# శ్రీనాథకవి

(జీవితము

గ్రంథకర్త

చిలుకూరి వీరభద్రరావు.



(రెండవకూర్పు)

శ్రీ రాజన్ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి
ఆర్యపుస్తకాలయమువారిచే
ప్రకటింపఁబడియెను.
రాజమహేంద్రవరము.
1930

# ARYAN BOOK DEPOT,

## RAJAHMUNDRY.

All School and College, Telugu and Sanskrit Books and Stationery can be had here.

1. సీతాదేవి వనవాసము
2. విదుషీమణులు
3. సతీదేవి
4. సావిత్రి
5. నీతిచంద్రిక, చిన్నయసూరి (నోట్సుతో)
6. కాళిదాస నాటకకథలు
7. హిందూదేశ చరిత్రకథలు I & II
8. బాలభారతము
9. భారతకథాలహరి
10. తుకారాము చరిత్రము
11. కావ్యకథావళి
12. భాగవతకథాలహరి
13. వామన చరిత్రము సటీక
14. ధ్రువోపాఖ్యానము ,,
15. సుమతీ శతకము ,,
16. దాశరథి శతకము ,,
17. కుమారీ శతకము ,,
18. భాస్కర శతకము ,,
19. అళియరామరాయలు ,,

తెనుగు, సంస్కృత గ్రంథములు, స్కూలుపుస్తకములు, స్టేషనరీ సామానులు వగైరా అమ్మబడును.

## ఆర్య పుస్తకాలయము,

రాజమహేంద్రవరము.

ఈ కవిజీవితమును నేను 1913 లో ముద్రించి ప్రచురించి యున్నాను. తరువాత నైదు సంవత్సరములకు అనఁగా 1923 సంవత్స మున నా మిత్రులగు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు శృంగారశ్రీనాథ మను పేరుతో నీ కవిజీవితమునే వ్రాసి ప్రచురించి నారు. ఆ గ్రంథమున శృంగారమును గూర్చి యేమియు లేకపోయినను ఎగతాళి చేయుటకో యన్నట్టులు వారా నామక రణముఁ గావించిరి. వీరును వీరేశలింగం పంతులవారి విమర్శామార్గ మును గర్హించువారివలెఁ గన్పట్టినను, మాటలభేదమె గాని పంతుల వారే యుద్దేశముతో నట్లు వ్రాయ సాహసించిరో నామిత్రులును దృష్టాంతపూర్వకముగా బలపఱుచుటకుఁ బ్రయత్నింప సాహసించిరి. అందువలన వీరి యభిప్రాయములను గూడ నీ రెండవకూర్పున సహే తుకముగా ఖండింపవలసి వచ్చినది ఎనుబది సంవత్సరముల కాలము బ్రదికి నలుబది సంవత్సరము లఖండవైభవ మనుభవించి కీర్తిశేషుఁ డై చన్న సార్వభౌముని జీవితచరిత్రమును దెలుపుటకు మాత్రమె యీ గ్రంథ ముద్దేశింపఁ బడినది గాని యాతని సాహిత్యసౌష్ఠవముల విమ ర్శను ప్రకాశింపఁ జేయుట కుద్దేశింపఁ బడినది కాదు. వీని జీవముతో సంబంధించిన గాథలు పెక్కులు గలవు వీని పేరుతో సంబంధించిన చాటువులు పెక్కులు గలవు వీని సత్యాసత్యములను దెలుపునట్టి విమర్శ లిందుఁ గలవు. ఈ నడుమ నీకవిని గూర్చి పండితులు పత్రికలలో గావించిన విమర్శనలు గూడ సందర్భానుసారముగా వారి వారి నామ ములతో నిందుఁ జేర్పఁబడి యున్నవి. వారికెల్లరకు నా కృతజ్ఞతా వందనముల నిందుమూలముగాఁ దెలుపుచున్నాను. దుర్భరవ్యాధి పీడి తుఁడనై యుండుట చేత నచ్చుపడిన చిత్తుప్రతులను స్వయముగా దిద్దు కొనుటకు సాధ్యపడనందున నందందు నచ్చుతప్పులుండవచ్చును. చదువ రులు మన్నించి వాని సంస్కరించుకొనవలయునని ప్రార్థించుచున్నాను

గ్రంథకర్త.

మొదటికూర్పు పీఠిక.

శ్రీనాథ మహాకవి యేనూఱు సంవత్సరములకుఁ బూర్వమున నున్నవాఁడు. ఉత్తమాంధ్రకవులలోఁ బరిగణింపఁదగినవాఁడు. కర్ణాట సామ్రాజ్యాధీశ్వరుఁడగు ప్రౌఢదేవరాయ సార్వభౌముని మౌక్తికాగారమునఁ గనకాభిషేకముఁ గాంచిన కవిసార్వభౌముఁడు.

వీరేశలింగముగారు ఏవిధమైన ఋజువుభారమును వహింపక గాలికబుర్లను పోగుచేసి యేనూఱు సంవత్సరములకుఁ బూర్వమున నున్నవాని వర్తనమును తాము ప్రత్యక్షమునఁ దమ కన్నులతోఁ జూచినట్లుగా స్త్రీలోలుఁడై వయఃకాలమున విచ్చలవిడిగాఁ దిరిగి కాయమును ధనికాయమును జెడఁగొట్టుకొన్న మహాపాపి యని నిందించుటయే గాక యాతని కాలపు నాటి యాంధ్ర హిందూసంఘము జారత్వమును ప్రతిష్ఠావహమైనది గను, శ్లాఘ్యమైనది గాను భావించునంతటి దౌర్భాగ్యస్థితి యందుండెనేని యేమో దూషించి నిర్హేతుకముగా ద్వేషబుద్ధిని బూని దురభిమానపూరితములైన యుక్తిరహితదూషణభాషణములచేఁ దమ యాంధ్రకవుల చరిత్రములోని శ్రీనాథకవి జీవితము నంతయు గళంకపఱిచి యున్నారు. ఇది యెంతయు సంతాపకరమైన విషయము. ఆశాపరుఁడై, అగ్రసంభావనలకై, స్వార్థము తీర్థము కలిసివచ్చుటకై, త్రిమ్మరియై జారుడై, దేశములు తిరిగి దేహమున ధనమును జెడఁగొట్టుకొని కష్టపడవలసిన వృద్ధదశను దెచ్చుకొని దిక్కులేక చచ్చినట్లుగా దేల్చినట్టి వారి వ్రాఁత వైఖరిని జూచినప్పుడు నాకుం గలిగిన పరితాపమునకు మేర లేకుండెను. ఎనుబది తొంబది యేండ్లు నిండి కాటికిఁ గాళ్ళు చాచుకొన్న ముసలితొక్కు శ్రీనాథుని వంటి శివభక్తాగ్రేసరుఁడు, వేదాంతి కస్తూరికొఱకు, రత్నాంబరముల కొఱకు నంగలార్చుచుఁ బ్రాణములు విడిచినాఁడని చెప్పెడి పద్యమును విశ్వసింప వచ్చునన్న జ్ఞానము యొక్క తత్వము డెబ్బదేండ్లు వయస్సు చెల్లిన వయోవృద్ధులును, ప్రపం

చానుభవైకవేద్యంబు నగు శ్రీవీరేశలింగము గారికే బోధపడవలయును గాని యస్మదాదులకు దురవగాహముగా నున్నది ... ... ... ఇది మిక్కిలి శోచనీయము వీరి దురభిప్రాయములను నిదర్శించి లోకమునకు జూపుటయే నాకు కర్తవ్యముగాఁ గన్పట్టు చున్నది. అందుకొఱకే నేఁడు శ్రీనాథకవి జీవితము నెత్తికొని యున్నాఁడను. దీనిలో శ్రీనాథుని యొక్కయు, ఆతని గ్రంథముల యొక్కయు చరిత్రాంశములను గూర్చిన విమర్శలుఁ గూడుకొని యున్నది.

# విషయసూచిక.

పంచమాధ్యాయము



షష్ఠాధ్యాయము ౨౧౦



సప్తమాధ్యాయము. ౨౩౭



అష్టమాధ్యాయము. ౨౫౫ 

నవమాధ్యాయము. ౨౬౨ 

# శ్రీనాథకవి

—:o:—

## ప్రథమాధ్యాయము

సీ. ఒడ్డోలగంబుల నడ్డమాకయు లేక వాక్ప్రవాహంబు వెల్వఱిచినాఁడు
అష్టదిగ్జయ యశోవష్టంభ డిండిమ భట్టారకుని నోడఁగొట్టినాఁడు
అఖిలవిద్వల్లోక మగ్గింపఁ గవిసార్వభౌమ సద్బిరుదంబుఁ బడసినాఁడు
కలితమౌక్తిక సభాగారాంతరమునందుఁ గనకాభిషేకంబు గాంచినాఁడు
గీ. రాజపరమేశ రాజాధిరాజవిభవ
దక్షిణాధీశ దేవరాయక్షితీంద్ర
రక్షితబుధాభిభటక కర్ణాటకటక
పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి.

ప్రభాకరశాస్త్రి.

మ. మహి మున్ వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు ద
న్మహనీయస్థితిమూలమైనిలువ, శ్రీనాథుండుప్రోవన్, మహా
మహులై సోమఁడు భాస్కరుండు వెలయింపన్, సొంపువాటించు నీ
ఖిలశాంధ్రోక్తిమయప్రపంచమునఁ దత్ప్రాగల్భ్యమూహించెదన్."

రామరాజభూషణకవి.

## శ్రీనాథుని జన్మస్థానము.

ఇతఁడు పాకనాఁటి నియోగిబ్రాహ్మణుఁడు; భారద్వాజసగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; కమలనాభుని పౌత్రుఁడు; మారయామాత్యునకును భీమాంబకును బుత్రుఁడు. శ్రీనాథుఁడు భీమేశ్వరపురాణములో

మ. కనకక్ష్మాధరధీర వారిధితటీ కాల్పట్టణాధీశ్వరున్
ఘనునిం బద్మపురాణసంగ్రహకళా కావ్యప్రబంధాధిపున్

వినమత్కాకతిసార్వభౌముఁ గవితావిద్యాధరుం గొల్తు నా
* యనుగుం దాతఁ బ్రదాత శ్రీకమలనాభామాత్య చూడామణిన్.

అను పద్యమునందు తన పితామహుఁడును, కవితావిద్యా ధురంధరుఁడును, పద్మపురాణసంగ్రహ కళా కావ్యప్రబంధాధిపుఁడును నగుకమల నాభామాత్యుఁడు సముద్రతీరమునందలి కాల్పట్టణమునకు ప్రభువుగా నుండెనని చెప్పియున్నాఁడు.

శ్రీ అక్కిరాజు ఉమాకాంతముగారు శ్రీనాథకవిజన్మస్థానము కర్ణాటదేశమనియు, కర్ణాటదేశమున జన్మించినను శైశవముననే యీతని తల్లిదండ్రులు ఉద్యోగవశముననో మఱి యేకారణముననో కొండవీటిసీమకు వచ్చియుందు రనియు, ఇంటిలోఁ దల్లిదండ్రులతో మిశ్రకర్ణాటము మాట్లాడుచున్నను బాల్యమునుండి తెలుఁగుదేశములోఁ దెలుఁగువారితో గలసిమెలసియున్నందునఁ దెలుఁగువానివలెఁ దోఁచుచున్నాఁడనియుఁ దెలుపు నపూర్వసిద్ధాంతము నొకదాని నెలకొలుపఁ

*"ఈపద్య మీరీతిని ముద్రితప్రతియైన భీమేశ్వరపురాణములో నున్నది. 'వినమత్కాకతిసార్వభౌమ' యను పాఠమునకు బదులుగా నాంధ్రకవుల చరిత్రములో 'వినమద్ధ్యాంతరసార్వభౌము' అనియు, సిస్లే 'కవిజీవితముల'యందును, ఉమాకాంతము గారి పల్నాటివీరచరిత్ర పీఠికలోని పద్యమునందు 'వినమజ్జ్యాంతరసార్వభౌము' అని మఱియొక పాఠాంతరభేదమును గన్పట్టుచున్నది. కావున ముద్రితప్రతిలోని 'వినమత్కాకతిసార్వభౌము' అను పాఠమే సరియైనది కావచ్చును. అట్లయినయెడల శ్రీనాథుని తాత కాకతిసార్వభౌముఁడగు రెండవప్రతాపరుద్రుని యాస్థానము నలంకరించి యున్నవాఁడనుట సమంజసముగానుండును;" అని నాయాంధ్రకవిచరిత్రములోని మూఁడవభాగములో ౪౧౬ వ పేజీలో అనుగుభాగమునఁ జిన్నటిపీఠికలోఁ దెలిపియున్నాను. దీనిం జదువుకొని శ్రీవీరేశలింగముగారు తా మిప్పుడు నూతనముగాఁ బ్రచురించినట్టి యాంధ్రకవులచరిత్రములోఁ దమ వెనుకటి పాఠమును విడిచి యందులనుగూర్చి యేమియుం జెప్పకయే 'వినమత్కాకతిసార్వభౌము' అను పాఠమునే సరియైనదానిగా గ్రహించి కమలనాభుఁడు కాకతిసార్వభౌముఁడైన రెండవప్రతాపరుద్రుని కాలములో నున్నవాఁడని నేను చెప్పిన సిద్ధాంతము నంగీకరించియున్నారు.

ప్రయత్నించి పల్నాటివీరచరిత్రములోని బాలచంద్రయుద్ధభాగమునకుఁ బీఠిక వ్రాయునపుడు తమ నూతనసిద్ధాంతమునందుఁ జొప్పించి యీ గ్రంథమును బ్రచురించి యున్నారు.

మఱియు 'సుప్రసిద్ధాంధ్రకవి కర్ణాటదేశీయుఁడనుట పలువురికి రుచింపకపోయినను మీదుమిక్కిలి నాకు నిష్టము లేకపోయినను యథార్థముగఁ గనఁబడుచున్నది. నమ్మకపోవుట సంభవింపనేరదు గాన నాయభిప్రాయము తెలుపుచున్నా'నని పలికి 'సత్యాన్వేషణపరాయణులగు వారీ యంశము నాలోచింపవలయు'నని కూడఁ బ్రార్థించి యున్నారు. వీరు తమవాదమునకు బలముగా నాలుగు హేతువులను గనఁబఱచియున్నారు శ్రీనాథుఁడు తన కాశీఖండములో 'కర్ణాటదేశకటకపద్మవనహేళి' యను విశేషణమును జెప్పుకొనియుండుట మొదటి హేతువు. తన భీమేశ్వరపురాణములో 'నాకవిత్వంబు నిజము కర్ణాటభాష' యనిఁ జెప్పుకొనియుండుట రెండవహేతువు. మరియు 'కల్లీ! కన్నడరాజ్యలక్ష్మి! దయలేదా? నేను శ్రీనాథుఁడన్' అని యొకచాటువులోఁ జెప్పుకొనియుండుట మూఁడవహేతువు. శ్రీనాథుని తాత కమలనాభామాత్యుని 'వారిధితటీకాల్పట్టనాధీశ్వరు' డని వచించుట నాలవ హేతువు. ఈహేతువులఁబట్టి ఉమాకాంతముగారు శ్రీనాథుని జన్మభూమి కర్ణాటదేశమని నిర్ధారించుచున్నారు; కాని యివియన్నియును భ్రాంతియంత్రమునందగుల్కొని తిరుగాడుచుండిన బుద్ధివలన జనించినట్టి యత్యద్భుతములైన యూహలుగాని మఱి యొండుగావు. వీరి భావముల నొక్కొక్కటిగాఁ దీసికొని జర్చించి సారమును గ్రహించినపుడు యథార్థము దేటతెల్లము గాకమానదు.

'కర్ణాటదేశ కటకపద్మవనహేళి' (అనఁగాఁ గర్ణాటదేశపట్టణములను కమలములకు సూర్యుఁడు,) అను విశేషణమును తనకుఁ జేర్చుకొనినాడు గనుక జన్మస్థలమునందలి యభిమానమువలన నట్లు

చెప్పుకొని యుండునని యుమాకాంతముగారి యూహయైయున్నది,గాని శ్రీనాథుఁ డిట్టివిశేషణముం జేర్చికొనుటకుంగల గాథ నెఱింగియున్న యెడల నట్టియభిప్రాయమును వెలిఁబుచ్చకయుండురు.

అయినను ఇందునుగూర్చి శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు ‘కనకాభిషేక’ మను నొకచిన్నపొత్తమునఁ జెప్పినయర్థమునఁ జేసిన వ్యాఖ్యయును గూడ మనము తెలిసికొనవలసియున్నది. కనకాభిషేకమున “మహారాజతల్పమునఁ దూగియాడుచుండు నాకర్ణాటాధీశ్వరుని (దేవరాయలు) నిండోలగమున డొక్కుచెదరును బిక్కుబెదరును లేక పాండిత్యశౌండీర్యమును వ్యక్తపఱచి యఖండపండితుఁడు మహాకవి బహుశిష్యపరివృతుఁడునై విజయడిండిమాడంబరమునఁ బ్రత్యర్థుల నద్రువఁజేయుచు నాప్రభుసార్వభౌమునినాస్థానింగవిసార్వభౌమ వైభవమనుభవించుచున్న యుద్దండుని డిండిమభట్టారకు నుద్భటవివాదమున నోడఁగొట్టి యాతని విజయడిండిమమును బగులగొట్టించి యత్యంతగౌరవాస్పదమగు నారాజేంద్రుని ముత్యాలశాలలోఁ బ్రభుపండితబహుమానపురస్కృతముగాఁ గవిసార్వభౌమపదవిని గనకాభిషేకములోఁ బట్టాభిషిక్తుడై కవిసార్వభౌముఁడను బిరుదాంకనామధేయమునఁ బరగుటయగాక యాకవిమార్తాండుఁడప్పుడు కర్ణాటరాజధాని (యందలివిబుధరాజి) యను తమ్మితోపునలరార్చినకతన ‘కర్ణాటదేశకటకపద్మవనహేళి,’ యనదనరారెను.” అనితమభావము విస్పష్టము జేసియున్నారు. కాఁబట్టిప్రభాకరశాస్త్రిగారు చెప్పినదే సహేతుకముగను సయుక్తికముగను గనుబట్టుచున్నది. కర్ణాటదేశకటకమను దానికి కర్ణాటదేశపురాజధానియని యర్థముగ్రహింపవలయును.* దీనిఁబట్టి శ్రీనాథుని జన్మభూమి

*శ్రీవీరేశలింగముగారు నాయాంధ్రుల చరిత్రము మూఁడవభాగములో నేను బ్రవేశపెట్టిన యీవాదస్వభావమును గుర్తించి తా మిపుడుమ నూతనముగాఁ బెంచివ్రాసిన యాంధ్రకవులచరిత్రలో శ్రీనాథునిగూర్చి వ్రాయుసందర్భమున నావా

కర్ణాటదేశమని యూహించుట భ్రాంతిగాని మఱియొండుగాదు. ఇఁక రెండవహేతువును విచారింతము. శ్రీనాథకవి భీమేశ్వరపురాణములో:

ప్రౌఢిఁ బరికింప సంస్కృత భాషయందు్ర
పలుకునుడికారమున నాంధ్రభాషయందు
రెవ్వ రేమన్న నందు్రగా కేమకొఱత
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష.

అను నొకపద్యము గానంబడుచున్నది. ఈగ్రంథము రాజమహేంద్రపురాధిపతియగు నల్లాడ వీరభద్రనృపాలునికి మంత్రియగు బెండపూడి అన్నామాత్యుని కంకితము చేయఁబడినది. కనుక నీపద్యరచనాకాలము పెదకోమటి వేమభూపాలుని మరణానంతరము కొండవీటిరాజ్యము కర్ణాటదేశాధీశ్వరుల యాధీనముకాఁగా శ్రీనాథుఁడు అన్నామాత్యుని సంబంధబాంధవ్యము మూలమున రాజమహేంద్రపురమునకు నేతెంచి, వారలకడ నాస్థానకవిగ బ్రవేశించినకాలమై యున్నది. కాకతీయ సామ్రాజ్య మంతరించినవెనుక నాంధ్రదేశములో దక్షిణభాగము (పాకనాఁటిసీమ) కర్ణాటాధీశుల యాధీనమై కర్ణాటరాజ్యముగానే పరిగణింపఁబడుచు వారిచేతనే పరిపాలింపఁబడుచు వచ్చినది. ఆభాగములోనుండు నాంధ్రుల కాకాలమునను నంతకుఁబూర్వమునను గూడ గర్ణాటకులతోడఁ దఱచు పొత్తుగలిగియుండుట సంభవముగుచు వచ్చెను. ఆంధ్రకవుల నేకుఁలు గర్ణాటరాజ్యమునందును కర్ణాటకవు లనేకులాంధ్ర

దము నెఱుఁగనివారివలె నిట్లు వ్రాసియున్నారు. "ఈపద్యమునందు 'కర్ణాటదేశకటకపద్మవనహేళి' యని తనకు విశేషణము వేసికొని తాను గర్ణాటరాజ్యరాజధానియందు విద్యావిజయమునొంది యచ్చటి పండితులను సంతోషపెట్టితినని సూచించి యున్నాఁడు. 'కర్ణాటదేశకటకపద్మవనహేళి' యనఁగా కర్ణాటదేశరాజధాని యనెడు పద్మరాజికి సూర్యుఁడని యర్థము. సూర్యుఁడెట్లు పద్మవనము నలరించునో యట్లే తానును కర్ణాటకటకవాసులైన విబుధబృందము నలరించినవాఁడనని కవి యభిప్రాయము." తమగ్రంథములోఁ జెప్పిన నేమి చెప్పకున్న నేమి మాయర్థము నంగీకరించి మాతో నేకీభవించినందులకు సంతసించు చున్నారము.

రాజ్యమునందును నుండుచుఁ గవిత్వములం జెప్పుచు వచ్చిరి. సుప్రసిద్ధకర్ణాటకవులగు నాగవర్మ మొదలుగాఁ గొందఱాంధ్రదేశమున జన్మించినట్లు కర్ణాటసారస్వతమువలన విదితము కాఁగలదు. సుప్రసిద్ధాంధ్రకవు లగు నన్నెచోడాదులు మొదలుగాఁ బెక్కండ్రు కవితారచనయందుఁ గన్నడపోకల ననుసరించుటయె గాక కర్ణాటభాషాపదములను బెక్కింటిని తమ గ్రంథములలోఁ జొప్పించి యున్నారు. శబ్దశాస్త్రజ్ఞులకు మాత్రి మీవిషయము చక్కఁగా బోధపడఁగలదు. శ్రీనాథుఁడు తనకావ్యములను కర్ణాటభాషాసంప్రదాయానుసారముగ రచియించినవాఁడగుటచేత గోదావరీతీరస్థమైన రాజమహేంద్రపురికివచ్చినప్పు డచ్చట కవులలోఁ గొందఱితని కవిత్వము ప్రౌఢమైనదేకాని సంస్కృతపదఘటితమైనదనియు, మఱికొందఱు పలుకుచమత్కారమున నాంధ్రభాషవలె నున్నదిగాని యాతనిభాష కర్ణాటభాషయనియు వంకలుపెట్టి యీర్ష్యాళువులై వెఱ్ఱిమొఱ్ఱియాక్షేపణలు చేయ నారంభించిరి. శ్రీనాథుఁడు సకలవిద్యాసనాథుఁడని యెఱుంగక పండితులనేకులు వివాదములు పెట్టుకొని యెట్టులైన నాతనివంచించి సాగనంపవలయునని ప్రయత్నించిరి. అందులకే శ్రీనాథుఁడు తన్నధిక్షేపింపవచ్చిన పండితమ్మన్యులను, కుకవులను

తే. బోధ మల్పంబు, గర్వ మభ్యున్నతంబు,
శాంతినిష్పచ్చరంబు మచ్చరము ఘనము,
కూపమండూకములు బోలెఁ గొంచె మెఱఁగి
పండితమ్మన్యులైన వైతండికులకు.

తే. నికటముననుండి శ్రుతిపుట నిష్ఠురముగ
నడరి కాకులు బిట్టు పెద్దఱచి నప్పు
డుదధిరాయంచ యూరక యుండుఁ గాక
ప్రతివచన మిచ్చునే వాని బన్నిపడుచు.

అను పద్యములలో నిందించి తరువాత,

తే. ప్రౌఢిఁ బరికింప సంస్కృతభాషయందుఁ
పలుకునుడికారమున నాంధ్రభాషయందు
నెవ్వ రేమన్న నందుఁ గాకేమికొఱఁత,
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష.

అను పద్యము జెప్పె.

ఇట్టి కుకవి నిరాకరణమునందే మనకవిసార్వభౌముఁడు తనకవిత్వము కర్ణాటభాషయని పలికినది. కాఁబట్టి యీతనికవిత్వ మాంధ్రకవిత్వముగాని కర్ణాటకవిత్వము గాదు. ఈతనిభాష యాంధ్రభాషగాని కర్ణాటభాషకాదు. తనభాష కర్ణాటభాష యని చెప్పినది తాను రాజమహేంద్రపురమునకు వచ్చినతరువాతఁ బ్రథమమునఁ రచించిన భీమేశ్వరపురాణమునందు మాత్రమె చెప్పెనుగాని యంతకుఁబూర్వము తాను రచించిన పండితారాధ్యచరిత్రమునఁగాని మఱియేగ్రంథమునఁగాని చెప్పియుండకపోవుటకుఁ గారణము పైని నేనుదహరించినదేగాని శ్రీనాథుని జన్మదేశము కర్ణాటదేశమగుటకాదు. దీనింబట్టి యీతనిజన్మభూమి కర్ణాటదేశమగుటచేతఁ గర్ణాటభాషయం దభిమానము చూపించెనని యూహించుట భ్రాంతిగాని వేఱొండుగాదు. శ్రీవీరేశలింగముగారు తాము క్రొత్తనూతనముగాఁ బెంచి వ్రాసి ప్రచురించిన నూతనగ్రంథములో శ్రీనాథుని జీవితసంఘట్టమున నాయభిప్రాయమునే తమయభిప్రాయముగా నిట్లు లిఖించిరి.

"ఎక్కడనుండియైనఁ గ్రొత్తగా నొక కవీశ్వరుఁడుగాని పండితుఁడుగాని తమపట్టణమునకు వచ్చినప్పు డచ్చటి పండితులు మత్సరగ్రస్తులయి యానూతనవిద్వాంసుని నాక్షేపించుటయుఁ బరాభవింపఁజూచుటయు సామాన్యములేగదా. శ్రీనాథకవి కర్ణాటక దేశమునుండి రాఁగానే రాజమహేంద్రవరమునందలి పండితులు శ్రీనాథుని కవిత్వమంతయు సంస్కృత భాషయేయనియు మాటలచమత్కారముచేతఁ దెలుఁగుభాషలాగు గనఁబడుచున్నను నిజముగాఁ గర్ణాటభాషాధోరణియే యనియు,

ఆక్షేపింపజొచ్చిరి. ఈయాక్షేపణలను మనస్సునందుంచుకొనియె శ్రీనాథుఁడు రాజమహేంద్రపుర పండితులమీఁది కోపముచేత కుకవిదూషణమను నెపముచేత భీమఖండములో నీక్రిందపద్యములను వేసెను.

... ... ... ...

"ఈకడపటిపద్యములోనివి తన్నితరులాక్షేపించినపుడు సమాధానముగాఁ జెప్పఁబడిన పరిహాసగర్భితములైన మాటలే కాని తనకవిత్వము కర్ణాటభాషయని శ్రీనాథుని యభిప్రాయ మెంతమాత్రమునుగాదు. ఇట్లన్యాపదేశముగా దూషించుటయేగాక రాజమహేంద్ర పండితులను శ్రీనాథుఁడు బహుపద్యములం దాక్షేపించి యున్నాఁడు."*

ఇట్టి భావము శ్రీవీరేశలింగముగా రాంధ్రుల చరిత్రములోని మూఁడవభాగములో శ్రీనాథుని చరిత్రమునుగూర్చిన నాచర్చను జదివిన పిమ్మట వారికిఁ గలిగినదిగాని యంతకుఁ బూర్వ మిట్టి యభిప్రాయము గలిగియుండలేదనుటకు వారి నూతన గ్రంథమునుండియె యిందుకు భిన్నముగా వ్రాసినదాని నుదాహరించుచున్నాఁడను. వేములవాడ భీమకవి జీవితములో:

"ఆకాలమునందలి తెలుఁగుపండితుల కందఱికిని సంస్కృత కర్ణాటకభాషలు సాధారణముగా వచ్చుచుండెను. అందుచేత దెలుఁగును సహితము గర్ణాటకమనుచుండుట యప్పుడప్పుడు గలదు. శ్రీనాథుఁడు తనభీమఖండములో నేమనెనో చూడుఁడు:

* శ్రీ వీరేశలింగముగారు తమ కవులచరిత్రమునుండియె యాంధ్రచరిత్రకారుఁ డీసిద్ధాంతమునంతయు గ్రహించెనని భావికాలపుజనులు తలంపవలయునను నుద్దేశముతోఁ గాఁబోలు దమ తొంటియభిప్రాయమును మార్చుకొని యాంధ్రచరిత్రకారుని యభిప్రాయమును సరియైనదిగా గ్రహించితిమని చెప్పుటను దెలుపకయే మెల్లగా నిట్టిభావములను జడిచప్పుడు లేకుండఁ బ్రవేశపెట్టిరి. తద్భిన్నమగు నభిప్రాయము నింకను గ్రంథము నందే యుంచి యేల పరిహాసపాత్రులు గావలయును?

ప్రౌఢిఁ బరికింప సంస్కృత భాషయందుఁ
పలుకునుడికారమున నాంధ్రభాషయందు
నెవ్వ రేమన్న నందురుగాక కొఱత,
నాకవిత్వంబు నిజము కర్ణాటభాష.

అని పై యభిప్రాయమునకుఁ భిన్నముగానే వ్రాయఁబడియున్నది!

ఇందునుగూర్చి పల్నాటివీరచరిత్ర పీఠికలోనే శ్రీఉమాకాంత ముగారు వ్రాసినదానినే వీరికిఁ బ్రత్యుత్తరముగా నిట నుదాహరించు చున్నాఁడను.

"ఈపద్యములోని 'కర్ణాటభాష' యనుదాని కాంధ్రభాషయని యర్థమనియు నాకాలమున నంధ్రరాజులను గర్ణాటరాజులని చెప్పుచుం డిరనియు నొకరు వ్రాసిరిగాని యది యప్రామాణికము. ఆకాలము నందుఁ గర్ణాటరాజులు నంధ్రరాజులు వేఱువేఱుగా నుండిరనియు నంధ్ర భాషయు కర్ణాటభాషయు వేఱువేఱుగ నెంచఁబడుచుండెననియు శ్రీనాథకృతగ్రంథములలోని యీక్రిందిపద్యములవలనఁ దెలియఁగలదు.

"శా. కర్ణాటోత్కలపారశీకనృపసఖ్యప్రాభవ, శ్రీనిధీ
యర్ణోరాశిపరీతభూభువనవద్వ్యాంధ్రక్షమాధీశ్వరా,
కర్ణాభ్యర్ణవిశాలనేత్ర, జగదేకప్రాజ్య సామ్రాజ్య, దృ
క్కర్ణాధీశ్వరహారభక్తినిరతక్ష్మాపాలచూడామణీ!

కాశీ. అ. 3.

గీ. యవనకర్ణాట కటకభూధవులతోడఁ
బలిమి వాటించి యేలించెఁ దెలుఁగుభూమి
దన నిజస్వామి యల్లాడ ధరణినాథు,
బలిగ! యరి యేటిలింగన ప్రభువరుండు. భీమ. ఆ. ౧

మ. అరబీభాషతురుష్కభాష గజకర్ణాటాంధ్రగాంధార ఘూ
ర్జరభాషల్ మళయాళభాష శకభాషాసింధుసౌవీర బ
ర్బరభాషల్ కరహాటభాష మఱియుం భాషావిశేషంబు ల
చ్చెరువై వచ్చునరేటియన్ననికి గోష్ఠీసంప్రయోగంబులన్.

భీమ. ఆ. ౧.

"ఇట్టి పద్యములింకను గలవు కర్ణాటదేశమనఁగా నంధ్రదేశమని కాని కర్ణాటభాషయన నంధ్రభాషయని కాని శ్రీనాథుని కభిప్రాయము లేనట్లు పైపద్యములవలన స్పష్టము కాఁగలదు". కాఁబట్టి యంధ్రభాషను కర్ణాటభాషయని శ్రీనాథుఁడన్నాఁడనుట వాస్తవముకాదు. ఇంక మూఁడవహేతువును విచారింతము.

"తల్లీ! కన్నడరాజ్యలక్ష్మి! దయలేదా నేను శ్రీనాథుఁడన్"

అనునది ఇది యీక్రిందిచాటువులోనిది.

శా. కుల్లాయుంచితిఁ గోకఁజుట్టితి మహాకూర్పాసముం దొడ్గితిన్,
వెల్లుల్లిం దిలపిష్టము న్మెసవితిన్ విశ్వస్త వడ్డింపఁగాఁ
జల్లాయంబలిఁ ద్రావితిన్ రుచుల్ దోసంబంచుఁ బోనాడితిన్,
దల్లీ! కన్నడరాజ్యలక్ష్మి! దయలేదా! నేను శ్రీనాథుఁడన్

ఈచాటుపద్యము నిజముగా శ్రీనాథుఁడు రచించెనో లేక మఱి యాతనిపేరితో మఱియెవ్వఁడైన రచించెనో తెలిసికొనుట కాధారమేమియు లేదు.

ఈతఁడు కర్ణాటరాజ్యలక్ష్మిని 'తల్లీ' యని సంబోధించినాఁడు గనుక నీతనిజన్మదేశము కర్ణాటదేశమై యుండునని యూహ. ఈచాటువు శ్రీనాథకవి సార్వభౌముఁడే చెప్పియుండునని తప్పక మనమొప్పుకోవలసినయెడల మిక్కిలి దైన్యస్థితియందున్న కాలమునఁ జెప్పియుండవలయునని తలంపవలయును. బాల్యస్థితి మనకంతగాఁ దెలియకపోయినను యుక్తవయస్సువచ్చినది మొదలుకొని వయస్సుముదిరి దేహపటుత్వము సడలువఱకు నీతఁడు మహారాజుల యాస్థానములయందు పండితకవియై ప్రసిద్ధికెక్కి వారలప్రాపున మహారాజభోగము లనుభవించుచు వచ్చినవాఁడనుటకు సంశయింపం బనిలేదు. ఇట్టి దైన్యస్థితి యవసానకాలమునఁ దటస్థించియుండెనని ప్రమాణములు గలవు గాని యౌవనకాలమునఁ దటస్థించియుండెననుటకు సాక్ష్యము గానరాదు. ఈపద్యము శ్రీనాథకవి చెప్పియుండినదే వాస్తవమైనయెడల వార్ధక్యమునఁ

జెప్పియుండవలయును. తన కాశ్రయులుగా నుండు కొండవీటిరెడ్లు, రాజమహేంద్రపురపు రెడ్లు, తెలుఁగురాయఁడు, మైలారరెడ్డి మొదలుగాఁ దన ప్రభువులెల్లను, తన్నాశ్రయించిన మిత్రులగు మంత్రిపుంగవులును స్వర్గస్థులు కాఁగా నీతఁడు దుర్దశపాలై కన్నడరాజ్యమునకు లేచిపోయి తనకు సమ్మానము జరుగకున్నప్పుడు చెప్పినపద్యమై యుండవలయును. ఏమన మున్నొకతూరి నిండుయౌవనమునఁ గర్ణాట రాజధానికిఁ బోయి కవిసార్వభౌముఁడైన డిండిమభట్టారకుని నోడించి దేవరాయల ముత్యాలశాలలో స్వర్ణాభిషేకమహోత్సవమును బడసినవాఁడని యెఱుఁగక కాలస్థితినిబట్టి యుపేక్షించియుండ వారలకు జ్ఞప్తికిఁ దెచ్చుటకై ‹ఓతల్లీ! కన్నడరాజ్యలక్ష్మీ! అప్పుడే నన్ను మఱచిపోయితివా? నామీఁద దయలేదా? ఇచ్చట ముత్యాలశాలలో స్వర్ణాభిషేక మనుభవించిన శ్రీనాథుఁడను జుమీ" యని పలికి జ్ఞప్తికిఁ దెచ్చిన విషయముగా భావింపవలయునే గాని దీనింబట్టి యీతఁడు కర్ణాటకుఁడనిగాని యీతని జన్మదేశము కర్ణాటమనిగాని చెప్ప సాహసింపరాదు.*

* ఈపయిపద్యమునే శ్రీవీరేశలింగముగారు మఱియొకసందర్భమున దాము నూతనముగాఁ బెంచి వ్రాసిన గ్రంథములో నుదాహరించుచుఁ బయిపద్యములో ‹తల్లీ! కన్నడరాజ్యలక్ష్మి!' యని కర్ణాటకదేశము సంబోధింపఁ బడియుండుటనుబట్టి, శ్రీనాథుఁడు కర్ణాటదేశస్థుఁడని యొకానొకరు విషయవిచారము చేయక వ్రాసిరిగాని ‹యవి గ్రాహ్యము కావు' అని చులకనగాఁ ద్రోసివేసి నాసిద్ధాంతము నంగీకరించి యున్నారు. ఆంధ్రకవులచరిత్ర వ్రాసిన శ్రీవీరేశలింగముగారికిఁ బల్నాటివీరచరిత్రపీఠికలో శ్రీనాథుఁడు కర్ణాటుఁడని శ్రీయుమాకాంతముగారు చేసిన సిద్ధాంతము నిర్భాగ్యకమైనదిగాఁ గానుపించి శ్రీనాథుఁడు సాళ్వనరసింహరాయని యాస్థానకవియైన డిండిమభట్టారకుని నోడించినాఁడని శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు క్రీడాభిరామ పీఠికలో నెప్పుడో వ్రాసిన యభిప్రాయము మహోత్కృష్టమైనదిగాఁ గానుపించెను గాఁబోలు! అందుకొఱకుఁ గొన్నిపుటలు వ్రయపెట్టఁగలిగినవారిరువురుగూర్చి పాప మొక్కవాక్యమును మాత్రము చెప్పి ముగించిరి.

శ్రీనాథుఁడు తనతాతను వారిధితటీ కాల్పట్టణాధీశ్వరుండని భీమేశ్వరపురాణములోఁ జెప్పియుండు విషయమును విచారింతము.

'తనతాత సముద్రతీరమునందలి 'కాల్, అనుపట్టణమున కధిపతి యని చెప్పినాఁడు. ఇది పశ్చిమసముద్రతీరపట్టణమై కర్ణాటములోఁ జేరి యుండునని యుమాకాంతముగారు వక్కాణించియున్నారు గాని యం దులకుం దగిన ఋజువుభారమును వహింపలేదు. కాల్పట్టణమనునది యెద్దియో నిర్ధారించి యయ్యది పశ్చిమసముద్రతీరమున నున్నదియో పూర్వ సముద్రతీరమున నున్నదియో విస్పష్టముగాఁ దెలుపవలసియుండును. కాఁబట్టి శ్రీనాథుఁడు తనతాతనుగూర్చి చెప్పినపద్యమునయితము శ్రీనా థుని జన్మభూమి కర్ణాటమనుటకుఁ జాలియుండలేదు. మఱియు 'విన మత్కాకతిసార్వభౌము 'నని చెప్పియుండుటచేత కమలనాభామాత్యుఁ డు కాకతీయాంధ్రచక్రవర్తియైన ద్వితీయప్రతాపరుద్రుని కాలమునఁ గాల్పట్టణాధీశ్వరుఁడుగ నుండెనని తేటపడుచున్నందునను కాకతిసార్వ భౌమునకుఁ బశ్చిమతీరమునందు గిద్దెడుభూమియైనను లేనందునను కాల్ప ట్టణము తూర్పుసముద్రతీరమున నుండెననుట యొప్పుకొనకతప్పదు.

శ్రీనాథుఁడాంధ్రదేశస్థుఁడైన యాంధ్రుఁడు; శ్రీనాథుఁడాంధ్రుఁడని యు, పాకనాఁటి నియోగిబ్రాహ్మణుఁడనియు రెండుప్రబలములైన హేతు వులను జూపుచున్నాఁడను. భీమేశ్వరపురాణము సంకితమునొందిన బెండపూఁడి అన్నామాత్యుఁడు, శ్రీనాథుని

'పాకనాటింటివాఁడవు బాంధవుఁడవు
గమలనాభుని మనుమఁడ వమలమతివి'

అని ప్రశంసించియున్నట్లుగా నాగ్రంథమునఁ దెలిపియుండుటఁజేత పాకనాఁటి నియోగిబ్రాహ్మణుఁడని విస్పష్టమగుచున్నది. అంతియగాక కమలనాభుని మనుమఁడవనుటలో నొకవిశేషము పొడసూపుచున్నది. కమలనాభుఁడా యన్నమంత్రికి జుట్టమని విస్పష్టము సేయుచున్నది, 'బాంధవుఁడను పదమే సమస్తసంశయములను నివారించుచున్నది. 'పాక

నాటింటివాఁడవను దానిలోఁ బాకనాటినివాసుఁడవని గాక పాకనాఁటి నియోగిశాఖలోనివాఁడవని యర్థమగుచున్నది. పాకనాఁటి నియోగిబ్రాహ్మణులాంధ్రులే గాని కర్ణాటకులుగారు; పాకనాఁటిలోనివసించు కర్ణాటకులు కన్నడిగనియోగి శాఖవారని శాసనములో వ్యవహరింపఁబడిరి. మఱియును శ్రీనాథునిభార్యతోఁబుట్టినవాఁడు దగ్గుఁబల్లి దుగ్గయామాత్యుఁడు దగ్గుఁబల్లి తిప్పయామాత్యునకు నెఱ్ఱమకును బుత్రుఁడు; పోతనకు నెఱ్ఱనామాత్యునకుఁ దమ్ముఁడు; దుగ్గయామాత్యుఁడు నాసికేతూపాఖ్యానము నాంధ్రము నరచించి యుదయగిరిపాలకుఁడైన బసవభూపాలుని మంత్రియైన చిట్టిగంగనామాత్యున కంకితము చేసియున్నాడు. శ్రీనాథునకిట్టి బాంధవ్యము లాంధ్రులతోఁ గన్పట్టుచుండగాఁ గర్ణాటకుఁడని లేనిపోని సిద్ధాంతములఁ జేయుటకుఁ బ్రయత్నించుట సమంజసము గాదు. ఉమాకాంతముగారు నుడివినట్లే శ్రీనాథుఁడు కర్ణాటకుఁడేయై, కర్ణాటదేశమునందును, కర్ణాటభాషయందున, నంతటి యభిమానమే యున్నయెడల, నంతకాలము మహాపండితుఁడై, బ్రతికియుండియుఁ, గర్ణాటరాజులతోఁ బరిచయము గలిగియుఁ, గర్ణాటదేశకటకపద్మవనహేళియయ్యు, నొక్క కావ్యమైనను, నొక్క పద్యమైనను, గర్ణాటభాషలో రచించియుండఁడా? ఏదీ యొక్కపద్యమైనఁ గానరాదే!

ఉమాకాంతముగారు తమపీఠికలో 'తల్లిదండ్రులతో నప్పుడప్పుడు మిశ్రమకర్ణాటమును మాట్లాడుచుండినను' అని యూహించి తమచెవులతో విన్నట్లుగా వ్రాయుటమాత్ర మతిచిత్రముగా నున్నది. శ్రీనాథుఁ డింట మిశ్రమకర్ణాటము వాడుచుండునో స్వచ్ఛమైన యాంధ్రమును మాట్లాడుచుండునో ఏనూరుసంవత్సరములకుఁ బూర్వమున నున్నవాని కుటుంబభాషావ్యవహారస్థితి యెట్టిదో, వీ రెట్లు తెలిసికొనగలిగిరి? కాఁబట్టి ఉమాకాంతముగారి యూహలు భ్రాంతిజనకములని పై చర్యవలనఁ జదువరులకు బోధపడక మానదు; గావున గ్రంథవిస్తరభీతివలన నీవిషయమును గూర్చినచర్చ నిఁక విరమించెదను.

## కాల్పట్టణపరిశంస.

కాల్పట్టణమనునది పశ్చిమసముద్రతీరమునందు గాక పూర్వ సముద్రతీరమునందే యుండవలయు నని నిర్ధారణ చేయఁగలిగితిమి కాని కాల్పట్ట మిదియని గుర్తించి చెప్పుటమాత్రము సాధ్యముగాక యున్నది. దీనిం గుర్తించుటకై శ్రీవీరేశలింగముగారొక యద్భుత మార్గముం బట్టిరి. కాల్పట్టణపరిశంస విద్యావినోదములలో నొకదాని గాఁ జేసిరి. చేతిలోనిపని గనుక వెనుకముందుఁ జూడక కాల్ప ట్టణ మనుదానిని క్రొల్పట్టణముగా సవరించి శ్రీనాథుఁ డట్లే భీమఖండ ములోఁ జెప్పియున్నాఁడనిరి. అటుపిమ్మటఁ గ్రొల్పట్టణాన్వేషణకుఁ దొడంగి, యిట్లు వ్రాసిచ్చి యున్నారు.

"క్రొల్పట్టణమేదో క్రొత్తపట్టణము. ఒకవేళ నిజముగానే క్రొత్తపట్టణమై యుండవచ్చును. క్రొల్పట్టణము ప్రకాశించుపట్టణము. క్రొత్తది ప్రకాశించును గనుక క్రొత్తపట్టణ మనవచ్చును. 'పినను త్కాకతి సార్వభౌము' నని చెప్పుటచేతఁ గమలనాభామాత్యుఁడు ౧౩౨౦ వ సంవత్సర ప్రాంతమున కాకతిప్రతాపరుద్రసార్వభౌముని కాలములో క్రొల్పట్టణమునకు కరణముగా నుండి యుండును."

ఇట్లు శ్రీనాథునిచరిత్రములో మొకటిపుటయందు వ్రాసియుం డియుఁ జదువరుల మనస్సులను బాగుగఁ బట్టియుండ దను తలంపునఁ గాఁబోలు మఱికొన్ని పుటలలో రెడ్లచరిత్రమును జెప్పిన వెనుక మఱల నిట్లు వక్కాణించి యున్నారు.

"ఈక్రొల్పట్టణ మేదో తెలియదు; ఆ ప్రాంతములయందుఁ బ్రసిద్ధికెక్కిన మోటుపల్లి యను రేవుపట్టణ ముండెను; గాని యది యి దికాదు. మోటుపల్లికి మొగడపల్లియని నామాంతరము గలదు. శాస నములయం దీరేవుపట్టణము ముకుళపురమని నాడఁబడినది. అనపోతరెడ్డి కాలమునందలి యొకశాసనములోని యీక్రింది శ్లోకములను జూఁడుఁడు.

"శ్లో. అహితతమః కృశానుర్వేమ భూపాలసూనుః
సుతకలిత మహీశాన్వాన్నపోత క్షితీశః
శాకాబ్దేగగనాష్టసూర్యగణితే తీ రేమహాంబోనిధిః
ప్రఖ్యాతమ్మక ళాహ్వయే పురవరే శ్రీసోమ మంత్రీశ్వరః

"అందుచేత క్రొల్పట్టణము మోటుపల్లిగాక వేఱొక సముద్రతీరగ్రామమై యుండును. అది యేదియో నిర్ధారణమగువఱకును క్రాలనఁ గ్రొత్తయని యర్థము చేయవచ్చును. కనుకను, కడను పట్టణశబ్దమున్నది గనుకను, క్రొత్తపట్టణమునుగా భావింతము. కమలనాభుఁడీ క్రాల్పట్టణమునకుఁ గరణము. 'వినమత్కాకతిసార్వభౌము' నని పద్యములో నుండుటచేత నితఁడు బాల్యములో ౧౩౨౦ సంవత్సరమునయందు కాకతి ప్రతాపరుద్రమహారాజు కాలములోనుండి యాతనిచే సమ్మానింపఁబడి యున్నవాఁడనుటకు సందేహము లేదు."

ఆంధ్రకవులచరిత్రము రచియింపఁబడి ముప్పదిసంవత్సరములు దాటిపోయినను, అనేక జన్మాంతరములను గాంచి నూత్నవేషములను దాల్చుచు వచ్చినను, మొన్నటివఱకు కాల్పట్టణము క్రాల్పట్టణముగా మార్పుఁజెంది యుండలేదు. భీమేశ్వర పురాణముయొక్క ముద్రితప్రతిలో నేమి, అముద్రిత ప్రతులలోనేమి, శ్రీరామమూర్తిగారి కవిజీవితములలోనేమి, కాల్పట్టణమనియే యున్నదిగాని క్రాల్పట్టణమని యుండలేదు. ఆంధ్రకవిచరిత్రకారు లిట్టిమార్పు నాకస్మికముగాఁ జేయుటకుఁ గలకారణము మన కిప్పుడు స్పష్టముగాఁ బోధపడఁగలదు. కాల్పట్టణముకై పూర్వసముద్రతీరము నన్వేషించునపుడు వీరికి క్రొత్తపట్టణము మనస్సునకు స్ఫురించి యుండును. అంతల బొంతలమాఱిగంత దొరకినది గదా యను సంతోషముతో నొక్కగంతు గంతుకొని కాల్పట్టణమును క్రాల్పట్టణమునుగాఁ జేసి యొకనిమిష కాలములోఁ జిరకాలము నుండి యున్న పాఠమును గారణము చెప్పకయె యూడ్చిపెట్టి పాఠాంతరభేదమును గల్పించిరి. ఆంధ్రప్రపంచమునకు మార్గదర్శకులు గావున వారెట్టి

సాహసంబనికి నైన నోడిగట్టఁగల సమర్థు లగుదురు గాని యస్మ దాదిభీరువుల కది యెట్లు సాధ్యమగును? పాఠకమహాశయు లారా! కాల్పట్టణ మేదియో నిశ్చయముగా నెవ్వరికిని దెలియరాదు. తెలియనప్పుడు మన మూహించి నిరూపింపవచ్చును. దాని దోష మేమియును లేదు గాని కారణము చెప్పక పూర్వపాఠముల నిష్టమువచ్చినట్లు మార్చుట మాత్రి మతి సాహస మని నొక్కి వక్కాణింపఁదగును. మనము నిరూపించుటకు సాధ్యముగాక యున్నప్పుడు కాల్పట్టణము పూర్వసముద్రతీరమునందున్న యేపట్టణమునకో నామాంతరమై యుండునని యూహాపుట్టకమానదు. అట్టియూహాలు చేయునప్పుడు నిర్హేతుకముగాఁ బూర్వపాఠములను మార్పక వాని కనుగుణముగా నుండునట్లుమనము నిర్ధారణముచేయుట యధార్థమునకు విరుద్ధముఁగాఁ గన్పట్టినను దోషదూషితముగాఁ జాలదు. ఆంధ్రకవిచరిత్రకారుల పథకమును మనమవలంబించుట కాక్షేపణము లేకయున్నపక్షమునఁ బూర్వపాఠములను మార్పుఁజెందింపకయే కాల్పట్టణమేదియో నిర్ధారణ సేయవచ్చును. ఎట్లన శ్రీనాథుఁడు పాకనాటిశియోగికావున నాతనిజన్మసీమ పాకనాఁడని తలంచుట వింత సంగతికాదు. కావునఁ గాల్పట్టణము పాకనాటిసీమలోనైనను, దానికి సమీపమునందైనను సముద్రతీరమునందుండునని యూహించుట యసంభావ్యముగాదు. నెల్లూరునకు సమీపమున సముద్రతీరమున కృష్ణపట్టణమను రేవుపట్టణ మొకటిగలదు. అది పూర్వకాలమునుండియు మోటుపల్లికిఁ దరువాత పేరుమోసిన రేవుపట్టణముగానుండెనని శాసనములంబట్టికూడఁ దెలియుచున్నది. ఇందును గూర్చియాంధ్రులచరిత్రము లోని ద్వితీయభాగములో రెండవప్రకరణమున నిట్లువ్రాసియున్నాఁడను.

“మనుమసిద్ధిరాజునకుఁ బిమ్మట సిద్ధిరాజుకొడుకగు రెండవతిక్కరాజు గద్దెయెక్కినటులు గానుపించుచున్నది. ఈయిమ్మడి తిక్కరాజు

శా. శ. ౧౨౧౦ (క్రీ. శ ౧౨౮౮) వ సంవత్సరమునఁ బట్టాభిషిక్తుఁడై నటుల గూడూరుసీమలోని కృష్ణపట్టణము శాసనముంబట్టి దెలియుచున్నది. ఇతఁడు సింహాసనమెక్కిన రెండవయేఁటనే అనఁగా శా.శ. ౧౨౧౧ టవ సంవత్సరమున మీనమాసమున శుద్ధ దశమీ గురువారమునాఁడు గండగోపాలపట్టణమని యెడికొల్లిత్తురై పట్టణమున నివసించునట్టి వర్తకులు తిరుక్కాళవనమునందు సమావేశులై తాముచేసికొన్న యొడంబడికప్రకార మారేవుపట్టణములో నెగుమతి చేయఁ బడునట్టియుఁ దిగుమతి చేయబడునట్టియు బస్తాలయొక్క మదింపువిలువను బట్టి నూటికి నాలుగువంతున కొల్లిత్తురై గ్రామములోని మనుమసిద్ధీశ్వరుని యాలయ నిర్మాణము కొరకును, ధూపదీప నైవేద్యాలంకారముల కొఱకును వినియోగించు నటులు దానశాసనము వ్రాయించిరి. ఆకాలమునందు కొల్లిత్తురై యనియు, గండగోపాల పట్టణ మనియుఁ బేర్కొనఁబడిన కృష్ణపట్టణము గొప్ప రేవుపట్టణముగా నుండెనని పైశాసనమునుబట్టి విస్పష్టమగుచున్నది. పదునెనిమిది విదేశములనుండి యైదువందలమంది విదేశవర్తకులును, ఆయా నాడులనుండియు, పట్టణములనుండియు వచ్చినట్టివర్తకులును ఆరేవుపట్టణమున నివసించుచుండిరని యాశాసనమునందుఁజెప్పఁబడియుండుట చేతనే యాకాలమునందు కృష్ణపట్టణము గొప్ప రేవుపట్టణముగా నుండెననియు, విదేశములతో విరివిగావర్తకవ్యాపారము జరుగుచుండెననియుఁ జక్కఁగాఁ బోధపడుచున్నది."

ఈకృష్ణపట్టణమునే మనము కాల్పట్టణముగా నీక్రింది హేతువులచే నిర్ధారణ చేయవచ్చును. కృష్ణశబ్దమునకు నలుపను నర్థము గలదు. కాలశబ్దమునకును నలుపను నర్థముగలదు. కాఁబట్టి కాలశబ్దమునకుఁ బర్యాయపదముగా నెంచి కృష్ణపట్టణమును కాల్పట్టణమని పద్యములో వ్రాసి యుండును. తన తాతకమలనాభామాత్యచూడా

మణి యీకృష్ణపట్టణమునకుఁ బ్రభునిగాఁ గాకతిసార్వభౌముఁ డైన రెండవప్రతాపరుద్రదేవునిచే నియమింపఁబడి యుండువచ్చును. మనుమసిద్ధిరాజు కాలముననే యీదేశమంతయును గాకతీయాంధ్రచక్రవర్తులకు వశ్యమైనది. ఆంధ్రచక్రవర్తిని యైన రుద్రమదేవి కాలముననే కాకతీయులపక్షమున నధికారు లీదేశమునకు నియమింపఁబడుచు వచ్చిరి. కావున రెండవప్రతాపరుద్రదేవుఁడు ముఖ్యమైన వర్తకస్థాన మగుట చేత మన కమలనాభామాత్యునిఁ గృష్ణపట్టణమునకు సర్వాధికారిగ నియమించియుండును. కమలనాభుఁ డుద్యోగపదవియందుండుటమాత్రము చేతనే గాక మహావిద్వాంసుఁడై పండితకవియై పద్మపురాణాది కావ్యప్రబంధములను రచించి యాసార్వభౌమునకు నంకితము గావించి యాతనిచే విశేషగౌరవసమ్మానములను బొంది దేశమునఁ బ్రఖ్యాతిఁగాంచి యుండవచ్చును. అందుచేతనే 'వినమత్కాకతిసార్వభౌము' నని ప్రస్తుతించి యుండును. ప్రతాపరుద్రుఁడు కమలనాభుఁను తన రాష్ట్రములోని యొకచిన్న యధికారియైనను, మహావిద్వాంసుఁడును, కవివర్యుఁడును, మఱియు విశేషించి బ్రాహ్మణుఁడు నైనందున నాకాలపు మర్యాద ననుసరించి పైవిధముగా సమ్మానించె ననుట యొక యాక్షేపణీయాంశము గాదు.

ఇంకొక సంగతి జ్ఞప్తియం దుంచుకొనవలయును. కొల్లిత్తురై యనునది యఱవలు పెట్టిన నామముగా నుండెను. తెలుఁగువారు కృష్ణపట్టణమనియే యప్పటినుండి యిప్పటివఱకును వ్యవహరించుచున్నారు. గండగోపాలుఁడను బిరుదము వహించిన చోడరాజుచే నభివృద్ధికిఁ దేఁబడినది గావున గండగోపాలపట్టణమని నామాంతరముగూడఁ గలిగి యుండెను గాని మఱియొండు గాదు. 'వినమత్కాకతిసార్వభౌము' ననుపాఠము ననుసరించుటవలనఁ గమలనాభుఁడు రెండవప్రతాపరుద్రుని కాలమున నున్నవాఁడని వేద్యమగుచున్నది. రెండవ ప్రతాపరుద్రసార్వ

భౌముఁడు క్రీ. శ. ౧౩౫౪ మొదలుకొని ౧౩౭౩ వఱకును బరిపాల
నము చేసినందునఁ గమలనాభుఁడు నాకాలమున నుండెనని యొప్పు
కొనకతప్పదు.

## కాళీపట్టణమె కాల్పట్టణము

"శ్రీనాథకవి జీవితము." యొక్క ప్రథమముద్రణగ్రంథము ప్రకటింపఁబడిన వెనుక శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'శృంగార శ్రీనాథము' అను పేరిట తాము రచించిన గ్రంథములో, "కాల్పట్టణ మనఁగాఁ గాలపట్టణము. (కాల = నల్లని) కాలపట్టణము కృష్ణపట్టణము. ఇది నెల్లూరిచేరువనున్నది. వీరభద్రరావుగారి యూహయిది. ఈయూహవారికే తృప్తిఁగొల్పదయ్యెను. కృష్ణపట్టణమనిపద్యమునఁ జెప్పఁగుదురక కాలపట్టణముగా మార్చుకొని యటులునుగుదురక, కాల్పట్టణముగాఁ గుంచించుకొని శ్రీనాథుఁడు చెప్పవలసినవాఁడయ్యెననుట యుచితముగా నుండదుగదా!"

"కాల్పట్టణముకాదు కాల్పట్టణమని యుండవలెను. కాల్పట్టణమనఁగాఁ బ్రకాశించుపట్టణము. కాల్త్తది బ్రకాశించునుగనుకఁ గాల్త్తపట్టణమని యర్థమువచ్చును"

అని వీరేశలింగముపంతులుగారి సంభావనము, ఇదిమిక్కిలియసంగతముగానున్నది. కృష్ణపట్టణమనిచెప్పఁ జూచుచోఁజొప్పడెడ, దోషములు దీనికినిదప్పినవికావు. మఱియు విశేషమొక్కటి. "కొత్తపట్టణమేర్పడిఇప్పటికినూఱేండ్లుకాలేదు. ఇదివంగవోలునకుఁ దూర్పునఁబదిమైళ్లలో సముద్రపుటొడ్డుననున్నది. ఆఱూఱేండ్లకుముందీ పట్టణమును గూర్చి ప్రశంస యసంగతముగదా." అని యాక్షేపించియున్నారు. తూర్పుతీరమున నిజమైన కాల్పట్టణము బయలుపడువఱకు సుప్రసిద్ధమైన కృష్ణపట్టణమునే కాల్పట్టణ మనఁదగుననని వ్రాసితినేగాని కృష్ణపట్టణమే కాల్పట్టణమని నిశ్చయించి నేను వ్రాసియుండలేదు.

నాగ్రంథము వెలువడినవెనుక "ఆంధ్రవార్తాపత్రికలలో" కాల్పట్టణ మేది? యనుటను గూర్చి పెక్కులు వాదోపవాదములు జరిగియున్నవి. చర్చలో మఱిరెండు గ్రామనామములు బయలుపడినవి. అందొకటి కాళీపట్టణము; రెండవది కలపటము. సుప్రసిద్ధచరిత్ర పరిశోధకులై యాంధ్రులకుఁ బూజ్యనీయులును నాకుఁ బరమమిత్రులును నై యిప్పుడు కీర్తిశేషులునైన లక్ష్మణరావుపంతులుగా రొక ప్రాచీనశాసనములో 'కలుపట్టణ' మను పేరునుగాంచి శ్రీనాథుని కాల్పట్టణ మదియే యని నిర్ణయించిరి. అట్లు శాసనములోఁ బేర్కొనఁబడిన 'కలుపట్టణము' నేఁడు 'కలపట' మను పేరుతో నొప్పుచున్నదని గుర్తించుచున్నారు. కలపటము వరసాపురమున కు బందరునకు నడుమనున్నది. మఱికొందఱు వర సాపురమునుండి బందరునకుఁ బోవు బాటలో ముత్యాలపల్లికి సంబల దీవికి సమీపమున నైదారు మైళ్ళదూరములోనున్న కాళీపట్టణమని శ్రీనాథుఁడు ప్రశంసించి యుండునని వక్కాణించిరి. కాల్ శబ్దమునకు క్రొత్త, కృష్ణశబ్దములు దూరస్థములు. అర్థములను బట్టి చెప్పుకొన వలసిన వగుచున్నవి. కలు, కాళీశబ్దములు మాత్ర మక్షరముల మార్పు కలవి. కనుక కాల్ శబ్దములకు సమీపించియున్నవి. కలు, కాళీశబ్దము లను పద్యములో గుదుర్చుకొనుటకై కాల్ శబ్దముగా శ్రీనాథుఁడు మార్చుట కవిసంప్రదాయమునకు విరుద్ధము కాదు గాన మన మంగీక రింపవచ్చును. కలపటమా? కాళీపట్టణమా? అని మరల సంశయము గలుగుచున్నది. లక్ష్మణరావుగారి శాసనములోని 'కలుపట్టణమే తరు వాత కాళీపట్టణమని వ్యవహరింపఁ బడుచున్నదేమో? లేక 'కలుపట్ట ణము' కలపటముగాను 'కాల్పట్టణము' గాను వ్యవహరింపఁబడుచుండ వచ్చును. కలపటము గ్రామము కంటెను కాళీపట్టణము యొక్క శిథిల స్వరూపము ప్రాచీన వైభవమును సూచించుచున్నది. ఇంతకన్న వివ రములుగాఁ దెలియునంతవఱకు కాళీపట్టణమునే కాల్పట్టణముగా భావించు

కొనుచుండవచ్చును. కాకతీయచక్రవర్తు లాంధ్రదేశమును క్రీ. శ. ౧౩౨౮ వఱకును మహావైభవముతోఁ బరిపాలించిరి. ఆకాలమునఁ బాకనాడునుండి నియోగులు పెక్కుండ్రు కృష్ణవేణ్ణా గోదావరీమధ్యస్థ ఖండప్రదేశములకు మంత్రులుగనో, దండనాథులుగనో, మఱియు నితరములగు రాజకీయోద్యోగముల మూలముననో వచ్చి యుండిరనుట చరిత్ర ప్రసిద్ధవిషయము.

వేల్నాఁడు-పాకనాఁడు

కెంకణాదిత్య కవితత కుమార సంభవమునందు:—

చ. అరినృపాలమాలి దళితాంఘ్రి యుగంబయి పాకనాటి యా
దిరువది యొక్క వేయిటిక ధీశుఁడు రాజను చోడబల్లికిం
జిరతర కీర్తి కగ్రమహిషీ తిలకంబన హైహయాన్వయా
బర శశిరేఖయైన గుణభాసిని శ్రీసతికిం దనూజుఁడన్.

అనియు, ఓపిలిసిద్ధి శాసనమున:—

చ. బిరుదును గొన్న యా తెలుఁగు బిజ్జన మన్మఁడు మల్లిదేవుఁడ
చ్చెరువగుచున్న పొత్తపియ చెన్నగు పీఠము గ్రాలి పాకనా
డిరువదియొక్క వేయి జనమేలుచుఁ బల్లవుడంచుఁ గొల్చి త
త్కరివర కుంభ మౌక్తిక వితానతతిఁ బుచ్చె నిజారి పుత్రికల్.

అనియు, మంచెనకవి తన కేయూరబాహుచరిత్రమునందు:-

మ. అరుదంద ల్వెలనాటి చోడమనుజేంద్రాజ్ఞాపనం బూని దు
స్తర శక్తిన్ జని యేకవింశతి సహస్రగ్రామ సంఖ్యాకమై
ధరణిం జెప్పిన పాకనాఁడు నిజదోర్దర్పంబు కలగ్నంబుగఁ
బరిపాలించె నమాత్య కొమ్మన జగత్ప్రఖ్యాత చారిత్రుఁడై.

అనియును వర్ణించి వక్కాణించిన 'పాకనాఁడు' ఇరువదియొక్క వేలు సంఖ్యగల గ్రామములను గలిగియున్నట్టుగా దెలియుచున్నది. శ్రీశైల పూర్వతట నికటమునుండి పూర్వ సముద్రముదాక ప్రవహించు కుండితరంగిణి యను గుండ్లకమ్మ (బ్రహ్మకుంతి) నది కిరుప్రక్కల నుండు సీమకే పూంగినాఁడను నామమున్నట్టి ప్రోలయ వేమారెడ్డి

శాసనమువలనఁ దెలియుచున్నది. "ఈపూంగినాఁడే శబ్దార్థ సంగతిని బట్టి 'పాకనాడు' కావచ్చు"నని కొందరభిప్రాయపడుచున్నారు గాని వేమారెడ్డి శాసనమునకుఁ బూర్వము బహుశతాబ్దములనుండి పాకనాఁడనునది వ్యవహారములోనున్నట్లు పైపద్యప్రమాణములవలనను శాసనప్రమాణములవలనను దేటపడుచున్నది. అదియునుగాక పూంగినాఁడిరువది యొకవేలసంఖ్యయున్నట్లుగ నెందును జెప్పఁబడి యుండలేదు. పూంగినాటికంటె బహువిశాలతరమైన ప్రదేశమునకుమాత్రమె పాకనాఁడను పేరు చెల్లియుండవలయును. ఇచ్చట నీచర్చయనావశ్యకమని విరమించుచున్నాను.

కృష్ణవేణ్ణానదికి దక్షిణభాగము "కమ్మకరాష్ట్రము" (కర్మకరాష్ట్రము) అని వ్యవహరింపఁ బడుచుండెడిది. చాళుక్యులను వెల్కులములవారు దండెత్తివచ్చి యీప్రదేశము నాక్రమించుకొని పరిపాలించిన నాటనుండి వేల్నాఁడనియు ఆఱువేల సంఖ్యతో నొప్పుచుండెడిది గనుక నాఱువేల్నాఁడనియు, సంస్కృతమున షట్సహస్ర దేశమనియును వ్యవహారనామము గలిగియుండెను. ఇంతకుఁ బూర్వము "కమ్మకరాట" మను ప్రాచీననామ ముండుటచేత "కమ్మనాఁడు" అని కూడ వ్యవహరింపఁ బడుచు, పాకనాటి కుత్తర భాగమునకు మాత్రమె రూఢనామమై యొప్పుచుఁ దరువాత నాఱువేలనాటిలో నంతర్భాగమై ప్రఖ్యాతికివచ్చెను.*

ఆరువేలనియోగులను వారు మొదట ఆఱువేలనాటిసీమలో నివసించిన వారగుటచే ఆఱువేలనియోగులనియు పాకనాటిలో మొదట

*పూర్వచాళుక్యుఁడగు రాజరాజనరేంద్రుని కుమారుఁడగు కులోత్తుంగచక్రవర్తి కొంకరాజు తనకు యుద్ధములో సహాయము చేసినందున షట్సహస్రావనీమండలాధిపత్యము నొసంగెనని యొకశాసనములో నిట్లు చెప్పఁబడినది.

"సంగ్రామ సాహాయ్యసుతుష్టచిత్తాత్ శ్రీరాజరాజ ప్రథమాత్మసువీరః
యః షట్సహస్రావనీ మండలాధిపత్యం సమాసాద్యచిరంభునక్తి."

నివసించినవారికి పాకనాటివని యోగులనియు నామభేదములుఁగలిగినవిగాని వీరందఱు మొదట నొక్క శేఖవారే. వీర లుభయులకు సంబంధబాంధవ్యములుగలవు.

బెండపూడి అన్నామాత్యుఁడు తన్ను "పాకనాటింటివాఁడవు బాంధవుఁడవు" అని అన్నట్లుగా శ్రీనాథుఁడు తనభీమేశ్వరపురాణమునఁ దెలుపుకొని యుండుటచేత కొందఱు శ్రీనాథునియింటిపేరు పాకనాటి వారని తలంచుచున్నారు.

నాచికేతోపాఖ్యాన విమర్శనమునందు నామిత్రులగు శ్రీచేకుమళ్ల అచ్యుతరావుగారు రెండుధర్మసందేహములను వెలిపుచ్చిరి. అందు మొదటిది:—

"పాకనాటింటివాఁడవు బాంధవుఁడవు" అని బెండపూడి అన్నమంత్రి చెప్పినట్లు శ్రీనాథుఁడు వ్రాసికొనెను. "పాకనాటింటివాఁడవు" అనువాక్యము పాకనాటి దేశస్థుఁడని యర్థమిచ్చునని బ్ర శ్రీ. వే. ప్రభాకరశాస్త్రిగారు వ్రాసినారు. ఇంటివాఁడవు అనిచెప్పుటలో గృహనామమని నేనూహించుచున్నాను." అనునది ఇఁక రెండవది: దుగ్గనకవి బహుశః ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు* అనివక్కాణించుట*

అచ్యుతరావుగారి పైసంశయములకు శ్రీకుఁదూరి ఈశ్వరదత్తుగారీ క్రింది విధమునఁ బ్రత్యుత్తరమొసంగినారు.

"ప్రొద్దాత్రిలింగ విషయే వేల్నాంటిద్విజసీమని"

"ప్రొద్దాత్రిలింగ విషయే వేల్నాడో పుణ్యసీమని"

శ్రీనాథునిచే వ్రాయఁబడిన వేమారెడ్డి శాసనములు.

"శ్రీనాథుఁడు తనభీమేశ్వరపురాణమునందుఁ గృతిభర్త తన్నిట్లుసంబోధించినట్లు వ్రాసికొనెను:—

* భారతీపత్రిక పుష్యమాసపత్రిక చూడుఁడు.

సీ॥ వినుపించినాఁడవు వేమభూపాలున
కష్టాదశపురాణ విద్యాగమములు
కల్పించినాఁడవు గాఢపాకకమైన
హర్ష నైషధకావ్యమాంధ్రభాష
భాషించినాఁడవు బహుదేశబుధులతో
విద్యాపరీక్షణ వేళలందు
వెదఁజల్లినాఁడవు విశదకీర్తి స్ఫూర్తి
కర్పూరములు దిశాంగణములందుఁ
బాకనాటింటివాఁడవు బాంధవుఁడవు
కమలనాభుని మనుమఁడ విమలమతివి
నాకుఁ గృపసేయు మొకప్రబంధంబు నీవు
కలితగుణగణ్య శ్రీనాథకవివరేణ్య.

శ్రీనాథుఁడు పెదకోమటి భూపాలుని మరణానంతరము రాజమహేంద్రవర రాజ్యమునకు వచ్చుటకుఁ గారణము లేమి? అచ్చట వేమ వీరభద్రనరపాలకులకు సచివగ్రామణియై, పండితపోషకుఁడై, బాంధవుఁడై, యున్న బెండపూడి అన్నమంత్రి తనకర్పూరతాంబూలము లొసంగు ననియె. అన్నమంత్రి కృతిభర్తయై శ్రీనాథుని 'పాకనాటింటివాఁడవు బాంధవుఁడవు' అని హెచ్చరించుటఁ గనినచో ఆపద్యపాదమున కిట్లర్థము చేసికొనవలెను:

"నేను కృతిభర్తను, నీవుకృతికర్తవు; మనమిరువురము ఒక్కటియే శాఖవారము, మీదుమిక్కిలి బంధువులము." ఇచ్చట వారివారి స్వశాఖాభిమానమును పరిస్ఫుటము చేయుచున్న వాక్యరత్నములే కాని 'మీయింటిపేరు పాకనాటివారు, మీరును, మేమును బంధువులము" అని యర్థమిచ్చు మాట లెంతమాత్రమును గావు. దూరదేశమునఁ గలుసుకొన్న శాఖాభిమానమువలన గలిగినలాభమే శ్రీనాథుని నట్లువ్రాయుటకుఁ బురికొల్పినది.

అదియునుగాక ఆంధ్రదేశమునఁగల ఆర్వెల నియోగులలో పాకనాటి నియోగిశాఖకూడ గలదని మనవాఙ్మయమే సాక్ష్యమిచ్చు చున్నది. కృష్ణరాయ విజయమును రచించిన కుమారధూర్జటి 'పాక నాట్యార్వేల వంశప్రసిద్ధుని' అనిచెప్పుకొని యున్నాడు. కావున 'పాక నాటింటివాడవు' అనువాక్యమునకు పాకనాటి నియోగిశాఖా బ్రాహ్మ ణుఁడవు' అనునర్థమే చేసికోవలెను. సుప్రసిద్ధాంధ్ర చరిత్రకారుఁడట్లే వ్రాసెను. శ్రీ ప్రభాకర శాస్త్రిల వారట్లేవ్రాసిరి. దీనికి వేఱొక యర్థము సందర్భశుద్ధిలేక కల్పించుట పరిహాసాస్పదమైనపని.*

మరియు 'భక్తానందకల్పద్రుమ' ప్రబంధకారుఁడును పాకనాటి శాఖ నియోగి బ్రాహ్మణుఁడు నగు బాపిరాజకవి తనగద్యములో నిట్లు వ్రాసికొనియున్నాఁడు.

"ఇది శ్రీమహాదేవ కాళీవరప్రసాదలబ్ధ సకలజనమత సమ్మత స్తుతవిహాయత ధౌరేయ నిరంతరోద్గాఢార్ద్ర సౌందర్య తాత్పర్య మా ధుర్య శబ్ద గుంఫనాలంకార వైశిష్ట్యానుగుణ్య ప్రకటనటన నానాదేశా న్వీత భాషా కవితాంధ్ర గీర్వాణ ఘటికాశత గ్రంథకల్పక విద్వజ్జ నాహ్లాదకర పాకనాటిశ్రేష్ఠ పరాశరగోత్ర శివపూజా దురంధర షట్సహస్ర నియోగి రత్నాకరశంక పరమ పతివ్రత తుల్యాచ్చ మాంబాధవేశ్వరవదప్ప రాజాబ్ధిసుధాకర (దివాకర రాజ శేషా చలా నులావతి,) వేంకమాంబాసుత బాపిరాజ ప్రణీతంబైన భక్తానంద కల్ప ద్రుమంబను ప్రబంధంబునందు ప్రథమాశ్వాసము."*

ఇంకఁ బాకనాటి నియోగియగు శ్రీనాథుని బావమరదియగు దగ్గుబల్లి దుగ్గనామాత్యుని నియోగియని చెప్పుటకు నామితృనివలె నెవ్వరును సంశయింపఁ బనిలేదుగదా. *

* A Triennial Catalogue of Manuscripts. Telugu. Vol III, part III, R. No. 316, page. 933.

## శ్రీనాథుని తాత.

"కమలనాభుని మనుమఁడ వమలమతివి" అనుటచేఁ గూడ నొకవిశేషము గలదు. శ్రీనాథుని తాతయగు కమలనాభుఁడు గూడ అన్నమంత్రికిఁ జుట్టమనియుఁ బరిచితుఁడనియు దేటతెల్లము సేయుచున్నది." అని యాంధ్రుల చరిత్రము మూఁడవభాగములో వ్రాసియున్నాను. అన్నమంత్రికిఁ గమలనాభుఁడు పరిచితుఁడనుట పొరబాటు. ఆయర్థ మిందులేదు. కమలనాభుఁడు ప్రసిద్ధపురుషుఁడైనందున నూరక 'కమలనాభుని మనుమఁడ, వని వక్కాణించి యున్నాఁడు. కమలనాభుఁడు బహుసంవత్సరములు జీవించి యుండ వచ్చును గాని అన్నమంత్రియును, శ్రీనాథుఁడును, కమలనాభుఁడు బ్రతికియుండగాఁ బుట్టియుండిన నుండవచ్చును గాని కమలనాభునివీరు బాగుగా నెఱిఁగియుందురనుట సంశయాస్పదమైన విషయము. ఆంధ్రుల చరిత్రము మూఁడవభాగములో బరిచితుఁడని నేను వ్రాసినదానిని బురస్కరించుకొని శ్రీవీరేశలింగముగారు పరిహాసభాజనమగునట్లుగా నూహాప్రపంచమును విస్తరింపఁజేసి నేఁ డిట్లు వ్రాయుచున్నారు. "తాతయే శ్రీనాథునకుఁ జిన్నప్పుడు విద్యయుఁ గవిత్వమును నేర్పియుండును. భీమఖండకృతిపతి కమలనాభుని నెఱింగియుండినట్టు చెప్పుటచేత నతఁడు ౧౩౭౦ వ సంవత్సరమునకై బ్రతికియుండవచ్చును. అప్పటికి శ్రీనాథునికి తప్పక పదునేను సంవత్సరములకుఁ దక్కువ కాని యీడుండును దానినిబట్టి శ్రీనాథుఁడు ౧౩౬౫ వ సంవత్సరప్రాంతమున జనన మొంది యుండును."

మఱియును వీరు కమలనాభుని శ్రీనాథునికి గురువునుగాఁ జేయుటకై శ్రీనాథునితండ్రిని పండితపుత్త్రుని గావించిరి. శ్రీనాథుఁడు తన తాతనుగూర్చియె కాని యేపుస్తకమునందును తండ్రినిగూర్చి యంతగాఁ జెప్పియుండకపోవుటచేత "అతఁడొకవేళ పండితపుత్త్రుఁడే యై

మో?" అని పరిహాసముగ వక్కాణించుచున్నారు. పండితపుత్రుఁడను మాట నటుండనిండు. రెడ్డిప్రతాపరుద్రుఁడు ౧౩౭౩ వ సంవత్సరమునఁ బుట్టిను రాజ్యపరిపాలనము చేసినవాఁడు గావున నప్పటికిఁ గమలనాభుఁడు ముప్పదేండ్లవయస్సు గలవాఁడై యుండవలయును. శ్రీవీరేశలింగముగారు చెప్పినట్లు ౧౫౮౦ వఱకుఁ గమలనాభుఁడు బ్రదికియుండుటయే నిశ్చయమైన యెడల కమలనాభునకప్పటికి ౧౭౭ సంవత్సరములైన నుండును. ఏవిధమైన లిఖితమూలకసాక్ష్యము లేకుండఁ గమలనాభుఁ డంత కాలము జీవించి యుండెనని విశ్వసించుట క్రమమైనపద్ధతి కాఁజాలదు. మఱియును అన్నమంత్రి ౧౪౩౦ వ సంవత్సరప్రాంతమున నున్నవాఁడు గావున నప్పటి కాతని కేఁబదేండ్లున్నవని యొప్పుకొన్నను ౧౩౮౦ దవ సంవత్సరప్రాంతమునఁ బుట్టి యుండవలయును గావునఁ గమలనాభునితో అన్నమంత్రికి స్నేహము గలదని కాని, అతఁడు కమలనాభుని నెఱింగియున్నవాఁడని కాని తలంచుట విశ్వాసపాత్రము గాదు. ఇంకొక చిత్రము చూడుఁడు. వెల్గోటివారి వంశములోఁ బదవపురుషుఁడైన సర్వజ్ఞసింగమనాయుని సభకు శ్రీనాథుఁడు ౧౪౨౫ దవ సంవత్సరమునఁ బోయియుండెనని శ్రీవీరేశలింగముగారు వ్రాసి యున్నారు. ఆఱవపురుషుఁడైన అనపోతనాయఁడు ౧౩౮౧ సంవత్సరమువఱకు బ్రదికియున్నట్లు శాసనములు నిరూపించుచున్నవి. ౧౪౨౫ దవ సంవత్సరమునాటికి సర్వజ్ఞసింగమనాయునికి ౨౫ సంవత్సరములు వయస్సు కలదనుకొన్నను, (కనీసపక్షము) అతఁడు ౧౪౦౦ సంవత్సరప్రాంతమున జన్మించి యుండును గదా! ఏడవపురుషుఁడు ౧౪౦౦ వఱకు బ్రదికి యున్నాఁడనుకొన్నను, ఎనిమిదవ తొమ్మిదవ పురుషు లేమైరి? శ్రీనాథుని సర్వజ్ఞసింగమనాయుని సభకుఁ గొనిపోవుటకై వెల్గోటివారి వంశములో రెండుపురుషాంతరముల నంతరింపఁజేసినవా రొక్కసారిగా శ్రీనాథుని తాతకు ౧౭౭ సంవత్స

రములు వయస్సు నిప్పించుట వీరి యుదారస్వభావమును తేటపఱచక మానదు. ఈచరిత్రమున నిట్టి విచిత్రవిషయము లెన్నెన్నో పొడఁగట్టఁ గలవు. వాని ప్రశంస యిప్పటికి నిలుపుదము. కమలనాభుఁ డెంత కాలము బ్రదికియుండెనో మనము చెప్పఁజాలము. మనకుఁ దెలియ నప్పు డొకనిఁ బండితపుత్త్రుఁడని వెక్కిరించుటయు సంభావ్యము గాదు. కమలనాభుఁడు గాని మారయగాని కరణములని చెప్పుటకుఁ బ్రమాణము లేనప్పుడు ,అతఁ డాగ్రామకరణమగుటచే నాతని పుత్త్రుఁడును శ్రీనాథుని తండ్రియునగు మారయయు నాగ్రామమునందే యుండి కరిణీకపువృత్తిచేసి జీవనము చేయుచు నుండియుండవచ్చునని వ్రాయుట విశ్వాసపాత్రమైన వ్రాఁతకాఁబోదు. తన తండ్రి తాతలు కరణము లేయై నిజముగాఁ గరిణీకపువృత్తివలన జీవించువారేయైనయెడల శ్రీనాథుఁడుగూడ వంశపారంపర్యపు హక్కును విడనాడుకొని యుండఁడు. ఆ విషయమును బహిరంగముగాఁ జెప్పకపోయినను పరోక్షముగానైనను దా నేదో పట్టణమునకుఁ బ్రభువునని యే చెప్పుకొనియుండును. అట్లు చెప్పుకొని యుండనందున నతని తండ్రి తాతలు కరణములని యూహించుట యుక్తముకాదు. మన మేది యూహించి చెప్పినను హేతు యుక్తమై యుండవలయును.

భీమేశ్వరపురాణకృతిభర్తయగు బెండపూడి అన్నమంత్రి తాత యగు అన్నమంత్రిని:—

సీ॥ కాకతిక్ష్మాపాల గంధదంతావళీ
ధ్వజినీమహాధురంధరుఁడనఁగ
నవలక్షకోదండనాథ రాజ్యాంబోధి
సద్వర్ణపూర్ణిమాచంద్రుఁ డనఁగ
నాంధ్రభూమండలాధ్యక్ష సింహాసన
సంప్రతిష్ఠాపనాచార్యుఁ డనఁగ

వీరరుద్రా శేషవిశ్వంభరాక్షీశ
పృథులదక్షిణ భుజాపీఠమనఁగ
యవనసంహార విలయకాలాగ్ని యనఁగ
ఘాటివిఘటిత కుమ్మరోద్యానుఁడనఁగ
విశ్వలోక ప్రశస్తుఁడై వినుతికెక్కె
నతులబలశీల పోలయ యన్నశౌరి.

అనఁగా ఈతఁడు ప్రతాపరుద్రుని గజఘటసేనల కధ్యక్షుఁడనియు, నవలక్షధనుర్ధరులుగల రాజ్యాధిపతి సేనాసముద్రమునకుఁ జంద్రునివంటివాఁడనియు, ఆంధ్రభూమండలాధ్యక్ష సింహాసన ప్రతిష్ఠాపకుండనియు, వీరరుద్రమహారాజుయొక్క సమస్త రాజ్యభారధురంధరుండనియు, యవనుల సంహారించుటలోఁ గానాగ్నిరుద్రకల్పుఁడనియు, కుమ్మరమను ప్రదేశమును జయించెననియు, శ్రీనాథకవి వర్ణించియున్నాఁడు. ఆపురాణమునందే తన తాతయగు కమలనాభామాత్యుఁడు కవితావిద్యాధురంధరుండనియు, పద్మపురాణసంగ్రహ కళాకావ్యప్రబంధాధిపుఁడనియును, సముద్రతీరమునందలి కొల్పట్టణాధీశ్వరుఁడుగా నుండెననియు వర్ణించిన పద్యము నీయధ్యాయము మొదట నిదివఱకే యుదాహరించి యున్నవాఁడను. ఇందువలన భీమేశ్వరపురాణ కృతిభర్తయొక్కయు, కృతికర్తయొక్కయు బితామహు లిర్వురును గెండవప్రతాపరుద్రునికాలమున రాజకీయోద్యోగులుగ నుండి సమకాలికులై ప్రసిద్ధిగాంచినవారుగఁ గనుపట్టుచున్నారు. మఱియుఁ గాశీఖండమున పూర్వకవిస్తుతి వర్ణనసేయుచు

మత్పితామహుఁ గవిపితామహునిఁ దలఁతుఁ
కవితకావ్యకళాలాభుఁ గమలనాభుఁ
జంద్రచందన మందారసదృశకీర్తి
సరససాహిత్య సామ్రాజ్యచక్రవర్తి.

అని వర్ణించెనేకాని తనతాత తనకు విద్యాగురువునుగాఁ జెప్పుకొనియుండలేదు. ఇకతన తండ్రియగు మారయామాత్యుని శ్రీనాథకవి కాశీఖండ

మున 'విద్యారాజీవభవుఁడు' అని ప్రస్తుతించియుండెను. గనుక 'మారయకమలనాభునివంటి విద్వాంసుఁడుగాకున్నను, ప్రాజ్ఞుఁడువిద్యావంతుఁడు ననియే తలఁపఁదగియున్నాఁడు' అని ప్రభాకరశాస్త్రిగారు వ్రాసియున్నారు*

---

## అధ్యాయము ౨

### శ్రీనాథుని జన్మకాలనిర్ణయము

ఇదివఱకు శ్రీనాథుని జన్మకాలమును నిర్ణయించిన వారిలో ముఖ్యులు కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుగారును, శ్రీవీరేశలింగముగారు నైయున్నారు. ♦ శ్రీనాథుని జన్మకాలము ౧౩౬౦ దవ సంవత్సర ప్రాంతమని వేంకటలక్ష్మణరావుగారు నుడువుచున్నారు. వీరేశలింగముగారు లక్ష్మణరావుగారి వ్యాసమును బఠించినమీఁదట వారి మార్గము ననుసరించి శ్రీనాథుని జన్మకాలము ౧౩౬౫ దవ సంవత్సరప్రాంతమని చెప్పిరి. అయినను లక్ష్మణరావుగారి వాక్యములనే యున్నవి యున్నట్లుగా మాత్రము చెప్పియుండలేదు. లక్ష్మణరావుగారు వివాదాస్పదములయిన వేఱువిషయముల నేమియు నెత్తక మెల్లగాఁ జాఱవిడిచి హరవిలాసకాలనిర్ణయమునకు మాత్రము పూనుకొని కొంతవఱ

*1908 దవ సంవత్సరమున వంకాయల కృష్ణస్వామిశ్రేష్ఠిగారి శ్రీరంగవిలాస ముద్రాక్షరశాలయందు ముద్రింపించి ప్రచురింపఁబడిన ముద్రితగ్రంథము నాకడనున్నది. అందెక్కడను మారయామాత్యుఁడు విద్యారాజీవభవుఁడని వర్ణింపఁబడిన పద్యముగాని వచనముగాని నాకంటఁబడలేదు. మఱి యేగ్రంథమునైన నున్న శాస్త్రిగారు మఱచి 'కాశీఖండ' మని ప్రస్తావించియుందురేమో? ఏమో?

♦వీ రిపుడు కీర్తిశేషు లయినవారు. గ్రంథాలయసర్వస్వము, ద్వితీయసంపుటము, ప్రథమసంచిక, శ్రీనాథునిగ్రంథముల కాలనిర్ణయమను వ్యాసము.

కై యుక్తియుక్తముగ వాదించి శ్రీనాథుని జన్మకాలము నిర్ణయింపగలిగినను, వీరేశలింగముగారు వివాదాస్పదములయిన విషయముల నన్నిఁటిని నెత్తికొని యెట్టివిపరీత సిద్ధాంతములను తాము చేయుచున్నారో తెలిసికొనఁజాలక, తాము చెప్పిన కాలమును సమన్వయించుకోలేక చరిత్రకాలములను విస్మరించి గాథలనే ప్రధానముఁ జేసికొని, కేవలము లక్ష్మణరావుగారి కాలనిర్ణయముపైనే యాధారపడి వారివాదమునే తమ గ్రంథములోనికిఁ జొప్పించియు వారినామమునైన నుదాహరింపక వారివాదమునకును దమవాదమునకును గొంచెము భేదము కలదని చదువరు లనుకొనుటకై యవకతవక మార్పులను గావించి పరిహాసాస్పద మగునట్టి వాదమును నెలకొల్పిరి. లక్ష్మణరావుగారు శ్రీనాథుని కాలనిర్ణయము నిట్లు గావించిరి.

౧౩౬౦ శ్రీనాథుని జన్మకాలము
౧౩౭౬ మరుద్రాట్చరిత్ర రచనాకాలము
౧౩౮౫ శాలివాహన సప్తశతికాలము
౧౩౯౫ ఆంధ్రనైషధ కాలము
౧౪౦౦ హరవిలాసకాలము
౧౪౧౦ ఫిరంగిపుర శాసనకాలము
౧౪౧౩ ఆలపాడుతామ్రశాసన కాలము
౧౪౧౬ అమీనాబాదుశాసన కాలము
౧౪౨౦ భీమఖండకాలము
౧౪౩౦ కాశీఖండకాలము
౧౪౩౫ శివరాత్రిమహాత్మ్యకాలము
౧౪౪౦ మరణకాలము

శ్రీవీరేశలింగముగారు శ్రీనాథుని కాలనిర్ణయము నిట్లు గావించిరి.

౧౩౬౫ శ్రీనాథుని జన్మకాలము.

౧౩౮౩ మరుత్తరాట్చరిత్ర రచనాకాలము

౧౩౯౪ పల్నాటివీరచరిత్ర రచనాకాలము

౧౩౮౭ శాలివాహనసప్తశతి రచనాకాలము

౧౩౯౦ పండితారాధ్య చరిత్రకాలము

౧౩౯౫ ఆంధ్రనైషధ రచనాకాలము

౧౪౦౦ హరవిలాస రచనాకాలము

౧౪౦౮ పొన్నుఁబల్లి శాసనకాలము

౧౪౧౦ ఫిరంగిపుర శాసనకాలము

౧౪౧౩ ఆలపాడు శాసనకాలము

౧౪౧౬ అమీనాబాదు శాసనకాలము

౧౪౨౦ శ్రీశైలయాత్ర, శివరాత్రిమాహాత్మ్య రచనాకాలము

౧౪౨౩ డిండిమభట్టు నోడించి కవిసార్వభౌముఁడగుట

౧౪౨౫ సర్వజ్ఞసింగమనాయని దర్శించుట

౧౪౩౦ భీమఖండకాలము

౧౪౩౫ కాశీఖండకాలము

మరణకాలమును సరిగా నిర్ణయించి చెప్పియుండలేదు.

౧౪౬౫ శ్రీనాథుని మఱది దుగ్గన విరచిత నాచికేతూపాఖ్యాన రచనాకాలము

౧౪౮౦ మఱియొక స్థలమునఁ జెప్పిన నాచికేతూపాఖ్యాన రచనాకాలము.

వీరేశలింగముగారు శ్రీనాథుని మరణకాలమును నిర్ణంచి చెప్పకపోయినను పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవిని గూర్చి వ్రాసినఘట్టమున యౌవనదశలోఁ దెలుంగురాయని పెద్దకుఁ బోయి కవిత్వము చెప్పి, యాతనిని మెప్పించిన శ్రీనాథుఁడు నృసింహరాజుయొక్క తండ్రికాలములోనే కాక కొంతవఱకీనృసింహరాజుయొక్క రాజ్యకాలములోఁ

గూడ నుండియుండును కాఁబట్టి కృతిభర్తయైన యీసాళువనృసింహరాజును, కృతికర్తయైన పినవీరన్నయు శ్రీనాథుని యంత్యకాలములోను తదనంతరకాలములోను జీవించియుండిన ట్లిందువలనఁ దేలుచున్నది. ఈమహాకవి ౧౪౮౦ వ సంవత్సరప్రాంతమువఱకును జీవించి యుండవచ్చును గనుక, శ్రీనాథకవి వార్ధకదశలో నున్నప్పు డితఁడు యౌవనదశయం దుండియుండును. దానినిబట్టిచూడగా శ్రీనాథుఁడు తా నాంధ్రీకరించిన నైషధమును గొనిపోయి యప్పుడు జను లెఱుఁగొనునట్లు కవిజనాగ్రగణ్యుఁడని యభినవముగాఁ బేరొందుచుండిన మహావిద్వాంసుఁడైన పినవీరనకుఁ జూపియుండును. పినవీరభద్రుని జీవితకాలములోనే శ్రీనాథుఁ డాతనికిఁ బూర్వకవియైనందున శృంగారశాకుంతల కృతిపతియైన వెన్నమంత్రి "సీ. శ్రీనాథభట్టభాషా నిగుంభనంబుల పరిమళంబులఁ గూడఁ బఱవనేర్చు" నని పినవీరన కవిత్వముఁ శ్లాఘించెను" అని వ్రాసియుండుటచేత శ్రీనాథుఁడు 15 యేండ్లుజీవించియున్నట్లు తేలుచున్నది గదా!

ఈపై విషయముల నన్నిటిని మనము పరిశీలించి శ్రీనాథుని జన్మకాలమును నిర్ణయింపవలసి యుండును. ఇట్లుపరస్పర విరుద్ధాంశములను సమన్వయించు టసాధ్యముగాదు. ఇందేవి సత్యములో, ఏవిసత్యములు కావో సిద్ధాంతము చేయుట బహుకష్టసాధ్య మైనను సాధింపవచ్చును. వీని నిష్పక్షపాతబుద్ధితో విమర్శించిచూతము. వేంకటలక్ష్మణ రావుగారును, వీరేశలింగముగారును, హరవిలాసకాలమును బట్టి శ్రీనాథుని జన్మకాలమును నిర్ణయించిరి. గ్రంథాలయ సర్వస్వములో శ్రీలక్ష్మణరావుగారు హరవిలాసమును గూర్చి:—

"ఈకావ్యమునందు శ్రీనాథుని కావ్యముల కాలనిర్ణయము చేయుటకు మంచిసాధనముకలదు. అందును గుఱించి యిచ్చటఁ గొంత చర్చించెదను.

"కృతిపతియొక్క తమ్ముఁడైన తిరుమల శెట్టిని వర్ణించుచు కవి యిట్లు వ్రాసియున్నాఁడు:—

చ. హరిహరరాయ పేరొజి షహాను మహాసుర జాఫషాహ భూ
వరులు నిజప్రభావ మభివర్ణన సేయఁగఁ గాంచు కృత్యధీ
శ్వరుని వసంతవైభవము సర్వము నొందఁగఁ జేసి నిర్వహించు మా
తిరుమలనాథ సెట్టికిని ధనబంధకట్టికి నెవ్వరీడగున్."

ఈపద్యమునందు ముగ్గురు సమకాలికులైన రాజుల పేళ్లు చెప్పఁబడి యున్నవి. వీరిలో హరిహరరాయలు విజయనగరాధీశ్వరుఁడు. ౧౩౭౭ మొదలు ౧౪౦౪వరకు రాజ్యముచేసెను. ఫీరోజషహా బహమనీరాజు. ౧౩౯౭ మొదలు ౧౪౨౨ వఱకు రాజ్యముచేసెను. కుమారగిరి కొండవీటిరాజు. ఈతఁడు శ్రీజయంతిరామయ్యగారి మతమున ౧౩౭౮ మొదలు ౧౩౯౮వఱకు రాజ్యముచేసెను. శ్రీచిలుకూరి వీరభద్రరావుగారి మతమున ౧౩౮౩ మొదలు ౧౪౦౦వఱకు రాజ్యముచేసెను. ఈముగ్గురు రాజులును బ్రదికియుండి స్వస్వరాజ్యములను పాలించుచుండిన కాలము శ్రీజయంతి రామయ్యగారి యభిప్రాయము ప్రకారము ౧౩౯౭-౧౩౯౮ రెండు సంవత్సరములు. శ్రీవీరభద్రరావు గారి యభిప్రాయముప్రకారము ౧౩౯౭-౧౪౦౦ నాలుగుసంవత్సరములు. ఇట్లు హరవిలాసనిర్మాణకాలము మనము ఒకటి రెండు సంవత్సరముల యంతరముతో సరిగఁ గనుగొనఁ గలిగితిమి. ౧౪౦౦వ సంవత్సరప్రాంతమున ననఁగా ౧౩౯౮ లో ౧౩౯౯లోనో కుమారగిరిప్రభుత్వపుఁ జివర భాగమున, ఈకావ్యము వ్రాయఁబడినదని స్పష్టపడుచున్నది. దీనిని బట్టి ఇతరకావ్యములయొక్క కాలనిర్ణయమును చేయవచ్చును" అని వ్రాసి హరవిలాసకాలమును నిర్ణయము గావించిరి.

ఈకాలమునే వీరేశలింగముగారును సంగీకరించిరి. వీరేశలింగముగారి యభిప్రాయము ప్రకారము శ్రీనాథుఁ డిప్పటికి ముప్పదియైదు సంవత్సరముల ప్రాయమువాఁడు. లక్ష్మణరావుగారి యభిప్రాయము

క. కంటిని విశుద్ధసంతతి
వింటి బురాణములు పెక్కులు విద్యలు వొగిచగెఁగా
మంటి బహువత్సరంబులు
గొంటి యశోధనము సుకవికోటి నుతింపఁగా.

కృతినందిన యవచితిప్పయ్య వృద్ధయిన నాతని బాలసఖుఁడు గూడ వృద్ధుడే కావలయునుగదా. మాలెక్కప్రకారము హారవిలాసము రచనాకాలము (౧౪౨౦) వఱకు శ్రీనాథుఁడు నలువదియేండ్లవాఁడుగ నున్నాఁడు. కావున ఈపూర్వపక్షమంత బలవంతమైనదికాదు. ‘మంటి బహువత్సరంబులు’ అని యేఁబదియేండ్లు సమీపించినవాఁడన వచ్చును. ‘బాలసఖుఁడు’ అనఁగనే తూచినట్లిద్దఱికిని ఒక్కటే వయస్సుండవక్కర లేదు. ఇద్దఱికి నేఁడెనిమిది సంవత్సరములు భేదముండవచ్చును. శ్రీనాథుఁడు చిన్ననాఁడే పెద్దబుద్ధులుగల యపరిమితప్రతిభాశాలి గనుక నాతనికంటెఁ పెద్దవారుకూడ నాతనితోఁ జెలిమిచేసి యుండుట యాశ్చర్యముకాదు.” అని చులకనఁగాఁ ద్రోసి రాజనిరి. ఇంక వీరేశలింగము గారన్ననో విచిత్రమైన మార్గ మవలంబించిరి. ‘ఉభయులును శైవ మతస్థులగుటచేతనో మఱియే హేతువుచేతనో యట్టిప్రయాణములయందు శ్రీనాథునకు కుమారగిరిభూపాలుని సుగంధభాండాగారధ్యక్షుఁడయి కోటీశ్వరుఁడుగానుండిన యవచితిప్పయసెట్టితోడిమైత్రి కలిగినది. అందుచేతనే శ్రీనాథుఁడు తిప్పయసెట్టికి బాలసఖుఁ డయ్యెను. అప్పటికి శ్రీనాథుఁడిరువదియైదు ముప్పదిసంవత్సరముల బాలుఁడే యయినను తిప్పయసెట్టి యాతనికంటె మిక్కిలి పెద్దవాఁడయి యుండును. కొండవీటియందు తప్ప శ్రీనాథున కవచితిప్పయసెట్టితోడి మైత్రి కలుగుట కవకాశము వేఱొకచోట గానఁబడదు. శ్రీనాథుఁడు నైషధరచనానంతరమునఁ దన బాలసఖుఁడైన తిప్పయసెట్టిని జూచి సన్మానమును బొందుటకు మరల గొండవీటికిఁ బోయెను. అప్పుడు శ్రీనాథుఁడు ధనస్వీకారముచేసి హారవిలాసమును రచించి తిప్పయ్యసెట్టి కంకిత మొనర్చెను.” అని

యొక యపూర్వ వ్యాఖ్యానమును గావించిరి. ఇందలి ఫలితార్థమేమన బాలసఖుం డనుదానికి వీరేశలింగముగా రొకరీతిగను, లక్ష్మణరావు గారు వేఱొక రీతిగను తేటతెల్లమగుచున్నది కదా! శ్రీవీరేశలింగముగారు ముప్పదియైదేండ్లవానిని గూడ బాలుడనుట నత్యాశ్చర్యము గా నున్నది. పదునాఱేండ్ల వయస్సునకుం దక్కువ వయస్సు గల మగవానిని బాలుండనియును, పదునాఱేండ్లకుం దక్కువ వయస్సు గలయాడుదానిని బాలికయనియు వ్యవహరించుట గలదు. వీరేశలింగముగారు బాలసఖుం డనుదానికి బాలుండైన సఖుడని యర్థము చేసినట్లు గన్పట్టుచున్నది. లక్ష్మణరావుగారు చెప్పినది యుక్తి యుక్తముగ నున్నట్టులు పైకిం గన్పట్టుచున్నను దానిని బాధించు విషయములు గొన్ని లేకపోలేదు. ఇరువదియైదేండ్లవానిని బాలుని గాం జేసినను వీరేశలింగముగారా బాలప్రాయమున హారవిలాసమును అంతకు బూర్వమే శృంగారనైషధమును రచించెనని చెప్పుట యుక్తి యుక్తముగాం గన్పట్టుచుండ లేదని కాంబోలుం బ్రథమ సమావేశ కాలమునకుం బదిసంవత్సరముల తరువాత హారవిలాసమును కృతి యిచ్చినట్లుగాం జెప్పినారు. ఇదియొక యద్భుతకల్పనము. బాలుండైన సఖుండని యర్థము చేసుకోవలసి వచ్చినపక్షమున హారవిలాస రచనా కాలమున శ్రీనాథుండు పదునాఱేండ్ల లోపు వయస్సు గల బాలుండని యర్థము చేసుకొనవలయునే గాని వీరేశలింగముగారి యసంబద్ధ వ్యాఖ్యానము సరిపడదని నిస్సంశయముగాం జెప్పందగును. ఏంబదేండ్ల వయస్సు గలిగిన వాండు మాత్రము 'మంటి బహువత్సరంబులు' అని యనుకొను నన్న నంతవిశ్వాసపాత్రముగాం గన్పట్టదు. శ్రీమాన్ ఉప్పల వేంకటనరసింహాచార్యులుగారు హారవిలాస పీఠికలో నిట్లు తెలిపియున్నారు,

"హారవిలాసములో నీతడు "మంటి బహువత్సరములు" అని

చెప్పుకొనుటచే కృతినందు నాటికి 65 సంవత్సరముల వయసువాఁడై యుండును. ఇతనికి బాలసఖుఁడగు శ్రీనాథుఁడును 50 సం॥ వయసువాఁడై యుండును. *

లక్ష్మణరావుగారి యభిప్రాయము ప్రకారము తిప్పయసెట్టి శ్రీనాథునికంటె నేఁడెనిమిదేండ్లెక్కువ వయస్సుగలవాఁడు. అనఁగా ౧౩౬౭ వ సంవత్సరమునఁ దిప్పయసెట్టి జనించియుండవలయును. శ్రీలక్ష్మణరావుగారి పద్ధతిని మన మవలంబించినయెడల తిప్పయసెట్టి వయస్సు నిశ్చయముగా మనముఁ దెలిసికొనుటకు మార్గ మాహారవిలాసమునందే గలదు. తిప్పయసెట్టి తండ్రియగు దేవయసెట్టి,

క. శ్రీపర్వతసోపాన
స్థాపకుఁడగు రెడ్డివేమజగతీపతికిన్
బ్రాపైన యవచిదేవయ
యాపావాణికి జనించె నభ్యుదయముతోన్.

అని పోలయ వేమారెడ్డికిఁ బ్రాపుగానుండెననుటకును బైపద్యమునఁ జెప్పియున్నాఁడు. మఱియును,

క. శ్రీపర్వతసోపాన
స్థాపక వేమక్షితీశ సామ్రాజ్య శ్రీ
వ్యాపారి ముఖ్య యవ్వయ
దీపక యవచిత్రిపురాంతక దేవయతిప్పా.

అని చెప్పియుండుటచేతఁ గూడ తిప్పయసెట్టి పోలయవేమక్షితినాథుని కాలమునఁగూడ వ్యాపారిముఖ్యుఁడుగా నున్నట్లు దెలిపియున్నాఁడు. శ్రీపర్వతసోపానస్థాపకుఁడై వన్నెకెక్కినవాఁడు పోలయవేమారెడ్డి గావున నతఁడు ౧౩౭౦ దవ సంవత్సరమువఱకును బరిపాలనము చేసినవాఁడు. అతని రాజ్యపరిపాలన కాలములో వ్యాపారిముఖ్యుడుగా నుండుటకుఁ దిప్పయసెట్టికిఁ గనీస మిరువదిసంవత్సరములయిన వయ

* వావిళ్ళ రామస్వామిశాస్త్రి అండ్ సన్సు వారిచేఁ బ్రకటితమైనప్రతి(1916)

స్సుండ వలయునుగదా. దీనింబట్టి కాలనిర్ణయముచేయఁ బూనినయెడల తిప్పయసెట్టి ౧౩౩౦ దవ సంవత్సర ప్రాంతమున జనించి యుండవలయును. లక్ష్మణరావుగారి యభిప్రాయప్రకార మేడెనిమిదేండ్లు శ్రీనాథుఁడు తిప్పయకంటెఁ జిన్నవాఁడు గావున, శ్రీనాథుఁడు ౧౩౩౮ దవ సంవత్సరప్రాంతమున జనించియుండ వలయునుగాని లక్ష్మణరావుగారు చెప్పిన చందమున శ్రీనాథుని జననకాల సంవత్సరము ౧౩౬౦ కాఁబోదు. శ్రీవీరేశలింగముగారు చెప్పినచందమున శ్రీనాథుని జననకాల సంవత్సరము ౧౩౬౫ కాఁబోదు. అనఁగా హరవిలాసరచనా కాలము ప్రకారము ౧౪౦౦ సంవత్సరమేయైన యెడల నప్పటికి వారునిర్ణయించిన దిప్పయకు ౭౦ సంవత్సరములు, శ్రీనాథునకు ౬౨ సంవత్సరములును వయస్సు గలిగి యుండవలయుననుట హరవిలాసము ప్రకారము సిద్ధాంతమగుచున్నది గాని లక్ష్మణరావుగారు చెప్పిన ప్రకారము తిప్పయకు నేబదేండ్లుగాని శ్రీనాథునకు నలువదేండ్లుగాని, వీరేశలింగముగారు చెప్పిన ప్రకారము శ్రీనాథునకు ముప్పదియైదేండ్లుగాని వయస్సుగలిగి యుందురన్న సిద్ధాంతము నిలువజాలక పోవుచున్నదిగదా! భీమఖండ రచనాకాలము లక్ష్మణరావుగారు చెప్పినట్లు ౧౪౨౦ దవ సంవత్సరమును కాశీఖండరచనాకాలము ౧౪౩౦ దవ సంవత్సరమునైన యెడల శ్రీనాథుఁడు తన ౮౨ సంవత్సర ప్రాయమున భీమఖండమును ౯౨ వ సంవత్సరప్రాయమున కాశీఖండమును రచించినట్లును హరవిలాసమును బట్టి సిద్ధాంతమగుచున్నది. వీరేశలింగముగారు చెప్పినచందమున భీమఖండరచనకాలము ౧౪౩౦ దవ సంవత్సరమును, కాశీఖండరచనకాలము ౧౪౩౫ దవ సంవత్సరము నైనయెడల శ్రీనాథుఁడు భీమఖండమును ౬౫ వ సంవత్సరప్రాయమునను, కాశీఖండమును ౭౦ దవ సంవత్సరప్రాయమునను, ఇరువురును బాల్యసఖులై శ్రీనాథుఁ డేఁడెనిమిది సంవత్సరములు చిన్నవాఁడైన పక్షమున

హరవిలాసమును బట్టి భీమఖండమును ౯౨వ సంవత్సర ప్రాయమునను, కాశీఖండమును ౯౭ దవ సంవత్సరప్రాయమునను రచించినట్లు సిద్ధాంతము చేయవలసియుండును. శ్రీనాథుని మరణకాలము లక్ష్మణరావుగారు వక్కాణించిన ౧౪౪౦ దవ సంవత్సర ప్రాంతమే సత్యమైనదైన యెడల శ్రీనాథుఁడు ౧౦౨ సంవత్సరములును, శ్రీవీరేశలింగముగారి యభిప్రాయము ప్రకారము శ్రీనాథుఁడు సాళ్వనృసింహరాజు రాజ్యకాలమునఁ గూడ నుండుటయే వాస్తవమైన యెడల ౧౧౭ సంవత్సరములును, హరవిలాసమును బట్టి శ్రీనాథునకు తిప్పయ బాల్యసఖుఁడే యైన యెడల ౧౨౨ సంవత్సరములును, పదవతరమువాఁడైన సర్వజ్ఞసింగభూపతిచే సన్మానింపఁబడినవాఁడే యైన యెడల ౧౩౨ సంవత్సరములును దీర్ఘాయుష్మంతుఁడై జీవించియుండునని సిద్ధాంతము చేయవలసి యుండును. ఇంకొక మార్గమును బట్టి చూతము.

నాచికేతూపాఖ్యాన కావ్యకర్త యగు దగ్గుబల్లి దుగ్గనామాత్యుఁడు శ్రీనాథుని భార్యతోఁబుట్టినవాఁడని నాచికేతూపాఖ్యానములోని,

సీ. కవిసార్వభౌముఁడై కర్ణాటవిభుచేతఁ
గనకరత్నాభిషేకములు గనిన
శ్రీనాథసుకవి కూరిమిచేయు మఱఁది
దుగ్గయకవిరాజ దగ్గుఁబల్లి
తిప్పనామాత్యునకు సతీమణి యెఱ్ఱప
కునుఁ దనూజుఁడవు పోతనకు నెఱ్ఱ
నామాత్యవరునకు ననుఁగు దమ్ముఁడవు
శాండిల్యగోత్రుఁడౌ సంసనుతిని
గీ. చెప్ప నేర్తువు కృతులు సుస్థిరముగఁగ
గాన నీవు రచింపఁ గడఁగియున్న
నాచికేతచరిత్రంబు నాదు పేర
నంకితము సేయు కవిరాజు లాదరింప,

అనుపద్యములోఁ దెలుపఁబడినది. మఱియును,

„ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్త్రి కవిసార్వభౌమ సకలవిద్యాసనాథ మహాకవీంద్రప్రసాదలబ్ధ కవితావిశేష దగ్గుబల్లి తిప్పనార్యప్రియతనూజ దుగ్గన నామధేయప్రణీతం బైన నాచికేతూపాఖ్యానం బను మహాప్రబంధమునందు" అను గద్యలోఁ దాను శ్రీనాథుని శిష్యుఁడై నట్లుగాఁ గూడఁ జెప్పుకొని యున్నాఁడు. ఇది మాధవవర్మ వంశోద్భవుఁడై గజపతుల పక్షమున నుదయగిరిదుర్గము నేలిన బసవ భూపాలునకు మంత్రియగు ననంతామాత్య గంగయ మంత్రికి నంకితము గావింపబడియె! వీరేశలింగముగారు ‚ఘంట సింగయ్య నంది మల్లయ్య' అను జంటకవులను గూర్చివ్రాసిన ఘట్టమున '౧౪౬౯ దవ సంవత్సర ప్రాంతమున శ్రీనాథుని ముద్దుమఱఁది యైన దుగ్గనకవిచేత నాచికేతూపాఖ్యాన మీతని కంకితము చేయఁబడియె' నని చెప్పియున్నారు. ఇంతకుఁ బూర్వము దుగ్గనకవిని గూర్చి వ్రాసిన ఘట్టమున ‚ఆవలకే కాంచీపుర మహాత్మ్యమును రచియించి తరువాతనే నాచికేతూపాఖ్యానమును రచియించి యుండుటచేత నీకడపటిపుస్తకము ౧౪౮౦ వ సంవత్సరప్రాంతములయందు రచియింపఁబడి యుండు' నని పరస్పరవిరుద్ధముగ వ్రాసియున్నారు. మొదట వ్రాసిన యభిప్రాయములకంటెఁ గడపటవ్రాసిన యభిప్రాయములే సరియైనవిగా గ్రహింపవలసిన దని తమ పీఠికలో వ్రాసియున్నారు గావునఁ గడపటి యభిప్రాయమైన ౧౪౬౯ దవ సంవత్సరమున నాచికేతూపాఖ్యానమును గంగయామాత్యున కంకితముచేయఁబడిన దను సిద్ధాంతమునే విశ్వసింతము. పైపద్యమును బట్టి శ్రీనాథుఁ డప్పటికి బ్రదికియున్నట్లు గానంబడుచున్నది. శ్రీనాథసుకవి కూరిమిచేయు మఱఁదిఁ' అని యుండుటచేత శ్రీనాథుఁ డప్పటికి స్వర్గస్థుఁడై యుండు ననుట సంభావ్యమైయుండునా? శ్రీనాథుఁడు బ్రతికియుండినను బ్రదికియుండకపోయినను నాగ్రంథము

రచించునాఁటికి నాతనికి నలువదియైదేండ్లకంటె నెక్కువ వయస్సు గలదని చెప్పరాదు. ఇతనికంటె నతని యప్పయగు శ్రీనాథుని భార్య ౧౫ సంవత్సరములు పెద్దదనుకొన్నను నామెకు ౬౦ సంవత్సరములు వయస్సుండు నని చెప్పవచ్చును. ఆమెకుఁ బదవయేఁట వివాహమయ్యె నని చెప్పక తప్పదుగదా. అనఁగా ౧౪౧౫ సంవత్సరము తరువాతనే శ్రీనాథునకు వివాహమై యుండు నని సిద్ధాంతముచేయవలసివచ్చును. లక్ష్మణరావుగారి యభిప్రాయమును బట్టి వివాహ మగునప్పటికి శ్రీనాథునకు నేఁబదియైదేండ్లప్రాయమును, వీరేశలింగముగారి యభిప్రాయమును బట్టి యేఁబదేఁడ్ల ప్రాయమును, హరవిలాసమునుబట్టి డెబ్బదియేడేండ్ల ప్రాయము నుండును సకలవిద్యాసనాథుఁడైన శ్రీనాథుఁడు శ్రీపెదకోమటి వేమభూపాలుని యాస్థానంబున విద్యాధికార పదవియం దుండియు, మహాభోగము లనుభవించుచుండియు నంతకాలమువఱకు వివాహము లేకయే యుండెనా?

ఇంతియగాక వెల్గోటివారి వంశములోఁ బదవతరము వాఁడైన సర్వజ్ఞసింగమనాయని సందర్శింప శ్రీనాథమహాకవి వాని యాస్థానమునకుఁ బోయెననియు నాప్రభువువలన సమ్మానము నొందె ననియు శ్రీవీరేశలింగముగారు సత్యముని వ్రాయుచున్నారుగదా! అదెప్పుడు సంభవమయ్యెను? ౧౪౩౫ దవ సంవత్సరమని శ్రీవీరేశలింగముగారు వ్రాసియున్నారు. అహహా! విఘ్నేశ్వరుని జేయఁబోయినఁ గోఁతియైనట్లుగా వీరిసిద్ధాంత మపహాస్యభాజన మగుచున్నదే. ౧౪౩౫ దవ సంవత్సరమునాటికి వీరు వక్కాణించిన పదవతరము సర్వజ్ఞసింగమనాయనికి నప్పటికి ౩౫ సంవత్సరముల ప్రాయము గల దనుకొన్నను నాయన జన్మకాలము ౧౪౦౦ అగుచున్నది. కాని యేఁడవతరమువాఁడైన సింగమనాయని పుత్రుఁడు రావుమాధవరావు క్రీ. శ. ౧౪౩౭, ౧౪౩౯ సంవత్సరములలో రాచకొండలో నివసింపుచు రాజ్యపాలన

ముచేయుచున్నట్లితని భార్య యగు నాగాంబిక శాసనమువలన స్పష్టముగా దెలియుచున్నది. ఈశాసనములో రావుమాధవరావు రాయరావు బిరుదమును స్థిరీకరించినాడని వాకొనఁబడి యున్నది. మఱియును, శాలివాహనశకము ౧౩౭౧ సౌమ్యసంవత్సర చైత్రమాసమున రావుమాధవరావుభార్య నాగాంబిక నాగసముద్రమను తటాకమును శాశ్వతధర్మాభివృద్ధికై ప్రతిష్ఠాపించె నని యాశాసన ముద్ఘోషించుచున్నది.* ఎనిమిదవతరమువాఁడైన రావుమాధవభూపాలుడు క్రీ.శ.౧౪౩౦దవసంవత్సర ప్రాంతమునఁ బరిపాలనము సేయుచుండఁగా బదవతరము సింగమునాయఁడు ౧౪౧౦ లోఁబుట్టి యిరువదియైదేండ్ల ప్రాయముననే సర్వజ్ఞుఁడై యెట్లు పరిపాలనము చేయుచు సకలవిద్యాసనాథుఁడైన శ్రీనాథుని సమ్మానింపఁగలిగెనని యేగణితశాస్త్రప్రకారము లెక్కింపగలిగిరో, ఏదివ్యదృష్టిచేతఁ గనిపెట్టఁగలిగిరో యూహింపనలవిగాక యున్నది. ఎనిమిదవతరములోని పురుషుఁడు ౧౪౩౦ లోఁ బరిపాలించునప్పుడు పదవతరములోని పురుషుఁడు మఱి (కనీసమెంచి చూచినను) నలువదియేండ్లకుఁ దరువాతఁ బరిపాలనము చేసియుండవలయును. అట్లగు నెడల పదవతరమువాఁడైన సర్వజ్ఞసింగమనాయఁడు ౧౪౭౦దవ సంవత్సరము ప్రాంతమున నుండవలయునుగాని యంతకు లోపుగా నుండి యుండెననుట యసంభవము. శ్రీనాథుఁడు పదవతరము సింగమనాయని సభకుఁబోయి సమ్మానముఁ బొందినది వాస్తవమైనయెడల హారవిలాసమును బట్టి శ్రీనాథునకు వయస్సు ౧౩౨ సంవత్సరము లగుచున్నది. పితామహుఁడగు కమలనాభామాత్యునకు ౮౭ సంవత్సరము లాయు విచ్చినప్పుడు వానిమనుమఁడైన శ్రీనాథునకు ౧౩౨ సంవత్సర

* వెల్గోటివారి వంశచరిత్రములోని యనుబంధములో నున్న శాసనము౨౦ జూడుఁడు,

ములైన యీయుపీయకన్న వారియుదారస్వభావమునకు వెలితిగన్పట్టదా? హారవిలాసములోని,

> 'శ్రీపర్వతసోపాన
> స్థాపక వేమక్షితీశ సామ్రాజ్యశ్రీ
> వ్యాపార ముఖ్య యన్వయ
> దీపక యాలకాధరాజ దేవయతిప్పా!,

అనుపద్యమును గూర్చి వీరేశలింగముగారు

"అంతేకాక తృతీయాశ్వాసారంభములోని యీపద్యము తిప్పయసెట్టికూడ ప్రోలయ వేమారెడ్డికాలములో నుండినట్లు తెలుపుచున్నది. ప్రోలయవేమారెడ్డి కాలములోనే తిప్పయ్యసెట్టి వ్యాపారిముఖ్యుఁడైనందున నప్పటి కిరువది సంవత్సరములవాఁడయిన నయియుండి, కుమారగిరిరెడ్డి రాజ్యారంభకాలమునకే, యేఁబదిసంవత్సరములవాఁడయి, హారవిలాసరచనకాలమునకే యఱువదేండ్లు దాటినవాఁడయియుండవలెను. హారవిలాసము ౧౪౨౦వ సంవత్సరప్రాంతమున తిప్పయసెట్టి కంకితముసేయఁబడినదని చెప్పెడి బుద్ధిమంతుల యభిప్రాయము ప్రకారము తిప్పయసెట్టికి నూటపదియేండ్లు దాటినదరునాత శ్రీనాథుఁడు హారవిలాసము సంకితము చేసెననియేర్పడును గనుక నదిగొప్పయసంగతము. కాబట్టి హారవిలాసము కుమారగిరిభూపాలుఁడు జీవించియుండగానే ౧౪౦౦వ సంవత్సరమునకు లోపలనే తిప్పయశెట్టికంకితము చేయఁబడుట నిశ్చయము. అప్పటికే తిప్పయశెట్టికి దాదాపుగా డెబ్బది సంవత్సరముల యీడుండును. ౧౩౬౦ వ సంవత్సరములోపలజననమొందని శ్రీనాథుఁడు వృద్ధుఁడైన తిప్పయశెట్టికి బాలసఖుడెట్లగును? ఇద్దరును సమానవయస్కులు కాకపోవుట నిశ్చయము. తిప్పయశెట్టి వృద్ధుడే శ్రీనాథుడు బాలుడై యుండినప్పుడు సఖ్యముకలిగియుండుటచేతనే తిప్పయశెట్టికి శ్రీనాథుఁడు బాలసఖుడయ్యెనుగాని యుభయులును బాలురై యుండినపుడు కలిగినమైత్రిచేతగాదు............కాఁబట్టి ౧౩౬౦

నకును ౧౪౦౦ లకును నడిమికాలములో ననఁగా ౧౪౦౦ వ సంవత్సర ప్రాంతమున హరవిలాసము రచింపఁబడెను. అప్పటికి శ్రీనాథునకు ముప్పదినాలుగు ముప్పదియైదుసంవత్సరముల వయస్సుండును." అని వ్రాయుచు లక్ష్మణరావుగారికిఁ బ్రత్యుత్తరమిచ్చియున్నారు. ఇంతగా వ్రాసిన వీరేశలింగముగారు సర్వజ్ఞసింగమ నాయని ప్రశంస వచ్చునప్పటికి నదియేమి మాహాత్మ్యమునకో కాని తమతోఁటిబుద్ధి కౌశలము నంతయు నవిడిచి విపరీతాప్రమాణవాదమునకుఁ గడంగుదురు. వీరివాద వైపరీత్యమునుగనుఁడు. సర్వజ్ఞసింగమనాయని గూర్చి వ్రాయుచు, "బేతాళనాయనికి నేఁడవతరమువాఁడు సర్వజ్ఞసింగమ నాయఁడ గుటకు సందేహములేదు; రసార్ణవసుధాకరాది సంస్కృత గ్రంథములను రచించినవాఁడతఁడే యగుటకును సందేహములేదు. శ్రీనాథ పోతనార్యులాతని కాలపువారు కాకపోవుటయు నందుచేత నాతని యాస్థానమునందుండకపోవుటయు నిశ్చయమే. అంతమాత్రముచేత పదవతరము వాఁడైన సింగమనాయఁడు విద్వాంసుఁడును సర్వజ్ఞబిరుదాంకితుఁడును గాఁడనసిద్ధాంతమేర్పడనేరదు." అనివీరేశలింగముగారేడవతరముసింగమ నాయనికాలములోశ్రీనాథుఁడులేఁడనుటనిశ్చయమునినొక్కి వక్కాణించుచున్నారు. ౧౩౬౮ వ సంవత్సరమునఁ బుట్టి ముప్పదైదేండ్లప్రాయమున ననఁగా ౧౪౦౦ సంవత్సరప్రాంతమున డెబ్బదేండ్ల ప్రాయముగల తిప్పయశెట్టికి హరవిలాసమంకితము చేసెనని యొకప్రక్కను సిద్ధాంతము సేయుచు నేఁడవతరము సింగమనాయని కాలములో శ్రీనాథుఁడు లేఁడని నొక్కి వక్కాణించుట పరిహాసాస్పదమైన విపరీత సిద్ధాంతమనుటకు లేశమాత్రమును సంశయింపఁబనిలేదు. ఆఱవతరమువాఁడైన అనపోతనాయఁడు ౧౩౬౧ వఱకును బ్రదికియుండి పరిపాలనము చేయుచున్నట్టు శాసనములు ఘోషించుచుండగా వానితరువాతవాని కుమారుఁడేఁడవ తరము సింగమనాయఁడు పరిపాలనముచేసిన ట్లాసింగమనాయని

పుత్రుడగు రామమూధవరావు కాలమునాటి శాసనమున, రసార్ణ వసుధాకర గ్రంథము మొదలగువాని వలనఁ దెల్లమగుచుండ నా కాలమున శ్రీనాథుఁడు లేఁడనుట స్వవచన వ్యాఘాతము కాదా? శ్రీనాథుఁడు పదవతరము సర్వజ్ఞసింగమనాయని సందర్శింపఁ బోయి యాతనిపైఁ బద్యములు చదివినది వాస్తవమని సిద్ధాంతము చేయవల సినపక్షమున లక్ష్మణరావుగారు శ్రీనాథుని జన్మకాల సంవత్సరమని నిర్ణయించి ౧౩౬౦ దవ సంవత్సరమును గాని వీరేశలింగముగారు నిర్ణ యించిన ౧౪౬౫ దవ సంవత్సరమును గాని మన మంగీకరింపరాదు. సర్వజ్ఞసింగమనాయని కథను లక్ష్మణరావుగారు విశ్వసించుచున్నారో లేదో మనకుఁ దెలియరాదు. వీరేశలింగముగారు విశ్వసించుచున్నారు. శ్రీనాథుని జన్మకాలమును నిర్ణయించువారు హారవిలాసమును మాత్ర మెత్తుకొని తక్కిన విషయములను విస్మరించుట కూడదు. లక్ష్మణ రావుగారు హరవిలాసమునుబట్టియే కాలనిర్ణయమునకుఁ బూనుకొన్నం దునఁ బైనచెప్పినరీతిగా విపరీతసిద్ధాంతము లేర్పడుచున్నవి. బాలసఖుఁ డను దానిని వీరేశలింగముగారుగాని లక్ష్మణరావుగారు గాని తృప్తి కరముగా సమన్వయింప లేదు. ముప్పదియైదేఁడ్లవానిని బాలునిగాఁ జెప్పి, వానికిని వృద్ధుడైన తిప్పయకును సమావేశమును గలిగించి, సఖ్యతఁగావించి, మఱి పదియేండ్లకు రప్పించి బాలసఖుఁ డనిపించి, కృతినిప్పించినట్టి వీరేశలింగముగారి వాదముయొక్క పటుత్వమంత తృప్తికరముగాఁ గానంబడదు. ఒకచోట వీరేశలింగముగారు, ఈనైషధ కావ్యరచనవలన శ్రీనాథున కాంధ్రకవులలో నత్యంతప్రసిద్ధి కలిగినది. ఎంతటి ప్రసిద్ధిగలిగినను శ్రీనాథున కింతవఱకు రాజాస్థానములలోఁ బ్రవేశము కలిగినది కాదు. ధనార్జనముకొఱకై పెదకోమటి వేమనృపా లుని సంస్థానమునకుఁ బోయి యతని మంత్రులు మొదలైనవారి నాశ్రయించినట్లే శ్రీనాథుఁడు స్వస్థలమును విడిచి వచ్చిన యారంభదరి

లోనే రెడ్డిరాజ్యమునకుఁ బ్రధాననగరమైన కొండవీటికిఁ బోయి కుమారగిరిరెడ్డియొక్క మంత్రులు మొదలగువారి నాశ్రయించి యుండును. యచ్చటివారీతని కచ్చటఁ బ్రవేశము కలుగనీయ లేదు." అని వ్రాసిరి ఇదెప్పుడు తటస్థమయ్యెను; వారి యభిప్రాయము ప్రకారము వారు చెప్పినరీతి నిరువదియైదేండ్ల బాలుఁడైయున్నప్పుడు గదా! మఱియొకచోట ,,అటుతరువాత రెండుమూఁడేండ్లకనఁగా ౧౩౯౦ వ సంవత్సర ప్రాంతమున శ్రీనాథున కిరువదియైదేండ్లుండినప్పుడు పండితారాధ్యచరిత్రము రచింపఁబడి యుండు" నని వ్రాకుచ్చియున్నారు. ఈపండితారాధ్యచరిత్రము నైషధకృతిపతియైన సింగనామాత్యుని యన్నయును, దండాధీశుఁడు నైనపెగడన్న గంకితము చేయఁబడినది. ఈవిషయమై సింగనామాత్యుఁడు పలికినట్లుగా శృంగార నైషధమున

క. జగము నుతింపఁగఁజెప్పెను
పెద్దయ్యకు నాయనుంగు పెద్దనకుఁ గృతుల్
నిగమార్థసారసంగ్రహ
మగు నారాధ్య చరిత మాదిగఁ బెక్కుల్.

అని దృఢముగాఁ జెప్పియున్నాఁడు. దీనింబట్టి శ్రీనాథుఁడు తాముచెప్పిన చొప్పున నిరువదియైదేండ్లప్రాయమున దండనాథుఁడైన పెగడన్న నాశ్రయించి పండితారాధ్యచరిత్ర మాదిగఁ బెక్కుగ్రంథములు రచించియుండఁగా ధనార్జనమునకై కొండవీటికిఁ బోయి కుమారగిరిరెడ్డి మంత్రుల నాశ్రయించినను బ్రవేశము లేదనియు, ఉభయులును శైవ మతస్థులగుటచేత తిప్పయసెట్టికి నిరువదియైదేండ్ల బాలుఁడైన శ్రీనాథునకు మైత్రి కలిగినదని చెప్పుట సంభావ్యమగునా? ధనార్జనమునకై పోయినవాఁడు, శైవమతాభిమానమువలన మైత్రి గావించుకొనిన తిప్పయశెట్టి కప్పుడేమియు నంకితముచేసి ధనసంపాదనము చేయక చేతులు జాడించుకొనుచుఁ బోయె ననియు, మఱి పదియేండ్లకు వచ్చినప్పుడ

తిప్పయశెట్టి వానిని బాలసఖుఁ డని గారవించి శైవమతగ్రంథమును డెబ్బదేండ్ల వయస్సునాఁ డంకితము నొందె ననియుఁ జెప్పినది నాకంత విశ్వాసపాత్రముగాఁ గన్పట్టలేదు. వారి యభిప్రాయమును బట్టి ౧౩౯౦ దవ సంవత్సరము నాఁడు పెద్దగడయ్యకుఁ బండితారాధ్యము మొదలగు పెక్కుకృతులను నంకితము గావించెనుగదా! ౧౩౯౫ దవ సంవత్సర ప్రాంతమున నాతని తమ్ముఁడును పెదకోమటి వేమభూపాలుని మంత్రియు నగు సింగనామాత్యునకు శృంగారనైషధకృతి నంకితము గావించెనుగదా! ఇట్లయిదు సంవత్సరముల కాలము పెదకోమటి వేమభూపాలుని మంత్రుల నాశ్రయించి వారిప్రాపున గ్రంథరచనములో మునింగి యుండియు, ఆకాలమున ధనార్జనమునకై కుమారగిరిరెడ్డి మంత్రుల కడకుఁ బోయె ననియు, వారెవ్వరు నాతని నాదరించకపోఁగా శైవమతాభిమానముచేత శైవుఁడైన శ్రీనాథున గారవించి మైత్రి నెఱపి యూరక యామహాకవిసత్తముని బంపివేసి పిమ్మట మఱి పదిసంవత్సరములకు బాలసఖుఁడని ప్రేమించి హరవిలాసము కృతినొందె ననుట యెట్లు విశ్వాసార్హ మగును? మఱియును వీరేశలింగముగారు 'దుగ్గన శ్రీనాథునికాలములో బాలకవియై యాతని యనంతరముననే కాంచీపురమహాత్మ్యమును, నాచికేతూపాఖ్యానమును జేసినట్లు కానంబడుచున్నాఁడు' అని వ్రాసియుండుటగూడ వారు పైనచెప్పెడు నభిప్రాయములకు బాధకముగా నుండకపోదు. దుగ్గన శ్రీనాథునకు మఱఁదియు, శిష్యుఁడుగూడ నై యున్నాఁడు. శ్రీవీరేశలింగముగారు శ్రీనాథుని జీవితకాలములో నీతఁడు బాలకవిగా నుండెనని వచించుచున్నారు. శ్రీనాథుఁడు ౧౩౬౫లోఁ బుట్టెననియు, నాచికేతూపాఖ్యానము ౧౪౬౫ లో దుగ్గన రచించి యనంతామాత్య గంగయ్యకు నంకితము చేసెనని యుఁ జెప్పెడి వీరేశలింగముగారి యభిప్రాయములో శ్రీనాథుని జీవిత కాలములో దుగ్గన బాలకవిగా నుండెనను వాక్యాభిప్రాయమును సమ

న్వయింప వలసి యుండును గదా ! నాచికేతూపాఖ్యాన రచనా కాలమునకు దుగ్గనకు నలువదియైదు సంవత్సరము లున్న వను కొన్నను దుగ్గన ౧౪౩౫ దవ సంవత్సరమునఁ బుట్టి యుండ వలయును గదా! శ్రీనాథుని యవసానకాలమునకు లక్ష్మణరావుగారి యభిప్రాయము ప్రకార మీబాలకవియైన దుగ్గనకు ౧౫ సంవత్సరము లును, వీరేశలింగముగారి యభిప్రాయముప్రకార మాబాలకవికి ౨౫ సంవత్సరములు నుండి యుండును. దుగ్గనకంటె నతని తోఁబుట్టువు శ్రీనాథుని భార్యకు ౨౦ సంవత్సరములు వయస్సులో నెచ్చుతగ్గుబున్న వనకొన్నను ౧౪౧౫ దవ సంవత్సరమున నామె జనించి యుండవల యును. మఱి పదియేండ్లకనఁగా ౧౪౨౫ సంవత్సర ప్రాంతమున వివాహ మైయుండవలయును. అటుపిమ్మట మూఁడేండ్లకుఁ గాని కాపురమునకు బోయి యుండదుగదా! అనఁగా శ్రీనాథునకు నేఁబదియేండ్లు దాటిన తరువాతనే వివాహమును, భార్యకాపురమునకు వచ్చియుండుటయుఁ దటస్థమై యుండవలయును గదా. శ్రీనాథుఁ డేఁబదేండ్లు దాటువఱకు ను వివాహము లేకుండ నున్నాఁడనుట నాకంత విశ్వాసపాత్రమైన విషయముగాఁ దోఁచలేదని యిదివఱకే తెలిపియున్నాఁడను. అట్లయిన వీరివాక్యముల నన్నిటిని సమన్వయించుట యెట్లు! హరవిలాస రచన కాలమును మనము స్థిరీకరింపఁ గలిగిన యెడల మనము శ్రీనాథుని జన్మకాల సమస్యను పరిష్కరింపఁ గలము.

## హరవిలాస రచనాకాలనిర్ణయము.

హరవిలాసరచనము కొండవీడు పురమున గాక కాంచీపురమున జరిగినది. ప్రఖ్యాతవిమర్శకులయిన లక్ష్మణరావుగారు హరవిలాసకృతి యగు తిప్పయసెట్టి తాత పావాణిసెట్టి,

తే. సింహవిక్రమ పట్టణశ్రేష్ఠుఁడైన
సెట్టిజగజెట్టి పావాణిసెట్టి విభుఁడు

ఘనుఁడు నగరీశ చంద్రశేఖర పదాబ్జ
వందనానందితాత్ముండగు వంశకరుఁడు.

అని హారవిలాసమున సింహావిక్రమ పట్టణ (నెల్లూరు) శ్రేష్ఠుఁడుగా వర్ణింపఁబడి యుండుటచేతను,

క. కొమరగిరి వసంతనృపా
గమక వివరగంధసార కస్తూరీ కుం
కుమ కర్పూరహిమాంభ
స్సముదంచిత బహుసుగంధ శాలాధ్యక్షా.

అని తిప్పయసెట్టి కుమారగిరి నిమిత్తము దెప్పించిన కర్పూరమును, గంధసారమును, కస్తూరిని విక్రయించు గొప్ప సుగంధద్రవ్యముల వాణిజ్యశాలను బెట్టినవాఁడా యని సంబోధింపఁబడి యుండుటచేతను, ఆనాటికి తిప్పయసెట్టి నిజముగాఁ గొండవీటిపురవాసియని నమ్మి, విద్యానగరాధిపతియగు రెండవహరిహర రాయలు, బహుమనీసుల్తానగు ఫిరోజిషాహా, కుమారగిరిరెడ్డి, మూవురు బ్రతికియున్న కాలమున క్రీ. శ. ౧౪౦౦ సంవత్సరప్రాంతమున కుమారగిరి ప్రభుత్వపుఁ జివరభాగమున, అనఁగా ౧౩౯౪ లో గాని, ౧౩౯౯ లోఁ గాని రచింపఁబడి యుండునని విశ్వసించి, సులువుగాఁ దెలిసికొనఁదగినదానికి లేనిపోని కల్పనలనుగావించి శ్రీనాథుని జీవితకాలనిర్ణయమునకుఁ బ్రతిబంధకమగు గొప్ప చిక్కును గలిగించిరి. ఈచిక్కును దొలగించునట్టి విషయము మనము సరిగా హారవిలాసమును బరిశీలించి విమర్శదృష్టితోఁ బఠించినయెడల మనకే దృష్టిగోచరము కాఁగలదు. శ్రీనాథుఁడు తన హారవిలాసమున:

ఉ. మంకణమానివంశ మణిమండన! కాంచిపురీనివాస! యే
ణాంకకిరీట దివ్యచరణాంబుజసేవక! వైరిభద్ర నా
గాంకుశ! హారిహీరదరహాసవి పాండురకీర్తి చంద్రికా
లంకృత దిగ్విభాగ! శుభలక్షణ! వారిరుహాయతేక్షణా!

అని తిప్పయసెట్టిని 'కాంచిపురీనివాస' యని సంబోధించుచున్నాఁడు. దీనిఁ బట్టి తిప్పయసెట్టి కాంచీపురనివాసియై యున్నకాలముననే హార

విలాసమును రచించి తిప్పయసెట్టి కోరిక ననుసరించి యాతని కంకితము గావించెననుట స్పష్టమగుచున్నది. మఱియు,

మ. ఖుసిమీఅన్ సురథాణి నీడుకొలువై కూర్చున్నచో నీకరా
భ్యసనంబు న్నుతియించు రాయపటితిప్పా! చంద్రసారంగనా
భిసముత్పాదితతాళవృంత పవనప్రేంఖోలనప్రక్రియా
వసరోదంచిత సారసౌరభరసవ్యాలోల రోలంబముల్.

అని వర్ణించియుండుటచేతఁ బైపద్యములోఁ బేర్కొనఁబడిన సురథాణి ఫిరోజిషాహా ౧౪౨౨ వఱకుఁ బరిపాలనము చేసినవాఁడు గావున నాతఁడు హరవిలాసరచనాకాలమున బ్రదికియుండెనని చెప్పవచ్చును. కనుక హరవిలాసరచనాకాలము పెదకోమటి వేమారెడ్డి మరణకాలము నకును, ఫిరోజిషాహా మరణకాలమునకును నడిమికాలమున అనఁగా ౧౪౨౧ వ సంవత్సరప్రాంతమునై యుండునని నిర్ధారించుట కెవ్వియు నడ్డుకొనఁజాలవు. ఇంకను ఈవిషయము హరవిలాసమునుగూర్చి వ్రాయు సందర్భమున సవిస్తరముగా విశదీకరింపఁబడును.*

## శ్రీనాథుని జన్మకాలనిర్ణయము.

హరవిలాసరచనాకాలము నిర్ణయమైనది గనుక నిపుడు శ్రీనాథు నిజన్మకాలము దెలిసికొనుటసుకరము కాఁగలదు. అవచి తిప్పయసెట్టి తన్ను బాలసఖుఁడని ప్రశంసించినట్లుగా శ్రీనాథుఁడు హరవిలాసమున విశదపఱచి యున్నాఁడు. తిప్పయసెట్టి వృద్ధుఁడై కాంచీపురములో సుఖుఁడై యున్నకాలమున బాలసఖుండవని ప్రశంసించుటచేత శ్రీనాథుఁడు బాలుఁడుగా నున్నకాలమున వానితో మైత్రిగలిగినదని స్పష్ట

*శ్రీప్రభాకరశాస్త్రిగారు తాము రచించి 1923లోఁ బ్రకటించిన శృంగార శ్రీనాథమను గ్రంథములోనా యీవాదమునే ప్రవేశపెట్టి ప్రథమ ముద్రణగ్రంథమున నేను జెప్పినకాలము నంగీకరించి బలపఱచియున్నారు.

పడఁగలదు. ఆమైత్రి యెచ్చట నెప్పుడేవిధముగా సంభవించెనని ప్రశ్న యుప్పుట్టఁగలదు. కొండవీటిసామ్రాజ్యమును బరిపాలించిన కుమారగిరి రెడ్డి పరిపాలనకాలమునఁ గొండవీడులో కుమారగిరిరెడ్డి ప్రతిసంవత్సరము వసంతోత్సవసందర్భములందు సుగంధవస్తుభాండాగారాధ్యక్షుఁడై యున్న సమయములందు బాలుఁడైన శ్రీనాథకవితో యౌవనవయస్కుఁడయిన తిప్పయసెట్టికి మైత్రిగలిగినదని చెప్పవచ్చును. కుమారగిరిరెడ్డి ౧౩౮౫ మొదలుకొని ౧౪౦౦ వఱకుఁ బరిపాలించియుండి ప్రతిసంవత్సరము వసంతోత్సవములను జరుపుచు వసంతభూపాలుడని ప్రఖ్యాతి గాంచినది చరిత్రప్రసిద్ధమైన విషయము. ఆకాలమున మనశ్రీనాథకవి బాలుఁడుగా నుండినను, అప్రతిమానప్రతిభావంతుఁడై గవితావిద్య నలవఱచుకొని ప్రఖ్యాతిఁ గాంచుచున్నవాఁడగుట చేత వసంతభూపాలుఁడు జరపు వసంతోత్సవములకు శ్రీనాథుఁడు బోవుచుండువాఁడగుటచేత నాతనితోఁ దిప్పయసెట్టికిఁ బరిచయము గలిగి క్రమముగా మైత్రి యేర్పడినదని చెప్పఁదగును. కుమారగిరిరెడ్డి మరణకాలమునకుఁ దిప్పయసెట్టికి ౪౫ సంవత్సరములకు మించిన వయస్సుండదు. శ్రీనాథమహాకవికి ౨౦ సంవత్సరములకుమించిన వయస్సుండదు. చిన్నారిపొన్నారి చిఱుతకూఁకటినాటినుండి (అనఁగా ౧౪ సంవత్సరముల ప్రాయముగల కాలము) శ్రీనాథకవి తిప్పయసెట్టికి మిత్రుఁడై యుండెను. వసంతోత్సవముల వైభవములు వసంతభూపాలుని మరణముతోనే నిలిచిపోయినవి. ఏనాఁడు వసంతభూపాలుని కొండవీటిసామ్రాజ్యము పెదకోమటి వేమారెడ్డి యాక్రమించుకొని పరిపాలనము చేయుట సాగించి తనకు పరమమిత్రుఁడైన కుమారగిరిరెడ్డి కుటుంబమునకు శత్రువయ్యెనో నాటినుండియుఁ దిప్పయసెట్టికిఁ గొండవీటితో సంబంధము విడిపోయి కాంచీపురమేసుస్థిర నివాస మయ్యెను. పెదకోమటివేమారెడ్డి యాస్థానమున శ్రీనాథమహాకవి విద్యాధికారిపదవి

సంపాదించి పెదకోమటివేమారెడ్డి మరణపర్యంతము నత్యంతప్రతిభానై పుణ్యములతో నిర్వహించినది సుప్రసిద్ధమైన చరిత్రాంశము. పెదకోమటివేమారెడ్డి మరణాంతర మనఁగా నిరువదిసంవత్సరములకుఁ బిమ్మట శ్రీనాథమహాకవి కాంచీపురమునకు శిష్యుఁడును మఱఁదియునగు దగ్గుపల్లి దుగ్గనతోఁ బోయి తన్ను సందర్శించినపు డరువదియేండ్ల వయస్సుగడచిన వృద్ధుఁడు తిప్పయసెట్టి మనకవిని బాలసఖుండని హెచ్చరించి జ్ఞప్తికిఁదెచ్చుకొనుట యాశ్చర్యకరమైన విషయముగాదు. కావున హరవిలాసరచనాకాలమునాటికిశ్రీనాథునకు నలువదిసంవత్సరములకును, తిప్పయసెట్టికినరువదియైదు సంవత్సరములకు మించినవయస్సుండఁబోదు. కనుక మన శ్రీనాథమహాకవి క్రీ. శ. ౧౩౮౦ దవ సంవత్సరప్రాంతమున జనించి యుండవలయుననుట సత్యమునకంతదూరమున నుండునదికాదు. ఈకాలము శ్రీనాథుఁడు తనగ్రంథములలోఁ జెప్పుకొన్న విషయముల నన్నిటిని క్రమముగా సమన్వయించుటకు సరిపోవుచున్నది. నేను శ్రీనాథకవి జీవితముయొక్క ప్రథమ ముద్రణగ్రంథమును జేసిన యీమావాదస్వభావమును జక్కఁగా నవగాహనముఁ జేసికొన్న శ్రీప్రభాకరశాస్త్రిగారు తరువాత తాముప్రాసిన 'శృంగారశ్రీనాథ'మను గ్రంథమున శ్రీనాథుని జన్మకాలమించుక యించుమించుగా క్రీ. శ. ౧౩౭౦ అగు నని వ్రాసియున్నారు. కాని ౧౪౦౪ సంవత్సరమునాటికి పెదకోమటివేమారెడ్డి యాస్థానమున విద్యాధికారపదవి యందుండి శ్రీనాథుఁడు శాసనాచార్యుఁడుగా నున్నట్టు గాన్పించుచున్నది. గావున నప్పటికి శ్రీనాథునికిఁ బదునెనిమిదో పదుతొమ్మిదో సంవత్సరముల వయస్సు మాత్రమే యుండును. అప్పటికి శ్రీనాథమహాకవికి నిరువదినాలుగు లేక యిరువదియైదు సంవత్సరములయిన వయస్సుండునని నాయభిప్రాయము. ఇందలి వివరణము చదువరులకు ముందు బోధపడఁగలదు.

## అధ్యాయము ౩.

## విద్యాభ్యాసము—విద్యాసంపత్తి.

శ్రీనాథుని బాల్యమును గూర్చి మన కంతగాఁ దెలియరాదు. శ్రీనాథునితల్లిదండ్రులను గూర్చియు నేమియు నెఱుఁగరాదు. ఇతఁడు బాల్యమునం దెట్లు విహరించెనో విద్యాభ్యాస మెట్లు గావించెనో యదియుం దెలియరాదు. ఇతఁడు తన కాశీఖండమున

చిన్నారిపొన్నారి చిఱుతకూకటినాఁడు
　　రచియించితి మరుత్తరాట్చరిత్ర,
నూనూగు మీసాల నూత్నయౌవనమున
　　శాలివాహన సప్తశతి నొడివితిఁ

అనియును, మఱియును శృంగారనైషధకావ్యమున:—

క. జగ మనుతింపఁగఁ జెప్పితి
　పెగడయ్యను నాయకుంగఁ బెద్దనకృతుల్
　నిగమార్థ సారసంగ్రహ
　మగు నాయారాధ్యచరిత మాదిగ బెక్కుల్

అని తన విరచితములుగాఁ జెప్పుకొన్న మరుత్తరాట్చరిత్రములోఁ గాని శాలివాహనసప్తశతిలోఁగాని, పండితారాధ్యచరిత్రములో గాని మరి తదితరగ్రంథములలోఁ గాని యేమైన వివరముగాఁ జెప్పుకొని యుండు నేమోగాని యాగ్రంథము లిపు డెచ్చటను గానరానందున నేమియుఁ దెలియరాకున్నది. తాతయే శ్రీనాథునికిఁ జిన్నటనాఁడు విద్యయుఁ గవిత్వము నేర్పియుండునని వీరేశలింగముగా రూహించి చెప్పునది సత్య మగునేని శ్రీనాథునివంటి మహాకవి ప్రఖ్యాతిగాంచిన తన యుత్తమ గ్రంథములలో తన పితామహుఁడైన కమలనాభుఁడె తనకు విద్యాగురు వని చెప్పుకొని యుండకమానఁడు.

గీ. మత్పితామహుఁ గవిపితామహుని దలఁతు
　గలితకావ్యకళాలాభుఁ గమలనాభుఁ

జంద్రచందనమందార సదృశకీర్తి
సరససాహిత్య సామ్రాజ్యచక్రవర్తి

అని కవిస్తుతి వర్ణనములో మాత్రము వక్కాణించి వర్ణించి యున్న వాఁడు గాని తనకు విద్యాగురువు నెప్పుకొని యుండలేదు.

ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచే కడపపట్టణమున నిర్వహింపఁబడిన వార్షికసభలో శ్రీనాగపూడి కుప్పుస్వామయ్యగారు శ్రీనాథుని కవిత్వమునుగూర్చి యుపన్యసించుచు నిట్లు నుడివియున్నారు. "ఇతని గురువు ఘోడెరాయఁ డనుబిరుదుగల భీమేశ్వరస్వామి యని కాశీఖండము (ఆ ౧. ప ౧౬.)

సీ. ఆంధ్రక్షమామండ లాఖండలుం డైన
వేమభూపతికృపావీక్షణంబు
ఘోడెరాయాంకసద్గురు రాజభీమేశ్వ
రస్వామి పదసమారాధనంబు
కమలాద్రినిలయ మార్కండేయశివమౌళి
చంద్రాంశునవసుధా సారధార
వేదాద్రినరసింహ విపులవక్షస్థలీ
కల్హారమాలికా గంధలహరి
కారణంబులు నుద్బోధకములు గాఁగ
సంభవించిన సాహిత్య సౌష్ఠవమున
వీరభద్రేశ్వరుఁ బ్రబంధవిభునిజేసి
కాశికాఖండము దెనుంగుగా నొనర్తు.

అను పద్యమువలన వేద్యంబయ్యెడును.

"ఇచ్చట వేదాద్రి యనుక్షేత్ర మేది యని యరయ బ్రహ్మశ్రీ సదాశివశాస్త్రిగారు, అవధానము శేషశాస్త్రిగారు వీరిచేఁ బ్రకటితమైన వేంకటగిరిరాజుల వంశచరిత్రలో 42వ పుటయందు, హైదరాబాదుసీమలో రాచకొండ యను దుర్గమునకు దక్షిణమున వేదగిరి యని వ్యవహరింపఁబడుచున్న పర్వతముయొక్క గుహలో వరాహనార

శింహస్వామి యను స్వయంవ్యక్తమూర్తి కలదు. ఆమూర్తి యనాదిగా రేచర్లరాజుల కుపాస్యముగా నుండెనంట. దీనివలననే సింగమనాయఁడను నామములు వీరియింట నాకాలమునఁ దఱచుగా గలిగియుండెనని తోఁచుచున్నది." అని వ్రాయఁబడిన దానిని జదువ వేదాద్రి యిది యని తెలియవచ్చె. ఇందలి కమలాద్రి యెద్దియో తెలియకున్నది."

ఇందు పైని పేర్కొనఁబడిన ఘోడెరాయబిరుదాంచితుఁడైన భీమేశ్వరుఁడు దేసటివంశ్యులైన రెడ్డిరాజులకు వంశగురువు. ఈవిషయము కాశీఖండములో

ఉ. ఈశ్వరుఁడింటివేల్పు జగదేకగురుండగు ఘోడెరాయభీ
మేశ్వరుఁ డాత్మవంశగురుఁ డీఁగులు నిత్యవినోద కృత్యముల్
శాశ్వతధర్మకీర్తులు దలంపఁగ నమ్మిన సొమ్ము లాదిగ
ర్భేశ్వరుడంట నైజ మెవరయే నృపు లల్లయ వీరశౌరికిన్

అను పద్యమువలనను, శ్రీభీమేశ్వరపురాణములో

"రాయగురు పరమేశ్వర సాధుజనవిధేయ ఘోడెరాయ సకలకళాధామాది బిరుదభాస్వరుండై భీమయగురువరేణ్య పుణ్య కారుణ్యకటాక్షవీక్షాలబ్ధ సుస్థిరైశ్వర్యధుర్యుండై" అను వచనమువలనను విశదమగుచున్నది. ఇట్టి గురుపద సమారాధనము రాజమహేంద్రిపురమునకు వచ్చిన పిమ్మట సంప్రాప్తమై యుండునుగాని యంతకుఁ బూర్వమే సంప్రాప్తమై యుండెనని తోఁచదు. పై పద్యములోఁ బేర్కొనఁబడిన వేమారెడ్డి కృతిపతిని సింహాసన మెక్కించిన యన్న. భీమేశ్వరస్వామి కృతిపతి కులగురువు. కమలాద్రినిలయుఁడైన మార్కండేయ శివుఁడును, వేదాద్రి నరసింహుఁడును ననుదినమును గృతిపతిచేఁ గొలుంబడుచుండెడి దేవులు. కమలాద్రియు, వేదాద్రియు, పుష్పగిరియు, శేషాద్రి మొదలగునవి రాజమహేంద్రపురములో గోదావరీతీరస్థములై యున్న మిట్టలకు నామములు. శ్రీనాథుఁడు వర్ణించిన వేదాద్రి కుప్పుస్వామయ్యగారు పేర్కొన్న హైదరాబాదు సీమలోని వేదాద్రి

గాదు. ఇందలి కమలాద్రి యెద్దియో తెలియకున్న దని కుప్పుస్వామయ్యగారు వచించిరి.

శ్రీనాథుఁడు భీమేశ్వరపురాణములో

సీ. కమలాచలాగ్రమార్కండేయ శివశిరశ్శశి చంద్రికాధ్రాతసౌధవీథి
గోదావరీపుణ్య కూలంకషాజల స్ఫారిత శ్రీపదప్రాదయుగళి
బలవదభ్యున్నత ప్రాకారపరివేష గండూషితాజాండమండలంబు
గంధదంతావళి గ్రైవేయఘంటికా ఝంకారముఖర ఘంటాపథంబు
రాజబింబాననా నూత్నరత్నపేటి
వీరరాహుత్త సుభటకంకీరవాద్రి
వేమభూపాల రాజ్యాభివృద్ధికరము
సాంద్రవిభవంబు రాజమహేంద్రపురము.

అని కమలాద్రినిలయుఁడైన మార్కండేయ శివుఁడు రాజమహేంద్రపురములోనివాఁడని తెలిపినందునఁ గమలాద్రి రాజమహేంద్రపురములోనిదే యని తేటపడుచున్నది గదా! కృతిపతియన్నయైన వేమభూపాలుని కృపావీక్షణమును, కృతిపతి కులగురువైన ఘోడేరాయ భీమయలింగ పదసమారాధనమును సంప్రాప్తము గాకయున్నఁ దనకట్టి మహాభాగ్యము లభింపదు గావున శ్రీనాథుఁ డట్లు వారినిఁ బ్రస్తుతించుటయుగాక యాపురములోన ముఖ్యదైవతములైన నృసింహ మార్కండేయ శివులనుగూడ నావిధముగాఁ బ్రశంసించి యున్నాఁడు. ఇదంతయును గృతిపతిని వానియన్నను వానికులగురువును సంతోషపెట్టుటకై శ్రీనాథుఁడుచేసిన వర్ణనముగాని నిజముగా ఘోడేరాయభీమయ నీతనికిఁ విద్యాగురువగుటచేతఁ జెప్పుకొన్నది కాదని సూక్ష్మబుద్ధిచేత మనము గ్రహింపవచ్చును. శ్రీనాథుని ప్రతిఘటించెడి మత్సరగ్రస్తులైన పండితులనేకులా రాజమహేంద్రపురమున నుండుటచేత రాజాశ్రయమునకుఁ దోడ్పడువారి ప్రస్తుతి ముఖ్యముగా గ్రంథమునం దుండవలయును. ఇది యడ్డకాళ్లకు బంధము తగిలించుట వంటిది. ఇట్టి స్తుతిపాఠములకు

సంతోషించి సర్వవిధములఁ గవివర్యునకుఁ దోడ్పడుచుండు రనుటకు సందేహముండునా? ఉండదు. ఒకవేళ ఘోడె రాయభీమేశ్వరస్వామి మతగురువై యుండిన నుండవచ్చును గాని విద్యాగురువని మాత్రము తలంపరాదు. శ్రీనాథుఁడు నేర్చిన దొక్కవిద్యగాదు; ఒక్క వేదము కాదు; ఒక్క శాస్త్రము గాదు; ఒక్క కవిత్వముఁగాదు; ఒక్క పురాణముగాదు; ఒక్క నాకటముకాదు; ఒకమత తత్త్వముగాదు. ఇతఁడు నేర్చినవిద్యలు పెక్కులుగలవు. అన్ని వేదములను బఠించెను; అన్ని శాస్త్రముల నభ్యసించెను. చతుర్విధ కవిత్వములను జెప్ప నేర్చెను; బహుపురాణములను బఠించెను. అనేక నాటకాలంకారాసాహిత్యసంపత్తి యలవఱచుకొనియెను. ఆంధ్రగీర్వాణవాణి వాని జిహ్వాగ్రమున నిలుచుండి యనుదినమును నృత్యము సలుపుచుఁ దనసమ్మోహనాస్త్రములచే నెల్లభూపాలుర నాకర్షింపుచుండెను. ఇందునుగూర్చి శ్రీనాథుని భార్యతోఁ బుట్టినవాఁడగు దగ్గుపల్లి దుగ్గయామాత్యుఁడు తన నాచికేతూపాఖ్యానములో తన బావ శ్రీనాథుని పాండిత్యాదుల నీక్రిందిపద్యములో నభివర్ణించెను.

సీ. సంస్కృత ప్రాకృతశౌరసేనీ ముఖ్యభాషాపరిజ్ఞాన పాటవంబు
పన్నగపతిసార్వభౌమ భాషిత మహాభాష్య విద్యాసమభ్యాసబలము
నక్షపాదకణాదపక్షి లోకీత న్యాయకలాకౌశలాతిశయము
శ్రుతిపురాణాగమస్మృతిసాంఖ్య సిద్ధాంత కబళనవ్యుత్పత్తి గౌరవంబు
పూర్వకవిముఖ్యవిరచితా పూర్వకావ్య
భావరసనుధాచర్వణ ప్రౌఢతయును
గందళింపంగఁగాశికాఖండ నైష
ధప్రముఖ వివిధప్రబంధము లొనర్చి.

హరవిలాసమున నవచి దేవయతిప్పయసెట్టి,

“అఖిలపురాణవిద్యాప్రవీణు, నధ్వర్యు, వేదశాఖాతిథినిష్ణాతు,”
అని “ఆగమజ్ఞాననిధివి, తత్త్వార్థఖనివి, బహుపురాణజ్ఞుడవు” అని తన్ను గూర్చి పలికినట్లుగా శ్రీనాథుఁడే తెలుపుకొనియున్నాఁడు. మఱియును

బ్రహ్మాండాదిమహాపురాణచయతాత్పర్యార్థనిర్ధారిత బ్రహ్మజ్ఞానకళానిధానము' వని యాంధ్రనైషధకృతిపతియైన మామిడిసింగనామాత్యుఁడు పలికినట్లుగాఁ జెప్పుకొనియెను. శ్రీనాథుఁడు తన భీమేశ్వరపురాణములోఁ గాళిదాసుని రసభావభావనామహనీయకవితాసముల్లాసునిగాను భట్టభాణుని నిరవద్యగద్యపద్య నిబంధపరిశోషితస్థాణునిగాను, ప్రవరసేనుని సాహిత్యపదవీమహారాజ్య భద్రాసనాసీనునిగాను, శ్రీహర్షుని నంబోధివార్వీచిగంభీరతాసారవాక్సముత్కర్షునిగాను బ్రస్తుతించి భావశివభద్రసౌమిల్ల భల్లులకుల మాఘభారవిబిల్హణులనును భట్టచిత్తపకవిదండిపండితులకును 'గేలు దోయి నొసలిపైఁ గీలుకొలిపెను. ఇమ్మహాకవుల కావ్యములనెల్ల నీతఁడు పఠించియుండునను టకు సందియము లేదు. ఇంకఁ గవితామహాత్మ్యమునన్నో, బ్రాహ్మీదత్తవరప్రసాదలబ్ధకవితాధురంధరుండగుటఁ జెప్పనక్కరయేలేదు. ఇతఁడు శృంగారనైషధకర్తయగు భట్టహర్షుని షట్తర్కమర్మకచక్రవర్తి' యని చెప్పియున్నాఁడు. ఇతనిం గూడ 'షట్తర్కమర్మకచక్రవర్తి' యని మనము చెప్పవచ్చును.*

ఇట్టివాఁ డగుటం జేసి శ్రీనాథుఁడు 'సకలవిద్యాసనాథుఁడను పట్టము నొంది కొండవీటినగరంబున శ్రీపెదకోమటి వేమభూపాలవర్యుని

* షట్తర్కములనఁగా షడ్దర్శనములని యాధునికులు కొందరు తలంచిరి. పూర్వులచే ఈరెండును వేర్వేఱని తెల్పబడియున్నవి. కవికల్పలతలో:—
'షడ్వ్రజకోణ త్రిశిరో నేత్ర తర్కాఙ్గదర్శనమ్। చక్రవర్తి మహాసేనపద నర్తుగుణారసాః॥
సౌగతనైయాయిక యోగ సాంఖ్య వైశేషికనాస్తికమతములు షట్తర్కములు.
(స్యాద్వాదవాద్యార్హతః స్యాత్) శూన్యవాదీతు సౌగతః। నైయాయిక్స్త్వక్షపాదో, యోగః। సాంఖ్యస్తు కాపిలః,। వైశేషికః స్యాదౌలూక్యో, బార్హస్పత్యస్తు నాస్తికః,। చార్వాకో లౌకాయతికశ్చైతే షడపి తార్కికాః" హేమాచార్యుఁడు,
శ్రీవేదము వేంకటరాయశాస్త్రి విరచితసర్వంకషావ్యాఖ్యాసమేత ముద్రిత శృంగారనైషధగ్రంథము. పేజి ౧౧.

యాస్థానంబున విద్యాధికారి పీఠము నధిష్ఠించి బహువత్సరంబులు విద్యాసామ్రాజ్యపరిపాలనమును జేయుటకును, అష్టభాషాకవితాసామ్రాజ్యాభిషిక్తుఁడును, డిండిమకవిసార్వభౌమబిరుదాంకితుఁడును, శ్రీకంఠాగమ శిఖండమండనమణియై ప్రప్రథమమున విజయడిండిమము నార్జించిన డిండిమప్రభుని దౌహిత్రుఁడును, సభాపతిభట్టారకాచార్య భాగినేయుండును, సరస్వతీప్రసాదలబ్ధకవితాసనాథుండును, యోగానందప్రహసనకర్తయునగు నరుణగిరినాథుఁడును మహావిద్వాంసుని, నజేయుఁడై ప్రౌఢ దేవరాయమహారాయల యాస్థాన మలంకరించియున్నవానితో నుద్భటవివాదమును బెట్టుకొని వాని నోడించి వానికంచుఢక్క పగుల గొట్టించి వాని కవిసార్వభౌమబిరుదముఁ జూఱఁగొని యమ్మహారాయల ముత్యాలశాలలోఁ గనకాభిషేకమహోత్సవమును బడయగాంచుటకు సాధ్యం బయ్యెను.

ఇన్ని విద్యలను నేర్చి యింతటి ప్రజ్ఞావిశేష మలవర్చుకొన్న వాఁడు బాల్యములో పితృపితామహులతో స్వగ్రామమునఁ గూరుచుండి సామాన్యగురువులకడఁ గవితావిద్య నేర్చుకొనుచుఁ గాలము గడపెనని తలంపరాదు. కావునఁ బితామహుఁ డుద్యోగముఁ జేసిన పట్టణములోనే శ్రీనాథుఁడుండెననుట పొసఁగనేరదు. శ్రీనాథుపితండ్రి నివాసము తెలియరాదు. ఏది యెట్లున్నను మారయామాత్యుఁడు శ్రీనాథుని బాల్యములోఁ గొండవీటిసీమకు వచ్చియుండును.

అట్లుకాదేని శ్రీనాథుని బాల్యములోఁ దనతండ్రి స్వర్గస్థుఁడు కాఁగా శ్రీనాథుఁడే కొండవీటిసీమకుఁ నేతెంచి విద్యాసముపార్జనము చేసి యుండవలయును. ఏమనఁ గొండవీటి ప్రభువగు కుమారగిరివసంత నృపాలుని సుగంధవస్తుభాండాగారాధ్యక్షుఁడైన యవచిదేవయతిప్పయసెట్టి శ్రీనాథుని బాలసఖుఁడని యన్నట్లుగా శ్రీనాథుఁడే హరవిలాసావతారిక పద్యములలో వక్కాణించి యుండుటచేతఁ బాల్యములో

కొండవీటి రాజధానియందు నివసించియుండునని యూహా పోడమకపోనదు. అనేక హేతువులచేత కుమారగిరిరెడ్డి కాలమునలో కొండవీటి రాజధానియందు నివసించియుండెనని మనము నిర్ధారణము సేయవచ్చును. ఇన్ని విద్యలు నేర్చిన శ్రీనాథునికి గురు వొక్కఁడే యుండి యుండఁడు. శ్రీనాథుఁడు వేర్వేఱు గురువులకడ వేర్వేఱు శాస్త్రముల నభ్యసించియుండును. కొన్నిటిని స్వయముగా నభ్యసించినను పెక్కు శాస్త్రములను గురుముఖమున నభ్యసించినఁ గాని యంతటి పాండిత్యము నలవఱచుకొని యంతప్రఖ్యాతిని గాంచి యుండఁడు. అనేకులకడ విద్యాభ్యాసము జేసియుండుటచేతనే శ్రీనాథకవి ప్రత్యేకముగా నొక్కని నామమైనఁ బేర్కొనకుండుటకుఁ గారణమైయుండును. శ్రీనాథకవికి బాల్యమునందు విద్యాభిలాష యత్యధికముగా నంకురించి ప్రోత్సహించుటకుఁ గారణము శ్రీనాథుని పితామహుఁడైన కమలనాభామాత్యుని జీవితమై యుండుననుటకు లేశమాత్రమును సంశయము లేదు. శ్రీనాథుఁడు తన తాతగారి జీవితము నాదర్శముగాఁ బెట్టుకొని విద్యాదీక్షగైకొని కష్టముల కోర్చి యత్యధిక పరిశ్రమమును గావించి విద్వల్లోక మగ్గించునంతటి విద్వాంసుఁ డయ్యెను.

నేను కవిచరిత్రమును బ్రకటించిన వెనుక నైదుసంవత్సరములకు శ్రీ వేటూరి ప్రభకరశాస్త్రిగారు 'శృంగార శ్రీనాథ' మను పేరిట నీకవిచరిత్రమునే ప్రకటించిరి. అందు "విద్యాభ్యాసము—గురువు" అను శీర్షిక క్రింద నాయభిప్రాయముల నొప్పుకొనుచు నొప్పుకొననని వానివలెఁ జదువరులు తలంపవలయుననికాఁబోలు విచిత్రమైన వ్యాఖ్యానము విస్తరింపఁ జేసియున్నారు.

"కుశాగ్రబుద్ధియు నద్భుత ప్రతిభాశాలియునగు నీతఁడు పలువురు గురులయొద్ద గురుకులవాస క్లేశమునకు లోనయి చిరకాలము జాడ్యమ్ముతో విద్యాభ్యాసము చేసెనని తలంపరాదు." అని వ్రాసి

నది, 'ఇన్నివిద్యలునేర్చిన శ్రీనాథునికి గురువొక్కఁడేయుండి యుండఁడు; శ్రీనాథుఁడు వేఱ్వేఱు శాస్త్రముల నభ్యసించి యుండును; కొన్నిఁటిని స్వయముగా నభ్యసించినను పెక్కు శాస్త్రములను గురుముఖమున నభ్యసించినగాని యంతటి పాండిత్యము నలవఱచికొని యంత ప్రఖ్యాతిని గాంచియుండఁడు; అనేకులకడ విద్యాభ్యాసముఁ జేసియుండుటచేతనే శ్రీనాథకవి ప్రత్యేకముగా నొక్కనినామమైనఁ బేర్కొనకుండుటకుఁ గారణమై యుండు' నని నేను వ్రాసినదానికి ఖండనముగా వ్రాసియున్నారు. వీరే యీసందర్భముననే మఱియొకచోట "ఉత్తమ కవితకు సహజశక్తి, లోకానుభవాదులవలన నైపుణ్యము చాలదు. కావ్యజ్ఞశిక్ష యావశ్యకము. సంస్కృత ప్రాకృతాదిభాషలలోఁ బరిజ్ఞానపాటవము, తర్కవ్యాకరణాది శాస్త్రములందుఁ దలస్పర్శమగు వైదుష్యము, పండితులతో శాస్త్రార్థములు సల్పఁజాలిన పాండితీ ప్రౌఢి, పయిపయి పూతమెఱుంగు చాతుర్యముతో నలవడఁదగినది కాదు. సకలవిద్యాసనాథుఁడై యితఁడికముందు కోమటి వేమారెడ్డి యాస్థానమున విద్యాధికార్యన్నతోద్యోగము వహింపనున్నాఁడు. మఱియు డిండిమభట్టారకాదులతో విద్యావివాదములు సలుపనున్నాఁడు. ఇట్టివాఁడు, గట్టిగా గురుశుశ్రూషతో శాస్త్రాభ్యాసము సల్పితీఱవలసి యుండును." అని తమకుఁదామే జవాబుచెప్పుకొన్నారు. ప్రభాకరశాస్త్రిగారి మొదటివాక్యమును బట్టుకొన్నజాడ్యపిశాచము రెండవ వాక్యమును పీడించక విడిచిపెట్టినది. చిరకాల విద్యాభ్యాసనజిగీషజాడ్యమని యనుకొనుటవలన నాపిశాచమెక్కడ వేధించునో యన్న భీతిచేతనుగాఁబోలు నాపిశాచమునుండి శ్రీనాథుని విడిపించుటకై యీసందర్భముననే యీదిగువ శ్రీనాథునకు గురువేలేఁడను భావము చదువరులకు జనింపఁజేయుటకై, "ఆలోకసామాన్యప్రతిభాశాలి యగుటచే నాతఁ డొకవేళనా యఖండపాండిత్యమును గూడఁ నాచార్యసన్నిధి

నభ్యసింపక యేయలవడుచున్నాఁడేమో యను సంశయమున కీ క్రింది పద్యమవకాశముకలిగించుచున్నది.

శా. బ్రాహ్మీదత్త వరప్రసాదుఁడవు పుష్యప్రజ్ఞా విశేషోదయా
జిహ్వాస్వాంతుఁడ వీశ్వరార్చన కళాశీలుండ వభ్యస్త్రిత
బహ్మాండాది మహాపురాణచయ తాత్పర్యార్థనిర్ధారిత
బ్రహ్మజ్ఞాన కళానిధానమవు నీభాగ్యంబుసామాన్యమే.

అని శృంగారనైషధములోని పద్యము నుదాహరించిరి.

కాని శ్రీనాథుఁడే తన కాశీఖండమున నొకచోటఁ జొప్పించిన:-

గీ. శాస్త్రమాచార్యసన్నిధి జదువఁడేని
యిద్ధబోధంబు మది సంగ్రహింపఁడేని
తెగువమీఱి ప్రతిజ్ఞ సాధింపఁడేని
జ్ఞాతిజయమందఁడేని తజ్జనుఁడుజనుఁడె.

అను పద్యము నడ్డమువచ్చి తమ యభిప్రాయమును ఖండించుటచేత "విద్యోపలబ్ధికిఁ గూడ నుద్బోధకముగాఁ గొంత గురుశుశ్రూష యుండ వలసినదే యగుచు. శాస్త్రాధ్యయనము గురునియొద్దఁ జేయవలసినదే" యనివక్కాణించుచుఁ పై బ్రాహ్మీదత్త మను పద్యము నాధారముగాఁ గొని శ్రీనాథునకు విద్యాగురువు లేఁడని తలంపరాదు" అని మరల శ్రీనాథుని చిరకాల విద్యాభ్యసనము జాడ్యము పాలుగావించిరి.

శ్రీప్రభాకరశాస్త్రిగారు శ్రీనాథునికి గురువున్నాఁడని యొప్పుకో వలసిన వారై యున్నారు గనుక నింక నాగురు వెవ్వరని వెదక నారం భించిరి. తాత కమలనాభుని గురువునిగాఁ జేయఁ బ్రయత్నించియు నది సాధ్యపడనందున కమలనాభుని సాక్షాదుపదేశముల నీతఁడు కాంచె ననిగాని లేదనిగాని స్పష్టపఱుప నాధారములుగానరావని యాతని వద లుకొన్నారు. ఇంక మిగిలి పట్టుకొనవలసినవాఁడు ఘోడెరాయభీమ య గురువరేణ్యుఁడు. ఇతఁ డల్లాడ వేమారెడ్డి వీరభద్రారెడ్ల కుల గురువనియుఁ వీరభద్రాచల (పట్టిసము) నిలయుఁడగు వీరభద్రేశ్వరు

నకు భక్తుఁడనియు, వేదశాస్త్రాది విద్యానిరూఢుఁడనియుఁ దెలియఁ జేయు పద్యములను నిశ్శంక కొమ్మనామాత్యుని శివలీలావిలాసమను ప్రబంధము నుండి యుదాహరించి కడపట నిట్లు వ్రాసిరి.

"వేదశాస్త్రాదివిద్యోపదేశముచేఁ గాక యాభీమయ గురువరేణ్యుఁడు శైవమంత్రాద్యుపదేశముచే నతనికి గురుఁడయి యుండ వచ్చును."

మామిత్రులగు ప్రభాకరశాస్త్రిగారిపై వాక్యములు శ్రీనాథుఁడు తన కాశీఖండములోఁ జెప్పుకొన్న దానికిఁ గేవలము భిన్నములుగా నున్నవి. తనకు సంభవించిన సాహిత్యసౌష్ఠవమునకు కారణంబులు నుద్బోధకములుగ నంతు వానిలోఁ ఘోడెరాయాంకసద్గురు రాజభీమేశ్వరస్వామి పదసమారాధనంబు" నొకటిగాఁ జెప్పుకొనియున్నాఁడు గాని శైవమంత్రాద్యుపదేశప్రశంసను సలిపి యుండలేదు. వేదశాస్త్రాధికవిద్యానిరూఢతవదన సరస్వతి నతుపుచాఁడని వర్ణింపఁబడిన శైవగురువు శైవమంత్రాద్యుపదేశమును జేయఁగలిగి వేదశాస్త్రాది విద్యోపదేశము చేయఁజాలి యుండకపోవునా? మొకటిదాని నంగీకరించినపుడు రెండవదాని నంగీకరింపకుండుటకుఁ గారణ మేమి? ఈ ప్రశ్నమునుండి తప్పించుకొనుటకై "పయివిధమునఁ బరామర్శింపఁబడిన యాకాశీఖండ పద్యము శ్రీనాథుని బాల్యవిద్యాభ్యాసవిషయము క దెలుపుసదిగాఁ దోపకున్న" దని వ్రాయుచున్నారు.

మఱియు కాశీఖండమున, బేర్కొనఁబడిన భీమయ శ్రీనాథునకు శైవమంత్రాద్యుపదేశకర్తయగు గురువై యుండవచ్చునని యొకవంక ఘోషించుచు కాశీఖండరచనాకాలమున నాతనికిఁ దాత్కాలికోత్సాహకారణముగా భీమయగురుని బ్రస్తుతించినాఁడుగాని, ఉపలబ్ధమైన శ్రీనాథుని గ్రంథములందాతని గురువెవ్వరో తెలియరాకున్నాఁడని యింకొకవంక ఘోషించుచున్నారు. ఇది యేమిఘోషః శైవమంత్రాద్యుపదేశకర్తయగు గురువు గురువుకాడనయా వీరియభిప్రాయము?

ఇంకను శాస్త్రిగారు:—

శ్రీనాథుఁడు కృష్ణయజుర్వేదము నధ్యయనముచేసినాఁడు. స్వవేద శాఖాధ్యయనము బ్రాహ్మణుని కావశ్యకకార్యమని స్మృతికారు లనిరి. దాని నీతఁడు పాటించెను. అధ్యయనముఁ జదివి మఱచుచుండ మునగాక చక్కఁగా నుపస్థితిలో నుండునట్లు చేసెను. ఈయర్థమును "అధ్వర్యువేదశాఖాధీతినిష్ణాతు" అన్న పదమెఱిఁగించుచున్నది. అధ్వర్యువేదశాఖ యనఁగా కృష్ణయజుర్వేదము ఉభయభాషాకవిమైత్రశ్రీనాథకవి' యనియె గాక వేదాధ్యయనపరుఁడై 'శ్రీనాథావధాని' యని కూడ శ్రీనాథుఁడు పేర్కొనఁదగినవాఁ డయినాఁడు." అని తమగ్రంథమునం దలంకరించిరి. ఆకాలమున గురుముఖమునఁగాని యిట్టియోగము సంప్రాప్తముగాదని ప్రభాకరశాస్త్రిగా రొప్పుకొనకతప్పదు. పల్వురు గురువులున్నారని చెప్పుటవలన శ్రీనాథుని కుశాగ్రబుద్ధికిని నద్భుతప్రతిభకును భంగమువాటిల్లును గావున శ్రీనాథుని కొక్కఁడే గురువుండవలయునని చెప్పెడివారు ప్రభాకరశాస్త్రిగారె గదా! ప్రభాకరశాస్త్రిగారి యభిప్రాయము ననుసరించి తన్నవధానిగ నొనరించిన వేదవేదాంగవిదుఁడైన గురువుకడనే శ్రీనాథుఁను శ్రౌతసూత్రములతోఁబాటు కామసూత్రములను బఠించినాఁడు. అష్టాదశస్మృతులను, అష్టాదశపురాణములను, ఉపపురాణములను, సాంఖ్యయోగసిద్ధాంతములను శైవాగమములను జదివినాఁడు. మఱియు నావిద్యలను ముద్దలు చేసి మింగినట్టుగా నశ్రమమున గ్రహించి వ్యుత్పత్తి సార్జించినాఁడు. మాహారాష్ట్రి, శౌరసేని మొదలగు ప్రాకృతభాషలందు బరిజ్ఞానపాటవము గడించినాఁడు. పతంజలిప్రణీతమగు వ్యాకరణ మహాభాష్యమును బాగుగాఁ బఠించినాఁడు. న్యాయవైశేషిక దర్శనములందుఁ గౌసల్యముగాంచినాఁడు. వీనిపై వ్రాయఁబడిన భాష్యకర్తల గ్రంథముల నన్నిటిని నభ్యసించెను. అతనికడనే పూర్వకవి ముఖ్యవిరచితా పూర్వకావ్యభావరససుధాచరణ ప్రౌఢతయును గాంచినాఁడు.

ఇన్ని విద్యలను, ఇన్ని శాస్త్రములను, ఇన్ని మతసిద్ధాంతములను నేకగురు ముఖమున నేకకాలమున శ్రీనాథుఁ డభ్యసించెనని ప్రభాకరశాస్త్రిగారి వాదము విశ్వసనీయమో, ఆయాశాస్త్రములందుఁ బ్రవీణులయిన విద్వాంసులయొద్ద వేఱ్వేఱుశాస్త్రములను వేఱ్వేఱు కాలములందు శ్రీనాథుఁ డభ్యసించెనను నావాదము విశ్వసనీయమో నిర్ధారించుకొనుటకుఁ జదువరులకే విడిచిపెట్టుచున్నాను.

---

## అధ్యాయము ౪

### రెడ్డిభూపాలురు

**దేసటి ప్రోలయవేమారెడ్డి.** (౧౩౨౪—౧౩౫౦)

**దేసటి పోలయ** (భార్య అన్నమ్మ)



౧౩౨౩ వ సంవత్సరమునఁ దురుష్కులు కాకతీయసామ్రాజ్యమును విధ్వంసము గావించి వెనుకఁ బంటకులంబున జనించినట్టి దేసటి వేమారెడ్డి మనుమఁడును ప్రోలయరెడ్డి రెండవకొడుకును నగువేమారెడ్డి యార్యధర్మోద్ధరణాభిలాషియై తురుష్కు లార్యధర్మముల నాంధ్రదేశంబునఁ దాటాదూటములుగఁ జేయుచుఁ గలవరపెట్టుచున్న కాలంబున విక్రమాఢ్యుఁడై కృష్ణానదీతీరప్రాంతదేశములఁ దురుష్కుల నోడించి పూఁగినాటిదేశంబున రాజ్యరమను నెలకొల్పి సామ్రాజ్యము విస్తరింపఁజేయ నెంతేని బ్రయత్నించి కృతార్థజన్ముఁడై యాంధ్రదేశంబునఁ జిరకీర్తిని సంపాదించినవాఁడు.* స్వదేశాభిమానము, స్వభాషాభిమాము, స్వమతాభిమానము, స్వజనాభిమానముగల భూపాలురలో నితఁ డగ్రగణ్యునిగా భావింపవచ్చును. కనుకనే యెఱ్ఱాప్రెగ్గడ వచించిన ట్లవదాతచరితంబున నఖిలజనరంజనం బొనర్చుటంజేసి రాజశబ్దమునకు భాజనం బయ్యెను. ఇతఁడు స్వబంధుజనానురాగము మెండుగాఁగలవాఁడై బహుభూము లాక్రమించి యనుజ తనుజ బాంధవ మిత్రజనుల కిచ్చెనని హరివంశములోని యీక్రిందిపద్యమువలన విస్పష్టమగుచున్నది.

తనకు నద్దంకి తగురాజధాని గాఁ బ
రాక్రమంబున బహుభూములాక్రమించి
యనుజతనుజ బాంధవమిత్ర జనులకిచ్చె
నెవ్వరెవ్వారు వేమమహీశ్వరునకు.

అద్దంకి యాతనికి రాజధానిగానుండెననికూడఁ బై పద్యమువలననే తేటపడుచున్నది. ఇట్లితఁడు భూముల నొసంగి స్వబంధుజనుల

* శ్రీశైల పూర్వతట నికటమునుండి పూర్వసముద్రముదాక ప్రవహించు ఖండితరంగిణియును గుండ్లకమ్మనది కిరుప్రక్కలనుండు సీమ కేపూఁగినాడను నామముగలదని తెలియుచున్నది.

నాదరించినవాఁ డగుటచేతనే కాఁబోలు

పంటకులస్వామి ప్రఖ్యాతుఁడౌర వే
మయపితామహుఁడను మాన్యతయును
ఘాతకళంకుండు దొడ్డయసైన్యనా
యకుఁడు మాతామహుండను విశతియా
నాదిరాజన్య తుల్యాచారవిధి మాచ
విభుఁడ పూర్వజుడను విశ్రుతియును
శ్రీయుతుల్ పోతయ ఓట్టయ నాగయ
ప్రభులు మాతులులను భవ్యతయును
దనమహత్త్వంబు భూషింపఁ దాను వారి
పేరు వెలఁయింపఁజాలు గభీరమహిమ
నాత్మగుణముల నొదవించు సన్వయైక
పావనుఁడు వేమజనపతి కేవలుండె!

అను హరివంశములోని పద్యములో పెద్దకోమటి వేమారెడ్డిని సన్వయైకపావనుఁ డని యభివర్ణించి యున్నాఁడు. ఇతనికి బిరుదనామము లనేకములు గలవు. వానిలో 'పల్లవాదిత్యుఁడు, జగనొబ్బగండఁడు, అంకరపాలుఁడు, కేలాదిరాయఁడు, సంగ్రామధనంజయుఁడు, భుజబలభీముఁడు, రూపనారాయణుఁడు, వీరనారాయణుఁడు, గుజ్జరిదళవిభాళుఁడు, జగరక్షపాలుఁడు, చంచుమలచూఱకారుఁడు, మండలీకరగండఁడు, కోదండరాముఁడు, రాయచేకోలుగండఁడు, అర్థిప్రత్యర్థిహేమాద్రిదానిరతుఁడు, ప్రజాపరిపాలనభరితుడు, అష్టరాభరణుఁడు, అపరిమితభూదాన పరశురాముఁడు, రాచూరిదుర్గవిభాళుఁడు, అనేకనగరోపకంఠ ప్రతిష్ఠాపిత బహువిధారాముఁడు, పరంతాహరోబల నిర్మితసోపానుఁడు, బ్రహ్మకుండిసహ్యజాగౌతమీజలక్రీడావినోదుఁడు: విరోధినృపదానవ నరసింహుఁడు, పాండ్యరాయగజసింహుఁడు, ప్రజ్ఞాచతుర్విధోపాయుఁడు, నిత్యపరిపాలిత

సత్యుఁడు, దుర్మదవైరివీరభయంకరుఁడు, బసవశంకరుఁడు,’ అనునవి ముఖ్యములైనవిగా నున్నవి. ఇతనికిఁ గాశ్యపగోత్రసంజాతుఁడును, రాజతంత్రజ్ఞుఁడును సమర్థుఁడును, అమాత్యశిఖామణియు, శాస్త్రవిదుఁడు, వయోవృద్ధుఁడగు రామాప్రెగ్గడ యను నియోగిబ్రాహ్మణుఁడు మంత్రిగనుండెను. ఇతనికిఁ దమ్ములైన అన్నారెడ్డియు, మల్లారెడ్డియు కుమారుఁడైన అనపోతరెడ్డియు, మాతులపుత్త్రుఁడైన నూకారెడ్డియుఁ బ్రసిద్ధసేనానులుగ నుండి వేమారెడ్డికి దిగ్విజయ మొనర్చుచుండిరి. వీరిలో మల్లారెడ్డి శ్రీరామచంద్రునికి లక్ష్మణునివలెను, ధర్మజునకు నర్జునునివలెను వేమారెడ్డికి విధేయుఁడై సౌభ్రాతృత్వము నెఱపుచు సమస్తజనులచేఁ గొనియాడఁబడుచుండెను. మల్లారెడ్డి తురుష్కులను జయించి వారాక్రమించిన బ్రాహ్మణాగ్రహారములను మరల బ్రాహ్మణుల కిప్పించెనట. ఇతఁడు కాకతీయ సైన్యాధిపతులగు క్షత్త్రియులను జయించి మోటుపల్లిని స్వాధీనపఱచికొనియెను. అనపోతరెడ్డి సేనాధ్యక్షుఁడై ధరణికోటయందుండి పద్మనాయకుల వలనను, రాచవారువలనను తమ రాజ్యమునకు హానికలుగకుండఁ గాపాడుచుండెను. ఇట్టి సేనాపతుల సాహాయ్యముతోఁ బరరాజులను జయించి యీవేమభూపాలుఁడు కందుకూరి మొదలుకొని గోదావరీనది పర్యంతముగల యాంధ్రదేశమును బరిపాలించెను. “బ్రిహ్మకుండి కృష్ణవేణ్ణా గోదావరీ మహానదీతటద్వయ తన్మధ్య దేశకర్త్తానేకాగ్రహారః’ అను విశేష మొకటి వేమునకుఁ గలదని శాసనములలోఁ గన్పట్టుచున్నందున వేముఁడు నెల్లూరు మొదలు కటకముదాక పరిపాలనము చేసినట్లు తోఁచుననియు, ఇందులోఁ గొంతభాగ మతిశయోక్తికింపఁ గొట్టివేసిన ప్రస్తుతపు గోదావరీమండలములోఁ జేరిన దేశమంతయు నతని పరిపాలనకు లోఁబడినదనుటకు సందేహముండదనియు శ్రీజయంతిరామయ్యగారు వ్రాయుచున్నారుగాని యదియంతగా బాటింపదగినది కాదు. పైదానిలోఁ గటకము ప్రశంస గానరాదు. * అంతియు

* ఆంధ్రభారతి సంపుట ౭ సంఖ్య ౩ పేజి ౧౧౯ చూడుఁడు.

గాదు. ఆకాలమున నిప్పటిగోదావరీమండలము కోరుకొండ రాజధానిగాఁ జేసికొన్న మంచికొండ కూనారెడ్డియొక్కయుఁ నతని కుమారుఁడు ముమ్మిడినాయకుని యొక్కయుఁ బాలనమునందున్నట్లు ముమ్మిడినాయకుని యార్యవటశాసనాదులు వేనోళ్ళ ఘోషించుచున్నవి. ఆశాసనముల యందెచ్చోటను కోరుకొండరెడ్లు ప్రోలయ వేమారెడ్డికి లోఁబడిన వారని చెప్పఁబడియుండలేదు. అందువలన పై వేమభూపాలుఁడు మహానదియైన గోదావరివఱకుఁ గల దేశమును మాత్రమె పరిపాలించియుండును. మంచికొండ కూనారెడ్డికి తురుష్కులను జయించుటకుఁ దోడ్పడినవారు ప్రోలయ నాయకుఁడును నాతని పుత్త్రుఁడు కాపయనాయకుఁడు నని యార్యవటశాసనమునుబట్టి యూహింపఁదగియున్నది. వేమారెడ్డియె కాపయనాయకుడని వ్యవహరింపఁబడియుండిన యెడల జయంతి రామయ్యగారి యూహాసరియైన దనవచ్చునుగాని యందునకుఁ బ్రమాణము గానరాదు. అమరావతీ శాసనములో 'మాద్యన్మన్నెనృపాలతూలపవదన' అని చెప్పుటచేఁ గళింగదేశములోని కొండరాజులను జయించిన మాత్రముచేత నాదేశమును గళింగదేశమనికాని, కళింగదేశమును బరిపాలించెననిగాని యెట్లు చెప్పనగును? ఇతర ప్రమాణములేవియుఁ గానరాకుండునప్పుడు వేమారెడ్డి కళింగదేశమును బరిపాలించెనని సిద్ధాంతము చేయరాదు. ఎఱ్ఱాప్రెగ్గడ యను మహాకవి యితని యాస్థానమునందేయుండి హరివంశమును రామాయణము నీతని కంకితము గావించెను. వేమారెడ్డి అహోబల శ్రీపర్వతముల రెంటికిని సోపానములను గట్టించి ప్రసిద్ధికెక్కినవాఁడు. ఇతఁడు శైవభక్తుఁడయినను పరమతసహనముగలవాఁడు. ఇతఁడు ౧౩౪౦ వఱకుఁ బరిపాలనము చేసెను. *

* ఆంధ్రకవుల చరిత్రమునందు ప్రోలయవేమారెడ్డి ౧౩౨౪ వ సంవత్సరమునందు స్వతంత్రుఁడై వినుకొండరాజ్యము నాక్రమించుకొని ౧౩౩౫ వ సంవత్సరము

ప్రోలయవేమారెడ్డి రాజ్యపరిపాలనము సర్వోత్కృష్టమైనదిగఁ దెలుపుచుఁ దద్భాగ్యవైభవమును శంభుదాసుకవి (ఎఱ్ఱాప్రెగ్గడ) యి ట్లభివర్ణించి యుండెను.

సీ. అగ్రహారములు విద్యాతపోవృద్ధ వి
ప్రులకిచ్చి యజ్ఞకర్తలుగ నునిచెఁ
గోమరాగఁ జెఱువులుగుళ్ళు ప్రతిష్ఠించి
లోకసంభావ్యంబులుగ నొనర్చె
నిధులు నల్లిండ్లును నిలిపెఁ దోటలు సత్ర
ములు చలివిందరల్ వెలయఁబెట్టె
హేమాద్రిపరికీర్తితామితవ్రతదాన
నివహంబులన్నియు నిర్వహించె
జేసెఁజేయుచున్నాఁడు సేయనున్న
వాఁడు పునరుక్తకృతిశుభావలుల నెల్ల
ననఁగ శ్రీవేమవిభువి కయ్యలరు పేర్మి
వశ మెవర్ణింపఁ దద్భాగ్యవైభవంబు.

## అనపోతరెడ్డి భూపాలుఁడు. (౧౩౫౦ మొదలుకొని ౧౩౬౨ వఱకు)

ప్రోలయ వేమారెడ్డి యనంతర మతని కుమారుడైన అనపోతరెడ్డి శా. శ. ౧౨౭౨ వ సంవత్సరమనఁగా క్రీ. శ.

వఱకును రాజ్యముచేసెనని వ్రాయఁబడియుండుటయె గాక ప్రోలయవేమారెడ్డితరువాత నతనికుమారుఁడనవేమారెడ్డి రాజ్యమునకు వచ్చెనని వ్రాయఁబడియుండుట నుదాహరించి ఫుట్‌నోటులో ఇటీవలివారు కొందఱు కవులచరిత్రములోని కాలమును నమ్మి తప్పుసిద్ధాంతములనుచేయ మొదలుపెట్టినారని నాయాంధ్రులచరిత్రములోని మూఁడవభాగములో ౧౪౯ వ పేజీలోవ్రాసియున్న దానిని చదువుకొని శ్రీవీరేశలింగముగారు వానినంతయు నిప్పటి నూతనగ్రంథమునందు నాగ్రంథమెంతసహాయము చేసినదో తెలుపకపోయినను మౌనముతో మెల్లగా సవరించుకొన్నందులకు సంతసించుచు వారినెంతయు శ్లాఘించుచున్నాను. ప్రోలయవేమారెడ్డికిఁ బిమ్మట నతనికుమారుఁడైన అనపోతరెడ్డి రాజ్యభారము వహించెననుసంగతి నాయాంధ్రులచరిత్రము మూఁడవభాగమున్ను జదువుకొనువఱకు వెలుంగనే యెఱుంగరు.

౧౩౫౦ దవ సంవత్సరమున సింహాసనమెక్కి రాజ్యభారమును వహించి క్రీ. శ. ౧౩౬౪ వఱకు రాజ్యపరిపాలనము గావించెను. వేమ భూపాలునకు అనపోతరెడ్డి, అనవేమరెడ్డి కోమటిరెడ్డి అను ముగ్గురు కొమాళ్లును, దొడ్డాంబిక వేమాంబిక అను నిద్దరు కుమార్తెలు గలరు. కోమటి రెడ్డి చిన్నవయస్సుననే గతాసు వయెను. దొడ్డాంబికను కాటయరెడ్డికిని, వేమాంబికను నల్లనూకయరెడ్డికి నిచ్చి వివాహము గావించెను. అనపోతరెడ్డి వేమభూపాలునకుఁ గూరిమి పుత్త్రుఁడు. అనపోతరెడ్డి రాజ్యభారమును వహించి తండ్రిపోయిన మార్గమునుబట్టి ప్రజారంజకముగ రాజ్యపరిపాలనముచేసి తండ్రికిఁ గీర్తియు, రాజ్యమునకు వన్నెయుఁ దెచ్చెను. తోఁబుట్టువుల భర్తలును సేనాపతులునైన కాటయరెడ్డియు,నల్లనూకయరెడ్డియునాతనికి రెండుభుజములుగానుండిరి. సోదరుఁడును ప్రచండసేనానియునగు అనవేమరెడ్డియు, విధేయుఁడై యుండెను. దక్షిణమునుండి కర్ణాటకులును, పశ్చిమమున నుండి పద్మనాయకులును, అప్పటప్పట రాచవారును రెడ్డిరాజ్యమును స్వాధీనము చేసికొనవలయునని ప్రబలప్రయత్నములు చేయుచువచ్చిరి. గానిఅనపోతరెడ్డి సమర్థుఁడును, పరాక్రమవంతుఁడునైనందున వైరివీర మదభంజనుఁడై తనరాజ్యమును సంరక్షించుకొనుచుఁ బొగడ్తలను గాంచెను. క్రీ. శ. ౧౩౬౧ వ సంవత్సరమున రేచర్లసింగమనాయని పుత్త్రులు అనపోతనాయఁడును, మాదానాయఁడును బహుళసైన్యములతోఁ దాడివెడలివచ్చి ధాన్యవాటీపురమును (ధరణికోట) ముట్టడించినప్పుడు, అనపోతరెడ్డి ప్రచండవిక్రమార్కుఁడై భూరిసైన్యములతో వారల నెదుర్కొని ఘోరసంగ్రామమును సలిపి కృష్ణానది కావలిప్రక్కకుఁ దఱిమెను. అంత వారలు పరిభవమున కోర్వఁజాలక తిరువిట్లుపడుచు తుదకు తురుష్కులు స్వరాజధానిపై దండెత్తివచ్చినారను వర్తమానము రాఁగాఁ బునఃప్రయత్నమును మానుకొని మరలిపోయిరి. అనపోతరెడ్డి యీ యుద్ధమునందు నోడి

పోయినట్లు గన్పట్టెను. ఇతఁడు ఆర్యధర్మములను బోషింపుచుండెను. వేదాధ్యయనసంపన్నులైన బ్రాహ్మణోత్తములకుఁ దన తఁడ్రి యొసంగిన యగ్రహారముల నన్నిఁటిని గాపాడుటయెగాక తానును హేమాద్రిదానఖండమునఁ జెప్పినప్రకారము గావించి కీర్తనీయుఁ డగుచుండెను. ఇతఁడు పట్టాభిషిక్తుఁడైన పిమ్మట రెండుసంవత్సరముల నడుకును రామాపెగ్గడ వంశములోనివాఁడగు మల్లినాథుఁడు మంత్రిగనుండినట్లు ఒంగోలుతాలూకాలోని మణికేశ్వరము శాసనమువలన నూహింపఁ దగియున్నది. ఆశాసనమునందు మల్లనమంత్రి స్వర్గస్థుఁడు కాఁగా నతని పినతమ్ముఁడు మంచిరాజు శాస్త్రయుక్తముగ నుత్తరక్రియలు నెఱవేర్చి పుణ్యార్థము శా. శ. ౧౨౭౫ విజయసంవత్సర జ్యేష్ఠ శు ౧౮ శనివారమునాఁడు తానావఱకు శ్రీశైలములోని పాతాళగంగ పట్టుననుండి కొనివచ్చిన రెండులింగములలో నొకదానిని మాండుకేశ్వరస్వామి దేవాలయములో రావినూతుల పర్వతమల్లినాథలింగస్వామి యను పేరితో బ్రతిష్ఠాపన గావించెను. మఱియొకలింగమును శ్రీగిరిలింగమనుపేర నెదుటనున్న మండపములోఁ బ్రతిష్ఠాపన గావించెను. మఱియు నితఁడు శివక్షేత్రము మణికేశ్వరములోని యాశివాలయమునకు నారామములు, భూములు మొదలగువానిని దానముచేసి ప్రఖ్యాతుఁడయ్యెను.* ఈమల్లనమంత్రి గాక మఱియొక మల్లనమంత్రి కలఁడని అమరావతీశాసనములలోని యొకశాసనమువలన విదితమగుచున్నది. అతఁడు కేతచమూపతి కుమారుఁడైన మల్లినాథుఁ డనియు, వేమపృథ్వీశ్వరునిరాజ్యధురంధరుఁడైన మంత్రి యనియు, కులక్రమాగతమైన మంత్రిత్వపదవియం దుండెననియు నాశాసనము చాటుచున్నది. అట్టి మల్లినాథమంత్రికి లక్కాంబికయందు జనించిన వేమచమూపతి ధాన్యవాటీపురమునందుఁ బ్రతిష్ఠాపింపఁబడియున్న యమరేశ్వరదేవుని శా.

* నెల్లూరి శాసనములు ౨ వ సంపుటము. ఒంగోలుశాసనము ౫౮ పేజీ ౧౦౩౩

శ. ౧౨౮౩ ప్లవసంవత్సర శ్రావణపంచమీ గురువారమునాఁడు అనపోతయరెడ్డిగారికి ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధికొఱకును, ధనకనకవస్తువాహన సమృద్ధికొఱకును, పుత్త్రపౌత్త్రాభివృద్ధికొఱకును పునఃప్రతిష్ఠాపనము గావించెనని యాశాసనము చాటుచున్నది. అనపోతభూపాలుని రాజ్యపరిపాలనాకాలమున జరిగిన మహద్విషయ మొండు గలదు. సముద్రతీరమునందున్న మోటుపల్లి పురాతనకాలమునుండియు వర్తకస్థానమై నౌకావ్యాపారమునకుఁ బ్రధానస్థానముగా నుండెను. కాకతీయసామ్రాజ్య మస్తమించిన వెనుక మోటుపల్లియందుండెడు వర్తకులు పరస్థలములకుఁ బోవుటయు వ్యాపారము తగ్గుటయుఁ దటస్థించెను. అనపోతరెడ్డి యీరేవుపట్టణమును వృద్ధికిఁ దీసికొనిరావలయు నని శ్రద్ధతో సంకల్పించెను. అనపోతరెడ్డి యాజ్ఞాప్రకారము వానిమంత్రులలో నొక్కఁడగు మోటుపల్లి నగరాధీశుఁడు సోమయామాత్యుఁడు,

'మోటుపల్లి కేవర్తకులువచ్చి నివసింపఁగోరినను వారిని గౌరవించి వారలకు భూములు నివేశనస్థలములు నిప్పింతుమనియు, వారలు మఱియొక స్థలమునకుఁ బోఁదలఁచుకొన్నప్పుడు వారిని నిర్బంధపెట్టి నిలుపక స్వేచ్ఛగా విడుతు మనియు, ఏయూరిసరకు తెచ్చినను, వారిని స్వేచ్ఛగా నమ్ముకొననిచ్చెద మనియు, పన్నులకై వారిసరకులను గ్రహింపమ'నియు శాసనమును వ్రాయించి ప్రచురించెను. ఇదంతయు నెట్లయిన రేవుపట్టణమునకు నభివృద్ధిలోనికిఁ దెచ్చి ద్వీపాంతరములతోడి వ్యాపారమును పెంపొందింప వలయునని మనఃపూర్వకముగాఁ జేసినప్రయత్నమైనట్లు శాసనముం జదివినవారికి స్పష్టముగా బోధపడఁగలదు*

See Elliots Collections,

ఈశాసనమును ఆంధ్రులచరిత్రములోని మూఁడవభాగములో ౧౩౦ పేజీలో ప్రచురించియున్నాఁడను. దీనిం బరిశీలించియే వీరేశలింగముగారు 'శ్లో॥ అహితతమఃకృశాను........శ్రీసోమమంత్రీశ్వరః. అను వానినిగ్రహించి తమ నవీనగ్రంథములో ౧౩౮ పేజీలోఁ జొప్పించియున్నారు.

## చతుర్థాధ్యాయము

అనపోతరెడ్డికిఁ దరువాత. గూడ నీనౌకావ్యా ...మంత్రిమూర్తుల గాంచియుచున్న లనేకదృష్టాంతములు గనుపట్టుచున్నవి. ఈతని పరిపాలనము సర్వజన రంజకమై యున్నదనుటకు సందియము లేదు. ఈశాసనము క్రీ. శ. ౧౩౬౯ న వ్రాయఁబడినది. మోటుపల్లి ముకుళపురమని వ్యవహరింపఁ బడుచున్నట్లుగా పై శాసనమువలనఁ దెలియుచున్నది. అనపోతరెడ్డి పరి పాలనము చేసినది పండ్రెండు సంవత్సరములు మాత్రమే. ఇతఁ డేకా రణము చేతనో అకాల మృతినొందెను. ఇతఁ డింకను బ్రదికియుండిన యెడల రెడ్డిరాజ్యమును విస్తరింపఁజేసి కర్ణాటక సామ్రాజ్యము వలె నొక ఘనసామ్రాజ్యమును దక్షిణహిందూస్థానమున స్థాపించి యుండు ను. ఇతనికి కుమారగిరిరెడ్డి యను కుమారుడును, మల్లాంబ యను కొ మార్తెయుఁ గలరు. మల్లాంబను తన మేనల్లుఁడగు కాటయవేమున కి చ్చి వివాహము గావించెను.

దక్షిణపు సరిహద్దుననున్న యుదయగిరిరాజ్యము కర్ణాటాధీ శులవశ్యమై వారి పరిపాలనమునఁ బ్రవర్ధమానమై యొప్పుచున్నందు న నెప్పటికైనఁ దనరాజ్యమునకు ముప్పు రాగలదని యూహించి త న్నివారణ మార్గముల నారయుచుండెను. నూత్నకర్ణాటసామ్రాజ్యాధీ శ్వరుల పుత్త్రులును, యువరాజులునగువారు తేలుచు నుదయగిరి దుర్గ మున నుండుచు నుదయగిరి రాజ్యమును బరిపాలము సేయుచుండిరి. అట్టి యుదయగిరికి సమీపమున దనరాజధాని యుండుట రాజ్యవినాశమున కు హేతువగునని యో, పద్మనాయకవీరులు తరచు ధాన్యవాటీనగరముపై దండయాత్రలు సలుపుచుండుటచేత తనముఖ్యపట్టణము ధాన్యవాటీపుర మునకు సమీపముననుండుటయు విశమని యెంచియో అనపోతభూపాలుఁ డుశత్రువుల కభేద్యమగు కొండవీడునకు తన రాజధానిని మార్చుకొని యెను. గోదావరీ మండలములోని యొకశాసనములో అనపోతఁ రెడ్డి

[illegible] కొండవీడును నిర్మించి రాజధానిగాఁ జేసుకొన్నట్లు దెలుపఁబడినది*

## అనవేమభూపాలుఁడు

క్రీ. శ. ౧౩౬౨ మొదలుకొని ౧౩౮౩ వఱకు

అనపోతభూపాలునకుఁ బిమ్మట నతనికుమారుఁడు బాలుఁడగుటచేతనుగాఁబోలు నతని తమ్ముఁడు అనవేమారెడ్డి రాజ్యాధీశుఁడయ్యెను. అనవేమభూపాలుఁడు తన యన్నవలెనే శౌర్యవంతుఁడును, సమర్థుఁడును, ధర్మాసక్తచిత్తుఁడునై ప్రజపరిపాలనము గావించెను. ఇతఁడు బ్రతికియున్నంతకాలము రాచకొండ, దేవరకొండ దుర్గముల కధిపతులై రాచకొండరాజ్యమును బరిపాలనము సేయుచుండెడి అనపోతనాయుఁడు, మాదానాయుఁడు బలద్విరోధులై యీతని రాజ్య మాక్రమించుకొనవలయునని యనేకపర్యాయములు దండయాత్రలుసలిపి యనవేమభూపాలునితోడ ఘోరయుద్ధములుచేసి యోడింపఁబడుచు వచ్చిరికాని మనోరథ మీడేర్చుకొన్నవారు కారయిరి. అనవేమభూపాలుని కీవిజయములతోఁ గీర్తి విస్తరించెను. అనవేమభూపాలుఁడు కందుకూరు మొదలుకొని విశాఖపట్టణమండలములోని

* శ్లో. తతోన్నపోతనృపతిః పరిపాలన కర్మణి
అపాలయత్తస్యపుత్రస్తదం తేందప్రవసుంధరా
కొండవీడుం రాజధానిం సతిచిత్రామకల్పయత్
దృష్ట్వాత్వష్టాపి చిత్ర్యధుభూద్యస్యాస్స విస్మయః

Elliot's collections Page. 270.

ఈశాసనములోని కొన్నిశ్లోకములను ఆంధ్రులచరిత్రము మూడవభాగములో ౧౩౩ పేజీలోఁ బ్రచురించియున్నాను. మఱిం జవివి వీరేశలింగముగారు తన నవీనగ్రంథమున (కవులచరిత్రము) 42[illegible] పేజీలోను పైశ్లోకమును 426, 427 పేజీలలోను బ్రచురించియున్నారు.

పూర్వగ్రంథమున నీశ్లోకమున అన్నపోతయనుటకుమాఱుగా అన్నవేమయని పడుటతప్పని శ్రీప్రభాకరశాస్త్రిగారు సూచించినందుకు వారికికృతజ్ఞుఁడను.

సింహాచలపర్యంతమును గల దేశమును బరిపాలనము చేసెను.*

అనవేమభూపాలుఁడు తన తండ్రి వహించిన జగనొబ్బగండఁ డాదిగాఁగల బిరుదములను మాత్రమె గాక వసంతరాయఁడను బిరుదమును గూడ వహించెను. అనవేమభూపతి హేమాద్రిదానాధికుఁడై దారిద్ర్యవిద్రావణుఁడై శిబికర్ణదధీచులం బోలెఁ బ్రసిద్ధిఁ గాంచెనఁట. ఇతని దానశాసనము లాంధ్రదేశమునం దంతటను గలవు. గ్రంథవిస్తరభీతిచే వాని నిట నుదాహరింప మానుచున్నాఁడను. అనవేమభూపాలుఁడు విద్యాభిమానియనియు, బండితపక్షపాతియనియు, కవుల పాలిటి కల్పతరువనియు, చాటుపద్యములవలనను శ్లోకములవలనను వేద్యమగుచున్నదిగాని యితఁడుగాని యితని యన్న యనపోతరెడ్డిగాని కృతి నొందిన గ్రంథము లెవ్వియుఁ గానరావు.

అనవేమరెడ్డికి సమకాలికుఁడైన రేచర్ల అనపోతనాయునికి మనుమఁడయిన అనపోతనాయుఁడు, అనవేమరెడ్డిని యుద్ధములో సంహరించి పట్టుతలాటాంక బిరుదమును బొందెనని వెలుగోటివారి వంశచరిత్రము దెలుపుచున్నది గాని యది విశ్వాసపాత్రముగాదు. వానికి సమకాలికుఁడయిన మొదటి అనపోతనాయుఁడు చంపెనన్న విశ్వసింపవచ్చును. లేదా అతని కుమారుఁడు సింగమనాయుఁడు చంపె నన్నను విశ్వసింపవచ్చును. అనవేముఁడు చనిపోయిన ముప్పదేండ్లకు వెనుక నున్న రెండవ యనపోతనాయుఁడు చంపెనన్న నంత విశ్వాసపాత్రముగాఁ గనుపట్టదు. మఱియు మఱియొకస్థలమున సింగనమాధవేంద్రుని మునిమనుమఁ డగు లింగమనాయఁడు. అనవేమరెడ్డిని సంహరించి సింహతలాటబిరుదము బొందెనని పై వెలుగోటివారి వంశచరిత్రమే దెలుపుచున్నది. మొదటిదివాస్తవమా? ఈరెండవది వాస్తవమా? మొదటి

* తస్యాభ్రాతా నిష్ఫృతవక్త్రప్రతాపోద సేంద్రవ్యాప్తనీరంధ్రకీర్తిః
శ్రీశైలవాసింహాశైల తతఃక్ష్మాం దత్తోధర్మేణాన వేమక్షితీశః॥

దియు రెండవదియు సత్యములుగావు. అనవేమరెడ్డి సింగనభూధవేంద్రు నకు సమకాలికుఁడుఁ. సింగనభూధవేంద్రుని మునిమనుమఁడగు లింగమ నాయుఁడెట్లు అనవేముని సంహరించి సింహతలాట బిరుదము నొందెనో యూహింపనలవిగాదు. అనవేమరెడ్డి వెలుగోటివారివంశచరిత్రములో వక్కాణింపఁబడినట్లు అనపోతనాయునివలనఁగాని లింగమనాయుని వలనఁగాని సంహరింపఁబడె ననుట విశ్వసనీయముగాదని రూఢిగఁ జెప్ప వచ్చును. శృంగారనైషధకృతిపతియగు మామిడి సింగనామాత్యుని తండ్రి పెద్దనామాత్యుఁడీయనవేమారెడ్డికి ముఖ్యమంత్రిగ నుండెనని శ్రీనాథుని శృంగారనైషధములో:—

మ. అనవోతారాతి వసుంధరారమణ సప్తాంగాపహారక్రియా
ఘనసంరంభ విజృంభమాణ పటుదోఃఖర్జూగ్ర ద్వితీయాగ్రజుం
డన వేమాధిపు రాజ్యభార భరణ వ్యాపారదక్షుండు పె
ద్దన మంత్రీశుఁడు మామిడన్నసుతుఁ డేతన్మాత్రుఁడే యెన్నగన్.

అను పద్యమువలనఁ దేటపడుచున్నది.

ఈయమాత్యశేఖరునకు వీరభద్రామాత్యుఁడు, మారనామా త్యుఁడు నామామాత్యుఁడునను ప్రసిద్ధులైన మువ్వురు తమ్ములు వివిధ కార్యకరణదక్షులై మంత్రులై యన్నకు విధేయులై యొక్కొక్కం డొక్కొక విషయంబునఁ బ్రజ్ఞాఢ్యులై యుండిరని నైషధములోని యీ క్రిందిపద్యములలోఁ దెల్లము చేయఁబడియెను.

ఉ. హేమధరాధరేంద్రమున కెంతటిపెద్దధృతిన్ భుజంగమ
స్వామికి మేలుచేయ పటునాగ్విభవంబున బుద్ధిసంపదన్
దామరచూలికిన్సరి ప్రధానులు దక్కినవారు సాటియే
మామిడి వీరభద్రవరకమాత్యశిఖామణికివ్వసుంధరన్.

ఉ. సత్యవచో నిరూఢుఁడు నిశాకరభక్తి భావనా
సాత్యవతేయుఁ డుద్భట భుజాబల విక్రమకేళి విక్రమా
దిత్యుఁడు కావ్యశుద్ధ సముదీర్ణుఁడు మామిడిమంత్రి మారనా
మాత్యుఁడు వానిఁ బోలవశమా ధరణీధవ మంత్రికోటికిన్.

"శా. స్వామిద్రోహర గండలాంఛనునకున్ సంగ్రామ గాండీవికిన్
వేమక్ష్మాపతి కార్యభారకలనా విఖ్యాత ధీశక్తికిన్
నామామాత్యుని కన్యరాజ నిటలాంతర్న్యస్త భాగ్యక్షర
స్తోమాపాకరణ ప్రవీణునకు మంత్రుల్సాటియే యెవ్వరున్."

"ఉ. తమ్ములు దన్ను మువ్వురును దైవముగా గురుగా మహానిధా
నమ్ముగ దాతగాఁ దమ మనంబుల భావనచేసి కొల్వ భా
గ్యమ్ములకెల్ల నెల్లయయి కాంచెఁ బ్రసిద్ధి నృపప్రధాన ర
త్నమ్మగు మంత్రి పెద్దన యుదాత్తమతిన్ రఘురాము కైవడిన్."

అనవేమమహీపాలుని కాలమునఁ గూడ బాలసరస్వతి యను కవియు, నతనివెనుక త్రిలోచనాచార్యుండను కవియు విద్యాధికారులుగ నుండి శాసనముల లిఖింపుచుండిరి. మఱియు నతనిపరిపాలనమున ప్రకాశభారతీయోగి యని యింకొక యంధ్రకవీశ్వరుఁ డుండెనని యనవేముని దాక్షారామ దేవాలయమున వ్రాయించిన పద్యశాసన కృతులవలనఁ దెలియవచ్చు చున్నది.

## కుమారగిరి వసంతభూపాలుఁడు.

(క్రీ. శ. ౧౩౮౩ మొదలుకొని క్రీ. శ ౧౪౦౦ వఱకు)

అనవేమభూపాలుని శాసనములు క్రీ. శ. ౧౩౮౩ వఱకుఁ గనంబడు చున్నవి. గావున నటుతరువాతనే అనపోతరెడ్డి కుమారుఁడగు కుమారగిరిరెడ్డి రాజ్యభారమును వహించెను. ఇతనికి వసంతోత్సవముల యందున్న ప్రీతి రాజ్యాంగ వ్యవహారములపట్ల లేదని చెప్పఁదగును. ఇతఁడు తండ్రితాతల వంటి ప్రజ్ఞావంతుఁడుగఁ గన్పట్టఁడు. విద్వాంసుఁడై విద్యావ్యాసంగములఁ బ్రొద్దుపుచ్చువాఁడే గాని రాజ్యరక్షణమునఁ బ్రమత్తుఁడై కనుమఱంగి యుండెను. కర్ణాటరాజ్యాధీశ్వరుండగు రెండవ హరిహరరాయలు సమకాలికుఁడై యుండెను. కర్ణాటయువరాజగు దేవరాయ లుదయగిరి రాజ్యమున కాధిపత్యము వహించి యుదయగిరి నెల్లూరు దుర్గములలో నుండి రెడ్డిరాజ్యమును గ్రమముగ నాక్రమింప

నభిలషించుచు సమయమునకై నిరీక్షించి యుండెను. రాచకొండ దేవరకొండ దుర్గాధీశులగు పద్మనాయక దొరలును, శూరవరపట్టణాధీశ్వరులగు రాచవారు మొదలగువారును తనరాజ్య మాక్రమించుకొనవలయునని ప్రబల ప్రయత్నములు సలుపుచుండఁగా నీకుమారగిరి ప్రభువు వసంతోత్సవములతోఁ గాలము గడపుచు రాజ్యభారము నంతయును బంధువును, మంత్రియు, సేనానియునైన కాటయవేమారెడ్డిపై నిడి ప్రమత్తుఁడై యుండెను. కుమారగిరిరెడ్డికిఁ దోఁబుట్టువు పెనిమిటియైన కాటయవేమారెడ్డి మిక్కిలి సమర్థుఁడు గావునఁ గుమారగిరిరెడ్డి భూపాలుని కాలమున రాజ్య మన్యాక్రాంతము గాకుండ సంరక్షింపఁ గలిగెను. కాటయవేమారెడ్డి కర్ణాటరాజ్యాధీశుల తోడ మైత్రిగలిగి యుండి సంగ్రామధనంజయుఁడని విఖ్యాతిఁగాంచి శత్రురాజులకు భయంకరుఁడై మంత్రియు సేనానియునై తానే రాజ్యపరిపాలనము సేయుచుండెను. కాటయవేముఁడు కుమారగిరిరెడ్డికి ధర్మరాజునకు శ్రీకృష్ణునివలె మేనమఱఁదియు సచివుఁడుఁ జెలియునై యుండి రాజ్యమును సంరక్షించుచున్న వాఁడగుటచేత నితనికి రాజమహేంద్రపురము రాజధాని గాఁగల తూర్పుదేశమును విడఁదీసి యిచ్చినట్లు తొత్తరమూఁడి శాసనముద్ఘోషించు చున్నది* ఈ యొక్క విషయమే కుమారగిరిరెడ్డి యొక్క

* కాటయవేముని భార్య మల్లాంబ తొత్తరమూఁడి శాసనములో నిట్లు తెలుపఁబడి యున్నది.

శ్లో. ఆసీదమాత్యరత్నం కాటయవేమ ప్రభుస్తస్య
అతిసునగురు భార్గవమతి రతిభార్గవ విజయవిఖ్యాతిః॥

శ్లో. సింహాసనే నిధాయాసౌ కుమారగిరి భూవరం
ఆతేజయన్మహాతేజా శ్రీకృష్ణఇవ ధర్మజం
కుమారగిరి భూనాథో యస్మై విక్రమ తోషితః
ప్రాదాత్ ప్రాచీభువం రాజమహేంద్రనగరీ ముఖాం.

ఈశాసనము జయంతి రామయ్యగారి వలన పత్రికలో ముద్రింపఁ బడినది.

యవివేకతను దుర్బలత్వమును వేనోళ్ళఁ జాటుచుండెను. ఇదియె కుమారగిరిరెడ్డి యనంతరము రెడ్డిరాజులలో ముఖ్యముగా పెదకోమటి వేమారెడ్డికిని కాటయవేమారెడ్డికిని వివాదములు కలుగుటకును, కోమటి వేమారెడ్డి, కుమారగిరిరెడ్డి రాజ్యము నాక్రమించుటకును గారణమయ్యెను. తన పూర్వులవలెనె కుమారగిరిరెడ్డికూడ విద్యాభిరతి గలిగి విద్వాంసుల నాదరించి పోషించుటయేగాక తానును విద్వాంసుఁడై సంస్కృతభాషలో 'వసంతరాజీయ" మను పేరిట నాట్యశాస్త్రమును రచించినట్లు దెలియుచున్నది.

ఇతని మేనమరది కాటయవేముఁడును కాళిదాసకృతనాటకత్రయమునకు (అభిజ్ఞానశాకుంతలము, మాళవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయము) వ్యాఖ్య రచియించెను. ఈవ్యాఖ్యానములోఁ దఱచుగాఁ బలుతావుల వసంతరాజీయమునుండి ప్రమాణవాక్యములు గైకొనఁ బడుచువచ్చెను. కుమారగిరిరెడ్డికి వసంతరాజనం బేరుగలదుగావునఁ దత్కృతమైన నాట్యశాస్త్రమునకు వసంతరాజీయ మను పేరుగలిగినది. ఇపుడెచ్చటను దీనిపొడ గానరాదు. శాకుంతల వ్యాఖ్యయం దిట్లున్నది.

శ్లో. మునీనాంభరతా దీనాంభోజా దీనాంచ భూభుజామ్
శాస్త్రాణి సమ్యగాలోచ్య నాట్య వేదార్థ వేదినామ్
ప్రోక్తం వసంతరాజేన కుమారగిరి భూభుజానామ్నా
వసంతరాజీయ నాట్యశాస్త్రియ దుత్తమమ్.

వసంతోత్సవములతోడను, వేశ్యాంగనా నర్తనములతోడను ననవరతము భోగైకపరాయణుండై కుమారగిరినామమాత్రప్రభువై సింహాసన మధిష్ఠించియుండియు రాజ్యమును మఱచియుండఁగా మహాసమర్థుం డగు కాటయవేముఁడు రాజ్యమును నిరాటంకముగా సంరక్షించుచుఁ బరిపాలించుచుండెను.

మాళవికావ్యాఖ్యయం దిట్లున్నది.

శ్లో. భాగ్యం నామసమగ్రి మిద్భశమతి స్నేహైకపాత్రం యతో
వీరం కాటయవేమ ముద్ధత రిపుధ్వంసే నియుజ్యస్వయమ్

నిత్యం నందతివర్తతై రభినవైః కాంతై ర్వసంతోత్సవైః
సంతానాభ్యుదయైః కుమారగిరి భూపాలో నృపాలోత్తమః.

ఈవసంతభూపాలుని కొల్వుకూటమున లకుమాదేవి యను నొక వేశ్యాంగన సహస్రధా నాట్యాభినయంబుల నెఱపుచు నృత్యములు సలుపుచు వేలకొలది యర్థిజనంబులకు ధన మొసంగుచుండెడి దని యీక్రిందిశ్లోకము వలన విదిత మగుచున్నది.

శ్లో. జయతి మహిమా లోకాతీతః కుమారగిరి ప్రభో
స్సదసిల కుమాదేవీ యస్యప్రియా సదృశీప్రియా
నవమభినయం నాట్యార్థానాం తనోతి సహస్రధా
వితరతి బహూనర్థానర్థి ప్రజాయ సహస్రశః.

అవచి తిప్పయసెట్టి

ఆకాలమున వసంతోత్సవములు సలుపు నాంధ్రరాజులలో రెడ్డిరాజులు ముఖ్యులుగవాసికెక్కియుండిరి. వారిలో కుమారగిరిరెడ్డి విస్తరించి సలుపుటచే నాతనికి వసంతరాజను బిరుదమును స్థిరమై పోయినది. ఇక్కాలమున వీరమహేశ్వరాచార భక్తిపరుఁడై శివసాయుజ్యముఁ బొందిన కంచిచిఱుతొండ నంబివంశమున జనించిన యవచి దేవసెట్టి కుమారుఁడు తిప్పయసెట్టి కోటీశ్వరుఁడు కుమారగిరిరెడ్డికి మిత్రుఁడును, సచివుఁడును సుగంధ భాండాగారాధ్యక్షుఁడు నై యీప్రఖ్యాతవసంతరాయఁడు సలుపు ప్రతిసంవత్సర వసంతోత్సవములకు కస్తూరీకుంకుమఘనసారసంకుమదహిమాంబుకాలాగురుగంధసారప్రభృతి సుగంధద్రవ్యంబు లొడఁగూర్చుచు నెక్కువగాఁ దోడ్పడుచుఁ బ్రఖ్యాతిఁ గాంచినవాఁడు. ఇంతియగాక మఱియు నీతఁడు చీనిసింహళతవాయి హురుమంజిజలనోగిప్రభృతినానాద్వీపనగరాకరంబు లగు ధనకనకవస్తువాహనమాణిక్యగాణిక్యఁబులు తెప్పించుచు కొండవీటిసామ్రాజ్యాధిపతియగు కుమారగిరిభూపాలునకు మాత్రమెగాక విజయనగరసామ్రాజ్యాధిపతియగు రెండవ హరిహరరాయలకును, బహుమానీసుల్తానగు

ఫిరోజిషాహాకును వికర్రయించుచుండెడివాఁడు. ఇతనిమూలముననే మన కుమారగిరి కీర్తిలతాధిష్ఠితాష్టావశద్వీపాంతరాళుం డయినది. ఇట్లగుట చేతనే కుమారగిరి వసంతనృపాలునివలన నాందోలికాఛత్రచామరతు రంగాదిరాజచిహ్నములం బడసినవాఁడట. ఇతఁడు త్రిపురాంతకదేవ దివ్యశ్రీపాదపద్మారాధకుఁడై కవియై గమకనాదివాంశికవై తాళికాదు లగు నర్థిజనంబులకు నర్థంబులు గుప్పించు ధీరుండు, నుదారుండు, గంభీరుండు, సదాచారుండు నన విఖ్యాతిఁ గాంచినవాఁడట. ఇతని పితృపితామహులు, మాతామహులుగూడ నిఖిలలోకప్రసిద్ధవాణిజ్యవంశధరులుగాఁ బ్రసిద్ధిగాంచినవారేయట. అవచి తిప్పయస్థిరముగాఁ గొండవీట నిల్లుగట్టుకొని కాపురము చేయుచుండువాఁడుగాఁడు. వసంతోత్సవసమయములయందు ప్రతిసంవత్సరముఁ గొండవీటికివిచ్చేసి సుగంధిశాలను దెఱచి దానికధ్యక్షుఁడై వసంతభూపాలునకుఁ గావలసిన సుగంధిద్రవ్యంబు లొనగూర్చుచుండెడివాఁడు.

## బాలకవి శ్రీనాథునితోడి మైత్రి.

చిన్నాఁటి పొన్నాఁటి చిఱుతకూఁకటినాఁ డనఁగాఁ బదునాలుగేండ్ల ప్రాయముననే యప్రతిమాన ప్రతిభాశాలియై కవితావిద్య నలవఱచుకొని, ‘మరుత్తరాట్చరిత్రము’ రచించి కొండవీటను నొకింత పేరు మోసి క్రీ. శ. ౧౩౮౪ దవ సంవత్సరప్రాంతమున వసంతభూపాలుఁడు చేయు వసంతోత్సవసందర్భమున లక్ష్మీపుత్త్రుఁడయిన యావచి తిప్పయసెట్టి విద్వద్గోష్ఠినున్న కాలమునఁ గవిపండితబృందమునకుమ శారదావిగ్రహముంబోలి కూయుచుండి యనర్గళకవితాధారం బ్రవహింపఁజేయుచున్న బాలకవిని శ్రీనాథునిఁ గన్నుల గఱవుదీఱంగఁజూచు భాగ్యమాతనికి లభించి పరమానందభరితుఁడై యక్కవి సత్కారములఁ బూజించెను. నాటనుండి తిప్పయసెట్టికి బాలసఖుఁడుగనుండెను. కుమారగిరిరెడ్డి పరిపాలనముతో వసంతోత్సవములును గిసిపోయినవి. అవచి తిప్పయసెట్టి కొండవీటు

నకువిచ్చేయుభాగ్యముదొలఁగిపోయినది. కుమారగిరిరెడ్డిపరిపాలనము ముగియువఱకు శ్రీనాథునకు నిరువదేండ్లకు మించిన ప్రాయములేదు. పెదకోమటి మరణానంతరము శ్రీనాథుఁడు కాంచీనగరమునకుఁబోయి తిప్పయసెట్టిని సందర్శించినప్పుడు 'బాలసఖుం' డని ప్రశంసించుట యెంత స్వాభావికముగా సమంజసముగాఁ గన్పట్టుచున్నదో వేఱుగ నొక్కి వక్కాణింపవలయునా? కొదువవిషయములు హరవిలాసక రచనాప్రశంస సందర్భమున విస్తరింపఁ దలఁచి యిచ్చట విరమించుచున్నాను.

శ్రీనాథకవికిఁ గొండవీ డెప్పటినుండి నివాసముగనుండి యుండెనో చెప్పుటకుఁ గాని యూహించుటకుఁగాని యాధార మేమియుఁగానరాదు. అవచితిప్పయసెట్టివలెనె ప్రతిసంవత్సర వసంతోత్సవములకు వచ్చుచుఁ బోవుచుండెడి వాఁడని ప్రభాకర శాస్త్రిగారూహించినదానికాధార మేమియు వారుచూపింపరయిరి, పదునైదేండ్లప్రాయముననే శ్రీనాథుడు;

చ. అవనిపుఁడాదరించిన భటాళిభటత్వము వైద్యువైద్యమున్
గవికవితామహత్త్వమును గాయకుగానముఁ గోటిసేయున
య్యవనిపుఁ డాదరింపని భటాళి భటత్వము వైద్యువైద్యమున్
గవికవితామహత్త్వమును గాయకు గానము గవ్వ సేయునే.

అన్నట్టును, రాజాశ్రయములేక యశోధనములు సమకూఱనేర వని యాకాలమునఁ బెనుపుగల్గి రాజ్య మేలుచున్న స్వదేశప్రభువులగు రెడ్డిప్రభువులకై యప్పుడు రాజధానిగా నున్న కొండవీడుచేరి రెడ్డిమంత్రులును గార్యనిర్వాహకులు నగు నియోగిప్రముఖుల యాదరగౌరవములు వడయఁజొచ్చి తర్వాత రెడ్లయాస్థానమున విద్వత్కవి యయ్యెనని ప్రభాకరశాస్త్రిగారు వ్రాయుట, పిచ్చ కుదిరినది రోకలి తలకుఁ జుట్టుమన్నట్టున్నది. శ్రీనాథుని జన్మకాలము ౧౩౮౫గి అని మామిత్రు లగు శాస్త్రిగారు నిర్ధారణచేసియున్నారు. పదునైదేండ్లప్రాయమున అనఁగా ౧౪౦౦ సంవత్సరమున శ్రీనాథుఁడు రాజాశ్రయముకొఱకు కొండ

పీఠు చేరె ననుచున్నారు. ఈసంవత్సరముతో కుమారగిరిరెడ్డి పరిపాలన మించుమించుగాఁ దుదముట్టినదని వక్కాణింపవచ్చును. ఇంకొక విచిత్రమైన వ్రాఁతవ్రాసిరి. "కాటయవేమన క్రీ. శ. ౧౩౯౪ ప్రాంతముల రాజమహేంద్రవరము చేరినాఁడు. విద్యారసికుఁడగు కాటయవేమన నాఁకాలమం దీతఁడు దర్శించియుండవచ్చును. సకలవిద్యాసనాథుఁ డగుచున్న యీప్రతిభాశాలి నాతఁ డాదరించియు నుండవచ్చును" అని వ్రాసియున్నారు. అన్నఁగా శ్రీనాథుఁడు ౧౩౯౪ దవ సంవత్సరమున కాటయవేముని రాజమహేంద్రవరములో సందర్శించెననియు నంతకుఁ బూర్వము సందర్శించి యుండలేదని వారి భావమని స్పష్టపడుచున్నది గనుక ౧౪౦౦ వఱకుఁ గొండవీఁడు చేరలేదనుటగూడ వారియభిప్రాయ మైనట్లు విస్పష్టమగుచున్నది. మఱియుఁ దనకుఁ జేసిన మేలును, చూపిన యాదరణగౌరవములను నవసానకాలమునఁ గూడ మఱపింపఁ జేయక స్మరింపఁ జేయునట్టి తన మిత్రులను ప్రభుపుంగవుల నొక్కొక్కరినే తలంచుకొని శ్రీనాథుఁడు చెప్పినాఁడన్న పద్యములో "భాస్కరుఁడు మున్నె దేవుని పాలికరిగె" నన్న పాదములోఁ బ్రశంసింపఁబడిన భాస్కరుఁడు కాటయవేమునిమంత్రియగు రాయనిభాస్కరుఁడే యనియు నతఁడు శ్రీనాథున కాలంబముగా నుండె ననియు,

చ. కలయఁ బసిండి గంటమున గాటయవేమ సమక్షమందు స
త్ఫలముగ రాయనప్రభుని బాచఁడు వ్రాసిన వ్రాలమ్రోఁతలున్
గలుగలు గల్లుగల్లురనఁ గంటకమంత్రుల గుండెలన్నియున్
జలుజలు జల్లుజల్లురను సత్కవి వర్యులు మేలు మేలనన్.

అను చాటువు రాయనిభాస్కరునిపై శ్రీనాథుఁడు చెప్పినదేయని మా మిత్రులగు శాస్త్రిలవారు వ్రాయుచున్నారు. కాటయవేమారెడ్డి వంటి విద్వత్ప్రభువును, రాయనిభాస్కరునివంటి విద్వన్మంత్రిని రాజమహేంద్రవరమున విడిచిపెట్టి రాజాశ్రయమునకై, నియోగిప్రముఖుల యాద

రణగౌరవములఁ బడయుటకై యెక్కడనో దూరమున నున్న కొండవీటికిఁ గుమారగిరిరెడ్డి పాలనము క్రుంగిపోయిన కాలమున, అవచితిప్పయసెట్టి కొండవీడును వీడి వెడలిపోయిన కాలమున నేల కొండవీటికిఁ బోవలసిన వాఁడయ్యెనో యాశ్చర్యకరముగా నున్నది. వింతలలో వింతే మఱియొక్క వింత. "కాటయవేమన కొండవీట నున్న కాలముననే, కొమరగిరి జీవించియుండఁగనే శ్రీనాథకవిరత్నము కొండవీటికి వచ్చుచుఁ బోవుచునుండి యుండునని నాతలంపు." అని చదువరులకుఁ గాని చరిత్ర పరిశోధకులకుఁ గాని యెట్టి సంశయము పుట్టకుండ వలయునని యింకొక మాట విస్పష్టపఱచిరి. "దీని భావమేమి తిరుమలేశ!" అని ప్రశ్నింప వలసి వచ్చుచున్నది. పదునాలుగేండ్ల వయస్సునకుఁ బూర్వమే మరుత్తరాట్చరిత్రము రచించి ప్రఖ్యాతిఁ గాంచుటకుఁ బూర్వమే, మిక్కిలి బాలుఁడుగ నున్న శ్రీనాథ కవిరత్నము కుమారగిరిసలుపు వసంతోత్సవముల సందర్శించుటకై కొండవీటికి వచ్చుచుఁ బోవుచు నున్నవాఁడయినను కాటయవేమునను గాని వాని మంత్రియగు రాయని భాస్కరునిగాని సందర్శించుభాగ్యము పట్టలేదనియు, అట్టిభాగ్యము ౧౩౯౮ దవ సంవత్సరప్రాంతముల రాజమహేంద్రపురమున నాకవిరత్నమునకు లభించినదని మనము గ్రహింపవలయును. పదునైదేండ్లు నిండినవెనుక పెన్నిధులవంటి వారయిన కాటయవేమారెడ్డి, రాయనభాస్కరుల ప్రాపును విడనాడుకొని కుమారగిరి ప్రభుత్వమంతమునొంది కొండవీడురాజ్యము కల్లోలమై పెదకోమటి వేమారెడ్డి యాకల్లోలములో రాజ్యమాక్రమించుకొనఁబోవు కాలమున శ్రీనాథకవిరత్నము రెడ్లప్రాపునకై కొండవీడుచేరెనట! ఎంత చమత్కారమైనవిమర్శ! మామిత్రులవారు తమగ్రంథమునకు 'నేతిబీర' వంటిదని తమకుఁదామె చెప్పుకొన్న 'శృంగారశ్రీనాథ' మను పేరుపెట్టుటకంటె 'చమత్కారప్రభాకర' మను పేరుపెట్టియుండిన నెంతయు నొప్పియుండునుగదా.

ఆహా! హరవిలాసములోని 'బాలసఖుం' డను శ్రీనాథుని పదప్రయోగ మెట్టెట్టి మేధావంతులనయినను 'ఓంకాయపిచ్చికుండ' లని పిలచు చున్నదే!

శాలివాహన సప్తశతి.

నేలవిడిచిసాముచేయుటవలనఁ బ్రయోజనములేదు. బాల్యమున శ్రీనాథుఁడు కొండవీడుననే యుండెను. ఆకాలముననే కాటయవేమా రెడ్డి మంత్రియగు రాయనిబాచని ప్రాపునవర్ధిల్లుచుఁ బదునాలుగేండ్ల ప్రాయమువాఁడయియుండగా నవచితిప్పయసెట్టితోడిమైత్రిప్రారంభమై యైదాఱు సంవత్సరముల బాటు నడిచెను. కుమారగిరిచేయు వసంతోత్సవములును, తిప్పయసెట్టి వసంతోత్సములయందుఁ దనకవితాప్రజ్ఞా ప్రదర్శనమునకు మెచ్చి తనకుఁజేయు సత్కారములును శ్రీనాథకవి భావిజీవితమునకు నొకవింతశోభను గలిగించినవి.

ఈవసంతోత్సవములే యీకుమారగిరి జీవితమేమన బాలకవి శ్రీనాథుని శాలివాహన సప్తశతి' యను రసోత్తరశృంగార ప్రబంధము నునాంధ్రీకరింపఁబురికొల్పినది. ఈగ్రంథము ప్రాకృతభాషలో హాలుఁ డను నొక యాంధ్రరాజుచే వ్రాయఁబడినది. దీనికి 'గాథాసప్తశతి' యని నామాంతరముగలదు. ఇందు ౭౦౦ గాథలు గలవు. భావపూరిత ములయిన చిన్నపద్యములతోఁగూడియున్నది. ఇందులోకవృత్తమును దెలుపుగాథలు గొన్నియున్నను వివిధరీతులఁజమత్కరించి వివరించెడి వివిధనాయికా నాయకాదుల శృంగారవృత్తులను దెలిపెడిగాథలనేకము లందున్నవి. అయ్యవికథావస్తు సూత్రితములుగావు. అందుశృంగార రసము పొర్లిపోవుచుండుననుటకు లేశమాత్రమునుసందియములేదు. మన శ్రీనాథుఁడు నూనూఁగుమీసాల నూత్నయౌవనమున 'శాలివాహన సప్తశతినొడివితి' నని యీగ్రంథమును రచించినట్లు చెప్పుకొనియున్నాడు కనుక నీగ్రంథమును బదునెనిమిదేండ్ల ప్రాయమున రచించినాఁడని

మనమునిశ్చయింపవచ్చును. కాని యీగ్రంథమెవ్వని కంకితమీయఁబడి నదో తెలిసికొనఁదమన్న నాగ్రంథ మిప్పుడెచ్చటను గానరాదు.

శ్రీనాథునిసప్తశతిలోని యీక్రిందిపద్యము మాత్రమనేకలక్షణ గ్రంథములలో నుదహరింపఁబడియున్నది.

ఉ. నారణసేయదాపగొనవానవవారిజమందుఁ దేటిక్రొ
వ్వారుచుపుఁటనీవెఱుఁగవా ప్రియహాళెఱగంటి గంటికె
వ్వారికిఁ గెంపురాదు తగవామగవారల దూఱనీవిభుం
డారసి నీనిజంబెఱుఁగు నంతకు నఁతను నోర్వనెచ్చెలీ!

ఇట్టియపరూప మధురకావ్యరచనచే బదునెనిమిదేండ్లప్రాయము ననే యీతనికీర్తి దశదిశలవ్యాపించి దేశదేశములకు బ్రాకనారంభించి నది. ఎందరెందరో మహారాజుల యొక్కయు, ఎందఱెందరో మంత్రి పుంగవులయొక్కయు జిత్తముల నాకర్షింపఁగలిగినంతటి ప్రజ్ఞాధురంధ రుఁడయ్యెను. మనశ్రీనాథకవి పుంగవుఁడు.

ఆరాధ్యచరిత్రము—ప్రెగడనామాత్యుఁడు

శ్రీనాథకవి శాలివాహనసప్తశతికి వెనుక నారాధ్యచరిత్రము మొదలగు పెక్కుకృతులను రచించి ప్రెగడనామాత్యుని కంకితముచేసి యున్నట్టుగా శృంగారనైషధములోనిఁ జగమునుతింపఁగఁజెప్పితి, యను పద్యమువలనఁ దెలియుచున్నదని యీపద్యము నివివఱకె యుదాహ రించినాఁడను. ఈప్రెగడనామాత్యుఁడెవ్వఁడు? ఇతఁడు శృంగార నైష ధకృతి పతియగు సింగనామాత్యుని యన్నయని యిదివఱకెఱిఁగితిమి. ఇతఁడేయుద్యోగమునందుండెనో యీవివరముగూడ నాగ్రంథమునని క్రిందిపద్యములో సూచింపఁబడినది.

మ. తగుఁ గైవారమొనర్ప విక్రమకళాధౌరేయుఁ డా శాలిశ్రీ
ప్రెగడన్నధ్వజినీశుఁడంబునిధి గంభీరుండు శుంభద్ద్విష
న్నగర ద్వారకవాటనవిధాన ప్రౌఢబాహార్గళా
యుగళుండాహవ సవ్యసాచి ధరలో నొక్కండు పేరుక్కనన్.

అనిపరాక్రమవంతుఁడు, గంభీరుఁడు, శత్రుపురభేదకుఁడు, యు

ద్దదక్షుఁడు, బలమువిషయములోఁబొగడనర్హుఁడైనవాఁడు, దండనాథుఁడి తఁడొక్కఁడేయని చెప్పియున్నాఁడు. అనవేమాధిప రాజ్యభారభరణ వ్యాపార దక్షుఁడయిన పెద్దనామాత్యుని మూవురుపుత్రులయిన వేమ నామాత్యుఁడు ప్రెగడనామాత్యుఁడు, సింగనామాత్యుఁడునను వారిలో నీతఁడురెండవవాఁడు. వీరి తండ్రియుఁబినతండ్రులు ననవేమునికాలము వారు గనుక నీతఁడు కొండవీటి సామ్రాజ్యమును బరిపాలించు ననవేముని యన్నకుమారుఁడగు కుమారగిరిరెడ్డి పరిపాలనకాలమున నాసా మ్రాజ్యమున నొకదండనాథుఁడుగనుండెనని మనము స్పష్టముగాఁజెప్ప వచ్చును. మరియుఁ గుమారగిరిరెడ్డి తరువాత నాసామ్రాజ్యపరిపాలన మువహించిన పెదకోమటి వేమారెడ్డి పరిపాలనారంభ దశయందు గూ డదండనాథుఁడుగనుండి యాకాలమునజరిగిన నే యుద్ధములోనో వీరమ రణమునొందియుండవచ్చును. ఈప్రెగడనామాత్యుని ప్రేరేపణముచేత నేమనశ్రీనాథకవి 'శాలివాహనసప్తశతి' యను రసోత్తర శృంగారప్ర బంధమును రచించియుండును. అయ్యదికుమారగిరిరెడ్డికో,లేక యీప్రె గడనామాత్యునికో యంకితముగావించి యుండవలయునని యూహిం చుటకవకాశముగలదు. ఎట్లయిననాగ్రంథము ప్రెగడ నామాత్యుని, పెదకోమటి వేమారెడ్డిని నాకర్షించినదని చెప్పకతప్పదు. ఎందువల్లన నఁగాఁ బెదకోమటి వేమారెడ్డి క్రీ. శ. ౧౪౦౪వ సంవత్సరమున నీతనిఁద నసామ్రాజ్యమున విద్యాధికారిగ నియమించెను. శ్రీనాథ విరచితము లైన యారాధ్యచరితమాదిగాఁ బెక్కుకృతులను ప్రెగడ నామాత్యు డంకితమునొందెను. ఇంతియగాక పెదకోమటి వేమారెడ్డి హాలవిరచిత మైన సప్తశతి యేడునూర్ల గాథలలోను మిక్కిలిసారములయిన వాని నూరుగాథలనేఱి వ్యాఖ్యవ్రాసిసప్తశతీసారటీకవెల్వఱచి యున్నాఁడు. ఆవ్యాఖ్యాప్రారంభమున:—

శ్లో. హాలః ప్రాక్ సప్తశతీం గాథా కోటేర్వ్యధత్త సంప్రీతః
సోయం వేమ నృపాలస్తస్యా అపిశతక మాహరత్సారమ్

దీనిగద్యములో నిట్లున్నది

"ఇతిశ్రీపెదకోమటి వేమభూపాలేన కృతా సప్తశతీసారటీకా సమాప్తా॥"

దీనింబట్టి ప్రభాకరశాస్త్రిగారు సంశయించినట్లు (బహుశః) శ్రీనాథుఁడు తనసప్తశతిని నాతనికంకితముచేసి యుండవచ్చునని మఱికొందఱకుఁగూడఁ దోపవచ్చును. నాయూహ మఱియొకవిధముగాఁ బోవుచున్నది. రసవత్తరమైన శృంగార ప్రబంధమునంకితముఁబొందిన ప్రభువెవ్వరైననేమి? అతఁడు తద్గ్రంథరచనమునకుఁ బిమ్మట రాజ్యసంబంధమునఁ గలిగిన వివాదములలోఁ బెదకోమటి వేమారెడ్డికిఁ బ్రతిపక్షనాయకకోటిలోఁ జేరినవాఁడగుటచేతనే పెదకోమటి వేమారెడ్డి వానివలని స్పర్థచే సప్తశతీ సారటీకను వ్రాయసంకల్పించి యుండుననియు, ప్రెగడనామాత్యుని ప్రేరేపణముచేనీకార్యమునందు శ్రీనాథకవి యాతనికి దోడ్పడియాతని మనోరథమీడేర్చినవాఁడయి యుండుటచేతనత్యంతాభిమానముతోఁ బెదకోమటి వేమారెడ్డి కొండవీటి సామ్రాజ్యాధిపత్యము తనకు స్థిరపడినతరువాత ౧౪౦౪ లో నమ్మహాకవిని దన సామ్రాజ్యమున విద్యాధికారిగ నియమించి యుండునని నేను విశ్వసించుచున్నాను. విశ్వేశ్వరపండితుఁడాదిగా గలమహోద్దండ పండితులుండిన యాకాలమున సామాన్యముగా నిరువది నాలుగేండ్లప్రాయమువాని నామహోపదవియందుంచుట సంభవింపదని నాయభిప్రాయము. ఏకారణముచేతనైన నేమి తొలుదొల్త విశేషాభిమానముతోడఁ దగ్గిరకుఁ జేర్చుకొన్ని, తనకొల్వునువిడిచిపెట్టి మరల పోకుండ నట్లాతని మహోన్నతాస్థానమునఁగూరుచుండఁబెట్టు నదృష్ట మాకాలముననొక్క వేమారెడ్డికిమాత్రమె పట్టినది.

కుమారగిరిరెడ్డి రాజ్యావసానస్థితి.

కుమారగిరిరెడ్డికి వీరాన్నపోతరెడ్డి యను కుమారుఁడున్నట్లు దాక్షారామమునందలి యొక శిథిలశాసనములో 'శ్రీమత్కుమారగిరి

భూమిపతేః కుమారో వీరాన్నపోతనృపతిః' అన్నవాక్యము మాత్రము గన్పట్టుచున్నందున వీరుఁడైన యనపోతరెడ్డి యను కుమారుఁ డున్నటులు గన్పట్టుచున్నది. కుమారగిరిరెడ్డి మరణానంతరము వీనికుమారుఁడైన యనపోతరెడ్డి రాజ్యమును బొందవలసినవాఁడై యుండఁగాఁ బెదకోమటి వేమారెడ్డి రాజ్యమాక్రమించుకొని పరిపాలనము చేసినట్లు గానంబడుచున్నది. 'వీరాన్నపోతనృపతిః' అనుటచేత నితఁడు కేవలము బాలుఁడుగా నుండువాఁడు గాక వీరుఁడనియు, నృపతియనియు, బ్రస్తావింపఁబడియున్నాఁడు. కావున నితఁడే మొదట రాజ్యమును బొందియుండును. కాని సామ్రాజ్య మీతనికి నిలిచియుండలేదు. రాజ్యము పెదకోమటివేమారెడ్డి పాలయ్యెను. ఇతఁడు బలాత్కారముగా రాజ్యమాక్రమించుకొనుటకుఁ దగినహేతువు గానరాదు. కుమారాన్నపోతరెడ్డి యెవరితోడనైన యుద్ధములోనో మరణముఁ జెంది యుండవలయును. అట్టియుద్ధము రాచకొండరాజ్యాధీశులగు పద్మనాయక వెలమదొరల తోడ ధరణికోటసమీపమున జరిగియుండవలయును. ఆయుద్ధములోఁ గుమారాన్నపోతరెడ్డి మృతినొందఁగాఁ గొండవీటిరాజ్యము కాటయవేమారెడ్డి యాక్రమించునేమో యన్నభయముచేత బ్రోలయవేమారెడ్డి యన్నయగు మాచారెడ్డిమనుమఁడు పెదకోమటివేమారెడ్డి, దండనాయకులును, నియోగిప్రముఖులునైన మామిడి వేమనామాత్యుఁడు, ప్రెగడనామాత్యుఁడు, సింగనామాత్యుఁడు మొదలగువారి తోడ్పాటున నాక్రమించుకొని యుండును. ఏతత్కారణము మూలముననే గాటయవేమారెడ్డి రాజమహేంద్రపురరాజ్యమును స్వతంత్రరాజ్యముగాఁ బ్రకటించియుండును. ఈరాజ్యమును కుమారగిరిరెడ్డి తనకిచ్చినవాఁడని చెప్పిన విషయ మప్పటినుండి చెప్పుకొనుట తటస్థమగుటచేత కాటయవేమారెడ్డిభార్య మల్లాంబ తొత్తరమూడి శాసనమున నట్లు వ్రాయించియుండును. రాజమహేంద్రపురము కొండవీటి సామ్రాజ్యములోనిదే గనుక

రాజమహేంద్రపురరాజ్యమునకుఁ గూడఁ దానే హక్కుదారుఁడనని పెద కోమటి వేమారెడ్డి ప్రకటించియుండును. ఏతత్కారణమువలన బెదకోమటి వేమారెడ్డికిని, కాటయవేమారెడ్డికిని మనస్పర్థలు పుట్టియుండును. కాటయవేమారెడ్డి పక్షమున ననవేమారెడ్డి మనుమరాలిపెనిమిటియైన అల్లాడ రెడ్డి రాజమహేంద్రపురపాలకుఁడుగా నుండి కాటయవేమారెడ్డి పక్షమాననుండి రాజమహేంద్రపురము పెదకోమటి వేమారెడ్డికి స్వాధీనముగాకుండఁజేసెను. కాని కుమారగిరిరెడ్డి కొడుకయిన యనపోతరెడ్డిని జంపి పెదకోమటి వేమారెడ్డి యన్యాయముగాఁ గొండవీటిసామ్రాజ్యమాక్రమించినాడని నేనూహింపఁజాలను. ఏమయిననగుఁగాక కొండవీటిసామ్రాజ్యము కుమారగిరి మరణముతో రెండుగాఁజీలిపోయినదనుట వాస్తవము. కాటయవేమారెడ్డియుఁ బెదకోమటి వేమారెడ్డియు గూడ సమర్థులును, విద్వాంసులును, బలవంతులునై యుండుటచేత రెండురాజ్యములును మఱికొంతకాలము స్థిరపడియుండుట కవకాశముగలిగినది. పెదకోమటి వేమారెడ్డి రాజ్యపరిపాలన ప్రారంభకాలమున నాతనికిఁ గొన్నిచిక్కులు గలిగియున్నట్టుగా నీక్రిందిచాటువువలన గూడ నూహింపఁదగును.

సీ. ఆచెంపనుద్దండ (?) అనవేమపురమను
        గ్రామంబు తోరణకట్టిరేని
ధరణికోటనుగల్గు ధనధాన్యవస్తువు
        లరికట్టుకొని చూఱలాడిరేని
మునుకొనియభిమాన ముద్దభక్షింపంగ
        సారెకుఁజేతులు సాచిరేని
అభ్యంగనము సేయ నన్నగారికిఁ దెచ్చు
        నూనెలోఁ జేతులు నాటిరేని
కణఁగి శత్రులు చేయునఘాత్యమునకు
నోర్చియుంటివి నీసాటియుర్విగలఁడె
సమదరిపువీర! రాయవేశ్యాభుజంగ!
అతులబలభీమ! పెదకోమటన్నవేమ

ఈపద్యమున కర్థసందర్భము సరిగా నూహింపనలవిగాక యున్నది. ఎవ్వియో కొన్ని చిక్కులు గలిగినవని మాత్రము సూచించును.

పెదకోమటివేమభూపాలుఁడు. (౧౪౦౦ మొదలు ౧౪౨౦ వఱకు)

ఇతఁడు పూర్వరాజమార్గానుసారముగా ధరాపాలనము గావించి తన జీవితకాలమునంతయు విద్వద్గోష్ఠులతోఁ గడపి చిరయశము సంపాదింప సంకల్పించుకొని కొండవీటిసామ్రాజ్యమున శాంతి ప్రబలి యుండుటకై మూఁడు సంవత్సరములు తన శక్తియుక్తులను ధారపోసి సమర్థుఁడై ప్రజ్ఞావంతుఁడై, భూరిపరాక్రమమున వైరివీరుల ఘోరసంగ్రామముల నోడించి వీరనారాయణ బిరుదాంచితుఁడై సఫలీకృతమనోరథుఁ డయ్యెనని చెప్పవచ్చును. ఆకాలమున నీతని పరాక్రమఘాటి యెట్లుండెనో యీక్రింది శ్రీనాథుని చాటువువలన సువ్యక్తము కాఁగలదు.

"సీ. కపట కంఠీరవాకార నారాయణ
క్ష్మాశానినాదంబుఁ గేలిసేయు
కల్పాంత దుర్దాంత కాలభైరవభేరి
ఢమరుకోన్మాదం బడంగఁజేయు
ప్రళయకాలాభీల పటుఘోరనిర్ఘాత
పటపటారావంబుఁ జటులపఱుచు
కహనా మహాకాల కోలాహలోత్తాల
పాతాళినినదంబు భంగపఱుచు
గీ. గండుమెఱసిన రిపుకోటి గుండెలవియఁ
జండగతిమ్రోయు నీరణోద్దండభేరి
జయరమాసంగ రాజవేశ్యాభుజంగ
అతుల బలధామ! పెదకోమటన్న వేమ!"

పెదకోమటివేముని విద్యావైభవము.

పెదకోమటివేముఁడు బాల్యమునుండియు సంస్కృతాంధ్రముల విశేషముగాఁ గృషిచేసి యపారమైన పాండిత్యమును గూడ సంపా

దించినవాఁడుగావున నప్రతిమానప్రతిభాఖ్యుఁడై శ్రీనాథుని నన్యనృప తుల పాలికరుఁగకుండఁ జేసి తనకడ నుంచుకొని యనుదినము నఖిల పురాణవిద్యాగమనూల నతనివలన వినుచు దేశమున శాంతి నెలకొల్పిన పిమ్మట యార్యవిద్యలఁ బోత్సహించి వర్ధిల్లఁ జేయుటకై ౧౪౦౪ గ వ సంవత్సరమున నాతని విద్యాధికారిపదవియం దుంచెను. ఈకాల ము శ్రీనాథుని యుచ్చదశకుఁ బ్రారంభమని చెప్పఁదగును.

ఈసంవత్సరమునఁ బెదకోమటివేముఁడు చేసిన దానములను గూర్చి చేసిన శాసనములు గొన్ని గన్పట్టుచున్నవి. వానిలో మొద టిది కుఱునూతుల శిలాశాసనము. దీనిలో నెఱపురీదాశరధికి కుఱు నూతుల గ్రామమును దానముచేసినట్లు చెప్పఁబడినదిగాని యందు శ్రీనాథుని పేరుగానరాదు* ఈశాసనమునాటికి శ్రీనాథుఁడు విద్యాధి కారిపదవిని బొందియుండలేదు. రెండవది పొన్నుపల్లి తామ్రశాసనము ఈశాసనము చివర శ్లోక మిట్లున్నది.

"విద్యాధికారీ శ్రీనాథోవీర శ్రీవేమభూపతేః
అకరోదాకరో 'వాచాం నిర్మలం ధర్మశాసనం."

అని యుండుటచేత ౧౪౦౪ సంవత్సరమునుండి విద్యాధికారిగ నుండె ననుట స్పష్టము. శ్రీనాథుని ప్రతిభాప్రఖ్యాతికిఁ బెదకోమటివేముని విద్యారసికత తోడ్పడి యుభయుల యశమ్మును నాంధ్రప్రపంచమునం దంతటను వ్యాపించునట్లు చేసినది. విద్యాధికారపదవి సామాన్యమైనది కాదు. రాజసందర్శనార్థము శ్రోతులు, వేదవిదులు, షట్తర్కములు

*ఈశాసనము ప్రభాకరశాస్త్రిగారి గ్రంథమున నుదాహరింపఁబడినది. అం దిట్లున్నది.

శ్లో. మహారాజస్సోయం రసకరహుతాశేందుగణితే
శకాబ్దే శ్రావణ్యాం శశభృదుపరాగే ప్రకటితే
వరంపేత్రక్షాపాదెఱ (విర) పురీదాశరథయే
వరంగ్రామం కుఱున్నూతురితి సమాఖ్యా ముపగతమ్."

నెఱింగినవారు, నాయుర్వేద మభ్యసించినవారు, దైవజ్ఞశిఖామణులు, వైయాకరణులు మొదలగువా రెందఱెందరో సత్కారములం బడయ వచ్చుచుందురు. వారి యర్హతానర్హతల నిర్ధారించుట కాయాపండిత ప్రకాండులతోడ సంభాషించినంగాని దేటపడునదికాదు. అట్లు సంభాషించుట కాయా విద్యలయందుఁ బ్రవేశము గలవారికిమాత్రము సాధ్య మగునుగాని తదితరులకు సాధ్యముకాదు.

అట్టి సామర్థ్యము, ప్రతిభ, యోగ్యత శ్రీనాథునియందుఁ గల వను విశ్వాసముతోనే వయస్సునఁ జిన్నవాఁ డని యెఱింగియుండియుఁ బ్రభువు వానినే యామహోత్సవపదవి నధిష్ఠింపఁ జేసెను. కనుకనే శ్రీనాథుఁడు గడు సామర్థ్యముతో నాపదవి నిర్వహించి యావిద్యాపీఠమున కధిక గౌరవము గలుగఁజేసి చిరకీర్తిని గడింపఁ గలిగెను. భీమేశ్వరపురాణకృతిపతియగు బెండపూడి అన్నమాత్యుఁడు;—

"భాషించినాఁడవు బహుదేశబుధులతో
విద్యాపరీక్షణవేళలందు
వెదచల్లినాఁడవు విశదకీర్తిస్ఫూర్తి
కర్పూరములు దిశాంగణములందు."

అని తన్నుఁగూర్చి ప్రశంసించినట్లుగా శ్రీనాథుఁడు తన గ్రంథమునం జెప్పుకొనఁ గలుగుట సంభవించినది.

## సర్వజ్ఞ చక్రవర్తి.

పెదకోమటి వేమభూపాలుని యాస్థానంబున సకలవిద్యాసనాథుఁడైన శ్రీనాథుఁడు విద్యాధికారిపదవియందును, అభినవ భట్టబాణ బిరుదాంచితుఁడగు వామన భట్టాస్థాన కవిపదవియందును, ప్రతాపగుణ భూషణుండును, పరిణతార్థ సంభాషణుండును, వితీర్ణ మహిమార్ణవుండును, విభవయోగ సంక్రందనుండును, పంచాగ స్థిరమంత్రి రక్షణా కళాప్రౌఢుండును, యవనాధీశ సభానిరంకుశ వచోవ్యాపార

పారంగతుండును, మహాసామ్రాజ్య రత్నామణియు నగు సింగనామా త్యుఁడు ప్రధానమంత్రిత్వ పదవియందును, నున్నవారని తెలిసికొన్న ప్పుడు పెదకోమటి వేమభూపాలుఁడు మహాపండితుఁడు. మహారసికుఁ డునై యుండునని తెలిసికొనకమానము. అందుచేతనే కాఁబోలు పెద కోమటి వేమభూపాలునకు శ్రీనాథునివంటి విద్వాంసులచే 'సర్వజ్ఞచక్ర వర్తి' యను బిరుదమీయఁబడినది. అభినవ భట్టబాణబిరుదాంచితుఁ డగు వామనభట్టుకూడ తానురచించిన వీరనారాయణ చరిత్రమను నా మాంతరముగల వేమభూపాల చరిత్రమను. సంస్కృత కావ్యమునఁ బెదకోమటి వేమభూపాలుని 'సర్వజ్ఞ చక్రవర్తి'యని ప్రశంసించినాఁడు. శ్రీనాథుని శాసనకృతులందుఁగూడ-

"చూడామణిర్నృపాణాం
దుర్మదపరిపంథి శిఖరిదంభోళిః
సర్వజ్ఞ చక్రవర్తీ
పెదకోమటి వేమభూపతి ర్జయతి."

అని పేర్కొనబడి యుండుటయు నిందుకుఁ బ్రమాణములుగఁ జూప వచ్చును.

శృంగారదీపిక.

సప్తశతీసారటీకగాక 'శృంగారదీపిక' యను పేరిట శృంగారకావ్య మగు నమరుశతకమునకు నొక జగత్ప్రసిద్ధమైన వ్యాఖ్యరచియించెను. ఎన్నివాఖ్యలు విరచింపఁబడినను, వానికంటెను వీనివ్యాఖ్యకే ప్రచార మెక్కువగాఁగలదు. ఇయ్యది విస్తరింపఁబడి చక్కఁగా వ్రాయఁబడినది.

శ్రీనాథకవి ప్రణీతమైన ఫిరంగిపురశాసనకృతిలోని రెండుశ్లోక ములు శృంగారదీపిక యందుండుటచేతను, శృంగారదీపికలోని మఱి యొకశ్లోకము శ్రీనాథకవి ప్రణీతమైన పొన్నుపల్లిశాసన కృతియందుం డుటచేతను శృగారదీపిక శ్రీనాథవిరచితమై యుండునని కొందఱు తలం తురుగాని యీరచనమున శ్రీనాథకవి వేమభూపాలునకు నెక్కువగఁ

దోడ్పడి యుండవచ్చును. అట్లుకాదేని పీఠిక భాగమును మాత్రము శ్రీనాథకవి రచించి యుండవచ్చును.*

వీరేశలింగముగారు తమ కవులచరిత్రములో "ఈ పెదకోమటి వేమభూపాలునియొద్ద శ్రీనాథుఁ డాంధ్రకవిగాను, పార్వతీపరిణయమును రచియించిన వామనభట్టు సంస్కృతకవిగాను ఉండిరి. వామనభట్టు సంస్కృతమున వేమభూపాలీయమను పేర నీతని గూర్చియే యొక వచనకావ్యమును రచియించెను. వేమభూపాలీయమునందు వామనభట్టీతనిని సర్వజ్ఞచక్రవర్తినిగాను ఈతని పూర్వులను మహాచక్రవర్తులను గాను పొగడెను. వేమభూపాలునకుఁ దాను గ్రంథభర్తయగుట కంటె గ్రంథకర్తయగుటయం దెక్కువ యిష్టముగలిగి యుండినట్లు

* "రాజ్యం వేమస్సచిరమకరోత్ ప్రాజ్య హేమాద్రిదానో
భూమి దేవైర్భువ మురుభుజో భుక్త శేషామభుఙ్క్త,
శ్రీశైలాగ్రాత్ ప్రభవతి పథి ప్రాప్త పాతాళగఙ్గా
సోపానాని ప్రమదపదవీరుమాయుక్షుశ్చకార.
మాచక్షోణిపతి ర్మహేంద్ర విభవో వేమక్షితీశాగ్రజో
హేమాద్రేః సదృశో బభూవ సుగుణైస్తస్య త్రయో నందనాః
కీర్త్యాజాగ్రతి రేడిపోత నృపతి శ్శ్రీకోమటీంద్రస్తతో
నాగక్ష్మాపతి రిత్యుపాత్త వపుషో ధర్మార్థ కామా ఇవ."

శృంగారదీపికలోని పైరెండు శ్లోకములు ఫిరంగిపుర శాసనములలోఁ గలవు. పైరెండు శ్లోకములు మాత్రమె గాదు. శృంగార దీపికలోని:—

"వేమాధిపో మాచవిభుశ్చ నందనౌ
శ్రీ కోమటీన్ద్రస్య గుణైకసంశ్రయౌ
భూలోక మేకోదరజన్మ వాఞ్ఛయా
భూయోవతీర్ణౌ వివరామ లక్ష్మణౌ"

అను శ్లోకముగూడా శ్రీనాథకవివిరచితమైన పొన్నుపల్లిశాసనమునందు గలదు. కాఁబట్టి అమరు వ్యాఖ్యాన పీఠిక భాగమును మాత్రము శ్రీనాథకవి రచించి యుండవచ్చునని, యుఅమరు కావ్యవ్యాఖ్యను మాత్రము పెదకోమటి వేమభూపాలుఁడే రచించి యుండుననియు విశ్వసింపవచ్చును.

గన్పట్టుచున్నది. వేమభూపాలుఁడు సంస్కృతాంధ్రములయందు మంచి పాండిత్యము కలవాఁడయినట్టు చెప్పుచున్నారు. అమరుకమను శృంగారకావ్యమునకు సంస్కృతమున శృంగారదీపికయను వ్యాఖ్యానము నీతఁడు రచించెను. ఈగ్రంథరచనమునందు శ్రీనాథవామనభట్టు లీతని సహాయులుగా నుండినట్టు కొందఱును శ్రీనాథుఁడే గ్రంథమునంతను వేమభూపాలుని పేరు పెట్టి రచించెనని కొందఱును చెప్పుచున్నారు. శ్రీనాథుని శాసనములలోని శ్లోకములే భేదమించుకయులేక సరిగా నిందుఁ గనఁబడుచున్నందున శ్రీనాథుఁడే శృంగారదీపికను రచించియుండును." అని యొకవిచిత్రవైఖరి నవలంబించి స్వాభిప్రాయమును వెల్లడించిరి ఈపెదకోమటి వేమభూపాలుని సర్వజ్ఞచక్రవర్తియని పొగడినది వామనభట్టు మాత్రమె గాక శ్రీనాథకవికూడ పొగడియున్నవాఁడని పొన్నపల్లిశాసనములోని,

"చూడామణిర్నృపాణాం దుర్మదపరిపంథి శిఖరిదంభోళిః
సర్వజ్ఞచక్రవర్తీ పెదకోమటి వేమభూపతిర్జయతి."

అను చరణములే వేనోళ్ళఁ జాటుచున్నవి.

శ్రీవీరేశలింగముగారు "బేతాళనాయనికి నేఁడవతరమువాఁడు సర్వజ్ఞసింగమనాయఁడగుటకు సందేహము లేదు; రసార్ణవసుధాకరాది సంస్కృతగ్రంథములను రచియించినవాఁ డతఁడే యగుటకును సందేహము లేదు." అనియు, "ఎట్లువచ్చినను పదవతరమువాఁడైన యీ సింగభూపాలుఁడు పాండిత్యప్రభావముచేతనుఁ పండితజనసమాదరణముచేతను కావ్యప్రియత్వముచేతను సర్వజ్ఞనామమున కర్హుఁడైనట్టు కనుపట్టుచున్నాఁడు" అనియు, "ఇద్దఱును విద్వాంసులు కావచ్చును ఇద్దఱును కృతిపతులు కావచ్చును; ఇద్దఱును సర్వజ్ఞబిరుదాంచితులు కావచ్చును" అనియు, "మొదటిది రసార్ణవసుధాకరము; రెండవది చమత్కారచంద్రిక; మొదటిది సింగభూపాల విరచితము; రెండవది సింగ

మభూపా లాంకితము" అని వ్రాయుటకు నేవిధమైన సందేహమును బొందియుండలేదు. కాని పెదకోమటివేమభూపాలునిగూర్చి వీరికన్నియు సందేహములే తోఁచుచున్నవి. వీరు రసార్ణవసుధాకరగ్రంథమును బఠించియున్నయెడల నింతసాహసముతోఁ బైవాక్యములను రచించియుండరు. పదవతరము సింగమనాయఁడు పాండిత్య ప్రభావముచేతను, పండితజనసమాదరణచేతను కావ్యప్రియత్వముచేతను, సర్వజ్ఞనామమున కర్హుఁడైనట్లు గన్పట్టునప్పుడు పెదకోమటి వేమభూపాలుఁడు పైహేతువులచేత సర్వజ్ఞచక్రవర్తి బిరుదమున కర్హుఁడైనట్లు ఏలగన్పడకుండెనో చెప్పిన బాగుండునుగదా! రసార్ణవసుధాకరగ్రంథమును సింగమనాయకుఁడు రచించెనని చెప్పుటకు సందేహములేదు గాని పెదకోమటివేమారెడ్డి శృంగారదీపికను రచించెననుటకు సందేహము కలుగుచున్నదఁట!

## సాహిత్యచింతామణి

ఇయ్యది యలంకారశాస్త్రగ్రంథములలోఁ బేర్కొనఁ దగిన యుత్కృష్టగ్రంథ మని ప్రభాకరశాస్త్రిగారు తెలుపుచున్నారు. ఈగ్రంథమును నేను జూచినవాఁడను గాను. కావున దీనింగూర్చి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన వాక్యములనే యిట నుదహరించుచున్నాను. "ఈగ్రంథము కావ్యప్రకాశమువంటిది. ప్రతాపరుద్రీయవ్యాఖ్యాత కుమారస్వామి సోమపీథి దీని నుదాహరించినాఁడు. మహిమభట్టు ననుమానము నిది ఖండించును. ధ్వన్యాలోకాదుల నిది పరామర్శించును. అమరుశతక శ్లోకములు పెక్కు లిందుదాహరింపఁబడినవి. మఱియు ననేక ప్రాచీనగ్రంథములలోని శ్లోకము లుదాహరింపఁబడినవి. 'యథామమైవ బాణే' అనియు, 'యథామమైవకావ్యే వీరనారాయణచరితే' యనియుఁ బెక్కుశ్లోకము లుదాహరింపఁ బడినవి. పెదకోమటివేమకృతు లగు నాగ్రంథము లిప్పుడు తెలియరావు. వామనభట్ట బాణునికృతి వీరనారాయణచరితమను గద్యగ్రంథము గలదు.

కాని యిం దుదాహరింపఁబడినది గద్యగ్రంథముగాదు. శ్లోకరూప మగు కావ్యము. ఎడనెడ వీరనారాయణ పెదకోమటివేమభూపాల ప్రశస్తిప్రస్తావశ్లోకములు పెక్కు లుదాహరింపఁబడినవి. వీరనారాయణుఁడే గ్రంథకర్తయగునప్పుడు తనపొగడ్తకు, దానే పాల్పడినవాఁ డగును. సమ్మానార్థమై వేమభూపాలు నాస్థానమునకువచ్చిన యనేక కవీశ్వరులు చెప్పిన ప్రశంసాశ్లోకముల నిందు దాహరించుకొన్నాఁ డేమో? ఆయా యలంకారాదులకు లక్ష్యముగాఁ బ్రియత్నపూర్వకముగా రచియింపఁబడినవిగాలే వాశ్లోకములు. ప్రతాపరుద్రీయ రసగంగాధరాదులందలి శ్లోకము లట్టివి."

ప్రభాకరశాస్త్రిగా రూహించినట్టు తనయాస్థానమునకు విచ్చేసిన కవీశ్వరులు తన్ను గుఱించిచెప్పిన శ్లోకములం దుదాహరించుకొని యుండుననుట పాటింపవలసియుండును. మఱియు సాహిత్యచింతామణిలోని శ్లోకముల మఱికొన్నిటి నుదాహరించి యయ్యవి శ్రీనాథునికృతులయందుఁ గన్పట్టుచున్నవని ప్రభాకరశాస్త్రిగారు తెలుపుచున్నారు. కాని యలంకారగ్రంథములలో లక్ష్యములుగాఁ గైకొని చూపఁబడినవానిఁబట్టి గ్రంథకర్తృత్వమును నిర్ణయింపఁబూనుట న్యాయ్యముగాఁ గనుపట్టదు. సాహిత్యచింతామణిలోని:

శ్లో. ఆటోపాయసటన్మహోనట జటాసంఘాట శృంగాటక
క్రోడాఘాటకరోటకోటర కుటీవాచాట వీచీఘటా
ఆస్తుస్వస్త్రటినీ వికంకట తటీవాటీకవాటీభవ
ల్లాటీకోటి లలాటపాటల సటాపాటల్య సాటచ్ఛరీ.

అను నాటోప పదారంభముగల పద్యములు శ్రీనాథునివి పెక్కులు గలవు. భీమఖండమందలి యీక్రిందిపద్యమున నొక సమానపదము మీఁది శ్లోక మందలిదే కలదు.

శా. ఆడంబరాండవమార్భటీ పటుహాలీలాటోప విస్ఫూర్జిత
క్రీడాడంబర ముల్లసిల్ల గరళగ్రీవుండు జూటాటవీ

క్రీడాఘాటిక ఘోటికోటర కుటీకోటీలుఠత్సైంధవీ
చీడోలాపటలీ పరిస్ఫుట తరస్ఫీతధ్వని ప్రౌఢిమన్.

అని యుదాహరించుటయెగాక ప్రభాకరశాస్త్రిగారు

వాణీనఖముఖముఖరిత వీణామాధుర్యధుర్యవాగ్వృత్తిః
ధ్వన్యర్థధ్వన్యర్థధ్వన్యః పెదకోమటి వేమభూపతిర్జయతిః॥

అను శ్లోకమును, హారవిలాసమునందలి:

క. వాణిజ్యచణుసకేత
ర్వాణిప్రస్తూయమానవాగ్విభవునకున్
వాణీనఖముఖముఖరిత
వీణావిక్వాణనిభ కవిత్వఫణితికిన్.

అను పద్యముతోఁ బోల్చి చదువుకొనుఁ డని వ్రాయుచున్నారు. ఇదంతయు సత్యమేకాని వేమభూపాలునిగూర్చిన-యిట్టి ప్రశస్తిప్రస్తాపనశ్లోకములను శ్రీనాథాదు లీగ్రంథరచనయందు వేమభూపాలునికిఁ దోడ్పడినవా రగుటచేత ప్రఖ్యాతములైన యాశ్లోకములనందుఁ జేర్పించియుందురు. అంతియగాని తానే రచించితినని లోక మనుకొనవలయునను తలంపుతో కోమటివేముఁడు వానిని తన సాహిత్యచింతామణి యందుఁ జేర్చియుండఁడనియే నా యభిప్రాయము.

ఇంతియగాక పెదకోమటివేమభూపాలుఁడు సంగీతచింతామణి మఱియొకగ్రంథమును రచించెననియు నయ్యది తిరువనంతపుర ప్రాచ్య లిఖితపుస్తకభాండాగారమున నున్నదనియుఁ దత్పుస్తకపట్టికలో పేరును మాత్రముచూచినానని వారె తెలుపుచున్నారు.

### శృంగారనైషధరచనాకాలము

ఆంధ్రభాషలో రచింపఁబడిన యుత్తమ ప్రౌఢకావ్యములలో శ్రీనాథుని శృంగారనైషధ మొకటిగాఁ బరిగణింపఁ బడుచున్నది. 'కాశీఖండమయఃపిండం నైషధమ్ విద్వదౌషధమ్' అని విద్వాంసులు గొనియాడుచుందురు. శ్రీనాథుఁడు దీనిలో మొదట "సంతరించితి నిండు జవ్వనంబునందు హర్షనైషధకావ్యమాంధ్రభాష" నని నైషధమును

నింతుజవ్వనమున రచియించినట్లు చెప్పియున్నాఁడు. నిండుజవ్వన మనఁగా ముప్పది మొదలు ముప్పదియైదు సంవత్సరములవఱకు నని చెప్పవచ్చును. అట్టికాలమున శ్రీనాథుఁడు శృంగారనైషధమును రచించెను. ఈయుత్తమ కావ్యమును కొండవీటి ప్రభువైన శ్రీపెదకోమటి వేమభూపాలుని ప్రధాన మంత్రియగు మామిడి సింగనామాత్యున కంకితము గావించెను.*

ఈసింగనామాత్యునికిఁ దాతయగు మామిడన్న భారద్వాజ గోత్రుఁడై, పెదతూర్కనమంత్రికి మనుమఁడై, విక్రమపురిసింహాసనాధ్యాసియైన చిటిపెద్ద ప్రభునకుఁ గుమారుఁడై యధికవిమలశివాచార తత్పరుఁడై బంధురతూమహనీయసంపదచే విలసిల్లుచు ధర్మశీలుఁడై అక్కాంబికయందు వంశపావనులైన నల్వురుపుత్త్రిలను బడసియుండెను. వారలలో నగ్రజుఁడైన పెద్దనామాత్యుఁ డపవేమాధిపు రాజ్యభార భరణవ్యాపారదక్షుఁడై యుండెను.

ఈ యమాత్యశేఖరునకు వీరభద్రామాత్యుఁడు మారనామాత్యుఁడు, నామామాత్యుఁడు నను ప్రసిద్ధులైన మువ్వురు తమ్ములు వివిధకార్యకరణదక్షులై యన్నకు విధేయులై యొక్కొక్కఁ డొక్క విషయంబునఁ బ్రజ్ఞాఢ్యులై యుండిరని నైషధములోని పద్యములను నింతకుఁబూర్వము చూపియున్నాను.

ఈ పెద్దనామాత్యుఁడు గౌతమగోత్ర విఖ్యాతుఁడును ఆపస్తంబ సూత్రపావనుఁడును, నగు శ్రీకేతనామాత్య శేఖరునకుఁ బుత్త్రిఁడై చౌహత్తమల్లుండు, చౌహత్తనారాయణుండు ఖండియరాయండు, నను బిరుదములచే దనరినట్టి యల్లాడమంత్రికి మహితపుణ్యయగు నన్న

* శ్రీనాథుఁడు శృంగారనైషధమును రాజమహేంద్రవరము నేలిన వేమారెడ్డి మంత్రి మామిడి సింగనార్యునకు అంకితము చేసెనని బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు తమ సర్వంకషావ్యాఖ్యాసమేత ముద్రిత శృంగారనైషధగ్రంథావతారికలో వ్రాసినది పొరబాటు.

మాంబయందు జనించిన తల్లమాంబిక నుద్వాహమై వేమనామాత్యుని ప్రెగడనామాత్యుని, సింగనామాత్యుని గనియెను. ఈ కడపటివాఁడైన సింగనామాత్యుఁడే త్రిభువనరాయ వేశ్యాభుజంగుఁడనియు. కదనగాండీవియనియు, జగనొబ్బగండఁడనియు మొదలు గాఁగల పెక్కు బిరుదములను వహించి వేమక్షితిపాల రాజ్యవిభవకళారత్నమణియై విమలతరమైన తన కీర్తి నాల్గుదెసల వ్యాపింపఁజేసి మిక్కిలి వాసిగాంచినవాఁడని యీక్రింది పద్యమువలనఁ దేటపడఁగలదు.

సీ. తనకృపాణము సముద్ధతవైరి శుద్ధాంత తాటంకముల కెగ్గుదలఁచుచుండఁ
దనబాహుపీఠంబు ధరణిభృత్కమఠాహిసాముజంబులకు విశ్రాంతి యొసఁగఁ
దనకీర్తి నర్తకి ఘనతరబ్రహ్మాండ భవనభూముల నాఁడి పట్టఁఝల్ల
దనదానమహిమ సంతాన చింతారత్న జీమూతసురభుల సిగ్గుపఱుపఁ
తే. బరఁగు శ్రీవేమమండలేశ్వరుని మంత్రి
యహితదుర్మంత్రి వదన ముద్రావతార
శాసనుఁడు రాయవేశ్యాభుజంగ బిరుద
మంత్రి పెద్దయసింగనామాత్య వరుఁడు.

ఈపై పద్యమునఁ బేర్కొనంబడిన వేమమండలేశ్వరుఁడు క్రీ. శ. ౧౪౦౦ మొదలుకొని ౧౪౨౦ వఱకును కొండవీటిరాజ్యమును బరిపాలించిన పెదకోమటి వేమభూపాలుఁడు గాని కొందఱు తలంచిన ట్లనవేమభూపాలుఁడు గాడు.

ఈశృంగారనైషధకావ్యమును శ్రీనాథుఁడు క్రీ. శ. ౧౪౦౯ దవ సంవత్సరప్రాంతమున రచించి యాకాలమున నొక చిన్నసంస్థానమున కధిపతిగానున్న పెదకోమటివేమునకు మంత్రిగానుండిన మామిడి సింగనామాత్యున కంకితము చేసెనని శ్రీలక్ష్మణరావుగారి ముఖ్యవాదమై యున్నది. దీనినే వీరేశలింగముగా రనువదించిరి. శ్రీలక్ష్మణరావుగారు "పెదకోమటివేమారెడ్డి ౧౪౦౦లో కొండవీటిరాజ్యమునకు వచ్చినను అంతకుఁ బూర్వమేమియు లేని యష్టదరిద్రుఁడు కాఁడు. కొండవీటివంశములోనివాఁడు. పెద్దకుటుంబమువాఁడు...... ఈతఁడు మాచని వంశ

ములోనివాఁడు. మాచని తమ్ముఁడైన వేమ (ఈతనినే ప్రోలయవేమ యందురు) మిక్కిలి శూరుఁడగుటచే కొండవీటిరాజ్యమాతనికే పోయెను. ఇట్లు కొండవీటిరాజ్యము రెండవవంశమునకుఁబోయినను 'మాచయ' అతని రెండవకుమారుఁడైన 'పెదకోమటి' అనామధేయులుగ నుండలేదనియు రాజ్యము చేయుచున్నవారికిఁ దోడుగ నుండిరనియు, మనమూహింపవచ్చును. *వేమభూపాలీయమునందు వీరిని గొప్పరాజులుగఁ గవి వర్ణించినాఁడు. ఆయతిశయోక్తిని వదలినను కొన్నిగ్రామములు భూతాది నిమిత్తమైనను వీరిక్రిందనుండెనని యెంచుట ప్రమాణము కానేరదు. కావున పెదకోమటి కుమారుఁడైన వేమారెడ్డి కుమారగిరి మరణానంతరము రాజ్యమునకు వచ్చుటకు బూర్వము ఒకచిన్న జమీందారుగను రాజవంశమునందు గౌరవముగలవాఁడుగను ఉండెననుటకు సందేహము లేదు. శ్రీనాథుఁ డాకాలమున నాతని మంత్రియైన మామిడి సింగన్నకు నాంధ్రనైషధమును అంకితమిచ్చి వేమరాజునకు మంత్రియని వర్ణించుటయందు విరుద్ధమేమియు లేదు. అనఁగా కుమారగిరికొండవీటిలో ప్రభుత్వముచేయుచున్నప్పుడు ఆతనిపెత్తాత (పెదతాత) మనుమఁడగు పెదకోమటి వేమారెడ్డికూడ కొండవీటికి రాజుగాకపోయినను ఒకచిన్న జమీందారుగ నుండెను. నాలుగూళ్లుగలవారినిగూడ పెద్దరాజులుగను వారియొద్దనున్న గుమస్తాలను మంత్రులుగను వర్ణించుట మన కవుల సంప్రదాయమని యాంధ్రకావ్యపాఠకులకు నేను వేఱుగ జెప్పనక్కరలేదు *" అని యసంబద్ధవ్యాఖ్యానమును జేసి శ్రీనాథుఁడు తన శృంగారనైషధమును నొకచిన్న జమీందారుఁడైన పెదకోమటివేమునకు గుమస్తాగానున్న మామిడిసింగన్నకు నంకితముచేసెనని సిద్ధాంతముచేసినారు. శ్రీలక్ష్మణరావుగారి మాటలవంటిమాటల నుపయోగింపకపోయినను శ్రీవీరేశలింగముగారుకూడ వారిపాటనే పాడియున్నారు.

పెదకోమటివేముఁ డస్వతంత్రుఁడై యున్నకాలమున నీశృం

గారనైషధము రచింపఁబడి యుండుననని వీరి ముఖ్యతాత్పర్యమై యున్నది. ఆ కాలమున నితఁడెక్కడ పరిపాలనము చేసెనో వీరు చెప్పఁజాలకున్నారు ఆ కాలమున వీని దానధర్మములను దెలుపు శాసనము నొక్క దానినైనఁ గనఁబఱుపఁ జాలకున్నారు. ఇవియన్నియు వీరి యూహాలు. ఇట్టి యూహాలు చేయుటకుఁ గారణము హరవిలాసమున శృంగారనైషధము పేర్కొనబడుటయు హరవిలాసము కుమారగిరిరెడ్డి కాలమున రచింపఁబడెనని విశ్వసించుటయునై యున్నది. కాని యాంధ్రశృంగారనైషధమును వీరు బాగుగాఁ బరిశీలించి వ్రాసినట్లు గానరాదు. గ్రంథమును విమర్శించి విషయములను జక్కగాఁ బరిశీలించిన బుద్ధిమంతులెవ్వరును వీరివలె నవిశ్వాసమునకు బాత్రులు కాఁజాలరు. శ్రీనాథుఁడతిశయోక్తులు చెప్పియుండలేదని మేమనఁజాలముగాని శ్రీలక్ష్మణరావుగా రూహించినంత నిరసనముగాఁ దలపోయుటకు మాత్రము సాహసింపఁజాలము. శృంగారనైషధము కృతినొందు నాటికి మామిడి సింగనామాత్యుఁ డెట్టిస్థితిలోనుండెనో మనము విచారించుటకు శ్రీనాథుఁడు శృంగారనైషధమును రచించి సింగనామాత్యుని కంకితము చేయుటకుఁ బూర్వమె యాతని యన్నయగు పెగడనామాత్యునకు పండితారాధ్యచరిత్రమను మొదలగు కృతులను రచించి యంకితముచేసి జగంబున నతికెక్కియున్నవాఁడని యిదివఱకె తెలిసికొని యున్నారము. శృంగారనైషధావతారికయందు శ్రీనాథుఁడు సింగనామాత్యు నిట్లభివర్ణించి యున్నాఁడు.

మ. అరుదారన్విపి భాగ్రిహాసములతో నాందోళికా చ్ఛత్త్రచా
మరకళ్యాణకళాచికాది బహుసమ్మానార్హచిహ్నంబు లా
దర మొప్పారఁగ వేమభూవరుని చేతం గాంచె సామ్రాజ్య సం
భరణప్రౌఢుఁ డమాత్యసింగఁడు నయప్రాగల్భ్య గర్వోన్నతిన్.

ఇందలి తాత్పర్యము సింగనామాత్యుఁడు నీతిప్రౌఢిగలిగి, నేర్పరియై సామ్రాజ్యసంరక్షణమును జేసినందున సంతోషించి యప్పు

ర్వముగా వేమభూవరుఁ డాతనికి వివిధాగ్రహారములతోఁ బాటు అందళము, ఛత్రము, చామరము (వీచోపులు) బంగారు తమ్మపడి గము మొదలుగాఁగల సమ్మానార్హచిహ్నములు లొసంగెనని గ్రహింపవలయును. మఱియు షష్ఠ్యంతములలో నాతనిగూర్చి

శ్రీమహిత పెద్దకోమటి
వేమక్షితిపాల రాజ్యవిభవకళారు
క్ష్మామణికి సింగసచివ
గ్రామణికిం బాండ్యరాజగజ కేసరికిన్. *

అనియుఁగూడఁ జెప్పియున్నాఁడు. కాఁబట్టి యాసింగనామాత్యుఁ మహాప్రధాన శేఖరునిగాఁ జెప్పియున్నందునఁ బెదకోమటి వేమభూవ రుఁడు కొండవీటిసామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడైన వెనుకనే యా శృంగారనైషధము సింగనామాత్యున కంకితము చేయఁబడియెనని యూ హింపవలయును: ఇంతకన్న విస్పష్టముగా ద్వితీయాశ్వాసాదియందిట్లున్నది

క. శ్రీరాజరాజవేమ
క్ష్మారమణ కృపాకటాక్ష సంవర్ధితల
క్ష్మీరక్షితబుధలోక యు
దారగుణాధార సింగనామాత్యమణీ.

శ్రీనాథుడీపై పద్యమునందు రాజాధిరాజైన వేమభూపాలునికరుణతోడి కడకంటి చూపుచేత పెంపఁబడిన సంపదచేత పోషింపఁబడిన విద్వాంసు లసమూహము కలవాఁడాయని సింగనామాత్యుని సంబోధించినాఁడు. పెదకోమటివేముఁడు కొండవీటి సామ్రాజ్యమున కభిషిక్తుఁడైన వెనుకనే యీశృంగారనైషధము సింగనామాత్యుని కంకితముచేయఁబడియెనని తెలుపుటకీ నిదర్శనములు చాలవా? వీటినన్నిటిని నతిశయోక్తులని

---

* ముద్రితగ్రంథములలో 'శ్రీమహిత పెద్దకోమటి' యను దానికి బదులుగా 'శ్రీమహితు పెద్దసుతునకు' అని యున్నది. చరిత్రము తెలియనందున బెద్దకోమటి యనుదాని యర్థము తెలిసికొనజాలక తప్పనుకొని శృంగారనైషధమును ప్రథమమున ముద్రించిన వారట్లుమార్చి చేసియుండురు.

పెద్దనిండుసున్న పెట్టి తాటియాకుకవిలెకట్టలు మోయు గుమస్తా కంకి తము చేసెనను భావమును దేల్చుచు నాకాశపంచాంగము విన్పించెడి లక్ష్మణరావుగారి పల్కులు విశ్వాసార్హము లెట్లగును? ఆపల్కులనే చిలుకవలె రెట్టించి పల్కెడి కవిచరిత్రకారుని పల్కులెట్లాదరణీయము లగును? సింగనామాత్యుఁడు కొండవీటి సామ్రాజ్యాధీశ్వరుఁడైన పెదకోమటి వేమభూపాలుని మంత్రులలోఁ బ్రధాన శేఖరుండగుటచేతనే సకలవిద్యాసనాథుఁడైన శ్రీనాథుఁడు సింగనామాత్యుని కొలువుకూటము నిట్లభివర్ణించియుండెను.

"మృదుమధురచిత్ర విస్తరకవితా విలాసవాగీశ్వరులగు కవీశ్వరులును, పతంజలి కణాదాక్షచరణ పక్షిలాది శాస్త్రసిద్ధాంతకమలవనహంసులగు విద్వాంసులును భరతమతంగదత్తిల కోహలాంజనేయ ప్రణీత సంగీత విద్యారహస్య విజ్ఞానవైజ్ఞానికస్వాంతులగు కళావంతులును, శక్తిత్రయచతురుపాయషాడ్గుణ్య ప్రయోగయోగ్య విచారులగురాయబారులును నిఖిల పురాణేతిహాససంహితా తాత్పర్య పర్యాలోచనాధురంధరధిషణాసముత్సాహంబగు పౌరాణికసమూహంబును బరివేష్టింప గొలువుండి,"

ఇట్లు విద్వద్బృందముతో కొలువుదీర్చునసింగనామాత్యుఁడుకవిలెకట్టలుమోయు గుమస్తాయని పల్కుటకు నాకునోరాడదు. అయినను ఈసింగనామాత్యుని తండ్రి పెద్దనామాత్యుఁడు అనవేమభూపాలునకు మంత్రిగనుండెననియు అనవేమభూపాలుఁడు కొండవీటి సామ్రాజ్యమున కధీశ్వరుఁడనియు శ్రీలక్ష్మణరావుగారును శ్రీవీరేశలింగముగారునుగూడనొప్పుకొనియేయున్నారు. అటువంటి పెద్దనామాత్యుని పుత్రుడైన సింగనామాత్యుఁ డతనికంటెను బ్రఖ్యాతుఁడై యుండెననుటను పైవర్ణనములు వేనోళ్ళఁ జాటుచున్నవికాని యతిశయోక్తులని గన్పట్టుచుండలేదు. ఇదియుగాక సింగనామాత్యుని యన్నలగు వేమయామాత్యుని ప్రెగడనామాత్యుని దండనాథులనుగా వర్ణించియున్నాఁడు.

వేమమంత్రిని దండనాయకచూడావతంసమని వర్ణించిన పిమ్మట ప్రెగడ నామాత్యుని

మ. తగుఁ గైవారమొనర్ప విక్రమకళాధౌరేయతాశాలి శ్రీ
ప్రెగడన్నధ్వజినీశుఁ డంబునిధి గంభీరుఁడు శుంభద్ద్విష
న్నగరద్వారకవాటపాటన విధాన ప్రౌఢ బాహార్గళా
యుగళుం డాహవసవ్యసాచి ధరలో నొక్కండు పేరుక్కునన్.

అని పరాక్రమవంతుఁడు, గంభీరుఁడు, శత్రుపురభేదకుఁడు, యుద్ధదక్షుఁడు బలమువిషయములో పొగడనర్హుఁడైన వాఁడు దండనాథుఁడితఁ డొక్కఁడేయని చెప్పియున్నాఁడు. వామనభట్టు పెదకోమటి వేమభూపాలుని చక్రవర్తియని వర్ణించిన వర్ణన మతిశయోక్తిగాఁ ద్రోసిపుచ్చినను వేమభూపాలుఁడు కొండవీటిరాజ్యమున కభిషిక్తుఁడై స్వతంత్రుఁడై పరిపాలనము చేయుచుండ సామ్రాజ్యసంభరణప్రౌఢుఁడై సింగనామాత్యుఁడు సకలవిద్యాసనాథుఁడైన శ్రీనాథుని సంప్రార్థించి నైషధకావ్యరచనకుం బ్రోత్సహించినది యతిశయోక్తి కాఁజాలదు. శ్రీ వీరేశలింగముగారు పెదకోమటి వేమనృపాలుని మండలేశ్వరుఁడని చెప్పుటచేత నైషధగ్రంథరచన కాలమునాటి కతఁడు రెడ్డిసామ్రాజ్య పట్టభద్రుఁడు కాలేదనియు రెడ్డిరాజ్యములోని మండలేశ్వరుఁడుగా నుండెననియు దెల్లముగుచున్న'దని వ్రాసియున్నారు కాని పైన నేనుదాహరించిన 'శ్రీరాజరాజవేమక్ష్మారమణ' యను ద్వితీయాశ్వాసములోని పద్యమును జూచియుండలేదు. శ్రీనాథుఁడు శృంగారనైషధము రచించునాటికి వేమారెడ్డి సామ్రాజ్యపట్టభద్రుఁడై యుండెననుట 'రాజరాజశబ్దమే వేనోళ్ళ జాటుచున్నది గదా! శ్రీ లక్ష్మణరావుగారు వీనిం దప్పించుకొనుటకు వేఱు మార్గము గానరానందున నతిశయోక్తులని యొక్కత్రోపుత్రోసి తమ సిద్ధాంతమును నిలుపఁజూచిరి. వీరి వాదదౌర్బల్యమును గమనించి శ్రీ వీరేశలింగముగారు తమవాదమును గారణయుక్తమైనదానిగఁ జేసి నిలుపఁబూని 'మండలేశ్వరుఁ' డను దానికి వెనుకను ముందును జూచు

కొంనక వ్యాఖ్యానముచేసి చెప్పిరి. ఇప్పుడన్ననో శ్రీలక్ష్మణరావుగారి నిడకేచేరి వారితోపాటుగా 'నతిశయోక్తు' లను నొక్కటేపాట పాడుదురు కాఁబోలు! పోలుంగద! పెదకోమటి వేమభూపాలుఁడు కొండవీటిసామ్రాజ్యపట్టభద్రుఁడుకాకపూర్వమే నైషధము, హరవిలాసము రచించియుండినయెడల ౧౪౦౦ మొదలుకొని ౧౪౨౦ వఱకు శ్రీనాథుఁడు గ్రంథరచనము లేక చేతులు నలుపుకొనుచుఁగూరుచుండెనాయనియెవ్వరైన ప్రశ్నింతురను భయముచేత కాఁబోలు నాకాలమున శ్రీనాథుఁడు పల్నాటివీరచరిత్రమును రచించుచుండెనని శ్రీలక్ష్మణరావుగారును శివరాత్రిమాహాత్మ్యమును రచించుచుండెనని శ్రీవీరేశలింగముఁగారును వ్రాసియున్నారు. పల్నాటివీరచరిత్రము బాల్యమున రచించెనని శ్రీవీరేశలింగముఁగారు వచించిన దానికి నేమి యాక్షేపణములు చెప్పఁబడినవో యా యాక్షేపణములు నిందుజవ్వనమున రచించెనను లక్ష్మణరావుగారి సిద్ధాంతమునకును వర్తింపుచున్నవి. నైషధము హరవిలాసమువంటి యుత్కృష్టగ్రంథములను రచించి సకలవిద్యాసనాథుఁడను బిరుదమును వహించి పెదకోమటివేమభూపాలుని యాస్థానంబున విద్యాధికారిపదవి నధిష్ఠించియున్న శ్రీనాథకవివర్యుండు శబ్దసౌష్ఠవజ్ఞానము విడిచి పల్నాటి వీరచరిత్రము వంటి ప్రబంధము నల్లియుండునని చెప్ప సాహసించినందులకు లక్ష్మణరావుగారి ధైర్యము నెంతయినం గొండాడఁ దగియున్నది. సకలవిద్యాసనాథుఁడైనను శ్రీనాథున కప్పటికిఁ గవిసార్వభౌమ బిరుదము లభింపలేదు. పల్నాటి వీర చరిత్రములో శ్రీనాథుఁడు కవిసార్వభౌమ బిరుదము గలవాఁడనని చెప్పుకొని యున్నాఁడు. శ్రీలక్ష్మణరావుగారు పల్నాటివీరచరిత్రమును బఠించియుండలేదు కాఁబోలు? పల్నాటివీరచరిత్రమాకాలమున రచింపఁబడలేదని "కవిసార్వభౌముఁడ ఘనతగన్నట్టి శ్రీనాథుఁడనువాఁడ శివభక్తిపరుఁడ, నని యాతఁడు చెప్పుకొన్న వాక్యములే బాధించుచున్నవి.

ఇఁక వీరేశలింగముగారు శివరాత్రిమాహాత్మ్యమని చెప్పినదానిగూర్చి విచారింతము. వారేమి వ్రాసియున్నారో చిత్తగింపుఁడు. ౧౪౦౦ వ సంవత్సరము మొదలుకొని ౧౪౨౦ వ సంవత్సరము వరకును మహాకవియైన శ్రీనాథుఁ డొక్క గ్రంథమునైనఁ జేయక యూరకుండఁ జాలఁడు. ఇట్లు వృధపుచ్చఁ బడినదనుకొన్న కాల మిరువదిసంవత్సరములే యననేల? ఇరువదినాలుగు సంవత్సరములు కావచ్చును......... ఎట్లయినను వింశతి దీర్ఘసంవత్సరములు నిరర్గళ కవితాధారగల కవిచేతి లేఖనియు ననల్పకల్పన సమర్థమైన బుద్ధియు స్వసామర్థ్యమును మఱచి యస్వాభావికనిద్రను వహించుట సంభావ్యముకాదు. అందుచేత శ్రీనాథుఁడీకాలములో నేదో మహాగ్రంథమును రచించుచుఁడి యుండవలెను. ఆమహాగ్రంథము శివరాత్రిమాహాత్మ్యమని తోఁచుచున్నది. శ్రీనాథుఁడు దీనిని తనప్రభువైన పెదకోమటివిభుని కంకితము చేయవలెననియే యుద్దేశించి యుండును. కాని యింతలోపల కొండవీటిరాజ్య మన్యాక్రాంతమగుటయుఁ దనకాశ్రయులైన వేమనృపాలసింగనామాత్యాదులు పరలోకగతులగుటయుఁ దటస్థించి నందున శ్రీనాథమహాకవి రాజధానియైన కొండవీటియందు నిలువ నాధారములేక తనగ్రంథపరికరములతో నావీడు విడిచి దేశాంతరగమనోన్ముఖుఁడై ౧౪౨౦ వ సంవత్సరప్రాంతములయందు ముందుగా స్వార్థమును తీర్థమును గలిసి వచ్చునట్లుగా శ్రీశైలయాత్రకు వెడలెను .........అట్టి పుణ్యస్థలమైన శ్రీశైల దివ్యక్షేత్రమునకు కొండవీటిరెడ్డి రాజ్యనాశనా నంతరమున శ్రీనాథుఁడు యాత్రకుఁబోయి దేవతాదర్శనము చేయుటయెగాక యచ్చట మఠాధికారులయి లక్షాధికారులయి యుండిన జంగమ గురుపీఠమువారి దర్శనముచేసి వారియనుగ్రహమునకు పాత్రుఁడై తాను రచియించిన శివరాత్రిమాహాత్మ్యమును ముమ్మయపుత్రుఁడైన శాంతయ్య కంకిత మొనర్చెను.........అవలకుఁ దాను గోమటివేమనృపాలుని

జీవితకాలములోనే రచియించుచుండిన గ్రంథమునే యవశిష్టమును ము గించి యవతారికను వ్రాసి యాశ్వాసాద్యంత పద్యములను జేసి శ్రీశై లయాత్రాసమయమునం దర్థసంభావనమును బడసి శ్రీనాథుఁడే శివరా త్రిమాహాత్మ్య మహాకావ్యమును మహాధనసంపన్నుఁడైన ముమ్మడి శాంతయ్య కంకితమొనర్చినట్లు తోఁచుచున్నది. ఈగ్రంథము ౧౪౫౪ వ సంవత్సర ప్రాంతమునందు సంపూర్తి చేయఁబడి యుండును."

అని శ్రీవీరేశలింగముగారు తమకుంగల యనల్పకల్పన సామర్థ్య విశేషమునంతయు నచ్చుపడంజేసి యున్నారుగదా? వీరివాక్యములలో ని యుక్తిరత్నములవంటి యుక్తిరత్నములు మన మెన్నఁడును జూడఁ బోము. పెదకోమటివేమభూపాలుని యాస్థానంబున విద్యాధికారపదవి యం దుండిన యిరువదిసంవత్సరముల కాలములో శ్రీనాథమహాకవివం టివాఁడు శివరాత్రిమహాత్మ్యము కావ్యమును రచించినాఁడఁట! ఈకృ తిరత్నము నంకితము నొందకుండ వానికి ప్రియులుగనుండిన ప్రభువ తంసము లెల్లరును స్వర్గస్థులైరఁట! స్వార్థమును తీర్థమును గలిసి వచ్చు నని ౧౪౫౦లో శ్రీశైలయాత్రకు బయలుదేఱెనఁట! అచట నవతారి కను, ఆశ్వాసాద్యంత పద్యములనుజేసి గ్రంథము సంపూర్తిచేయుట ౧౪౫౪ వ సంవత్సరప్రాంతమునందుగాని సంభవింపలేదఁట! అటుపిమ్మ టనే శ్రీనాథుఁడు ప్రౌఢదేవరాయని కర్ణాటరాజధానికిఁ బోయి గౌడ డిండిమభట్టును నోడించి కవిసార్వభౌమ బిరుదము లాగుకొనియుండె నఁట! కాని యాగ్రంథావతారికలోనే 'మహాప్రసాదం బని సత్కవిసా ర్వభౌముఁడగు శ్రీనాథకవివరేణ్యుని కృపావిశేషంబున, నీశివరాత్రిమ హాత్మ్యము చెప్పంబడియుండె' నని వ్రాయఁబడియున్నదఁట! 'వీఁడెఁ గవిసార్వభౌము విమలచరిత్రు' ననిగూడ యున్నదఁట! పల్నాటివీరచరి త్రమునకును బట్టిన కవిసార్వభౌమ బిరుదముబాధ శివరాత్రి మహా త్మ్యమునకుఁ బట్టినదనుమాట వీ రెఱుంగకపోయిరి. "ఈతనిని (డిం

మభట్టును) శ్రీనాథుఁ డోడించుట ౧౪౨౩ వ సంవత్సరమునకుఁ దరువాతనయి యుండవలెను. ౧౪౨౮ వ సంవత్సరప్రాంతమున నని తోఁచుచున్నది.'' అని వారే వ్రాయుచు శివరాత్రిమహాత్మ్యము రచించి శాంతయ్యసుదేవర కంకితమొనర్చునాటికే శ్రీనాథుఁడు కవిసార్వభౌమ బిరుదాంచితుఁడై యుండెనని కన్పడు నవతారికలోని గద్యపద్యములనెత్తి ప్రచురించుచు స్వవచనవ్యాఘాతములతోఁ గూడిన వితండవాదమును గ్రంథస్థము గావించుట యపహాస్యభాజనమగుటకుం దక్కమఱియెందునకుం గొఱగాకయున్నది. శ్రీవీరేశలింగముగారు "శ్రీనాథునకు (౧౪౨౮ వ సంవత్సరమున) రాయలసందర్శనలాభము కలుగుటయేగాక తదాస్థానమునందు విపక్షవిద్వాంసవిజయలాభమును, తద్బిరుదాంకసంపాదన లాభమును, కనకాభిషేకలాభమునుగూడఁ గలిగినవి.........శ్రీవాణిప్రసాదలబ్ధ సకలవిద్యాసనాథుఁడగు శ్రీనాథుడే విజయము నొంది యా గౌడడిండిమభట్టు కంచుఢక్కను బగులఁగొట్టించి యాతని కవిసార్వభౌమ బిరుదమును లాగుకొన సమర్థుఁడయ్యె" నని వ్రాసియుండుటచేత వారివాక్యములే వారివాదమును సమూలచ్ఛేదము గావించుచున్నవి. శ్రీవీరేశలింగముగారు "ఇట్లు శ్రీశైలయాత్రవలన తీర్థమును స్వార్థమును గలిసివచ్చి యభిమతార్థసిద్ధియయినతరువాత శ్రీనాథుఁ డక్కడనుండి వెలుపడి ధనాగమసమ్మానసముపార్జనార్థమయి స్థలాంతరాన్వేషణము చేసికొనవలసినవాఁ డయ్యెను......... ఈహేతువులచేత శ్రీనాథుఁ డాకాలమునందు మహాబలిష్ఠమై యుండిన కర్ణాటరాజధానికిఁ బోవలసినవాఁడయ్యె" నని విస్పష్టముగ వ్రాసి యొప్పుకొని యుండుటచేత మఱియొక వాదమునకుఁ గడంగ వీలులేదు. అప్పుడింతకన్నను నపహాస్యభాజనముగఁ బరిణమించును. ఏమన, కర్ణాటాధీశ్వరుని సభకుఁబోయి గౌడడిండిమభట్టును నోడించి వానికవిసార్వభౌమ బిరుదమును గొని యమ్మహారాజు ముత్యాలశాలలోఁ గనకాభిషేక

మును బొందినవెంటనే స్వార్థమునకై శ్రీశైలయాత్రచేసి యొకజంగమ
గురుదేవరకుఁ గృతినిచ్చెననుట హాస్యాస్పదముగఁ గన్పట్టుచుండలేదా?
అట్లు కనకాభిషేకముగాంచిన కవిసార్వభౌముఁడు (శ్రీవీరేశలింగముగా
రెగతాళిగాఁ బలికినట్లు) అర్థసంభావనకై జంగమగురుదేవరకుఁ గృతి
నొసంగియుండఁడు. కావున పెదకోమటివేమభూపాలుని యాస్థానంబున
సకలవిద్యాసనాథుఁడైన శ్రీనాథుఁడు విద్యాధికారపదవి నధిష్ఠించి
యున్న కాలమున శ్రీలక్ష్మణరావుగారు నుడివినట్లు పల్నాటివీరచరిత్ర
మునుగాని' శ్రీవీరేశలింగముగారు నుడివినట్లు శివరాత్రి మహాత్మ్యము
గాని రచించియుండలేదని ఋజువుచేసి యున్నాడను. శ్రీవీరేశలింగము
గారు పలికినట్లు వింశతిదీర్ఘసంవత్సరములు నిరర్గళకవితాధారగల కవి
చేతిలేఖినియు ననల్పకల్పనసమర్థమైన బుద్ధియు స్వసామర్థ్యమునుమఱచి
యస్వాభావికనిద్రను వహించుట సంభావ్యము కాదనుట యొప్పకోఁ
దగియున్నది. శ్రీనాథుఁడు కొన్నిగ్రంథములను రచించియుండకపోఁడు.
వానిలో ముఖ్యమైనది శృంగారనైషధమనుటకు సంశయింపఁబనిలేదు.
ఎందుకన, "శ్రీరాజరాజవేమక్ష్మారమణ కృపాకటాక్ష సంవర్ధితలక్ష్మీ
రక్షితబుధలోక" అని సింగనామాత్యుని శ్రీనాథుఁడు సంబోధించియుండు
టచేత ౧౪౦౦ సంవత్సరమునఁ గొండవీటిరాజ్యమునకుఁ బెదకోమటివేమ
భూపాలుఁడు పట్టాభిషిక్తుఁడైన తరువాతనే వానిమంత్రిగానున్న మామి
డిసింగనామాత్యునకు వానికోరికమీఁద శృంగారనైషధమును భాషాంత
రీకరించి యంకితము చేసియుండెనని దృఢముగాఁజెప్పవచ్చును. మామిడి
సింగనామాత్యుఁడు రాజకార్యధురంధరుఁడు మాత్రమెగాక విద్వాం
సుఁడును, గణితశాస్త్రజ్ఞుఁడును దైవజ్ఞశిఖామణియుఁ గూడనై యున్న
వాఁడు. ఈసింగనామాత్యుఁడు ౧౪౧౫ దవ సంవత్సరమునఁ దాను
పెదకోమటివేమభూపాలునకు మంత్రిగానుండియు సోమసిద్ధాంతమునకు
వ్యాఖ్యానమును జేసియున్నాఁడు. శ్రీనాథుఁడు సింగనామాత్యు

నభివర్ణించుచు నీవిషయముననే యీక్రింది పద్యములో సూచించి యున్నాఁడు.

శా. పంచాంగస్థిరమంత్రరక్షణకళాప్రౌఢుండు బాలాప ః
పాంచాలుండు విరించి వంశజలధిప్రాలేయభానుండు దో
శ్చంచచ్చాపకృపాణలబ్ధవిజయైశ్వర్యుండు దిక్కామినీ
కాంచీమౌక్తికకీర్తి పెద్దవిభు సింగం డొక్కనాఁ డిమ్ములన్.*

సింగనామాత్యుఁ డొక్కనాఁడు విద్వద్బృందము పరివేష్టింపం గొలువుండి సరససాహిత్యగోష్ఠీవినోదప్రసంగంబున శ్రీనాథుని గారవించి గంభీరవాక్ప్రౌఢిమతో నిట్లు ప్రశంసించెను.

శా. బ్రాహ్మీదత్తవరప్రసాదుఁడవు ప్రజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతుఁడ వీశ్వరార్చనకళాశీలుండ వష్టాదశ
బ్రహ్మాండాది మహాపురాణచయతాత్పర్యార్థనిర్ధారిత
బ్రహ్మజ్ఞానకళానిధానమవు నీభాగ్యంబు సామాన్యమే.

క. జగము నుతి పఁగఁ జెప్పితి
పెగ్గడయ్యకు నాయనుంగుఁ బెద్దనకు గృతుల్
నిగమార్థసారసంగ్రహ
మగు నాయూరాధ్యచరిత మాదిగఁ బెక్కుల్.

సీ. కవిరాజరాజితశేఖరహీరము కుటుంబ
శ్రీహీరకలశాబ్ధిశీతకరుఁడు
మామల్లదేవీకుమారరత్నంబు చిం
తామణీమంత్రచింతనపరుండు

---

* శ్రీవేదము వేంకటరాయశాస్త్రిగారు "పంచాంగస్థిరమంత్రరక్షణకళాప్రౌఢుండను దానికిట్లర్థము వ్రాసియున్నారు.

పంచాంగ=(సహాయులు, సాధనోపాయములు, దేశకాలవిభాగము, ప్రాతి ప్రతీకారము సిద్ధి అనెడి) యయిదంగములచేత స్థిర=నిశ్చలమైన మంత్ర=ఆలోచన యొక్క రక్షణ=కాపాడుటయను కళా=విద్యయందు ప్రౌఢుండు=గడితేరినవాఁడు. మామిడిసింగనామాత్యుఁడు సోమసిద్ధాంతమునకు వ్యాఖ్యానము చేసియున్న సంగతి నెఱిఁగియున్న యెడల శ్రీశాస్త్రులవారు పైరీతినర్థము వ్రాసియుందురని తలంపఁజాలను.

కవిసులావ్యష్టాధ్యాగమనాధ్యసనుండు
కాశ్మీరనృప సభాకమలహేళి
ఖండనగ్రంథసంగ్రంథకర్కశబుద్ధి
షట్తర్కమర్మైకచక్రవర్తి
గీ. భట్టహర్షుండు ప్రౌఢివాక్పాటవమున
నెద్ది రచించె బుధలోకహితము పొంద
నట్టి నైషధసత్కావ్యమాంధ్రభాష
ననఘ యొనరింపు నాపేర నంకితముగ.

చ. పనివడి నారికేళఫలపాకమునం జవియైన భట్టహ
ర్షుని కవితానుగుంభనములు సోమరిపోతులు కొందఱయ్యలౌ
నని కొనియాడ నేరరది; యట్టిది తేజపగాలు చెప్పఁగాఁ గ
టిన వసపల్చు బాలసుఁడు డెందమునం గలఁగ న్నేర్చునే.

అని యిట్లు ప్రశంసించి సబహుమానంబుగాఁ గర్పూరతాంబూలం బొసంగి జాంబూనదాంబరాభరణంబులు గట్టనిచ్చి వీడ్కొలిపె నని శ్రీనాథుఁడు చెప్పుకొని యున్నాఁడు. తర్వాత శృంగారనైషధము నాంధ్రభాషను రచించి సింగనామాత్యున కంకిత మొనరించి యున్నాఁడు. 'సంతరించితి నిండు జవ్వనంబునయందు హర్షనైషధకావ్యమాంధ్రభాష' యని కాశీఖండమునఁ జెప్పుకొనియుండుటచేత ముప్పదియైదవసంవత్సరప్రాయమున శృంగారనైషధమును రచించి మామిడి సింగనామాత్యుని కంకితము చేసియుండుననుట కెంత సూత్రమును సంశయింపఁ బనిలేదు.

ఈ మామిడిసింగనామాత్యుఁడు వేమభూపతి మహాసామ్రాజ్యరక్షామణియగుటచేతనే గాక మహావిద్వాంసుఁడై ప్రత్యేకము జ్యోతిషసిద్ధాంతభాగమున నసమానప్రజ్ఞాపాండిత్యములు గలవాఁడై క్లిష్టార్థయుతమైన సోమసిద్ధాంతమున కొకవ్యాఖ్యవ్రాసి ప్రసిద్ధిగాంచినవాఁడు. ఈతఁడీవ్యాఖ్యను క్రీ.శ.౧౪౧౯దవ సంవత్సరమున రచించెను. అందుఁ దన్ను గూర్చి యిట్లు చెప్పుకొన్నాఁడు.

శ్లో. అస్తి శ్రీవసిష్ఠ భారద్వాజ గోత్రే శ్రోత్రియ భూషణమ్
నప్తా శ్రీచిట్టనాఖ్యస్య పౌత్రో మామిడి మంత్రిణః
తనుజః పెద్దనార్యస్య శ్రీసింగనామహాయశాః
పెదకోమటి వేమేంద్రమంత్రిణా తేన ధీమతా
జ్యోతిర్విద్యాశిరోభూష సాస్వత్పారదృశ్వనా
సింగయామాత్యరత్నేన భువిలోకహితైషిణా
క్రియతే సోమసిద్ధాంత వ్యాఖ్యాగూఢార్థ దీపికా.

ఇతఁడు దైవజ్ఞశిఖామణి యగుటచేతనే శ్రీనాథభట్టసుకవి పంచాంగస్థిరమంత్ర రత్నకళాప్రౌఢుండని తననైషధమున నీతని నభివర్ణించియుండఁబోలు. సకలవిద్యాపారంగతుండయిన యీ యమాత్యశేఖరుండెప్పుడును "మృదుమధుర చిత్ర విస్తర కవితావిలాస వాగీశ్వరులగు కవీశ్వరులచేతను, పతంజలికణాదాక్షచరణపక్షిలాది శాస్త్రసిద్ధాంత కమలవనహంసులగు విద్వాంసులచేతను, భరతమతంగదత్తిళకాపాలాంజనేయ ప్రణీత సంగీతవిద్యారహస్య విజ్ఞానవైజ్ఞానిక స్వాంతులగు కళావంతులచేతను, శక్తిత్రయ చతురుపాయ షాడ్గుణ్యప్రయోగ యోగ్యవిచారులగు రాయబారులచేతను, నిఖిలపురాణేతిహాస సంహితా తాత్పర్య పర్యాలోచనా ధురంధరధిషణా సముత్సాహులగు పౌరాణిక వర్యులచేతను, గొల్వుకూటంబునఁ బరివేష్టింపఁబడియుండి సరససాహిత్య గోష్ఠీవినోదప్రసంగంబులు జరుపుచుండు" నని నైషధమహాకావ్యము నందభివర్ణింపఁబడి యుండుటఁ జూచియు మహామేధావులయిన లక్ష్మణరావుగారును, వీరేశలింగముగారును నొక్కకలముపోటుతోఁ గవిలెక్కట్టలు మోయుగుమాస్తాగా నీడ్చివేయఁబ్రయత్నించిన దెంతయు శోచనీయము

కొండవీటి గార్దభములు.

కొండవీ డాకాలమున నసంఖ్యాకులగు కవులతో నిండియుండెడిదనియు, వారిలో సరసకవులు, విరసకవులు, కుకవులుగూడ నుండెడివారనియు, ఎక్కడఁజూచినను సుకవుల కవితారచనము లేగాక యసమర్థులగువారి కవితారచనములుగూడ వినంబడుచుండెడి వనియు, శ్రీనాథుఁ

డొకనాఁడు పురమేగినపుడిట్టి యసమర్థకవితారచనములు చెవికి వినంబడి నపు డీక్రింది చాటువునుజెప్పి వారి నపహాస్య భాజనులుగాఁ జేసెనని తెలియుచున్నది.

ఉ. బూడిదబుంగలై మొగముఁ బోడిమిఁదక్కి మొగంబువెల్లనై
వాడల వాడలందిరిగి వారును వీరును జొచ్చొచోయనన్
గోడల గొందులం దొడిగ కూయుచు నుండెడు కొండపీటిలో
గాడిద నీవునుం గవివికాదుగదా యనుమాన మయ్యెడిన్.

## వామనభట్ట బాణుఁడు.

వేమభూపాలుని యాస్థానమున శ్రీనాథునిఁ జెప్పినవెనుకఁ జేరె న్నికగాంచినకవి వామనభట్టబాణుఁడు. ఇతఁడొకగొప్ప సంస్కృతకవి. ఇతఁడు సంస్కృతభాషలో గ్రంథములఁబెక్కింటిని రచియించి విశేష ముగాఁ బ్రఖ్యాతిగాంచి వేమభూపాలుని మన్ననకుఁ బాత్రుఁడయ్యెను. వీరనారాయణ చరిత్రమను నామాంతరముగల వేమభూపాల చరిత మను నాఖ్యాయికయు, రఘునాథాభ్యుదయము నలాభ్యుదయమునను కావ్యములను, పార్వతీపరిణయ శృంగారభూషణములను రూపకములను శబ్దచంద్రిక,శబ్దరత్నాకరము, అను నిఘంటువులను, హంస సందేశమను ఖండకావ్యమును రచించినవాఁడు. తన నిఘంటువులలోఁ బ్రారంభమున

శ్లో. విద్యారణ్యగురూన్ సార్వభౌమాద్యఖిల సత్కవీన్
నమస్కృత్యాథ బాణేన క్రియతే శబ్దచంద్రికా॥

శ్లో. వరదాగ్నిచితః పౌత్త్రః పుత్త్రః కోమటియజ్వనః
జాగర్త్తి వా మనోబాణో వత్స వంశశిఖామణిః॥

అనిచెప్పుకొని యుండుటచేత నితఁడు విద్యారణ్యులకు శిష్యుఁ డనియు, సార్వభౌమకవి యనఁగా శ్రీనాథుని ప్రత్యర్థియగు డిండిమకవి సార్వభౌముఁడై యుండుననియు, శృంగారభూషణ భాణము తుంగాభ ద్రాతీరమున విరూపాక్షోత్సవమునందుఁ బ్రదర్శింపఁ బడినట్టురచింపఁ బడినదగుటచే నీతని జన్మస్థలము విద్యానగర ప్రాంతమేమోయని సంశ

యముగలుగుచున్నదనియు, శ్రీ ప్రభాకరశాస్త్రిగారు వ్రాయుచున్నారు. ఈయూహలు నిలుచునవి యైనను గాకపోయినను జన్మస్థలము నిర్ధారించుట కీశ్లోకములు చాలవు. విద్యారణ్యుల జన్మస్థానము విద్యానగరము కాదు. విద్యానగరము క్రీ. శ. ౧౩౩౬వ సంవత్సరమున మొదటి హరిహరరాయలచే విద్యారణ్యుని పేరిటఁ బునరుద్ధరింపఁబడినది. అప్పటికి విద్యారణ్యునికి ముప్పదియైదుసంవత్సరములయిన నుండియుండుననుటకు సంశయింపఁబనిలేదు. డిండిమకవి సార్వభౌముఁడు దేవరాయలు యొక్క తుదికాలమునను ప్రౌఢదేవరాయల యొక్క ప్రారంభకాలమునను బ్రఖ్యాతిగాంచియున్నవాఁడు. దేవరాయలు క్రీ. శ. ౧౪౦౬వ సంవత్సరమున విజయనగరసామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడయినవాఁడు. విజయనగరసామ్రాజ్యమును పాలించిన వారిలోఁ జక్రవర్తియనిచెప్పదగినవాఁడు రెండవహరిహరరాయలు. ఇతఁడు విద్యారణ్యులకు శిష్యుఁడే యైయుండి విద్యాభ్యాసముగావించినవాఁడనిన చెప్పినయెడ నేకాలమునందనిప్రశ్నము పుట్టకమానదు. రెండవహరిహరుఁడు క్రీ. శ. ౧౩౭౭వ సంవత్సరమునఁ బట్టాభిషిక్తుఁడయ్యెను, గనుకనప్పటి విద్యారణ్యుఁడు కొంచెమించుగా ౮౧ సంవత్సరములవాఁడై యుండును. అట్టివానివద్ద విద్యాభ్యాసముచేసియున్నయెడల నధమమిరువదేండ్ల ప్రాయమువాఁడై నయిన యుండవలయును. విద్యారణ్యస్వామిపట్ల నతిగౌరవము జూపెడి రెండవ హరిహరుఁడు విద్యారణ్యుని శిష్యుని విద్యానగర వాసుఁడైన పండితుని తనకంటెను దక్కువస్థితియందుండిన కోమటి వేమభూపాలునికి విడిచిపెట్టియుండునా! ఇతఁడు విద్యారణ్యునకు శిష్యుఁడై విద్యానగరనివాసియై యితఁడు పేర్కొన్న సార్వభౌమకవి డిండిమ భట్టారకుఁడే యైనయెడల, విరూపాక్షోత్సవమనునది హంపీవిరూపాక్షస్వామిదే యైయుండినయెడల, నమ్మహాసామ్రాజ్యమును, ఆమహానగరమునువిడిచి కొండవీడుచేరి వేమభూపాలుని యాస్థానముననుండి వేమభూపాలచరిత్రము రచించి యనేకాతిశయోక్తులతో నతని నొకమహాచక్రవర్తిగానభి

వర్ణించుటకు విజయనగర సామ్రాజ్యముపైని, ఏతచ్చక్రవర్తులపైని, జన్మభూమి పయిననెద్దియేని ద్వేషము పుట్టినఁగాక వేరు కారణముచెప్ప రాదు. అదియునుంగాక విద్యారణ్యులు డిండిమకవి సార్వభౌముఁడునేక కాలమున విద్యానగరమున నున్నవారుగారు. ఈవిషయముఁ జక్కఁగాఁ బరిశోధించి సిద్ధాంతీకరించిన ప్రభాకరశాస్త్రిగారి సమన్వయమును సమ ర్థింపఁజాలము. ఎట్లయిననేమి? పెదకోమటి వేముని యాస్థానకవీశ్వరుం డుగానుండెనని తెలిసికొనఁగలుగుచున్నారము. వేమభూపాలచరితము గద్యకావ్యము ప్రఖ్యాతుఁడైన భట్టబాణుని మార్గము ననుసరించి యాతఁడేగద్యకావ్యమును రచించెను. ఈవేమభూపాలచరిత్రమున వేమ భూపాలుని సత్యచరిత్రమును దెలుపువిషయము లంతగాఁగానరావు; గాని దాక్షారామ వేశ్యావర్ణనము మాత్రమెక్కువగాఁ గానంబడు చున్నది. కోమటి వేముఁడీగ్రంథమునందు, సరసకవికావ్యశరణభూమణేన కర్తా ప్రతిదినమలంకుర్వన్' అని వర్ణింపఁబడియుండుటచేత ప్రభాకర శాస్త్రిగారు శ్రీనాథుఁడాసరసకవులలో నగ్రగణ్యుఁడవునుగదా యను చున్నారు. వామనభట్టబాణుఁడుగూడ నం దగ్రగణ్యుఁడుగాఁడా? శ్రీనా థునివలె దాక్షారామ వేశ్యావర్ణన మెక్కువగాఁజేసి యుండినవాఁడేగదా!

మఱియు గ్రంథాంతమం దీశ్లోకమున్నది.

శ్లో. సుగుణాలంకృతిశుభగా సుకృతి రియం భట్టబాణభవనీయా
అధరయతి శ్రుతసుభగా మధురిమ వీణా నినాదమ ధుర్యమ్.

ఇదివామన భట్టబాణుని రచనము కాఁగూడదనియు, మఱియొక కవి యాతనిఁ బ్రశంసించుచుఁ జెప్పినదనియు ఇయ్యది శ్రీనాథుఁడు చెప్పి నదనియు వారియభిప్రాయము. శ్రీనాథుఁడు చెప్పిన యాశ్లోకమును దన ప్రఖ్యాతికై తనగ్రంథముచివర నలంకరించుకొని యుండెనుగాఁబోలు! వామనభట్ట బాణుఁడు. ఇంతకుముందు దాహరింపబడిన హరవిలాసము లోనిపద్యమె యాతలంపునకు సాధకమని నామిత్రులగు శాస్త్రిగారు దెలుపుచున్నారు. అట్లయినయెడల సకల విద్యాసనాథుఁడగు శ్రీనాథుఁడు

పెదకోమటి వేమారెడ్డిని, వామనభట్టును, తిప్పయ సెట్టిని నొక్క యుయ్యేలలో నేయుంచి యొకటేజోలపాట పాడి జోకొట్టినవాఁడని తేలుచున్నది పర్యవసానము.

ఈతని ప్రశస్తి యెట్టిదో యీ క్రింది రెండుశ్లోకములవలన బాగుగాఁ దెలియనగును.

శ్లో. సౌభాగ్యస్యనిధిశ్శ్రితపసతిర్విద్యా వధూనాం వగో
లక్ష్మ్యాః కేళిగృహం ప్రసూతిభవనం శీలస్యకీర్తేఃపదమ్
నిస్సామాన్యవికాసయా కవితయా జాగర్తివత్సాన్వయ
శ్శ్రీమాన్ వామనభట్టబాణసుకవి స్సాహిత్యచూడామణిః

శ్లో. గాథాస్త్రాథాగతావోదనతు వితథతాం తార్కికా స్తర్కవిద్భి
స్సతాంసతాంసమాన్యం ఫణిఫణితిజుషో వః కృతంప్రక్రియాభిః
భూమ్నాం సాహిత్య సీమ్నామది భువిభువనే వామనే భట్టబాణే
జీవత్యస్మిన్ కవీంద్రే జహితజహితభో! కద్వదావిద్వదాస్థాం.

భట్టబాణునివెనుక నైపుణ్యతను జూపఁగలిగిన గద్యకావ్యకర్తలు లేరను లోపమును దీర్చిన వామనభట్టబాణుని గద్యకవిసార్వభౌముఁడని వచింపనగు.

ఇతర విద్వాంసుల పోషణము.

ఆర్యవిద్యల సంరక్షణార్థమును, విద్వత్కుటుంబముల పోషణార్థమును సకలవిద్యాసనాథుఁడై విద్యాధికారి పదవియందుండిన శ్రీనాథుఁడు పెదకోమటివేమభూపాలునిచే ననేక ాగ్రహారముల నిప్పించెను. ఆకాలమున నాంధ్రదేశమున నాయుర్వేదము విశేషవ్యాప్తి నొందుచున్నటు లనేకశాసనములంబట్టి మనము తెలిసికొనఁ గలుగుదుము. అట్టి బహుమానములను గాంచిన యాయుర్వేదవిద్యాపారంగుతులయున మహనీయులు వేమభూపాలుని విద్యాపరిషత్తు నలంకరించినవారిరువురు గలరు. వారిలో మొదట బహుమానముగాంచినవాఁడు భాస్కరార్యుఁడు. అటుపిమ్మట బహుమానముఁ గాంచినవాఁడు సింగనార్యుఁడు

(౧) భాస్కరాచార్యుఁడు;— ఇతఁడు కప్పయొుక్క గ్రుచ్చుకొను టచే వ్యథఁ జెందుచున్న పామును బ్రదికించి 'పరహితబిరుదమును' బొందిన పండితవంశమున జనించిన పరహితుని కుమారుఁడు.

మండూకశల్యవ్యసనే సర్పప్రాణాభిరక్షణాత్
ఆసేదుషాం పండితానాం కులే పరహితాభిధాః.

మొుదటి పొన్నుపల్లిశాసనము.

"భూలోకధన్వంతరి" యను ప్రసిద్ధిగలవాఁడు; యజుశ్శాఖాధ్యాయి, ఆపస్తంబసూత్రుఁడు; కాశ్యపగోత్రుఁడు; ప్రభాకరశాస్త్రిగారు భారద్వాజగోత్రుఁడని వ్రాయుట, 'కాశ్యపాయ యజుశ్శాఖాధ్యాయినే సుకృతాత్మనే' యని శాసనములో వ్రాయఁబడినదానికి విరుద్ధముగాఁ గన్పట్టుచున్నది. 'అనితల్లి కలువచేఱు శాసనమునఁగూడ నీశాసనమునందున్నట్లే పరహితవంశప్రశంస గలదు. అక్కడఁగూడఁ బరహితవంశ్యుఁడే ప్రతిగ్రహీత" అని ప్రభాకరశాస్త్రిగారు వ్రాయుట చూడఁగా వీరిరువురిని నొక్క వంశమువారిగా భావించినట్లు గన్పట్టుచున్నది. ఈరెండువంశములు భిన్నవంశములని శాసనములంబట్టి దెలియుచున్నది. కలువచేఱుశాసనములోని పరహితాచార్యుఁడు "అత్రిగోత్రకమలాకరభానుః" అని ఆత్రేయగోత్రుఁడని శాసనములో వక్కాణింపఁబడియెను. కాని దానిని 'ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక'లోఁ బ్రకటించిన శ్రీజయంతి రామయ్యగారు శాసనములోఁ జెప్పఁబడిన దానికి భిన్నముగా 'భారద్వాజసగోత్రుఁ' డని వ్రాయుట వింతగానున్నది. 'పరహితవంశ్యుఁడును, కాశ్యపగోత్రుఁడు నైన భాస్కరాచార్యుని శ్రీప్రభాకరశాస్త్రిగారును,పరహితవంశ్యుఁడును,ఆత్రేయగోత్రుఁడును నగు పరహితాచార్యుని శ్రీజయంతిరామయ్యగారును భారద్వాజసగోత్రులని వ్రాయుటకుఁ గారణమేమో యూహింపనలవిగాదు. వీరుపండితులుపరిశోధకులు నైయుండియు భిన్నగోత్రులని శాసనములలో స్పష్టముగా వ్రాయఁబడియుండగా నాశాసనములం బ్రకటించినవారయ్యు నిట్లు వ్రాయుట

16

వింతగాఁ గన్పట్టదా? కలువచేఱుశాసనముం బ్రకటించిన శ్రీజయంతి రామయ్యగారు 'పరహితుఁడు కాళనాథునితనయుఁడు ప్రకృతముశాసనస్వామియగు కాళనాథభట్ల సుబ్రహ్మణ్యముగా రీకాళనాథుని వంశములోని వాఁడనియు, కాళనాథభట్లవారను నింటిపేరీకాళనాథునిఁ బట్టియే వారికి వచ్చెననియు నూహింపఁదగియున్నది. వీరు కాసలనాటివారు. వీరిది భారద్వాజసగోత్రము. యజుశ్శాఖ వీరియింట వైద్యవిద్య నేఁటికిని గలదట." అని వ్రాసి విమర్శలో తప్పు త్రోవదీసిరి. వీరి వాక్యములను విశ్వసించి ప్రభాకరశాస్త్రిగారుకూడ శాసనముల విమర్శింపక పంజరములోని కీరమువలె రామయ్యగారి పలుకే పలికిరి. రామయ్యగారి యూహసరియైనదికాదు. కాసలనాటి శాఖవారైన కాళనాథభట్ల సుబ్రహ్మణ్యముగారు కలువచేఱుశాసనములోని కాళనాథుని వంశములోనివారుగా రనుట స్పష్టము వీరిది భారద్వాజగోత్రము వానిది యాత్రేయసగోత్రము. కాళనాథభట్ల యను నింటిపేరుగలవారొక్క కాసలనాటిశాఖవారిలో నేగాక యాంధ్రదేశమున నితరశాఖలవారిలోఁగూడ నున్నవారు. కావున రామయ్యగారి యూహసరియైనదికాదని చెప్పక తప్పదు. పొన్నుపల్లిశాసనములోని బస్కరార్యుఁడును, కలువచేఱుశాసనములోని పరహితాచార్యుఁడును కప్పపాము కథకు సంబంధించిన పరహితుని వంశములో జనియించినవారైయుండ నొకరిని కాశ్యపగోత్రునిగాను మఱియొకని నాత్రేయగోత్రునిగాను భిన్నగోత్రులుగాఁ జెప్పుటకుఁ గారణము గనుపట్టదు. ఆంధ్రదేశమున బ్రాహ్మణులలో నేకగోత్రముగల వారి వంశనామములు వేర్వేఱుగ నుండుట గనంబడునుగాని యొకపురుషుని వంశములోనివారు భిన్నఋషిగోత్రములలోఁ బరగినవారిని బ్రాహ్మణులలో నేను గనుగొని యుండలేదు. ఇదియే ప్రథమమున నాకన్నులకుఁ దట్టినది. పొన్నుపల్లిశాసనములో మూలపురుషుఁడయిన పరహితుని గూర్చిన కథ కలువచేఱుశాసనములో వివరణముతోఁ గూడ నిట్లున్నది.

ఘ్రాప్తిఖ్యాతవక్త్రోభయపుట మసకృద్దర్శయంతం సమాస్యం
దృష్ట్వావల్మీకపార్శ్వే భుజగవర ముపేత్యాభయో యః కృపాళుః
కృత్వా సమ్యక్చికిత్సామచిర ముపరుజా తేన దత్తాభయశ్రీ
ర్వ్యాఖ్యాతోఽపకరిమతాత్పరహితభిషజో నామతస్యార్థకం యుక్తం.

పరహితాచార్యుఁడను వైద్యునకు మూలపురుషుఁడగు పరహితుఁడను నాతఁడొకానొకప్పుడొక సర్పము దాఁడలు రెంటికిని నెముక గుచ్చుకొని బాధపడుచుండుటఁ జూచి యాయెముక నూడఁబెఱికి పుండునకుఁ జికిత్సయొనర్చి, పరహితుఁడను నన్వర్థనాముఁడై యాపామువలన నభయదానమును బొంది చికిత్స చేయనారంభింప నాటినుండియు సర్పచికిత్స యాతనివంశమునఁ బరంపరగ నడచివచ్చుచుండెనఁట. భాస్కరార్యుఁడు భూలోకధన్వంతరియని శ్రీనాథుఁడు లిఖించినాఁడుగాని ప్రసిద్ధసర్పచికిత్సకునిగాఁ జెప్పియుండలేదు. తండ్రినిదక్క భాస్కరార్యుని పూర్వుల మఱియెవ్వరిని గూడ పొన్నుపల్లి శాసనము పేర్కొనియుండలేదు. కలువచేఱు శాసనమునఁ బరహితుని పూర్వులెల్లరును గొప్పసర్పచికిత్సకులని పేర్కొనంబడిరి. పొన్నుపల్లి శాసనము ౧౪౦౪ గవ సంవత్సరమునను, కలువచేఱు శాసనము ౧౪౨౩ వ సంవత్సరమునను లిఖియింపఁబడినవి. ఇంచుమించుగా రెంటికి నడుమ ౧౯ సంవత్సరము లుండును. ఇంతమాత్రము కాలవ్యవధిగల శాసనములలో నొకేవంశము యొక్క గోత్రములు భిన్నములుగానుండుటకు హేతువేమై యుండునో దురూహ్యము. వేమభూపాలుఁడు కృష్ణవేణ్ణానదికి దక్షిణతీరముననుండు పొన్నుపల్లియను గ్రామమునకు వేమవరమనునామమును బెట్టి సోమేశ్వరస్వామి సన్నిధానమునఁ బుత్త్రపౌత్త్రపారంపర్యముగా ననుభవింప ననేక బ్రాహ్మణులయెదుట భాస్కరార్యునకు దానముచేసి యుండెను.

(౨) సింగనార్యుఁడు;—కళ్యాణగుణశాలియగు పెరియపెళ్ళకు సప్తసాంగవేదవేదియు బ్రహ్మవాదియు నగు భట్టభాస్కరార్యుని పౌత్రుఁడు; పదునెనిమిదివిద్యల యందు పారంగతుఁడైన విశ్వనాథార్యునకు

బుత్రుఁడు; సాష్టాంగమయిన యజుర్వేద మధ్యయనము చేసినవాఁడు; ఫణిరాజమహాభాష్యఫక్కికాపరమేష్ఠి; పూర్వోత్తరమీమాంసాశాస్త్రముల బాగుగా నెఱింగినవాఁడు; కణాదగీతములతర్కశాస్త్రముల నేర్చినవాఁడు; యజుర్వేది; ఆపస్తంబసూత్రుఁడు; కాశ్యపగోత్రుఁడు శివభక్తుఁడు. ఈశాసనకాలము శా. శ. ౧౩౬౦ అనఁగా క్రీ. శ ౧౪౦౮ దవ సంవత్సరము. దత్తాగ్రహారము పొన్నుపల్లి. ఇయ్యది దివిసీమలో కృష్ణాతీరమున నున్నది. ఇందలి పెరియపిళ్ళ, విళ్లియార్య నామములను బట్టి యీ దానప్రతిగ్రహీతయగు సింగనార్యుఁడు ద్రావిడబ్రాహ్మణుఁడగునేమోయని సంశయము కలుగుచున్నది.

(౩) పెద్దియజ్వ:-ఇతఁడు యజుర్వేది. హరితసగోత్రుఁడు; కృష్ణాతీరమున ననేకయజ్ఞములను జేసిన మహావిద్వాంసుఁడగు భీమయజ్వయీయనముత్తాత (తాతతండ్రి) షట్తర్కకర్కశాలాపప్రక్రియాపరమేశ్వరుండనఁ బ్రసిద్ధిగాంచిన మహావిద్వాంసుఁడు. పోతయ యీయన తాత పౌండరీకయాగము జేసి బ్రహ్మసంతతికి నలంకారమయినవాఁడు. గుండయ యీయనతండ్రి; గోదావరీతటమునఁ బెక్కుయజ్ఞములను గావించినవాఁడును బ్రహ్మ, సూర్యాదిసిద్ధాంతములను శోధించి తెలిచి చూచిన దైవజ్ఞుఁడును త్రికాలవేత్తయు నైనవాఁడు పెద్దియజ్వ: ఇతఁడనవేమభూపాలునివలనఁ గూడ నగ్రహారమును బడసినవాఁడు. ఖండవాటనున్న కల్వాములయను గ్రామమును నగ్రహారమును బడసినవాఁడు. ఈశాసనకాలము శా.శ. ౧౩౨౬ వ సంవత్సర మనఁగా క్రీ.శ. ౧౪౦౪వ సంవత్సరము. ఇతఁడె శా. శ. ౧౩౩౩ అనఁగా క్రీ. శ. ౧౪౧౧ వసంవత్సరమున వేమభూపాలునివలన ఖండవాటిసీమలోని నందమూరు గ్రామమును దానము నొందెను.

(౪) శంకరగురువు;-ఇతఁడు వేమభూపాలుని మంత్రిశేఖరుఁడు సింగనామాత్యునకు గురువని శృంగారనైషధములో శ్రీగురుశంకరహాని

దయాగౌరవ నిత్యవర్ధితాన్వయా' యని సింగనామాత్యుని సంబోధించిన శ్రీనాథుని సంబోధన పద్యపాదమువలన గ్రహింపనగును. పినపాడునందున్న యుద్భటారాధ్యుని సంతతివారగువారు తామీశంకరగురు సంతతివారమని చెప్పుకొనియెదరు. వేమభూపాలునివలన శా. శ. ౧౩౨౭ అగు పార్థివసంవత్సర మాఘ మహాశివరాత్రి పుణ్యకాలమున శ్రీశైలమునకుఁ బోయినపుడచట పినపాడను గ్రామ మీశంకరదేశికునకు దానము చేయఁబడినది.

(5) పిసిపాటిరామభద్రసోమయాజి:—— ఇతఁడు షట్కర్మనిరతుఁడు. యజుర్వేదవేత్త ఆపస్తంబసూత్రుఁడు భారద్వాజస గోత్రుఁడు బహుతపస్సంపన్నుఁడు; బ్రహ్మవేత్త శా. శ. ౧౩౩౦అగు సర్వధారినామసంవత్సరాశ్వీయుజ బహుళామావాస్యా సూర్యగ్రహణపుణ్యకాలమున క్రీ. శ. ౧౪౦౮ వేమభూపాలుఁడీయనకు సహిరణ్యోదక దానధారాపూర్వకముగా పొట్లపాడు అనుగ్రామము నగ్రహారమునుగాఁ జేసియొసంగెను.

(6) విశ్వేశ్వరపండితుఁడు:—— ఇతఁడు చమత్కారచంద్రికయను నలంకారశాస్త్రమును రచించినవాఁడుగఁ గన్పట్టుచున్నాడు. ఇతఁడు యశోనిధి, మహామేధావి విద్యావిహార భూమి, యగు మాధవార్యుని పౌత్రుఁడు. వేదాదివిద్యలకు జన్మమందిరమువంటివాఁడగు గుండయార్యుఁడీతనితాత! లక్ష్మీనరసింహ మంత్రసిద్ధుఁడును, శాపానుగ్రహదక్షుఁడును, సకలకవిసార్వభౌముఁడును నగుమాధవార్యుని కుమారుఁడు; మహావిద్వాంసుఁడు; విద్యావినయాన్వితుఁడు. వెలనాటిలో తుంగభద్రాతీరమునందున్న ఆలపాడనుగ్రామము నీతని కగ్రహారముగా నొసంగఁబడెను. విశ్వేశ్వర భట్టారకుఁడు వెనువెంటనే యరువదిపాళ్లుగా విభజించి తనవంతుభాగముగాక తక్కినభాగములను విశిష్ట బ్రాహ్మణులకుఁ బంచి యిచ్చెను.

(7) రామచంద్రజ్యోతిషికుఁడు:—— ఇతఁడు పెద్దియజ్వపుత్రుఁడు

బ్రహ్మసూత్రాద్యాది సిద్ధాంతరహస్యార్థ రేకవేది. ఇతనికిరుద్రవరమను గ్రామము దానముచేసినపుడీతఁడును మఱికొందఱు బ్రాహ్మణులును బంచికొనిరి.

ఇట్టిమహావిద్వాంసులతోఁ గూడుకొని సకలవిద్యాసనాథుఁడైన శ్రీనాథకవి యధ్యక్షుఁడుగానున్న పరిషదంబుచే నలంకరింపఁబడిన యాస్థానముచేనలంకరింపఁబడిన కొల్వుకూటమున సర్వజ్ఞచక్రవర్తి బిరుదాంకితుఁడైన పెదకోమటి వేమభూపాలునిఁ జూచియొకకవి:—

శ్లో. జ్ఞాతా యది నహి దాతా
దాతా చేత్సోఽపి భువినతజ్ఞాతా
జ్ఞాతా దాతా చాభూః
పెదకోమటి వేమనృపతే చిత్రమ్.

శ్లో. అర్థిజనచింతితార్థా
దధికం చేత స్తతోఽపితే వాణీ;
అస్యా అపి శిశతికరః
పెదకోమటివేమభూపతే చిత్రమ్.

శ్లో. శ్రితపోషణ రిపుశోషణ
బుధతోషణ సత్యభాషణాది గుణాన్
దధతే దశరథరామః
ప్రాగద్యకలౌతు కోమటివిభు వేమః

అని పొగడుటొక యాశ్చర్యకరమైన విషయముగాదు.

## శ్రీనాథుని వివాహము.

క్రీ. శ. ౧౪౪౫ దవ సంవత్సరమునాటికి రెడ్డిరాజ్యము లనందగిన రాజమహేంద్రపురరాజ్యమును, కొండవీడురాజ్యమును, విజయనగరసామ్రాజ్యాధీశ్వరుల దగు నుదయగిరిరాజ్యమును కటకపురాధీశ్వరుఁడయిన కపిలేంద్రగజపతికి సంపూర్ణముగా వశ్యములై యాతనిచే బరిపాలింపఁబడుచుండిన వనుట స్పష్టము. మాధవవర్మ వంశోద్భవుఁడగు బసవభూపాలుఁ డుదయగిరిరాజ్యమును గజపతుల పక్షమునఁ బరి

పాలించుచున్న కాలమున నాతనికి మంత్రిగానున్న చందలూరి గంగయామాత్యునకుఁ దాను రచియించిన నాచికేతోపాఖ్యానము నంకితము గావించినవాఁడు శ్రీనాథుని మఱఁది దగ్గుబల్లి దుగ్గనామాత్యకవి. ఇతని యక్కయె శ్రీనాథుని భార్య. ఇతఁడు శ్రీనాథునకు మఱఁదిమాత్రమెగాక శిష్యుఁడననిగూడఁ జెప్పుకొనియున్నవాఁడు. కపిలేంద్రగజపతి (క్రీ. శ. ౧౪౬౧ వఱకు మాత్రమే యీరాజ్యములను బరిపాలించియుండె నని మన మెఱుంగుదుము. కాని బసవభూపాలుఁ డెప్పటినుండి యెప్పటివఱకు నుదయగిరిని బరిపాలించియుండెనో యాధార మంతఁగాఁ గానరాదు. ఎట్లయినను కపిలేంద్రగజపతి బ్రదికియున్నకాలమున అనఁగా క్రి. శ. ౧౪౪౮ మొదలుకొని క్రీ. శ. ౧౪౬౧ వఱకుఁ గల మధ్యకాలమునందు ఉదయగిరిరాజ్యమును బసవభూపాలుఁడు బరిపాలించుచుండె ననుట సత్యమునకు విరుద్ధముకాదుగనుక నాకాలమున నాతని మంత్రియగు గంగయామాత్యుఁ డుండెనని చెప్పఁదగును. కావున దుగ్గనకవి తన నాచికేతూపాఖ్యానమును గంగయామాత్యునకు ౧౪౫౦ దవ సంవత్సరప్రాంతముల నంకితము చేసియుండును. శ్రీనాథుఁడు పెదకోమటివేమభూపాలునికడ విద్యాధికారిగఁ బ్రవేశించిన కాలముననే నీతఁడు పుట్టియుండవచ్చును. ఇతని యక్కకుఁ బెండ్లినాటికి పదేండ్లు వయస్సు గలిగియుండునుగనుక నామెను ౧౪౦౦ నాటికి వివాహమయిన యెడల ౧౪౦౪ నాటికి శ్రీనాథుఁడు విద్యాధికారి పదవికి వచ్చునప్పటికి నిరువదినాలుగేండ్ల ప్రాయముగలవాఁడై యుండుటయు, భార్య పదునాలుగేండ్ల వయస్సుకలదై కాపురమునకు వచ్చియుండుట సత్యమున కంతదూరములు కావు. దుగ్గనకును, అతని యక్కకును ౧౦ సంవత్సరములకన్న నెక్కువ వ్యత్యాస ముండు నని తలంపఁజాలను. శ్రీనాథునకు మఱఁదియు, శిష్యుఁడునై యుండుటయె గాక 'కాంచీపురమహాత్మ్యము' మను ప్రబంధమును గూడ రచియించిన

వాఁడుగావున శ్రీనాథుఁడు కాంచీపురమునకుఁ బోయి యవచితిప్పయను సందర్శించినకాలమున దుగ్గనకూడ పోయియుండును. అప్పటి కితఁడిరువదియేండ్లప్రాయముగలవాఁడై యుండవచ్చును. గంగయామాత్యుఁడును వాని ప్రభువగు బసవభూపాలుఁడును పురుషోత్తమగజపతి కాలములోఁ గూడ గొంతకాల ముండియుండవచ్చును. గంగయామాత్యుఁడు ప్రథమమునఁ గృతిపొందిన గ్రంథము నాచికేతూపాఖ్యానమె. తరువాత నంకితము నొందినది ప్రబోధచంద్రోదయము. నంది మల్లయ్య, ఘంట సింగయ్యల కంటె (ప్రబోధచంద్రోదయ కర్తలు) వయస్సున దుగ్గన పెద్దవాఁడుగాని సమానవయస్కుఁడు గాఁడు. దుగ్గన కవిత్వమును గంగయామాత్యుఁడు ప్రశంసించి ప్రస్తుతించిన విధ మీ క్రిందిపద్యమున నభివర్ణింపఁబడినది.

చ. శ్రుతులవిహారదేశములు సుస్థిరవాక్య పదప్రమాణ శా
స్త్రతతుల యిక్కలాగమ పురాణచయమ్ముల మేలిసద్మముల్
స్మృతుల నివాసముల్ కవిసమీహిత సత్కవితాగుణ ప్రసా
దితములు దగ్గుబల్లికవి తిప్పయ దుగ్గన గద్యపద్యముల్.

## వేముని కాశీరామేశ్వరయాత్రలు.

పెదకోమటివేమభూపాలుఁడు శా. శ. ౧౩౨౬ తారణసంవత్సరములో (క్రీ. శ. ౧౪౦౪) రామేశ్వరయాత్రకుఁ బోయినట్లు ద్రవిడదేశమునందలి తిరువళ్ళూరు వీరరాఘవస్వామికి సువర్ణకిరీటము సమర్పించినట్లు వ్రాయించి యా దేవాలయమునఁ జెక్కించిన శాసనముఁబట్టి తెలియుచున్నది. ఈశాసనమున నితని వంశవర్ణన మంతయుఁ బద్యములలో నభివర్ణింపఁ బడియున్నది. ఇం దితఁ డిక్ష్వాకువంశమునఁ బుట్టిన క్షత్రియుఁడుగా నీక్రిందిపద్యములో వర్ణింపఁ బడియెను.

శా. ఏవంశంబున నుద్భవించి కరుణాపాత్రత్వముం జెం డిక్ష్వాకుఁడున్
ధీవర్యుండు రఘుం డజుండు ఘనసంకీర్త్యుండనుండున్ గుణం
డివిశ్వంబును ఖ్యాతి నేలి రలఘుశ్రీకాన్వయంబందు వా
త్రీవర్యుల్ జనియించి యేలి రతఁ డీరీతిన్ బెక్కురా పిమ్మటన్

ఉ. ఆ యనవంశమునందు నరపాగ్రణి ప్రోలనృపుండు పుట్టె బా
హాయతశక్తిమంతుఁడ హితౌఘ విపాటన శూరవర్యుఁడున్
న్యాయగుణుండు వేమ నరనాథుఁడు పుట్టెను వానివంశమం
దాయతమైన భూవలయ మంచితనీతిని నేలు చుండఁగన్.

మఱియు నావంశవర్ణనము చివర

సీ. శకవత్సరంబులు శరపక్షగుణ
శశిసంఖ్యయు బాగుగ జరుగుచున్న
సుమహితతారణాబ్దమున శ్రావణపౌర్ణ
మంబున నాదివారంబునందు
చారు తిర్వళ్ళూరు వీరరాఘవునకు
నిజరాజ్యవృద్ధికై నిర్మలమతి
మేటి యా స్వర్ణకిరీటంబు నర్పించె
సకలలోకవిదులు తగ సంస్తుతింప
నూరమాంబికాయావనా స్తోకవన
వసంతు డహితాళికాలుఁడు సత్యగతుఁడు
వీరనారాయణుఁడు మహాధీరవరుఁడు
విమలగుణసాగరుండు నా వేమవిభుఁడు.*

ఇయ్యది శ్రీనాథుఁడు విద్యాధికారిగ నేర్పడక
త్సరము ప్రథమ భాగమున జరుపఁబడియుండును. ఈయాత్రలో వేమ
భూపాలునితోఁ గూడ శ్రీనాథుఁ డరిగియుండునుగావున నీశాసనమును
నాతఁడే రచించియుండు నని యూహించుట కవకాశము గలదు.
మఱియు ఫిరంగిపురశాసనమునందు,

శ్లో. శ్రీశైలేస్థిర మాశ్రితా ముపగతా వృద్ధిం కుమారాచలే
పంపాగ్రామతతే ప్రతానసుషమా సింహాచలేం ద్రేతతః
శ్రీకూర్మే పురుషోత్తమే కుసుమితా యద్ధస్య కీర్తిర్లతా
కాశ్యాం విశ్వపతేః పురః ఫలవతీ నిర్యోపహారోచితమ్.

---

*ఈశాసనము శ్రీమాన్ శేషాద్రి రమణకవులు, మండపేట వెంకటకృష్ణకవి గార్లచే రచియింపఁబడిన 'రెడ్డిసంచికా సందిక' యను గ్రంథమున మఱి పేర్కొనఁబడినది.

"పెదకోమటివేముని కీర్తిలత శ్రీశైలమున స్థిరమూలమై కుమారాచలమున వృద్ధినొంది పంచారామములందును, సింహాచలమునను బందిరి యల్లి, శ్రీకూర్మమునను, పురుషోత్తమమునను బుష్పించి కాశిలో విశ్వనాథు నెదుర నిత్యనైవేద్యమున కుచితముగా ఫలించె" నని వయిశ్లోకమున కర్థము. వేమభూపాలచరిత్రమున నాతఁడు దిగ్విజయార్థముగా నాసేతుహిమాచలము యాత్ర సలిపిన ట్లాగ్రంథమునం దదియే ముఖ్యవిషయముగా వామనభట్టబాణుఁ డభివర్ణించియున్నాఁడు. శ్రీనాథుఁడుగూడఁ గాశీయాత్రలో వేమభూపాలుని వెంబడించియుండును. ఈక్రిందిశ్లోకముగూడ వేమభూపాలుఁ డీయాత్రలను చేసినట్లు బలపఱచుచున్నది.

శ్లో. కావేర్యాం త్రిపురాంతకే జయపురే కాశీపురే గోపతే
పంచారామపురీషు పట్టసపురే మార్కండ శంభోః పురే,
గంగాసాగర సంగమేషు నిరతం శ్రీకొండవీటీపురే
చాళుక్యామయతాన్న దాన నిరతయ శ్రీ వేమభూపప్రభుః.

రామేశ్వరయాత్ర ముగించినవెనుకఁ గాశీయాత్రకుఁ బోయియుండును.

### సంతానసాగర నిర్మాణము.

ధాన్యవాటిపురమను నామాంతరముగల ధరణికోటకుఁ బ్రభువగు గన్నభూపాలుని కూతురైన సూరాంబను పెదకోమటి వేమభూపాలుఁడు వివాహముఁ జేసికొనియెను. ఆమె సంతానసాగరమను నొక పెద్ద చెఱువును ద్రవ్వించి శా. శ. ౧౩౩౧ విరోధిసంవత్సర ఫాల్గుణ బ ౭ శుక్రవారమునఁ బ్రతిష్ఠ యొనర్చెనని ఫిరంగిపురశాసనమువలనఁ దెలియుచున్నది. ఈశాసనము చివరను,

"విద్యాధికారి శ్రీనాథా వీరశ్రీవేమభూపతేః
అకరో దాకరో వాచాం నిర్మలం ధర్మశాసనం."

అని యుండుటచేత నియ్యది శ్రీనాథ విరచితమని స్పష్టపడుచున్నది. ఈశాసనముతుదను శ్రీనాథ విరచితములైన యీక్రింది సీస

పద్యములు మూఁడును సంతానసాగర ప్రతిష్ఠను దెలుపునవియై యున్నవి.

సీ. శాకాబ్దములు సహస్రమును మున్నూటము
ప్పదియొకండును నైన భవ్యసంఖ్య
వఱలు విరోధి సంవత్సరంబున ఫాల్గు
నంబున బహుళపక్షంబు విదియ
శుక్రవారంబున శుభముహూర్తంబున
శ్రీధాన్యవాటీపురాధిపతియు
కృష్ణవేణ్ణా జలక్రీడావినోదుండు
నగు గన్నభూపాలు ననుగుబుత్రి

గీ. వీరనారాయణుండు వేమవిభునిదేవి
భూరిసద్గుణనికురంబ సూరమాంబ
జగము వినుతింప సంతానసాగరాఖ్య
వరతటాక ప్రతిష్ఠోత్సవం బొనర్చె.

సీ. జాహ్నవీ యమునాది సకలపావనసరి
ద్విమలతీర్థాంభః పవిత్రితంబు
సవిధదేశస్థాయి శివమౌళి బాలేందు
కౌముదీ సంఫుల్ల కైరవంబు
బహుల మహాపరివాహ పాదోభరధ్వన
ఘుమఘుమాయితదిశా గోళకంబు
జల సారణీసేక సంవర్ధితానేక
వని వినితాధ్వగాధ్వశ్రమంబు

గీ. బలవదురుమత్స్య కచ్ఛపధుళికుళీర
తిమితిమింగళ విక్రమక్రమవిహార
తరళతర తుంగభంగ కదంబచుంబి
తాభ్రవీథిసంతాన మహాపయోధి.

సీ. కపటసూకరమైన కైటభాసురవైరి
ఖురపుటంబులఁ బరిక్షుణ్ణ మయ్యె
రఘుకులోద్వహ ధనుర్యంత్రముక్తమైన
చిచ్చరమ్ముల వేడిఁ జేవఁదఱిఁగె

కుంభసంభవుని హస్తాంభోరుహంబున
నాపోసనంబయి హాస్యమొందెఁ
బాషాణముల నచ్చభల్ల గోలాంగూల
కపియూథములచేతఁ గట్టువడియె
గీ. వననిధియే భంగి సరివచ్చు ననఁగవచ్చు
నా రసాతల గంభీరవారియగుచు
నపగతాపాయమగుచు శోభాఢ్యవగుచు
ననుపమంబైన సంతానవననిధితోడ. ,,

క్రైస్తవమానముచే సంతానసాగరప్రతిష్ఠాతిథి ౧౪౧౦ వ సంవత్సరము ఫిబ్రివరు ౨౧ తేదీ శుక్రివారమగుచున్నది. ఈసంతానసాగరమును చెఱువునకు నీరువచ్చుటకై యీసూరాంబకొడుకు రాచవేముఁడు శా. శ. ౧౩౩౭ మన్మథ సంవత్సర మాఘ శు ౧౫ దినమునకు సరియైన క్రైస్త్రవమానము ౧౪౧౬ వ సంవత్సరము జనవరి ౧౪ వ తేదీ మంగళవారమునాఁడు 'జగనొబ్బగండకాలువను' త్రివ్వించునట్లు అమీనాబాదు శాసనము దెలుపుచున్నది. అది శ్రీనాధకృతియైన యొక సీసపద్యముగా నున్నది. దాని నీదిగువ నుదాహరించెదను.

,,సీ. శాకాబ్దములు సహస్రంబును మున్నూట
ముప్పదియేడును నొప్పుమిగుల
మహనీయమైన మన్మథవత్సరంబున
మఘమాసమునఁ బూర్ణిమాదినమున
హేమాద్రి దానచింతామణియరిరాయ
బసవశంకరుఁ డాజి ఫల్గుణుండు
సమదారి రాయవేశ్యాభుజంగుండు వే
మయరాచ వేమన క్ష్మాపరుండు
గీ. తల్లిసూరాంబచే సముత్పన్నమగుచుఁ
బరగుసంతాన వార్ధికి వరువగాఁగ
నొలయుగిరి వాహినుల జగనొబ్బగండ
కాలువఘటించె నాతారకంబుగాఁగ.,,

(శ్రీనాధకృతి)

## పెదకోమటివేముని యంత్యదశ.

పెదకోమటి వేమభూపాలుని పరిపాలనము సర్వవిధములచేత శ్లాఘాపాత్రమైనదిగా నున్నది. అతఁడు మిక్కిలి సమర్థుఁడు. ప్రజ్ఞావంతుఁడు. అతనిమంత్రులెల్లరును ప్రజ్ఞావంతులు. బాహుబలవిక్రమసంపత్తికలవాఁడగుటచేత శత్రురాజులెవ్వరెన్నివిధములఁ దనరాజ్య మాక్రమించుకొనవలయునని ప్రయత్నించినను వారలను బరాజితులను గావించి నైపుణ్యముమీర జనరంజకముగా ధరాపాలనంబు గావించెను. క్రొత్తసుంకములను వేయక ప్రాతపద్ధతులనే బలపఱిచి సుంకములు రాఁబట్టుచుండెను. వర్ణాశ్రమధర్మములను బోషించెను. వేదాధ్యయన సంపన్నులును శాస్త్రవేత్తలునగు బ్రాహ్మణోత్తములకు భూదానములు మొదలగునవి చేసి సత్కరించుచు సమస్తవిద్యలను బోషింపుచుండెను. దేశమున వర్తకవ్యాపార మభివృద్ధియగు మార్గములను వెదకుచుండెను. బావులను చెఱువులను త్రవ్వించి వ్యవసాయకులకు నుపకారము గావింపుచుండెను. దేశమున ననేక మతప్రతిష్ఠాపనములను గావించెను. ఈతఁడు ౧౪౨౦ వఱకుఁ బరిపాలనము చేసినట్లు గానంబడుచున్నది. కుమారగిరిరెడ్డి మరణానంతరము పెదకోమటివేమభూపాలునిఁ దిరస్కరించి కాటయవేముఁడు రాజమహేంద్రపుర రాజ్యమును స్వతంత్రుఁడై పరిపాలనము చేసెను. అందువలనఁ బెదకోమటి వేమభూపాలునకును, కాటయవేమభూపాలునకును మనస్పర్థలేర్పడి యొండొరులరాజ్యము లాక్రమించుకొనుటకై యుద్ధములఁగూడఁ జరుపుచువచ్చిరి. ఈయుద్ధములవలన నిరువురకుఁ గూడఁ బ్రయోజనము లేకపోయెను. ఎవ్వరి ప్రభుత్వములు వారికి నిలిచియుండెను. ఈపోరాటములోఁ గొండవీటిరెడ్ల జ్ఞాతియైన అల్లాడరెడ్డి కాటయవేమభూపాలుని పక్షమున నిలిచి యాతనికి సాహాయ్యమును సలుపుచుండెను. అల్లాడరెడ్డి కొండవీటిరెడ్లకు జ్ఞాతిమాత్రమె గాక కొండవీటి రాజ్యపాలకుఁడైన అనవేమభూపాలుని మనుమరాలి

భర్తయై యుండెను. కాటయవేముని మేనమామయగు అనపోతభూపా లుఁడు ఈఅల్లాడిరెడ్డి భార్య వేమాంబతల్లికిఁ బెదతండ్రియై యుండెను. అనఁగా కాటయవేముఁడును, అల్లాడరెడ్డిభార్య వేమాంబ తల్లియును మేనత్తమేనమామ బిడ్డలగుదురు. ఇట్టి సంబంధబాంధవ్యముచేత అల్లా డరెడ్డి కాటయవేముని పక్షముననుండి పెదకోమటి వేమభూపాలునికిఁ బ్రత్యర్థిగఁ బనిచేసెను. కుమారగిరి యనంతర మక్రమముగాఁ బెదకోమ టివేమభూపాలుఁడు కొండవీటిరాజ్యము నాక్రమించెను గావునఁ గాట యవేమారెడ్డియును, అల్లాడరెడ్డియును న్యాయముకొఱకే పోరాడి యుందురు. కాని యీవిరోధముల వలన రెడ్డిసామ్రాజ్యముయొక్క యున్నతికి భంగము కలిగించెను. పెదకోమటి వేమునికంటె నైదుసంవ త్సరములు ముందుగానే అనగా ౧౪౧౫ వ సంవత్సర ప్రాంతమునఁ గాటయవేముఁడు మృతినొందెను. అతఁడు మృతినొందినను అతనిసంతా నము పక్షమున నల్లాడరెడ్డి పెదకోమటివేమునితోఁ బోరాడిజయించెను. పెదకోమటివేముఁడు ౧౪౨౦ దవ సంవత్సర ప్రాంతమున మృతినొంది యుండును. ఈతనితరువాత నీతనికుమారుఁడు రాచవేమన రాజ్యభార మును వహించి నాలుగుసంవత్సరములు పరిపాలనముచేసెను గాని యి తఁడు తన దుష్ప్రవర్తనముచేతఁ దండ్రికి నపయశస్సు గలిగించుటయు గాక తనప్రాణములను గూడఁ గోలుపోయెను. వీనితరువాత రాజ్య మంతయును గర్ణాటాధీశ్వరుల స్వాధీనమాయెను. శ్రీనాథుఁడు ౧౪౨౦ వఱకుఁ గొండవీటి నగరమున నున్నవాఁడనుట విస్పష్టము.

## పల్నాటిచరిత్ర రచనాకాలము.

శ్రీనాథుని పల్నాటివీరచరిత్రమని యొకభాగమును బ్రచురించిన శ్రీఅక్కిరాజు ఉమాకాంతముగారు పీఠికలో నిట్లువ్రాసియున్నారు.

"ప్రథమమున గౌరవము పడయకపోయినను రానురాను శ్రీనా థుఁడు పల్నాటివారితో మిక్కిలి మైత్రి పాటించి తనవార్ధక్యము నంత

యు నచ్చటనే గడపెను. పల్నాటివీరచరిత్ర మచ్చటనుండియే వ్రాసి నాఁడు. కాశీఖండము తరువాత నితఁడు రచించినది హరవిలాసము హరవిలాసము తరువాత నితఁడురచించినది పల్నాటివీరచరిత్రము వీరచరిత్రము యొక్క పౌర్వాపర్యము తెలిసికొనుట కాగ్రంథమున నాధారములు గన్పట్టుచున్నవి. బాలచంద్రుని యుద్ధఘట్టమున:—

ద్వి. ఎసఁగెడు శివకంచి యేకామ్రపతికిఁ
జిఱుతొండ భక్తుఁడు చెలఁగు మార్తండి
సెంకలసిరువను చెలువమాతల్లి
సిరియాళుఁడనఁబుట్టి చెన్నొందినాఁడ.

అని తన హరవిలాసములోని చిరుతొండనంబి కథను సూచించి యున్నాఁడు. గనుకఁ బల్నాటివీరచరిత్రమే యితఁడు రచించిన గ్రంథములలో నెల్లఁజివరగ్రంథమని చెప్పవలయు"

దీనికిఁ బ్రతిపక్షవాదముగా శ్రీవీరేశలింగముగారు నూతనముగాఁ బ్రచురింపించిన కవులచరిత్రములో నిట్లు వ్రాసియున్నారు.

"కాఁబట్టి మరుత్తరాట్చరిత్రము ౧౩౮౩ వ సంవత్సరప్రాంతమున రచించెనని చెప్పవచ్చును. నాకీపుస్తకము లభింపనందున శైలి యెట్లున్నదో యందు వ్యాకరణాది దోషము లేమయిన నుండినవో యది యెవ్వరికైన సంకితము చేయఁబడినదో లేదో చెప్పఁజాలను. ఈతఁడు చేసిన రెండవగ్రంథము పల్నాటివీరచరిత్రము నందలి బాలునికథ. ఇది యు నింటికడనున్నప్పుడే (కొత్తపట్టణములో) స్వగ్రామము నందలి పల్నాటివీరుల కులమువారి ప్రోత్సాహముచేత రచియింపఁబడి యుండును. ఈపుస్తక రచనమువలన శ్రీనాథునకుఁ గొంతధనలాభము గలిగియుండును. పల్నాటివీరచరిత్రము ద్విపదకావ్యము. ఇది ౧౩౮౮ వ సంవత్సర ప్రాంతములయందు రచియింపఁబడి యుండును. పల్నాటివీరులచరిత్ర ద్విపద నోర్వుగంటిపురములో నాడినట్లు ౧౪౨౦వ సంవత్సర ప్రాం

తములందు వల్లభరాయనిచే రచియింపఁబడిన క్రీడాభిరామమునం దిట్లు చెప్పఁబడినది—

గీ. . . విప్రు, డీక్షించెఁ బలనాటి వీరపురుష
పరమదైవత శివలింగభవనవాటి.

మ. ద్రుతతాళంబున. . . . . .
యతిగూడం ద్విపద ప్రబంధమున వీరానీకముం బాడె నొ
క్కత ప్రత్యేకముగాఁ గుమారికులు ఢీట్కారంబునతూలఁగన్.

గీ. . . . . . పడతి పల్నాటి వీరుల బాడునపుడు.'

ఈ పుస్తకమువలన గలిగిన ప్రోత్సాహమునుబట్టి శ్రీనాథుఁడు గొప్పవానికిఁ గృతులిచ్చి ధనార్జనము చేయవచ్చు నన్న యాశగల వాఁడై స్వగ్రామమును విడిచి స్వస్థలమునకు మిక్కిలి సమీపమున నున్న యొక చిన్న సంస్థానమునకుఁ బోయెను. ఆ సంస్థానమున కప్పు డధిపతి పెదకోమటివేముఁడు.'

శ్రీవీరేశలింగముఁగారిచేత నిట్టి గంతల తడిక నల్లించినది యాంధ్రుల చరిత్రము మూఁడవభాగములో నాయీవాక్యములై యున్నవి.

"పల్నాటివీరచరిత్రమును శ్రీనాథుఁడు రచించెనని చెప్పెదరు కాని శ్రీనాథవిరచితమైన పల్నాటివీరచరిత్రముయొక్క సంపూర్ణగ్రంథ మెచ్చటను గానరాదు. చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున శ్రీనాథవిరచితమని వ్రాయఁబడిన పల్నాటి వీరచరిత్రములోని యొక భాగము మాత్రము గన్పట్టుచున్నది. ఆభాగమైనను శ్రీనాథ విరచిత మని విశ్వసించుటకుఁ బ్రతిబంధకములు చాలఁ గలవు. శ్రీయుతులైన ఉమాకాంతముగారు ప్రచురించిన పల్నాటివీరచరిత్రభాగము శ్రీనాథ కవి రచితము కాదని తోఁచుచున్నది. ఉమాకాంతముగారు పల్నాటి వీరచరిత్రమును శ్రీనాథుఁడు వార్ధకదశయందు వ్రాసెనని వ్రాయు చున్నారు గాని నిక్కముగా నాతఁ డాచరిత్రమును రచించియుండు నేని

బాల్యముననే వ్రాసియుండును గాని యాతప్పులఁ దడిక వార్ధకదశ యందు నల్లియుండఁడు."

శ్రీనాథుని పల్నాటివీరచరిత్ర సంపూర్ణగ్రంథ మెచ్చటను గానరాదని నేను వ్రాయుటచేత వీరేశలింగముగారు పల్నాటివీరచరిత్రమునందలి బాలునికథ మాత్రము వ్రాసెనని చెప్పినారు. పంధొమ్మిదేండ్ల ప్రాయమున నిల్లు విడిచిపెట్టినినాఁడు సముద్రతీరమునఁ గొత్త పట్టణములోఁ గూరుచుండి శ్రీనాథుఁడు పల్నాటి వీరుల కులమువారి ప్రోత్సాహముచేత రచించినాఁడట! పల్నాటి వీరుల కులమఁట! పల్నాటివీరులలో క్షత్రియులు, గొల్లలు, రెడ్లు, పద్మనాయక వెలమలు, మాలలు, మాదిగలు మొదలగు కులములవా రెందఱో కలరు. పల్నాటివీరుల కులమువా రన్న నాకర్థమగుచుండలేదు. పల్నాటియనుభవములేని పిన్నవాఁడు పల్నాటివీరచరిత్ర మెట్లువ్రాయఁ గలిగెనో యూహింపనలవిగాక యున్నది. కంటిరా యీచిత్రము ఈపందొమ్మిదేండ్ల పిన్నవాఁడు గ్రంథారంభమునను గ్రంథాంతమునను నేమనుచున్నాఁడో యొక్కమాఱు చిత్తగింపుఁడు. గ్రంథాదిని.

సంగీతసాహిత్య చాతుర్య కవితఁ
జెప్ప నేర్చినవాఁడఁ జెలఁగి మాచెర్ల
చెన్నరాయని పాదసేవారతుండ
వలను భారద్వాజవంశ వర్ధనుఁడఁ
గవిసార్వభౌముఁడ ఘనతగన్నట్టి
శ్రీనాథుఁడనువాఁడ శివభక్తిపరుండ.

అనియును గ్రంథాంతమున

'ఘనుఁడైన శ్రీనాథకవిరాజరాజు
చెన్నుని కృపచేతఁ జిత్తముప్పొంగి
బాలుని విక్రమప్రౌఢియంతయును
వివరించె జనులకు విశదముగాను.

అని వ్రాయఁబడియున్న దే. ఆహా! ఇది యెట్టివిపరీతసిద్ధాంతము? క్రీ. శ ౧౪౨౬ వ సంవత్సరప్రాంతమున శ్రీనాథుఁడు కర్ణాట రాజధానికిఁ బోయి ప్రౌఢదేవరాయల యాస్థానంబున గవిసార్వభౌమ బిరుదాంచితుఁ డైన గౌడడిండిమభట్టుతోడ నుద్భటవివాదము పెట్టుకొని వాని నోడించి యాదేవరాయమహారాయల ముత్యాలశాలలో కనకాభిషేకమహోత్సవమును గాంచినది మొదలుకొని కవిసార్వభౌమ బిరుదముతోఁ బ్రవర్తిల్లుచుండెనని వ్రాసిన శ్రీవీరేశలింగముగారు ౧౩౮౪ వ సంవత్సరమున శ్రీనాథుడు తన పందొమ్మిదవ యేఁటనే కవిసార్వభౌమ బిరుదాంచితుఁడై పల్నాటివీరచరిత్రము తప్పుల తడికను రచించెనని వ్రాయుట హాస్యాస్పదముగుచుండలేదా? ౧౪౨౦దవ సంవత్సరమునాటికే యోరుగంటిపురములోఁ బల్నాటివీరచరిత్రము పాడుచున్నారు గనుక నంతకుఁబూర్వమే పల్నాటివీరచరిత్రము శ్రీనాథుఁడు రచించినాఁడని యొక హేతువు. ఆపాడుచున్న ద్విపదప్రబంధము శ్రీనాథుని దనుటకు హేతువు లెవ్వి? కొండన మల్లన యనువారలుకూడ ద్విపదలలోఁ బల్నాటివీరచరిత్రమును జెప్పియుండలేదా? అట్టివారు మఱికొందరు చెప్పియుండరాదా? ఆపాడునది శ్రీనాథుఁడు చెప్పిన ద్విపదకావ్యమేయని యెక్కడ చెప్పఁబడినది? ఇదియంతయు నేలవిడిచి సాముచేయుటవంటిది. కాఁబట్టి పల్నాటివీరచరిత్రము తప్పుల తడికగావున బాల్యములో రచించియుండు నని యూహచేసినది హాస్యాస్పదమైన సిద్ధాంతమునకు మూల మయ్యెను.*

---

*ఉమాకాంతముగారు పల్నాటివీరచరిత్రమున శ్రీనాథుఁడు వార్ధకదశయందు వ్రాసె నని వ్రాయుచున్నారుగాని నిక్కముగా నాతఁ డాచరిత్రమును రచించియుండఁడేని బాల్యముననే వ్రాసియుండునుగాని యాతప్పులతడిక వార్ధకదశయందు నల్లియుండఁడని నేను వ్రాసినదాని భావమును సరిగా గ్రహింపక బాల్యమను పదమును మాత్రము పట్టుకొని విడువక పూర్వాపరసందర్భములను గమనింపకపోయిరి. ఏపల్నాటివీరచరిత్రమును శ్రీనాథకృతమని వ్యవహరించుచున్నారో అది శ్రీనాథకృతము కాదని నాయభిప్రాయము.

# అధ్యాయము ౫

## హారవిలాసరచనము.

అంతట కొండవీడురాజ్యము పరహస్తగతమై పోవుటకు దల పోసి శ్రీనాథుఁడు:—

చ. తెలుఁగులవెన్ని యేటికిని, నంచితమైనవిశాలభూమిపైఁ
గలుగులవెన్ని పాముకునుఁ గానలవెంబడిసంచరించు గా
పులుఁగునకెన్ని వృక్ష . ౦పాల్పవహించిన భూధరాళిలో
నెలఁగునకెన్ని రోమములు నేలికలందఱు కొండవీటికిన్.

అను చాటువును జెప్పి మిక్కిలి చింతించెనని చెప్పుదురు.

ఇతఁడావెనువెంటనే అనఁగా క్రీ. శ. ౧౪_౭౧ ప్రాంతముల తన పూర్వస్నేహితుఁడైన కోటీశ్వరుఁడు తిప్పయసెట్టి తన్నాదరించు నను విశ్వాసముతోఁ గాంచీనగరమునకుఁ దన శిష్యుఁడును మఱఁదియు నగు దుగ్గనతోడఁ బోయి యాతని సందర్శించెను. అతఁడును సత్కారాద రముఁ జూపి కొంతకాల మాతని నచట నిలిపి యొకనాఁ డతనితో నిట్లనియెను.

సీ. కమలనాభుని పౌత్త్రుఁ గవితామహారాజ్య
భద్రాసనారూఢుఁ బరమపుణ్యుఁ
బాత్రు నాపస్తంబ సూత్రు భారద్వాజ
గోత్రు సజ్జనమిత్రుఁ గులపవిత్రు
భీమాంబికామార నామాత్యనందను
నఖిలపురాణ విద్యా ప్రవీణు
నధ్వర్యు వేదశాఖా తిథినిష్ణాతు
నంధ్రభాషానైష ధజ్ఞకవుని

గీ. నుభయభాషాకవిత్వ ప్రయోగకుశలు
బాలసఖుఁ గారవించి తాత్పర్య మొప్ప
నచిదేవయత్రిపురారి యక్షరాజు
హితమితోక్తుల వెలయంగ నిట్టులనియె.

నైషధము తరువాత హరవిలాసము రచింపఁబడినది వాస్తవమనియు హరవిలాస రచనకాలము ౧౪౨౦ ప్రాంతమనియు చేయుట సాధ్యమైనది. కుమారగిరిరెడ్డి కాలముననే రచింపఁబడియుండినయెడలఁ గలిగెడి యాక్షేపణములను గూర్చి పూర్వప్రకరణమున విశేషముగాఁ జర్చించి యున్నాఁడను. హరవిలాసమును గూర్చి తన యేగ్రంథమునందుఁ బ్రశంసించి యుండకపోవుటచేత వార్ధక్యమున రచించియుండునని యనేకు లభిప్రాయపడుచున్నారు. ఇందలి యవతారికలోని పద్యములనుబట్టి ద్వితీయ హరిహరరాయలు, కుమారగిరి, ఫిరోజిషాహా మూవురురాజులు బ్రదికియున్న కాలముననే హరవిలాసము రచింపఁబడి యుండవలయునని శ్రీలక్ష్మణరావుగారు ప్రయత్నించినారు. ఈవాదమునందు కొంతబలము గలదుగాని యీవాదము నంగీకరించుటకితరవిషయము లనేకములు బాధించుచున్నవి. వానిని జాలవఱకుఁ జర్చించియే యున్నాను. ఈ గ్రంథము నైషధమునకు భీమేశ్వర పురాణమునకు నడిమికాలమున ననఁగాఁ బెదకోమటివేమభూపాలుని యనంతరము రచింపఁబడినదనుట సత్యము. ఈ హరవిలాసమును ప్రథమమున ముద్రింపించిన శ్రీపోలవరము జమీందారుగారగు కొచ్చర్లకోట రామచంద్రవేంకటకృష్ణరావు బహదరుగారు హరవిలాసముద్రణపీఠికలో నిట్లు వ్రాసియున్నారు.

“ఈగ్రంథము సయితము నామావశిష్టము గాక యొక్క ప్రతిమాత్రము పీఠిక లేక తప్పులు కుప్పలుగా తంజావూరు పుస్తకభాండాగారములో నుండిన దాని వ్రాయించి తెప్పించి చిరకాలము ప్రత్యంతరముకొఱకు ప్రతీక్షించియు లభింపనేరక యస్మదాస్థానవిద్వత్కవులును, శతావధానులునగు తిరుపతివేంకటేశ్వరుల సహాయంబునం బరిష్కరించి మాసరస్వతీపత్రికాముఖమునఁ బ్రచురించుచుండఁగా నైదాశ్వాసము లచ్చుపడువఱకు దైవకృపవలనఁ బీఠికతో నైదాశ్వాసముల

వఱకే యుండిన యొక శిథిలతాళపత్రగ్రంథము దొరకినందులకు మిగుల సంతసించి తుట్టతుదవఱకు ముద్రింపించితిమి. యథామతిఁ బరిష్కరించినను నిందుఁ గొన్ని స్ఖాలిత్యము లింకను నుండవచ్చును గాన వాని మన్నించుటకు బండితులను వేఁడుకొనుచున్నాను."

పీఠిక భాగము గల ప్రతియొక్కటియె దొరకుటను బట్టి హరవిలాసము గొన్ని స్ఖాలిత్యములకు లోనయి యుండునన్న నచ్చెరువొందఁ బనిలేదు. ఇందు ముందుగా విచారించవలసిన గొప్ప సందేహము తిప్పయసెట్టి ప్రోలయవేమారెడ్డి కాలములో వ్యాపారముఖ్యుఁడుగా నున్న వాఁడా యనునది. ఇది వఱకు ముద్రితగ్రంథములోని తృతీయాశ్వాసము మొదటనున్న.

"క. శ్రీపర్వతసోపాన
స్థాపక వేమక్షితీశ సామ్రాజ్యశ్రీ
వ్యాపారిముఖ్యమన్వ య
దీపక యలకాధి రాజిదేవయతిప్పా,

అనుపద్యపాఠమే సరియైనదైన యెడల స్థిరసిద్ధాంతము లనేకములకు ప్రతిబంధక మగుచున్నది. ఆవిషయమును బూర్వప్రకరణమునఁ జర్చించి యున్నాఁడను. శ్రీకృష్ణరావు బహదరుగారు హరవిలాసమునకు వ్రాసిన పీఠికలో

"శ్రీపర్వతసోపాన
స్థాపక వేమక్షితీశ సామ్రాజ్య శ్రీ
వ్యాపారిముఖ్య సత్కుల
దీపక యలకాధిరాజ దేవయతిప్పా,,

అని దిద్దినచోఁ దిప్పన తండ్రియగు దేవయ వేమారెడ్డి కాలములోనివాఁడనియు......కొమరగిరిభూపాలునికాలము నాటివాఁడు తిప్పఁడనియుఁ,, నని సూచించి యున్నారు. అట్టి మార్పువలన మార్గము గొంతవరకు సుగమముగానుండు ననుటకు సందేహములేదు. మనము

హరవిలాసపీఠికను జక్కఁగాఁ బరిశీలించిన పక్షమున నాగ్రంథము కుమారగిరిరెడ్డి బ్రదికియుండఁగా రచింపఁబడియుండలేదని తేటపడ గలదు.

శ్రీనాథుఁడు హరవిలాసావతారికలో «అని ప్రార్థించి...... • ......కొండవీడుపురంబు రాజధానిగా ‹గీర్తిలతాధిష్ఠితాష్టాదశ ద్వీపాంతరాళుండునగు కొమరగిరి వసంతనృపాలువలన నాందోళికా ఛత్ర చామర తురంగాది రాజచిహ్నములు వడసి యమ్మహారాజునకుం బ్రీతి సంవత్సరోత్సవంబునకుం దగిన కస్తూరి కుంకుమ ఘనసారసంకుమద హిమాంబు కాలాగురుగంధసారప్రభృతి సుగంధద్రవ్యంబు లొడఁగూర్చియుఁ జీనిసింహళతవాయి హురుమంజి జలనోగి ప్రభృతి నానాద్వీపనగరాకరంబులగు ఘనకనకవస్తువాహన మాణిక్యంబులు తెప్పించియుఁ గవినైగమికవాది వాంశిక వైతాళికాదులగు నర్థిజనంబులకు నర్థంబులు గుప్పించియు ధీరుండును సుదారుండును గంభీరుండును సదాచారుండు నన విఖ్యాతిగాంచినయవచి దేవయతిప్పయప్రభుం డొక్కనాఁ డాస్థాన మంటపంబున సుఖోపవిష్టుండై'' అని వ్రాసియున్నాఁడు. పై వచనమునందు క్రింద నడ్డుగీట్లు గీయఁబడిన పదముల ప్రయోగముల వైఖరులనుజూడఁగా భూతకాలమున జరిగిన విషయములనే సూచించియున్నాఁడనియు, హరవిలాసము తిప్పయకంకితము గావించినది కొండవీడుపురములోఁ గాదనియు, అప్పటికిఁ గుమారగిరిరెడ్డి మరణము నొందినవాఁడనియు, బోధపడకమానదు. కుమారగిరిరెడ్డి కాలమున దిప్పయకుటుంబమువారు పొందిన యున్నతస్థానస్థితినిఁ గవి వర్ణించి యశస్సును గలిగించుచున్నాడు. గాని వర్తమానకాల స్థితిని దెలిపినవాఁడుకాఁడు. "(ప్రతిసంవత్సరోత్సవమునకు)--ఒడఁగూర్చియు—తెప్పించియు — కుప్పించియు — విఖ్యాతిగాంచిన" అను భూతార్థకక్రియలకు మాఱుగా, ‹ఒడఁగూర్చుచును—తెప్పిం

చుచున——కుపించుచుచున—— ప్రఖ్యాతి గాంచుచున్న అను వర్తమానార్థక క్రియలను బ్రయోగించి యున్న యెడల కుమారగిరిరెడ్డికాలమున హరవిలాసము రచింపఁబడియుండెనని చెప్పవచ్చునుగాన భూతకాలమును దెలువు క్రియలను ప్రయోగించుటవలన హరవిలాసము కుమారగిరిరెడ్డి మరణానంతరము రచింపఁబడియుండెననుటను మనము విశ్వసింపవచ్చును.

చ. హరిహరరాయ పేరోజసహాసురథాణగజాధిపాది భూ
వరులు నిజప్రభావ మభివర్ణనసేయఁ గుమారగిర్య ధీ
శ్వరుని వసంతవైభవము సర్వము నొక్కఁడ నిర్వహించు మా
తిరుమలనాథసెట్టికిని ధీగుణభట్టికి నెవ్వఁడీడగున్.

అని పద్యములోని 'నిర్వహించు' అను క్రియ భూతార్థకక్రియకు బదులుగాఁ బ్రయోగించినదనియే యర్థము చేసికోవలయును. అట్లర్థము చేసికొనక పోయినయెడల

ఉ. ఆతతభక్తిసంపద నహర్నిశముం ఘృతఖండశర్కరా
పాతముతో నపూపములు పాయసముం గదళీఫలంబులుం
స్ఫీతముగాఁగ నన్నములు పెట్టును శంకరభక్తకోటికా
సేతుహిమాచలం బవచసెట్టికి నెవ్వరుసాటి యిమ్మహిన్.

'అను పద్యములోఁ 'పెట్టును' అను క్రియాభూతార్థమును దెలుపకున్న యెడల తిప్పయసెట్టితండ్రియగు దేవయసెట్టికూడ ప్రోలయవేమారెడ్డి మరణానంతరము ౫౦ సంవత్సరములవఱకు బ్రదికియుండి కుమారగిరిరెడ్డి కాలమునఁ గూడ శివభక్తులయిన వీరమాహేశ్వరుల కెల్లరకు నన్నములు పెట్టుచున్నాఁడని యర్థము చేయవలసివచ్చును. అట్టిది యసంభవము గదా? కాఁబట్టి పెట్టును, నిర్వహించు, అను క్రియలకు నేనుజెప్పిన యర్థమును, భావమును సరిపడకున్నచో 'పెట్టెను, నిర్వహించె'నని సవరించుటయె సమంజసముగానుండును. హరవిలాసమునందు నొక్కనైషధమును మాత్రము పేర్కొని భీమేశ్వరపురాణమునుగాని కాశీఖండమునుగాని పేర్కొనకపోవుటచేత నైషధమునకు భీమేశ్వరపురాణమునకును

నడిమికాలమున రచింపఁబడెనని చెప్పవచ్చును. మఱియు నీరెండును శైవులకు ప్రధానములైన మతగ్రంథములుగావున శైవుఁడైన తిప్పయ సెట్టికి హరవిలాసము నంకితముసేయుచు శైవగ్రంథములను బేర్కొనక శృంగారనైషధమునుమాత్రము పేర్కొనుట చూడఁగా నారెంటికిని పూర్వమె హరవిలాసము రచించియుండె ననుట విశ్వసింపవలసివచ్చుచున్నది. మఱియును

మ. ఘనసిబిరాజః సురధాణినిండుకొలువై కూర్చున్నచో నీకరా
గ్ర్యసనంబున్నతియించుగా యవచితిప్పాచంద్ర సారంగ నా
భినముత్పాదిత తాళవృంతపవన ప్రేంఖోలనప్రక్రియా
వసరోదంచిత సాంద్రసౌరభ సదావ్యాలోల రోలంబముల్.

ఈపద్యములోఁ బేర్కొనఁబడిన సురధాణిఫిరోజిసాహి—ఇతఁడు ౧౪౨౨ వఱకుఁ బరిపాలనము చేసినవాఁడుగావున హరవిలాసము రచించునాటికి ఫిరోజిసాహి బ్రదికియుండెనని చెప్పవచ్చును. అనఁగా పెదకోమటివేముని మరణానంతరమున ఫిరోజిసాహి మరణమునకుఁ బూర్వమును హరవిలాసము రచింపఁబడి యుండుననుట సందేహములేదు. హరవిలాసము పీఠికలో—

క. కంటిని విశుద్ధసంతతి
వింటిఁబురాణములు పెక్కు విశ్వము వొగడన్
గంటి బహువత్సరంబులు
గొంటి యశోధనము సుకవికోటి నుతింపన్.

అని తిప్పయసెట్టి చెప్పుకొనియుండుటచేత ౬౦ సంవత్సరములు వయస్సుచెల్లినవాఁడై యుండెననుటకు సందేహము లేదు. కుమారగిరిరెడ్డి సుగంధభాండాగారాధ్యక్షుఁడై యున్న యవచితిప్పయతోడ శ్రీనాథుఁడు బాలుఁడుగానున్న కాలమున మైత్రికలిగి యుండవచ్చును. అనఁగా దిప్పయసెట్టికిని శ్రీనాథునకును వయస్సులో ౨౦ సంవత్సరముల భేదముండునని యూహింపవచ్చును. ఇదియె నిశ్చయమైనయెడల హరవిలాసరచనకాలమునాటికి శ్రీనాథునకు ౪౫ సంవత్సరములకన్న నెక్కువ

యుండవు. ఎట్లయినను హరవిలాసము ౧౪౨౧ వ సంవత్సరమున రచింపఁబడినదేమి, తరువాత రచింపఁబడినదేమి, కుమారగిరిరెడ్డి, పెదకోమటి వేమారెడ్డి మొదలగువారు, మరణమునొందిన వెనుక రచింపఁబడిన దనియే నాదృఢమైన యభిప్రాయము. హరవిలాసములోని గద్య మిట్లున్నది.

"ఇది శ్రీమత్కమలనాభపౌత్రమారయామాత్యపుత్రసుకవిజనవిధేయ శ్రీనాథనామధేయ ప్రణీతంబైన హరవిలాసం బను మహాప్రబంధము నందు."

అని యుండుటచేతను, శృంగారనైషధమున 'ఇది శ్రీమత్కమల నాభపౌత్త్రి సకలవిద్యాసనాథ శ్రీనాథప్రణీతంబైన' అని యుండుట చేతను,

భీమేశ్వరపురాణమున 'ఇది శ్రీమత్కమలనాభపౌత్రమారయామాత్యపుత్త్రి సుకవిజనవిధేయ సకలవిద్యాసనాథ శ్రీనాథనామధేయ ప్రణీతంబైన యుండుటచేతను 'సకలవిద్యాసనాథ' అను విశేషణము హరవిలాసములోఁ గూడ జేర్పవలసియున్నట్లు గనంబడుచున్నది. అది లేఖకులఁ దోషముగాని మఱియొకటిగా భావింపరాదు. హరవిలాసరచనాకాలము నేను చెప్పినదే క్రమమైనదని నాయభిప్రాయము. దానికిం గల సాధకబాధకములను జాలవఱకుఁ జర్చించినాఁడను.

శ్రీవీరేశలింగముగారు 'కవి ధనలాభముకొఱకు కృతిపతిని తిప్ప ప్రభుఁడనియు, ఆస్థానమంటపంబున సుఖోపవిష్టుండై అనియు, అతిశయోక్తులతో నెంతయెక్కువగా వర్ణించినను తిప్పయసెట్టి సముద్రవ్యాపారమును జేయుచు, కుమారగిరివలెనే యితరరాజులకును కస్తూరీకుంకుమాది సుగంధద్రవ్యములను చీనాంబరాదులను హయరత్నాదులను విదేశములనుండి తెప్పించి విక్రయించుచు పెద్దయంగడిపెట్టిన లక్షాధికారియైన పెద్దకోమటియేగాని మహారాజు గాఁడు.

ప్రథమాశ్వాసాంతమునందలి

క. కోమరగిరి నృపవసంతా
గమకీవిసర గంధసారకస్తూరీ కుం
కుమకర్పూర హిమాంభ
స్సముదంచిత బహుసుగంధి శాలాధ్యక్షా!

అన్న పద్యములోని సంబోధనము తిప్పయసెట్టి కుమారగిరి నిమిత్తము దెప్పించిన కర్పూరమును గంధసారమును కస్తూరిని విక్రయించు గొప్పసుగంధద్రవ్యముల వాణిజ్యశాలను బెట్టినవాఁడని చెప్పుచున్నది." అని శ్రీనాథుఁడు తిప్పనిఁబ్రభు వన్నందులకును అతని కాస్థానమండపంబు గలదన్నందులకును నధిక్షేపించుచున్నారు. శ్రీనాథుఁడు తిప్పయను వర్ణించిన వర్ణనములలో నతిశయోక్తులు లేవని నేను చెప్పఁజాలను కాని వీరియాక్షేపణములు మాత్ర మొకలెక్కలోనికిఁ దీసికొని రాఁదగినవి కావు. తిప్పయను ప్రభుఁడనుటలో దోషమేమియు లేదు. శ్రీవీరేశలింగముగారే యొకచోట 'శ్రీనాథునకు కుమారగిరిభూపాలుని సుగంధభాండాగారాధ్యక్షుఁడై కోటీశ్వరుఁడుగానుండిన యవచి తిప్పయసెట్టితోడ మైత్రికలిగినది!" అని తిప్పయకోటీశ్వరుఁడైన ధనికుఁడని వ్రాసియున్నారు. మఱియును కుమారగిరిభూపాలునివలన నాందోళికాఛత్రచామర తురంగాది రాజచిహ్నంబులను బడసెనని శ్రీనాథుఁడే చెప్పియున్నాఁడు. అటువంటివానిని శ్రీనాథుఁడు ప్రభువని వక్కాణించుట దోషమయ్యెనా? తిప్పయ మహారాజు కాకపోయినను మహారాజసంపత్తికలవాఁడు. మహారాజులకు సయితమాశ్రయుఁడని చెప్పఁదగినవాఁడు. అతనికి గొప్ప వాణిజ్యశాల యున్నంతమాత్రముచేత నతని కాస్థానమండపము లేదని చెప్పఁదగునా? ఇంక నతిశయోక్తులందురా కవితావాసనగల ప్రతివారును కొంచెమో గొప్పయో వీనియం దభిమానముగలవారే. తమసైతులు పన్నియకున్న వానిని రాఁబట్టుకొనలేక దొరతనమువారి న్యాయస్థానములకెక్కి తగవు పరిష్కరింపుమని కోరెడి జమీందారులను సఖ్యి

తము మనుజపతులని వీరేశలింగమువంటివారే శ్లాఘించుచు వానిని మఱచి శ్రీనాథుని నధిక్షేపించుట నాకంత సరసముగాఁ గన్పట్టలేదు.

అవచి తిప్పయసెట్టి పూర్వులు చాలఁ బ్రసిద్ధిగాంచిన వారైనట్లుగా నీక్రిందిపద్యములోఁ జెప్పియున్నాఁడు.

సీ. కట్టించె నొకతాత కంచిహర్మ్యంబులు
హాటకాంకమాళి కేకామ్రపతికి
బాలార్కమనియెడి పద్మరాగముదాచె
నొకతాత కంచినాయకునినాభి
నొకతాతఁ గట్టించె యోజనత్రయశిఖ
తరతటాకాంబోధి తిరువళూరఁ
గావేరి గట్టించెఁ గార్పాసరాసుల
నుబ్బి చోడఁడు మెచ్చ నొక్కతాత
గీ. ప్రతిదినమ్ముఁగపుష్పపుష్పములు వేయు
పవిత్రముగా నొక్కతాత యీశ్వరునికొసఁగె
నిఖిలలోక ప్రసిద్ధవాణిజ్య వంశ
ధరులు మాతాత లుభయగోత్రములవారు.

ఈతిప్పయసెట్టియు వీనితమ్ముడు తిరుమలనాథ సెట్టియును జామి సెట్టియును నౌకాయాత్రలంజేయుచు విదేశములతో వ్యాపారము సేయుచుఁగడుఁబ్రఖ్యాతిగాంచినవారని హరవిలాస పీఠికలోని యీక్రింది పద్యములవలనఁ దేటపడుచున్నది.

సీ. పంజాబుకర్పూర పాదపంబులు దెచ్చి
జలనోగిబంగారు మొలక దెచ్చి
సింహళంబున గంధ సింధురంబులు దెచ్చి
హరుమంజి బలు తేజి హరులు దెచ్చి
గోవసంశుద్ధ సంకుమదద్రవము దెచ్చి
యాపఁగనాణిముత్యాలు తెచ్చి
చోటంగికస్తూరి కాటంకములు దెచ్చి
చీనిచీనాంబర శ్రేణి దెచ్చి

గీ. జగదగోపాలరాయ వేశ్యాభుజంగ
పల్లవాదిత్య భూదాన పరశురామ
కొమరగిరి రాజదేవేంద్ర కూర్మిహితుఁడు
జాగ్రజగ జెట్టి దేవయచామి సెట్టి

గీ. తమ్ము లిద్దఱుఁ దనయాజ్ఞఁ దలఁ ధరించి
యన్నిదీవులఁ దెచ్చు లాభార్థకోటి
యర్థలక్షి నిచ్చి కీర్తి జేకొనమాడు
ఘనచిత్రపురాంతకుఁడు వంశాబ్ధి విధుఁడు.

మ. తరుసాచీనితవాయి గోవ రమణాస్థానంబులం జందనా
గరుకర్పూర హిమాంబు కుంకుమరజః కస్తూరికాద్రవ్యముల్
శరధిం గప్పలఁ జోగులన్ విరివిగా సామాన్ల దెప్పించునే
స్వరసా వైశ్యకులోత్తముండవని తిప్పండల్పుఁడే యిమ్మహిన్.

గీ. పండువాఁ జిల్లి రాఘారిపట్టణముల
యధిపతులు మాళిఁదాల్చు రత్నాంశుకంబు
లవచి త్రిపురాంతకానీత ఘనసపాత్ర
సింహళద్వీపమండల క్షేత్రజములు.

పెదకోమటి వేమభూపాలుని యనంతరము రాచవేమారెడ్డి కొండవీటిరాజ్యమున కభిషిక్తుఁడయ్యెను. ఇతఁడు పెదకోమటివేమభూపాలుని పుత్త్రుఁడనియు, తండ్రి బ్రదికియున్నకాలముననే ౧౪౧౬ లో జగనొబ్బగండకాలువను ద్రవ్వించి శాసనము వ్రాయించెనని యింతకుఁ బూర్వము తెలిసికొంటిమి, ఇతఁ డేసంవత్సరమున సింహాసనమెక్కెనో, ఏసంవత్సరమున మరణముఁ జెందెనో సరిగాఁ జెప్పఁజాలము కాని యితఁడు నాలుగుసంవత్సరములు పరిపాలనముచేసెనని కొండవీటిగండకవిలె తెలుపుచున్నది. ఇతనికి రాచవేమనయని పేరెట్లువచ్చెనో తెలిసికొనవలసియున్నది. ఇతనికి తల్లి సూరాంబికయని అమీనాబాదు శాసనమువలనను, యీసూరాంబిక 'శ్రీధాన్యవాటీ పురాధిపతియు, కృష్ణవేణ్ణా జలక్రీడా వినోదుండు' నగు గన్నభూపాలు ననుఁగుఁబుత్త్రి" అని ఫిరంగిపుర శాసనమువలనను, వేద్యమగుచున్నది.

ఈ గన్నభూపాలునింటిపేరు దంతులూరివారు. వీరి మూలపురుషుఁడు ధనంజయ గోత్రులైన (కోట) కేతరాజు మొదలగువారు కాకతీయ రాజులతోను, చంద్రవోలు రాజులతోను సంబంధబాంధవ్యములు గలిగి రాచవారని ప్రఖ్యాతి గాంచియున్నారు. వీరు మొదట చతుర్థ కుల సంపన్నులుగాఁ బరిగణింపఁబడినను రాను రాను రాచవారను నొక శాఖవారుగ నేర్పడిరి. అట్టికుటుంబములతోఁ జేరిన వారొకరు దంతులూరు నందుండుటచే వానింబట్టి దంతులూరివారను నింటిపేరు కలిగినది. దంతులూరి గన్నభూపాలుఁడు రాచవేమునకు మాతామహుఁడనియు, పెదకోమటి వేమభూపాలుని కాలమున ధాన్యవాటీపురాధిపతిగ నుండిన యొక సేనాని. ఇతఁడే శ్రీనాథకవివర్యునిచే ధనంజయ విజయమను కావ్యమును గృతినొందెనను విషయము దంతులూరి బాపిరాజకవి ప్రణీతమైన మూర్తి త్రయోపాఖ్యానమునందలి యీక్రిందిపద్యమువలనఁ దేటపడుచున్నది.

"సీ. అహిత దుర్గాధ్యక్షు లందఱుభయమంద
గ్రిడికైవడినిల్చెఁ దాడినాడ
నక్షుద్రదాన విద్యాశాస్త్రములచేతఁ
బ్రతియెవ్వరును లేక ప్రతిభఁ గాంచె
దనకీర్తిదశదిగంతరగీయమానమై
కనుపట్టధర్మ మార్గంబు సెఱపె
శ్రీనాథసుకవీంద్రుచే ధనుంజయ విజ
యంబనుసత్కావ్య మందివెలసె
నృపతిమాత్రుఁడె నిజపాదనీరజాత
ఘటితకోటీర వైరిభూకాంతమాన
సాంతరభయాపహారి శ్రీదంతులూరి
గన్నభూపాల మౌళి దోర్గర్వశాలి"

దీనినిదెలిసికొని వీరేశలింగముగారు తమకవుల చరిత్రములో "నీక్రిందివిధముగా శ్రీనాథుని నెత్తిపొడిచియున్నారు

తరువాత శ్రీనాథుఁడు మైలారరెడ్డి మొదలయిన సామంత సంస్థానప్రభువులనుగూడ సందర్శించి యర్హాసంభావనలు పొంది దేశసంచారము ముగింపవలసిన వాఁడయ్యెను. ఈసంచారము ముగింపక ముందే శ్రీనాథుఁడు ధాన్యవాటీపురమున కోదారిలో కృష్ణగోదావరీమధ్యాంతర్వేది సీమకోపోయి యచ్చటి యప్పటి సంస్థానాధిపతియైన దంతులూరి గన్ననృపాలునికడఁ గొంతకాలముండి యాతనికి ధనంజయవిజయమంకితము చేసినట్లు గనంబడుచున్నది." అని తమకలముయొక్క వాశిపోటును జూపినారు. శ్రీనాథునిపట్ల 'అర్హాసంభావన' శబ్దమును పలుమాఱు వినియోగించినను శ్రీనాథునకుఁ గలుగఁబోవు నవమానము గానరాదు. కాని, సర్వజ్ఞసింగభూపతి వంశీయులని చెప్పఁబడెడి శ్రీపీఠికాపురాధీశ్వరునిచే నర్హాసంభావనలనుబల్మాఱుపొంది,యనేకముద్రణములనుబొందిముప్పదిసంవత్సరములకుఁ బిమ్మట'ఆంధ్రకవులచరిత్ర'మనువృద్ధకృతి కన్యను వారికి నంకితముచేసిన వీరేశలింగముగారికంటెఁ దనకాశ్రియుఁడైన దంతులూరి గన్నభూపాలుచే నర్హాసంభావనలనుబొంది ధనంజయమను నూత్నకావ్యకన్యనంకితము చేసినశ్రీనాథకవి సార్వభౌముఁడుధన్యుఁడనియే నాయభిప్రాయము. ఈదంతులూరి గన్నభూపాలుఁడు తనమనుమఁడయిన రాచవేమారెడ్డి కాలమునగూడ ధాన్యవాటీపురాధిపతిగనుండియుండును. శ్రీనాథుఁడు కాంచీపురమునకుఁ బోవుటకుఁబూర్వము ౧౪౧౫లోఁగాని ౧౪౨౦లోఁగాని లేక కాంచీపురమున హరవిలాసము రచించి తిప్పయసెట్టికి నంకితముచేసి తిరిగి కొండవీటికివచ్చిన వెనుక ౧౪౨౭లోగాని ధనంజయవిజయమును రచియించి గన్నభూపాలునకు నంకితముచేసియుండును. ఈధనంజయవిజయ మిప్పుడెచ్చటను గంటఁబడకున్నది. శ్రీనాథకవి జీవితముయొక్క ప్రథమ ముద్రణగ్రంథమునందు ఆకాలమున ధాన్యవాటీపురమునేలుచుండినది. పెదకోమటి వేమారెడ్డి మామగారగు గన్నారెడ్డిగాని దంతులూరి గన్నభూపతికాడ

నివాసిసినది, సరికాదని యిటీవలఁదెలిసికొన్న విషయములనుబట్టి తెలిసికొనుచున్నాను.

రాచవేమారెడ్డి. (౧౪౨౦—౧౪౨౪)

ఇతనిపరిపాలనము జనరంజకమైనదిగాఁ గనుపట్టదు. ఎవరెన్ని విధములఁ దన రాజ్యమాక్రమించుకొనవలయునని ప్రయత్నించినను నితనితండ్రి పెదకోమటి వేముఁడు వారలను బరాజితులుగావించి నైపుణ్యము మీఱ జనరంజకముగా ధరాపాలనము గావించెను. క్రొత్తసుంకములను వేయక ప్రాతపద్ధతులనే బలపఱిచి సుంకములు రాఁబట్టుచుండెను. ఆర్యమతమును పోషించి వేదాధ్యయన సంపన్నులను శాస్త్రవేత్తలను భూదానములు మొదలగువానిచే సత్కరింపుచు సమస్తవిద్యలను బోషింపుచుండెను. దేశమున వర్తకవ్యాపారమభివృద్ధియగు మార్గములను వెదకుచుండెను. బావులు, చెఱువులు, కాలువలు త్రవ్వించి వ్యవసాయములకు మహోపకారములను గావించెను. అతనిపరిపాలనము సర్వోత్కృష్టమైనదిగనుండెను. ఇతనితరువాత రాజ్యభారమును వహించిన యీతనికుమారుఁడగు రాచవేమన తనదుష్ప్రవర్తనముచేతఁ దండ్రికి నపయశస్సుకలిగించుటయెగాక తుదకు రాజ్యమును ప్రాణములనుగూఁడ గోల్పోయెను. ఈరాచవేమన తనపూర్వులమార్గమునుగాని తనతండ్రి మార్గమునుగాని యవలంబింపక తానొక క్రొత్తమార్గ మవలంబించి క్రొత్తపన్నులను విధించి ప్రజలనుబాధింపమొదలుపెట్టెనని కొండవీటి దండకవిలె తెలుపుచున్నది. రాచవేమన ప్రజలపై పురిటిపన్నువిధించి యక్రమముగా రాఁబట్టుచుండెననియు, తనభృత్యుడగు సౌరముఎల్లయ యను నొకబలిజనాయకునిపై పురుటిపన్నువేసి బలాత్కారముగావసూలుచేసినందున నాతఁడాగ్రహించి యొకనాఁడు ముత్యాలమ్మ గుడికడ నాతని కఠారితోఁ బొడిచిచంపెననియుఁ బైదండకవిలె నుడువుచున్నది. ఇతఁడు బ్రతికియుండఁగనే కొండవీటిరాజ్యములో రెండువంతులు కర్ణా

టరాజ్యాధీశ్వరుఁడగు ప్రౌఢదేవరాయనికి వశ్యమైపోయెను. ఇతనిమరణముతో రాజ్యమాతనికి వశ్యమైపోయెను. ఏదియెట్టిదిగానున్నను ఇతని పాలనము జనరంజకముగ లేదనియు, అత్యల్పకాలములోనే యితనిపరిపాలనము తుదముట్టెననియుఁ జెప్పవచ్చును.

## తెలుఁగురాయని సందర్శించుట

పెదకోమటివేమభూపాలుఁడు ౧౪౨౦ దవ సంవత్సరప్రాంతమున మరణముఁ జెందిన వెనుక శ్రీనాథుఁడు రాచవేముని పరిపాలము ముగియువఱకును కొండవీడునగరమున నుండి యాపిమ్మట ప్రౌఢదేవరాయనికి సేనాధిపతులును సామంతులునైన తెలుఁగురాయనికడఁ గొంతకాలమును, పంట మైలారరెడ్డికడ కొంతకాలమును గడపెను. తెలుఁగురాయఁడు శ్రీమన్మహామండలేశ్వరమేదిని మీసరగండకఠారిసాళువ రాయవిభాళమహారాజుయొక్క కుమారుఁడైన శ్రీమహామండలేశ్వరమేదినిమీసరగండకఠారిసాళువశంభురాయదేవమహారాజు పుత్త్రుఁడైన తెలుఁగురాయఁడు గాని మఱియొక తెలుఁగురాయఁడుగాఁడు. ఇతఁడు కొంతకాలము కృష్ణానదీ ముఖద్వారమునందున్న శ్రీకాకుళమున నున్నట్లు తెలియవచ్చుచున్నది. తెలుఁగురాయని తండ్రియగు శంభురాయఁడును, సాళ్వమంగుచే జయింపఁబడిన శంభురాయఁడును వేఱ్వేఱుపురుషులని నేనాంధ్రుల చరిత్రములోని మూఁడవభాగమున నిట్లువ్రాసియున్నాను.

"బుక్కరాయలకు దేవాయియను భార్యవలనమూవురుపుత్త్రులు గలిగిరి. వారిలో జ్యేష్ఠుఁడైన కంపరాయలు తండ్రియాజ్ఞను శిరసావహించి దక్షిణదిగ్విజయ యాత్రకు బయలుదేఱెను. ఈదిగ్విజయయాత్రలో వైష్ణవమతావలంబకుఁడైన గోపన్నమంత్రియును, సాళువ మంగరాజును సైన్యాధిపతులుగనుండి తోడ్పడిరి. తండ్రియాజ్ఞానుసారముగా కంపభూపతి తుండీరమండలమును (ద్రావిడదేశమున కధిపతియైన రాజనారాయణ సాంబువరాయలను (సాంపరాయలను) జయించుటకై

ముందుగ ద్రావిడదేశముపై దండయాత్ర వెడలెను. ఈదండయాత్ర ౧౩౬౨-౬౪సంవత్సరములలో జరిగియుండును. ఇతఁడసంఖ్యాకములగు సైన్యములతో మొగిలి కనమమార్గముగఁ బాలేరునది యొడ్డుననున్న విరించిపురమునకుఁబోయి దండువిడిసెను. ఈసమాచారమును సాంపరాయలు విని పాలేరునదినిదాటి తనరాజ్యములోఁ బ్రవేశింపకుండ విశేష సైన్యములతో నడ్డుకొని విరించిపురము కడ ఘోరయుద్ధమును సలిపెఁ గాని యాంధ్రకర్ణాటకులతోఁ బోరాడఁజాలక ద్రావిడసైన్యములు పలాయనముకాఁగా సాంపరాయలును పలాయనుఁడై పడవీటివైపునకు బాఱిపోయి స్వల్పసైన్యముతో రాజగంభీరపర్వతమును శరణ్యముగాఁ జేసికొని తగురక్షణ చేసికొనుచుండెను గాని విజయనగర సైన్యములు వెంటాడించి రాజగంభీర పర్వతమును (పడవీడుదుర్గమునకు నామాంతరము) ముట్టడించినవి. రాజగంభీర సాంపరాయలను నాతఁడు శా. శ. ౧౧౮౦ లో పరిపాలనము సేయుచున్న మూఁడవరాజరాజను చోళ రాజునకు సామంతుఁడుగ నుండెను. అతని పేరిటనే పడవీడుదుర్గమునకు 'రాజగంభీరమల' యని నామము గలిగినది. అతని వంశమునందే కంప భూపతితో సమకాలికుఁడగు రాజనారాయణ సాంబువరాయలు జనించి రాజగంభీరరాజ్యమును (తుండీరమండలమును లేక తొండైమండలమును) పరిపాలించుచుండెను. విజయనగరసైన్యములు పడవీడుదుర్గమును ముట్టడించినప్పుడు మరల వారలకు భయంకరమైనయుద్ధము జరిగెను. ఈ యుద్ధములో సాంపరాయలు కంపభూపతిచేఁ జంపఁబడినటులు గంగాదేవి విరచితమైన మధురవిజయము లేక కంపరాయచరిత్రము వలనఁ దెలియుచున్నది. కాని సంస్కృతకావ్యము లగు రామాభ్యుదయము, సాళువాభ్యుదయము, ఆంధ్రకావ్యములగు జైమినిభారతమును వరాహపురాణమును సాంపరాయలు పరాజితుఁడై వేఁడఁగా విజయనగరసైన్యాధిపతులలో నొక్కఁడగు సాళ్వమంగరాజు వానిని మరల సామ్రాజ్యమున

నిలిపి సాంపరాయస్థాపనాచార్య బిరుదమును గాంచెనని చెప్పబడియుం డుటచేత మధురవిజయములోఁ జెప్పినది యతిశయోక్తిగా భావింపవలసి యున్నది. ఈసాంపరాయలే తెలుంగాధీశుని తండ్రియని జయంతి రామయ్యగారును కొమర్రాజు లక్ష్మణరావుగారును నభిప్రాయులగుచున్నారు గాని తెలుఁగురాయల కుటుంబము వేఱు, ఈరాజనారాయణసాంపరాయని కుటుంబము వేఱు. తెలుగురాయలకు నీసాంపరాయలకు నెనుబది సంవత్సరములు వ్యత్యాసము గలదు" ఈతెలుఁగురాయని తండ్రి మేదినిమీసరగండకఠారి సాళువబిరుదాంచితుఁడైన శంభురాయఁడుగాని రాజనారాయణ బిరుదాంచితుఁడైన యాశంభురాయఁడుగాఁడు. శ్రీనాథుఁడు తెలుఁగురాయని సందర్శించినప్పు డిట్లాశీర్వదించెనట!

శా. ధాటీఘోటకరత్నఘట్టన మిళద్ధాత్రీపరిష్ఠకక్ష్మాణ ఘం
టాటంకార విలుంఠలుంఠితమహోన్మత్తాహితక్షోణిభృ
త్కోటీగాంకితసంభినీధరసముత్కూటాటవీఘూటక
ద్ఘాటాఁ ధాత్రిధిప సాంపరాయని తెలుంగా నీవు బ్రహ్మాయువై.

ఈపద్యము తెలుఁగు రాయఁ డశ్వారూఢుఁడై యుద్ధోన్ముఖుఁడై దండయాత్ర వెడలనున్న కాలమునఁజూచి చెప్పిన పద్యమైయున్నది.

మఱియు నీతెలుఁగు రాయఁడు కవులకు కస్తూరి యొసఁగుచుండెడివాఁడట. అందుచే శ్రీనాథకవి యొకప్పుడీ క్రిందిపద్యమును జెప్పెనని కొందఱు చెప్పవత్తురు,

అక్షయ్యంబగు సాంపరాయని తెలుంగాధీశ! కస్తూరికా
భిక్షాదానము చేయురా సుకవిరాడ్బృందారక స్వామికిన్
దాక్షారామపురీ విహార వరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయ కుంభికుంభముల పై వాసించుఁ దద్వాసనల్.

ఈపద్య మేభావముతో నేకాలమున నేసందర్భమునఁ జెప్పఁబడినదో యదార్థమును గ్రహింపఁజాలక కవి హృదయమును దెలిసికొనలేక ప్రభాకరశాస్త్రిగారు నల్లేరుపై బండిపఱువిడినట్లు తమ

విమర్శాఖడ్గమును తళతళలాడునట్లు మెఱపించుచుఁ బదునైనవ శతాబ్దిలో 'విశదకీర్తి స్ఫూర్తికస్ఫూరములు దిశాంగణములయందు వెదచల్లినట్టి శ్రీనాథ కవిసార్వభౌముని యశస్సును చించి చెండాడుటకై పఱువిడునట్టి సాహసము భరింపరానిదిగ నున్నది.

శ్రీనాథునకు వైషయికవాంఛ లత్యున్నతము లఁట. భోగపరాయణత మెండఁట. ప్రౌఢ నిర్భరవయః పరిపాక కాలమగుటచే నాతఁ డప్పుడు శృంగారసముద్రమునఁ దెప్ప దేలుచున్నాఁడఁట. దాక్షారామాప్సరోరామల యొడళ్ళపయి బుగబుగలొల్పుట కని తెలుంగురాయని కస్తూరి కోరినాఁడఁట. ఇయ్యవి ప్రభాకర శాస్త్రిగారు తమ 'నేతిబీర' లోఁ జొన్పినభావములు. ఇట్టిభావములు లోకజ్ఞానమెఱుంగని శుద్ధ ఛాందసులు వెల్వరింపవలసిన భావములుగాని ప్రభాకరశాస్త్రిగారివంటి కోవిదుఁడు శృంగార రసాస్వాదన తత్పరుండయిన సరసకవి శిఖామణి వెల్వరింపవలసిన భావములుగావు. ఈపద్యము రచింపఁబడుటకుఁ గల కారణమిద్ది. పాపము. ప్రభాకరశాస్త్రిగారు పైపద్యములోని 'సుకవి రాడ్బృందారకస్వామికిన్' అనఁగా శ్రీనాథునికని యర్థముఁ జేసికొనిరి. అందువలన శ్రీనాథుని కొంపకుఁ జిచ్చువెట్టుట సంభవించెను. ఆసమాస పదమునకు శివుఁడని యర్థము. ఇచ్చట దాక్షారామ భీమేశ్వరస్వామి కని భావము. తెలుఁగురాయఁడు దాక్షారామ భీమేశ్వరస్వామిని సందర్శింపఁగోరి వచ్చినప్పుడు భీమేశ్వరస్వామివారి సన్నిధానమున శ్రీనాథకవిగానిండు, మఱియొక కవిగానిండు భీమేశ్వరస్వామివారికిఁ గస్తూరి దానము చేయవలసినదని హెచ్చరించిన పద్యముగాని మఱియొండు గాదు. కవిచమత్కరించి చెప్పినాఁడు. ఆకాలమునఁ బ్రభుపుంగవులు గాని, సామాన్యగృహస్థులుగాని సుగంధి ద్రవ్యములను స్వామివారికిఁ గానుకగా నొసంగు నొకయాచారము గలదు. అయ్యది చిరకాలము నుండి జరుగుచుండెను. అట్టిసుగంధిద్రవ్యములలోఁ గస్తూరిమిగుల విలువ

గలది. అయ్యది ప్రభుపుంగవులకుగాని సాధ్యపడునదికాదు. ప్రభువులు దానముచేసెడు కస్తూరిని దేవస్థానమునకు సేవఁజేయునట్టి దేవదాసీలు కొంతభాగమును గ్రైకొని తమవక్షస్థలములందు రాచుకొను చుందురు. ఇట్టినగుటచేతనే తెలుఁగురాయఁడు దాక్షారామభీమేశ్వర సన్నిధాన మునసున్నప్పుడు కవి కస్తూరిని వేడుచు చెప్పినపద్యమయి యున్నది.

ఈపద్యము శ్రీనాథునిదేయని చెప్పుటకు వారొక హేతువును జూపిరి. ఇటువంటి పద్యమే 'క్ష' ప్రాసముతోనున్నదొకటి కాశీఖండ మున గలదనిచెప్పిరి. వారాపద్యము నుదాహరింపక పోయినను నేను దాని నిట నుదాహరించుచున్నాఁడను.

శా. ఈక్షోణిన్నినుఁ బోలుసత్కవులు లేరే నేఁటికాలంబునన్
దాక్షారామచళుక్యభీమవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయగంధసారఘుసృణద్వైరాజ్య భారంబున
ధ్యక్షించున్ గవిసార్వభౌమ భవదీయప్రౌఢ సాహిత్యముల్

ఈపద్యమే ప్రభాకరశాస్త్రిగారిని పెడమార్గముఁ బట్టించినది. ఈపద్య ముయొక్క భావమును దెలిసికొనవలెనన్న నాకాలమునాటి దర్బారుల తీరువెట్టిదో, ప్రభుచిత్తవృత్తులెట్టివో, ప్రజలమర్యాదలెట్టివో, యాచా రములలోను,నడవళ్లలోను నేవి దూష్యములో నేవి దూష్యములుగావో, కవిసంప్రదాయములెట్టివో, కవులపోకడలెట్టివో, దేవదాసీప్రతిష్ఠాపన మెట్టిదో వీనినెల్ల నవగాహనముఁజేసికొన్నమీదట సాధ్యపడునుగాని స్థూలదృష్టితోఁ జూచువారికి బోధపడదు. కవి హృదయమునుగ్రహిం చినఁగాని వ్యాఖ్య లపహాస్యభాజనము లగును. ఈపద్యము వీరభద్రా రెడ్డిత్రైలోక్య విజయాభిధంబైన సౌధములోఁ జంద్రశాలాప్రదేశంబు నందు, సచివసైన్యాధీశసామంతనృప వారసీమంతినీ జనశ్రేణిగొలువ, శాస్త్రమీమాంసయు,సాహిత్యగోష్టియు విద్వాంసులు విస్తరింపుచుండ కర్పూరకస్తూరికా సంకుమద గంధసారసౌరభము దిక్పూరిత మగుచు నుండ, నిజభుజావిక్రమంబున నిఖిలదిశలుగెలిచి తన్ను రాజ్యపీటమె

క్కించినట్టి యన్నవేమేశ్వరుని యంకమాశ్రయించి, విమలధర్మశీలుం డగువీరభద్రభూపాలుండు గన్నులపండువుగానిండుగొలువుండు వేళనల్లాడ వేమవిభుఁడు శ్రీనాథకవి సార్వభౌమునిరప్పించి పలికినట్లుగాఁ గాశీఖండ మునఁ జెప్పఁబడిన పద్య మిది. శాస్త్రిగారు తలంచినట్లులు దాక్షారామాప్సరోరామల యొుకళ్లపై బుగబుగలొల్పుట కిచ్చుట కస్తూరికాదు. ఇక్కడవర్ణింపఁబడినది ప్రౌఢసాహిత్యము. దీనినుదాహరింపక నీ పద్యముపై తమభావమేమోదెలుపక బడబడఁదిట్టివేయుట సద్విమర్శకు లక్షణముకాదు. అందువిషయమైన చర్చ రాఁబోవు ప్రకరణములలో విస్తరింపఁబడును గావున నిప్పటికిచ్చుట విరమించెదను.

## పంటమైలారరెడ్డిని సందర్శించుట

శ్రీనాథకవి కొంతకాలము పంటమైలారరెడ్డితో మైత్రిగలిగి యాతనివలన సత్కారములను బొందుచుండెనని చెప్పుదురు. శ్రీనాథుని దినవెచ్చము నంతయు నాకాలమున నాతఁడు భరించుచుండెనట. ఇతఁడు ప్రౌఢదేవరాయని విశ్వాసమునకుఁ బాత్రులైన వారిలోనొక్కఁడు, ఇతడతిపరాక్రమవంతుఁడు. తురుష్కులతోడను, గజపతులతోడను, జరిగిన యుద్ధములలో రాయలకువిజయమునుసంఘటింపఁజేయుచుండెను. ఇతఁడు సూరారెడ్డి మునిమనుమఁడును, పోతిరెడ్డిమనుమడును, ముమ్మడీందునకు ముమ్మామ్మయందుజనించిన పుత్రుఁడు నయియుండెను. ఇతనికి ధరణీవరాహుఁడు, చౌహుత్తమల్లుఁడునను బిరుదములుగలవు. ఇతని వీరఘంటధ్వనివినంబడినతోడనే శత్రురాజులగుండెలదరుచుండు నట. ఈమహాపరాక్రమవంతుఁడైన మైలారవిభుఁడు తనకొనఁగూర్చిన జయములకు సంతోషించినవాఁడై యొకనాఁడు ప్రౌఢదేవరాయలవారు మైలారువిభుని రప్పించి నీవేమికోరెదవో కోరుమని నుడివెనట. అందులకాతఁడు వినమ్రుఁడగుచు దేవరా! నాకు నగలు నాణెములక్కరలేదు. ధనమక్కరలేదు. గజాస్వాందోలికాదివాహనము లక్కరలేదు. ఎవ్వరి

హృదయసీమలందు మహేశ్వరుఁడు మొదలగు దైవతములు నివసించు చున్నారో, వేదవేదాంగములు నివసించుచున్నవో ఎవరు మత సంరక్షణాభివృద్ధికై ఏర్పడినారో అట్టి బ్రాహ్మణోత్తములకు నొక చక్కని గ్రామము దానముచేయవలసినదిగా నాప్రార్థన మని వేఁడుకొనియెనట, అప్పుడాతనికోరిక మన్నించి శా. శ. ౧౩౫౧ కీలక నామసంవత్సరమాఘమాసములో భాస్కరక్షేత్రమున హేమకూటమున నివసించు విరూపాక్షదేవుని సన్నిధిని పూగినాటిసీమలో గుండకమ్మ నది యొడ్డునయుండు పోలవరమనుగ్రామమునకు చేజెర్లయని పేరుపెట్టి బ్రాహ్మణులకు దానము చేసెనట.

## రాజమహేంద్రిపురరాజ్యము

## అల్లాడ భూపతి.

కాటయవేమభూపాలుఁడు స్వర్గస్థుడయిన పిమ్మట సతనిబంధువుసు సైన్యాధ్యక్షుఁడు నగు అల్లాడరెడ్డి రాజమహేంద్రిపురరాజ్యము నాక్రమించుకొని పరిపాలనము చేయనారంభించెను. ఇతఁడు క్రీ. శ ౧౪౧౬ మొదలుకొని ౧౪౨౬ సంవత్సరాంతమువఱకుఁ బరిపాలనము చేసెను. అల్లాడభూపతి రాజమహేంద్రిపురరాజ్యము పరిపాలనము చే నట్లు శ్రీనాథకవి విరచితములయిన భీమేశ్వరపురాణము, కాశీఖండము వలననేగాక అల్లాడవేమారెడ్డి శాసనమువలన సువ్యక్తమగుచున్నది కాటయవేమభూపాలుఁడు కాలధర్మము నొందినవెనుకఁ బెదకోమటి వేమభూపాలుఁడు రాజమహేంద్రపురరాజ్య మాక్రమించుటకై దండె రాగా నల్లాడభూపతి రామేశ్వరముకడ వానినెదుర్కొని యుద్ధము జేసి కోమటివేముని సైన్యముల హతముగావించి యోడించెననియు నల్లాడరెడ్డి శాసనమువలన స్పష్టమగుచున్నది*. నిశ్శంక కొమ్మనామాత్యు

* "తేషాం కనిష్ఠోపి చ జన్మనాభూత్ జ్యేష్ఠాగుణైరల్లయరాత లేంద్రః చంద్రో ప్రదోషాకరతా ముపేత స్త్వామ్యోపిభూనందనతా ముపన్నః

విరచితమై అల్లాడదొడ్డభూపాలున కంకితమీయఁబడిన శివలీలావిలాసమున "పెద్దకోమటి వేమపృథివీశు వెనుసొచ్చి యతనిసంపదలెల్ల నపహరించె, నని వ్రాయఁబడియుండెను. అల్లాడభూపతి కాటయవేముని శత్రువులవినాశముగావించెనని పలివెలశాసనమున వక్కాణింపఁబడినది. కాటయవేమునికిఁ శత్రువు పెదకోమటివేముఁ డగుట నిశ్చయము. కాటయవేమునికిఁ గాటయ కుమారగిరియని యిరువురు కొమాళ్లుగలరని యెఱుంగుదుము. కాటయవేమున కిరువురుపుత్త్రులుండఁగా నల్లాడభూపతి రాజమహేంద్రపుర రాజ్యమును వశ్యముఁజేసి తానే రాజుగా నెట్లుపరిపాలించెను? కాటయవేమారెడ్డికిని అల్లాడరెడ్డికినిఁ బూర్వపు బాంధవ్యమె గాక కాటయవేముఁడుతనకు దొడ్డాంబికయందు జనియించిన 'అనితల్లి' యను కొమార్తెను అల్లాడరెడ్డికి వేమాంబికవలనఁ బుట్టిన నల్వురుకొమాళ్లలోను రెండవవాఁడయిన వీరభద్రారెడ్డికిచ్చి వివాహముఁగావించెను*. కోరుమిల్లిశాసనములో నుదాహరింపఁబడిన కాటయ కాటయ

---

జిత్వా నల్పవికల్ప కల్పితంబలం తం చాల్ప భానుం రణే
మిత్రీకృత్య సమాగతం గజపతిం కర్ణాటభూపం చ తం
హత్వా కోమటివేమసైన్యనికరం భూయోపి రామేశ్వరాత్
రాజ్యం రాజమహేంద్రరాజ్య మకరో దల్లాడభూమీశ్వరః"

"అల్లాడ వేమారెడ్డి కోరుమిల్లిశాసనము"

* ఆర్యవటశాసనము.

౪౩ భూలోక భాగ్యోదిత కల్పవల్లీ
శిష్టాశ్రితా నిష్టవిభేదభల్లీ
పవిత్రచారిత్ర వధూమతల్లీ
వేమక్షితీశస్య సుతాన్నతల్లీ

౫ తస్యాః పతిః పతి రశేషమహీపతీనాం
వేమాంబికాల్లయ నృపాలవరేణ్యసూనుః
శ్రీవీరభద్ర ఇతిసర్వగుణైకభద్రః
కీర్తిప్రతాపతులితేశ్వర వీరభద్రః

వేముని పుత్రుఁడగునో కాఁడో సందిగ్ధవిషయముగానున్నది. కాని కాటయవేముని ప్రథమభార్య యగుమల్లాంబికకు 'కుమారగిరి' యను పుత్రుఁడుగలఁడు. రెండవభార్యయగు దొడ్డాంబిక కూతు రనితల్లి అల్లాడ రెడ్డికోడలు. కోడలిపక్షమువహించి శత్రువులనుజయించి రాజ్యమునాక్రమించుకొని పదిసంవత్సరములు స్వతంత్రపరిపాలనముచేసినను రాజ్యము కోడలి దెయని మనమూహింపవచ్చును. ఇతఁడు కర్ణాటగజపతి భూపతులతోడ సఖ్యము వహించియుండెను. ఇతనివంశము నాలుగవజాతివంశముగాఁ గాశీఖండమున నీక్రిందిపద్యములలో వర్ణింపఁబడినది.

సీ. కలశాబ్ధి కన్యకాకరపల్లవ ద్వయా
సంవాహన క్రియా సముచితంబు
నిఖిలవేదాంత వాణీవధూ ధమ్మిల్ల
బహుళ పుష్పామోద ఛాదితంబు
ప్రణుత నానాసుపర్వకిరీట సంఘాత
రత్నాంశు నీరాజి రాజితంబు
సనకాది సన్మునీశ్వర మనోమంట పా
భ్యంతర రత్న దీపాంకురంబు
పతక కేతను శ్రీపాదపంకజంబు
గారణంబుగఁ జన్మించె భూరిమహిమ
గంగ సయిదోడు రిపుకోటి గళముత్రాఁడు
నాలుగవజాతి సముదగ్రోన్నతవిభూతి.

ఇట్టి నాలుగవ వర్ణంబున పెరుమాణి రెడ్డి పుట్టె ననియు నాతనివంశము నల్లాడ రెడ్డి జనించె ననియుఁ జెప్పఁబడియెను. ఇట్లు కాశీఖండమున నీతని వంశము నాలుగవవర్ణముగా వర్ణించియుండ నిశ్శంక కొమ్మ

---

మ. మనుతుల్యుం డగుఁ గాటభూవరుని వేమక్ష్మాతలాధీశు నం
దనఁ బాణిగ్రహణంబు చేసి ప్రియ మొందన్ వీరభద్రేశ్వరు
డనితల్లి న్వినతామతల్లి నుదయాస్తాంద్రి సీమావనీ
ఘనసామ్రాజ్యసమగ్ర సుప్రక్షితసాక్షా దిందిరాదేవతన్.॥

(కాశీఖండము)

నామాత్యుఁడు, తన శివలీలావిలాసము నందు నిశని కుమారుఁడైన వీర భద్రారెడ్డిని వర్ణించు సందర్భమున శ్రేష్ఠమయిన సూర్యవంశముగా నీక్రిందిపద్యములో నభివర్ణించియున్నాఁడు.

చ. వరకమలాప్తవంశమున వన్నెఁ గాంచి యమోఘ మార్గణా
దరమున మించి శాంభవకథాసరణిన్ మనసుబ్బి యుల్లస
ద్భరతమత పవిత్రన ముదంబునహించి రచర్తింపు సొం
పసుదుగ రామభద్రుఁడును నల్లన పాలకు వీరభద్రుఁడున్.

ఇతనికిఁ గొండవీటి సామ్రాజ్యాధిపతి యగు అనవేమారెడ్డి పౌత్రి దౌహిత్రి:—(పుత్ర్యాఃపుత్రియని యర్థము గ్రహింపవలయును.) యగు వేమాంబామహాదేవివలన వేమారెడ్డి, వీరభద్రారెడ్డి, దొడ్డారెడ్డి, అన్నారెడ్డి, అను నల్వురు పుత్రు లుదయించి రని కాశీఖండమున శ్రీనాథుఁడు వక్కాణించినాఁడు. నిశ్శంకకొమ్మనామాత్యుఁడు తన శివ లీలా విలాసము నందు:—

మ. భరితశ్రీనిధి యమ్మహీరమణుఁ డొప్పన్ జోళభక్తక్షితీ
శ్వర సూనుం డగు భీమలింగ మనుజేశశ్రేష్ఠు సత్పుత్రి భా
స్వర కారుణ్యదశాజనావనవిధాసంధాత్రి వేమాంబికన్
వరియించెం బతిభక్తి గౌరవవృష వ్యాపారనిత్యాంబికన్.

అనియు, మఱియుం గోయమిల్లిశాసనమున (౧౪౩౪),

శ్లో. శచీవ శక్రస్య శివేవశంభోః పద్మేవసాపద్మ విలోచనస్య
వేమాంబికా చోళకులేందు భీమభూపాత్మజా భూన్మహిశాస్యజాయా
శ్రీవేమభూమీశ్వర వీరభద్రభూనాథ దొడ్డక్షితి పాన్నభూపాః
అల్లాడ శౌరేరభవన్కుమారా స్తస్యా యథాపంక్తి రథస్యపుత్రాః

అనియు, వేమాంబికాదేవి భక్తీశ్వరచోడుని కుమారుఁ డగు భీమ భూపాలుని పుత్రియనియుఁ జెప్పుటవలన సూర్యవంశ క్షత్రియుం డయిన భీమలింగచోడుఁ డన వేమారెడ్డి యల్లుఁడని ధృవపడుచున్నది.

పదునేనవ శతాబ్దప్రారంభమునఁగూడఁ గొండవీడు, రాజమహేం

ద్రపురముఁ బాలించిన రెడ్లకును రాచవారికిని సంబంధ బాంధవ్యములు కలవని పైదృష్టాంతములు చాటుచున్నవి.

## లింగనామాత్యుఁడు

కాశ్యపగోత్రసంజాతుఁ డగు బెండపూడి దేవనమంత్రిపుత్త్రుఁ డగు లింగనామాత్యుఁడు అల్లాడ భూపాలునకుఁ బ్రధానమంత్రిగనుండెను. ఇతఁడు పరాక్రమవిజృంభితుఁ డగు శూరశిఖామణియు, రాజ్యాంగ వేత్తయు, నగుటవలన నాకాలమునఁ గడు, బ్రఖ్యాతిఁ గాంచి తన ప్రభువర్యునకు సమరజయముల సమకూర్చుచువచ్చెను. అట్టి సమరవిజయములను బెక్కింటిని పేర్కొనుచు నీక్రిందిపద్యమున నిట్లభివర్ణింపఁబడియుండెను.

సీ. ఘూడేశవనసప్తమాడె బారుహదొంతి
        వంతునాదిక్షితీశ్వరులఁ గెలిచి
    యొడ్డాదిమత్స్య వంశోదయార్జునుచేతఁ
        బల్లవాధిపుచేతఁ బలచ మంది
    దండకారణ్యమధ్య పుళిందరాజ రం
        బాహితవంశజులకు నభయ మొసఁగి
    భానుమత్కుల వీరభద్రాద్రిస్న దేవేంద్ర
        గర్వసంరంభంబుఁ గట్టిపెట్టి
గీ. యవన కర్ణాటకటక భూధవులతోడఁ
    జెలిమివాటించి యేలించెఁ దెలుఁగుభూమి
    దన నిజస్వామి నల్లాడ ధరణినాథుఁ
    బళిర! యరియేటిలింగన ప్రభువరుండు.

ఈపై పద్యమునందుఁ బేర్కొనఁబడిన రాజ్యము లన్నియును, విశాఖపట్టణము, గంజాము మండలములలోనివియు, జయపురము, బిస్తరు సంస్థానములలోనివియుఁ గావున లింగనామాత్యుఁడు వీని నన్నిటిని జయించి తురుష్క, కర్ణాట, కటకరాజులతో మైత్రిపాటించి యల్లాడ భూపతిచేతఁ దెలుఁగుభూమి నేలించెను. మరియు నీతని ప్రతిభా విశేష

మును శ్రీనాథుఁ డిట్లభివర్ణించియున్నాఁడు.

సీ. వాహ్యాళిభూమి రేవంత వైభవము నట్లు
  హయరత్నముల నెక్కి యాడ నేర్చు
గీర్బుధశ్రేణికిఁ జెవులపండువులుగా
  నాస్థానమున మాటలాడ నేర్చు
శక్తిత్రయంబునఁ జతు రుపాయంబుల
  షాడ్గుణ్యముల బుద్ధి నెరుప నేర్చుఁ
గైసేసి ప్రత్యక్షకందర్పమూర్తియై
  నిర్వికారంబున నిలువ నేర్చు
తే. నిష్ఠురాటోప విస్ఫూర్తి నృహరికరణి
నతికఠోరకుఠార ధారాంచలమున
వైరివక్షస్థలము వ్రచ్చి వైవ నేర్చు
సంగరార్జునుఁ డరియేటి లింగవిభుఁడు.

ఈలింగనామాత్యునకుఁ బిమ్మట వీని రెండవతమ్ముఁ డయిన అన్నామాత్యుఁడు వీరభద్రవేమ పృథ్వీధవులకుఁ బ్రధానమంత్రియై, తద్రాజ్యాభివృద్ధికారుఁడై అసదృశమగు కీర్తి సంపాదించెను. భీమేశ్వర పురాణమున:—

సీ. ఏమంత్రి సకలదైవ మిందుశేఖరుఁడు ద
  క్షారామ భీమేశుఁ డఖిలకర్త
యేమంత్రి యేలిక యిక్ష్వాకుమాంధాతృ
  రామసన్నిభుఁ డైన వేమనృపతి
యేమంత్రి సితకీర్తి యేడువారాసుల
  కడ కొండ యవ్వల చీకటికిఁ గొంగ
యేమంత్రి సౌభాగ్య మిగురుఁ గైదువజోడు
  లాలిత్యలీలకు మేలుబంతి
యతఁడు కర్ణాటలాట భోటాంగ వంగ
కురుకుకురుకుంతలావంతి ఘూర్జరాది
నృపసభాస్థాన బుధవర్ణనీయ సుగుణ
మండనుఁడు బెండపూఁడన్నమంత్రివరుఁడు.

అని వర్ణింపఁబడి యున్నాఁడు. భీమేశ్వరపురాణము రచించు నాటికి వీరభద్ర వేమపృథ్వీశ్వరుల రాజ్యము సింహాద్రి పర్యంతము మాత్రమె వ్యాపించియుండినను కాశీఖండము రచించునాటికి చిల్కసముద్రము వఱకు వ్యాపించినట్లు గన్పట్టుచున్నది. అన్నామాత్యుఁడు బహుభాషలనేర్చి రాజాస్థానమునకు వివిధ దేశముల నుండి యేతెంచిన రాయబారులతో వారివారి భాషలతోనే ప్రసంగ ములు సలుపుచుండు ననియు, పారసిభాష చక్కఁగ వ్రాయునట్టి వ్రాయసకాఁడనియు, బహమనీసుల్తా నగుఅహమదుషాతో నుత్తర ప్రత్యుత్తరములు జరుపుచుండు వాఁడనియు, శ్రీనాథకవివరేణ్యుఁడీ క్రింది పద్యములలోఁ జెప్పి వర్ణించియున్నాఁడు.

అరబీభాష తురుష్కభాష గజకర్ణాటాంధ్ర గాంధార ఘూ
ర్జరభాషల్ మళయాళభాష శకభాషా సింధుసౌవీర బ
ర్బరభాషల్ కరహాటభాష మఱియుం భాషావిశేషంబు ల
చ్చెరువై వచ్చునరేటియన్ననికి గోష్ఠీసంప్రయోగంబులన్.

ఉ. అన్నయమంత్రిశేఖరుఁ డహమ్మదు శాసనదానభూమి భృ
త్సన్నిధికి న్మదిస్సము బిలింబుగ వేమమహీసురేంద్ర రా
జోన్నతి సంతతాభ్యుదయ మొందఁగఁ బారసిభాష వ్రాసినం
గన్నులపండువై యమరుగాకితమందలి వర్ణపద్ధతుల్.

## శ్రీనాథకవి రాక.

పెదకోమటివేమభూపాలుఁడు స్వర్గస్థుఁడయినవెనుక సకలవిద్యా సనాథుఁడగు శ్రీనాథుఁడు కర్ణాటసామ్రాజ్య సార్వభౌముఁడగు ప్రౌఢ దేవరాయనికి సామంత నృపతులుగనున్న తెలుఁగురాయనికడఁ గొంత కాలమును, పంటమైలారు విభునికడఁ గొంతకాలమునుగడపి రాజమ హేంద్రపురరాజ్యము ప్రవర్ధమానముగ నుండుటయు, తనకు మిత్రుఁ డును బాంధవుఁడు నగుబెండపూడి అన్నామాత్యుఁడు వేమవీరభద్ర పృథ్వీశ్వరులకు మంత్రియై, పండిత పక్షపాతియై, విద్యాభిమానియై,

విఖ్యాతిఁ గాంచుచుండుటఁ దలపోసి తనకవిత్వసత్కారము లారాజ్యమునఁ గలుగఁ గలవని యూహించి రాజమహేంద్రిపురమునకు విచ్చేసెను. రాజమహేంద్రపుర విద్వజ్జనముతోడి ప్రథమసమావేశ మంత యుత్సాహాకరమైనదిగ శ్రీనాథునకుఁ గన్పట్టలేదు. రాజాస్థానమున నీతని ప్రవేశముగల్గినఁ దమయాధిక్యతకు నెక్కడ న్యూనతవచ్చునోయని పెక్కండ్రు పండితులు భయపడుచుండిరి. అయినను అన్నమంత్రియొక్కనాఁడు విద్వజ్జనపరివేష్టితుండై కొలువుకూటమునుండి తన్ను రప్పించిన విధము నీవిధముగా వర్ణించి యున్నాఁడు.

సీ. భట్టప్రభాకరప్రస్థాన సంవేద్యు
లుద్దండపాండిత్యు లొక్కవంక
ఫణిపభాషిత భాష్యఫక్కికా భావజ్ఞు
లుత్తమప్రాగల్భ్యు లొక్కవంక
గణభుజ్మతగ్రంథ గాఢార్థవిధుల బా
హుశ్రుత్య సంపన్ను లొక్కవంక
వేదాంతవాసనావిశ్రాంత హృదయజ్ఞు
లుపనిషత్తత్త్వజ్ఞు లొక్కవంక
తే. నుభయభాషాకవీశ్వరు లొక్కవంక
వేశ్యలొకవంక నొకవంక వీరభటులు
బలసికొలువంగఁ గొలువుండి పిలువఁబంపె
బెండపూడన్నమంత్రీశ్వరుండ నన్ను.

అట్లు విద్వజ్జనమహాజ్జనులచే నలంకరింపఁబడిన యాస్థానమంటపమునకు సకలవిద్యాసనాథుఁడగు శ్రీనాథుని రప్పించి సముచితాసనమునఁ గూర్చుండఁ జేసి యామంత్రిపుంగవుఁడు గంభీరధీరసంభాషణములతోడ నామహాకవి నిట్లు ప్రార్థించెను.

సీ. వినుపించినాఁడవు వేమభూపాలున
కఖిలపురాణ విద్యాగమములు
కల్పించినాఁడవు గాఢపాకంబైన
హర్షనైషధకావ్య మాంధ్రభాష

భాషించినాఁడవు బహుదేశబుధులతో
విద్యాపరీక్షణ వేళలందు
వెదచల్లినాఁడవు విశదకీర్తి స్ఫూర్తి
కర్పూరములు దిశాంగణము లందు
బాకనాటింటివాఁడవు బాంధవుఁడవు
కమలనాభుని మనుమఁడ విమలమతివి
నాకుఁ గృపసేయు మొక ప్రబంధంబు నీవు
కవితగుణగణ్య శ్రీనాథకవివరేణ్య.

మ. అరవిందాప్తకృతిప్రతిష్ఠుఁడగు దక్షారామభీమేశ్వరే
శ్వరు మహాత్మ్యముతోడఁ గూడిభువనశ్లాఘాస్పదం బైయథం
గురమై స్కాందపురాణ సార మగు శ్రీగోదావరీఖండముం
బరిపాటిన్ రచియింపు మంధ్రజగతీ భాషాప్రబంధంబుగన్

అనిపలికిన బహుమానంబుగాఁ గర్పూరతాంబూల జాంబూనదాంబర భరణంబులొసఁగి వీడుకొల్పెను. అంతటఁ బండితులును గవులును నీర్ష్యాళువులై ప్రవర్తించినట్లు గన్పట్టుచున్నది. పండితమ్మన్యులును గుకవులు నగువారు గొందఱు శ్రీనాథుని కవిత్వమాంధ్రకవిత్వము గాదనియు భాషకర్ణాటభాషయనియు, వెఱ్ఱిమొఱ్ఱియాక్షేపణలు చేయ నారంభించిరి. శ్రీనాథుఁడు సకలవిద్యాసనాథుఁడని యెఱుంగక శాస్త్ర పండితు లనేకులు వివాదములుపెట్టుకొని యెట్లులయిననీతని వంచించిసాగ నంపవలయునని ప్రయత్నించిరిగాని తుదకు శ్రీనాథుఁడే విజయమునొంది రాజమహేంద్రపురమునఁ గాశీఖండరచనమునాటికి బాదుకొని యా పురంబునకుఁ బ్రీతి కాపయ్యెను. ఇతఁడు పండితులను గుకవులను నిరాకరించి చెప్పినపద్యములను నీగ్రంథము మొదట నుదాహరించి యావిధము గొంతచవిచూపి యున్నాఁడను.

భీమఖండము రచించినకాలము క్రీ. శ. ౧౪౨౫వ సంవత్సరమునకు దరువాతనే అనఁగా ౧౪౩౦ ప్రాంతములనయి యుండునని యీ క్రింది విషయములు ధృవపఱచుచున్నది. అన్నామహాత్మ్యాని, సత్కా

ర్యములఁ గొన్నిటిని శ్రీనాథుఁడు తనభీమేశ్వరపురాణమున నీక్రింది పద్యములో వివరించియున్నాఁడు.

సీ. రాజమహేంద్రిమార్గమునఁ గావించె శ్రీ
వీరభద్రునకుఁ బ్రాకారరేఖ
నిలిపె మార్కండేయ నీలకంఠునిమ్రోల
రామేశుఁ దమతల్లి నామకముగ
సంగమేశ్వర దివ్య శంభులింగమునకుఁ
గల్పించెఁ గళ్యాణకల్పగృహము
దక్షవాటికయందుఁ దరుణేందుమౌళికి
మొగిలివాకిట ధామము రచించె
గీ. ప్రాగ్గిరావప్ర గోపుర ప్రాంగణమున
సప్తమునిసింధుసోపాన సరణి కెలన
చిత్రభవనంబు భీమయదేవునగర
మంత్రిదేవయ యన్నమహామాత్యవరుఁడు.

పైధర్మకార్యములలో నొక్కటగు భవననిర్మాణ ధర్మకార్యమును గూర్చినశాసన మొకటి దాక్షారామభీమేశ్వరుని యాలయమునఁ గానంబడుచున్నది.* ఈశాసనము శా. శ. ౧౩౫౦ అనఁగా క్రీ. శ.

* ఆశాసనమున నిట్లున్నది.

శ్లో. అస్తి ప్రశస్తమతిరల్లయ వేమభూపో
రాజ్యోన్నతో జగతి రాజమహేంద్రిపుర్యామ్
మంత్రీహితోఽస్య మతినిర్జిత దేవమంత్రి
ర్దివ్యశ్రీయాజయతి దేవయయన్నమంత్రీ
శ్లో. నాకేపుష్కర బాణవిశ్వగణితే సంవత్సరే కీలకే
కార్తిక్యాం శనివాసరే కృతధీశ్శ్రీయన్నమంత్రీశ్వరః
దాక్షారామజ భీమలింగపురతశ్శ్రీసప్త గోదాతటే
ప్రాచీగోపురమండపం సమకరోద్రమ్యం శిలానిర్మితమ్.
శ్లో. ద్వాదశసంఖ్యాస్తంభే
సదాబహిర్ద్వార మండపేవిహారః
రక్షతుభీమేశోఽయం
శ్రీదేవయ యన్నసచివమాకల్పమ్

౧౪౨౨వ సంవత్సరమున లిఖింపఁబడినది. కావుననీధర్మకార్యములు భీమఖండములో నుదాహరింపఁబడినవి కావుననాగ్రంథమాకాలమునకు దరువాతనే రచియింపఁబడిన దనుటస్పష్టము.

శ్రీనాథుని కనకాభిషేకము.

పెదకోమటివేమభూపాలుని యనంతర మైదారుసంవత్సరముల కాలము తెలుఁగురాయఁడు, మైలారరెడ్డి మొదలగువారలకడఁ గాలమునుగడపి పిమ్మట నీతఁడు కర్ణాటరాజధానికిఁ బోయెనని కొందఱు చెప్పుదురు. నేనాంధ్రులచరిత్రములో దేవరాయమహారాయలుకర్ణాటసామ్రాజ్యాధిపత్యము వహించియున్న కాలమున శ్రీనాథమహాకవి పెదకోమటి వేమభూపాలునికడ విద్యాధికారిగనుండియుఁ గర్ణాటరాజధానియగు విద్యానగర మను నామాంతరముగల విజయనగరమును జూడఁబోయెను. కర్ణాటసింహాసనాధ్యక్షుఁ డగు దేవరాయ లీయఖండపండితుని సన్మానించి నివాసస్థలం బెయ్యది యని ప్రశ్నింపఁగా నీతఁ "డీక్రిందిపద్యమును జదివెనఁట."

సీ. పగరాజగిరి దుర్గవరవైభవశ్రీల
 గొనకొని చెడనాడుకొండవీడు
పరిపంథిరాజన్య బలములబంధించి
 కొమరుమిగించిన బోడుకొండవీడు
ముగురురాజులకును మోహంబుఁ బుట్టించు
 గుఱుతైన యుర్విరాడు కొండవీడు
చటులవిక్రమకళా సాహసంబొనరించు
 కుటిలాత్ములకు గాడు కొండవీడు
గీ. జనన ఘోటక సామంత సరసవీర
 భటనటానేక హాటకప్రకటగంధ
సింధురారావ మోహన శ్రీలఁదనరు
 కూర్మినమరావతికి జోడు కొండవీడు.

అని వాసియున్నాఁడ. పెదకోమటివేమవిభుని మరణానంతరము

హరవిలాసము వ్రాసి తిప్పయసెట్టి కంకితముచేసినది వాస్తవముగాన శ్రీనాథుఁడు ప్రౌఢదేవరాయని యాస్థానమునకుఁ బోయినది పెదకోమటి వేమభూపాలుని కాలమునఁగాదని చెప్పవలసియుండును. హరవిలాసము లక్ష్మణరావుగారు చెప్పినట్లు కుమారగిరిరెడ్డికాలమునఁగాని, మఱికొందఱు చెప్పినట్లు కాశీఖండరచనానంతరమునఁగాని రచింపఁబడి యుండుట వాస్తవమయ్యెనేని శ్రీనాథుఁడు పెదకోమటివేమభూపాలుని కాలముననే చూడఁ బోయెనని చెప్పఁదగును. ఏదియెట్లున్నను పై పద్యము నేసందర్భముననో శ్రీనాథుఁడే చెప్పియుండవలయు నని నిర్ధారింపవచ్చును. కాని శ్రీనాథకవి ప్రౌఢదేవరాయల యాస్థానమునకుఁ బోయినది భీమేశ్వరపురాణరచనమునకుఁ దరువాతను, కాశీఖండరచనమునకుఁ బూర్వమునై యుండుట వాస్తవముగాఁ గన్పట్టుచున్నది. ఎందుకన నీసంగతి భీమేశ్వరపురాణమున నెత్తకపోవుటయే గాక తనకు గవిసార్వభౌమబిరుద మున్నట్లే చెప్పుకొని యుండలేదు. కాశీఖండమందన్ననో

శా. కర్ణాటక్షితినాథమౌక్తిక సభాగారాంత సంకల్పిత
స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధ కవిరాట్సంస్తుత్యచారిత్ర! దు
ర్ధర్ణోరాశిగభీర! ప్రాహ్ణముఖమధ్యాహ్న పరాహ్ణార్చితా
పర్ణావల్లభ! రాజశేఖరమణీ! పంటాన్వయగ్రామణీ!

కృతిపతిసంబోధనపద్యమున సూచింపఁబడి యుండెను. మఱియు నవతారికలో నల్లాడవేమభూపాలుఁడు తన్నుఁగూర్చి పలికిన యీక్రింది:—

శా. ఈక్షోణిన్నినుఁబోలు సత్కవులు లేరీ నేటికాలంబునన్
దాక్షారామచళుక్య భీమవరగంధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయగంధసార ఘుసృణద్వైరాజ్యభారంబున
ధ్యక్షించన్ గవిసార్వభౌమ భవదీయప్రౌఢ సాహిత్యముల్.

అను పద్యములోఁ దన్నుఁ 'గవిసార్వభౌమ' అని సంబోధించినట్లుగాఁ జెప్పియున్నాఁడు. అట్టిదేమియును భీమేశ్వరపురాణమునఁ జెప్పియుండలేదు గనుక నీనడిమికాలముననే యీతఁడు ప్రౌఢదేవరాయని

యాస్థానమునకుఁ బోయి గౌడడిండిమభట్టును నోడించి యుండవలయుననియే నాముఖ్యాభిప్రాయము. కొండవీటిపురవర్ణనముంగూర్చిన పద్యమును దేవరాయని యాస్థానమునం జదివె నను విశ్వాసబుద్ధితో నాఁడట్లు వ్రాసియున్నాఁడను. ఇప్పుడు చూడ నాయీకడపటి యభిప్రాయమే సత్యమని తోఁచుచున్నది. భీమేశ్వరపురాణమునకు ముందే యీకథ నడిచియున్నయెడల శ్రీనాథుఁడు తప్పక యాగ్రంథమున సూచించియే యుండును.

అష్టభాషాకవితా సామ్రాజ్యాభిషిక్తుఁడును, డిండిమ కవిసార్వభౌమ బిరుదాంకితుఁడును, శ్రీకంఠాగమశిఖండమండనమగ్నుఁడై ప్రప్రథమమున విజయడిండిమము నార్జించిన డిండిమప్రభుని దౌహిత్రుఁడును, సభాపతి భట్టారకాచార్యభాగినేయుండును, సరస్వతీప్రసాదలబ్ధ కవితా సనాథుఁడును, యోగానందప్రహసనకర్తయు నగు నరుణగిరినాథుఁ డను మహావిద్వాంసుఁడొకఁడు దేవరాయ మహారాయలవారి యాస్థానమలంకరించి యెట్టిపండితులను, ఎట్టికవులను సరకుగొనక విజృంభించి యనేక పండితుల నోడించెను. కారణమేమో తెలియదు గాని యట్టిపండితాగ్రగణ్యునకును మన శ్రీనాథభట్టసుకవికినుద్భటమైన వివాదము పొసంగినది.

### డిండిముని జయించుట.

డిండిమకవిసార్వభౌమ బిరుదాంకముగల కవిశ్రేష్ఠులు మువ్వురు గనంబడుచున్నారు. వీరిలో మన శ్రీనాథునకుఁ బ్రత్యర్థిగనున్న యతఁడు యోగానందప్రహసనకర్తయగు నరుణగిరినాథుఁ డను కవి యని పైని జెప్పియున్నాఁడను. ఇతఁడు గౌడబ్రాహ్మణుఁడు. ఈమహాకవి తనప్రహసనమునందలి భరతవాక్యములో 'దీర్ఘాయుర్దేవరాయో దధతువసుమతీ చక్రమాచంద్రతారామ్' అని చెప్పియున్నందున నితఁడు ప్రౌఢదేవరాయలకాలములోనే గాక యతని తాతయగు దేవరాయల కాలములోఁ గూడ నుండెనని విస్పష్టముగాఁ దెలియుచున్నది.

తన పితామహుఁడు కవిప్రభుఁడనియును, బల్లాలరాయాస్థాన కవీశ్వరుల గర్వమడంచినవాఁడనియును; నాగణయను కవీశ్వరుని నోడించినవాఁడనియును, తనతండ్రి రాజనాథదేశికుఁడనియును, మాతామహుఁడు డిండిమప్రభుఁడనియును, విజయడిండిమముగలవాఁడనియును, శైవవేదాంత పారంగతుఁడనియును, తల్లి యభిరామనాయికయనియును మేనమామ సభాపతి భట్టారకాచార్యుఁడనియును, యోగానందప్రహసనమునుబట్టి తెలియుచున్నది.* శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు వారిచే రచింపఁబడిన కనకాభిషేకము ప్రగ్రంథమున నిట్లు వ్రాసియున్నారు.

“దేవరాయ లను పేరు విద్యానగరప్రభువులలోఁ బలువురకుఁ బొసంగునదైనను ద్వితీయహరిహరరాయల కుమారుఁడగు దేవరాయలయందును మాత్రముగాఁ గన్పట్టుచున్నది. రెండవ దేవరాయల కిమ్మడి దేవరాయ లని, ప్రౌఢదేవరాయలని, ప్రతాపదేవరాయ లని నామాంతరములు గలవు. యోగానందప్రహసనమునఁ బేర్కొనఁబడిన దేవరాయ లీయిర్వురి దేవరాయలలో నొక్కఁడై యుండవలయును. రెండవ దేవరాయలే కాఁదగుననుట కొక యాధారముగలదు. సంస్కృతమున నిమ్మడి దేవరాయలు రచించిన ట్లాతని పేర మహానాటకసుధానిధి యను నొక యింపైన కావ్యము గలదు. బాలకాండాంతమునఁగల పద్యమిది:—

---

*“అస్తి ఖిలిగోదేషు ......గ్రహార నాయకమణేః సామవేదసాగర సాంయాత్రికస్య అష్టభాషాసామ్రాజ్యాభిషిక్తస్య బళ్ళాలరాయకటకకవికుల పర్వతపవేః నాగణ కవిగజకేసరిణః శ్రీకవిప్రభోః పౌత్రః పుత్రశ్శ్రీరాజనాథదేశికస్య బ్రహ్మాండభాండపిచండమండలితవిజయడిండిమచండిమ్నః శ్రీకంఠాగమశిఖండమండనమణేః శ్రీడిండిమప్రభోర్దౌహిత్రః శ్రీమదభిరామ నాయికాస్తనంధయః సభాపతిభట్టారకాచార్యభాగినేయః శ్రీడిండిమకవిసార్వభౌమ ఇతిప్రథితబిరుదాంకితనామధేయః సరస్వతీప్రసాదలబ్ధకవితాసనాథః శ్రీమానరుణగిరినాథః తేనకృతేన యోగానందనామ్నా ప్రహసనేనసభాని యోగమనుతిష్ఠామిః—”

శ్లో. శ్రీమానిమ్మడి దేవరాయ నృపతిస్సల్లోకకల్లోలినీ
కల్లోలప్రతిమల్లసూక్తి విభవో విద్వజ్జనశ్లాఘితః
ధీమానాదిమకాండవస్తువిషయాన్ వ్యస్తాన్మహానాటక
శ్లోకాన్వర్ణపదక్రమోజ్ఝితతరాన్ సమ్యాక్ కార్షీద్విభుః.

ఈశ్లోకమునఁగల 'కల్లోలప్రతిమల్లసూక్తివిభవ' యను పద్య మేభేదము చుఁలేక యట్లే డిండిమభట్టారకుని చాటుపద్యమునఁ గూడఁ గలదు. ఉదాహరింతును;—

శ్లో. అగ్రేడిండిమనాదనం తత ఇతో వంది ప్రఘోషోద్ఘోషణాం
స్తోత్రాశ్చిత్రపటాః పఠంతి బిరుదప్రోతాని పద్యానినః
ఆస్తాం తావదిదం మహేశమకుటీకోటీరకల్లోలినీ
కల్లోలప్రతిమల్లసూక్తి విభవద్వ్యాఖ్యాన్విజేష్యామహే.

దీనివలన నిమ్మడిదేవరాయలకాలమున డిండిమభట్టారకుఁడుండి నట్లు తేలుచున్నది. మఱియు, మహానాటకసుధానిధికూడ నాడిండిమ భట్టారకుని కూర్పే యగునో యని సందియము పొడముచున్నది. దేవరాయలు రచించినట్లుగ రతిరత్నప్రదీపిక యను కామశాస్త్రము గూడ నిట్టిదేయగుఁగాబోలు! అయియుండును. అన్యకవీశ్వర రచితములై ధనలోభమున రాజులపేళ్ళఁ బ్రచురింపఁబడిన గ్రంథములు మన తెల్గుదేశముననే పరశ్శతము గలవు. ఆ కుళ్ళు వెల్లడింప వేఱగ్రంథమే కూర్పవలసియున్నది. ఈప్రౌఢదేవరాయలవారి కాలముననే అరుణ గిరినాథుఁడను కవీశ్వరునిచే ద్రావిడభాషయందుఁ గొన్ని ప్రౌఢములగు శైవస్తోత్రగ్రంథములు రచియింపఁబడినవి. అరుణగిరినాథుఁడీ సోగా నంద ప్రహసనకర్త యగునేమో విచారింపవలసియున్నది."

శ్రీనాథుఁడుద్భటవివాదముఁ బెట్టుకొని జయించినది రెండవడిండి మకవిసార్వభౌముని. ఈడిండిమకవిసార్వభౌముని మాతామహుఁడగు డిండిమకవిసార్వభౌముఁడు (ప్రథముఁడు) కవితార్కికసింహసర్వతంత్ర స్వతంత్రాది బిరుదమండనుఁడై విశిష్టాద్వైతమతమును బెంపొందించిన వేదాంతదేశికునితోడ నుద్భటవివాదము జరిగించినట్లొక గాథ పండిత

పరంపరాగతముగా దక్షిణదేశమునఁ జెప్పుకొనఁ బడుచున్నది. వేదాంతదేశికులవారు క్రీ. శ. ౧౨౭౦ మొదలుకొని ౧౩౭౦ వఱకు నుండుటచేత ప్రథమ డిండిమకవిసార్వభౌమునితో వాదింపలేకునుట స్పష్టము. క్రీడాభిరామము పీఠికలో 'సాళువనరసింహరాయల కాలములోనున్న మూఁడవ డిండిమకవిసార్వభౌముని నోడించె' నని శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు పొరపాటున వ్రాసియున్నారు. తరువాత శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారి కనకాభిషేక మను పొత్తము వెలువడినది. ఆగ్రంథమును జదివినపిమ్మట రామకృష్ణకవిగారు తాము పొరపడితిమని నాతోఁ జెప్పియున్నారు. ప్రభాకరశాస్త్రిగారి వాక్యములనే నాయాంధ్రుల చరిత్రములో నుదాహరించి యున్నాను.

శ్రీవీరేశలింగముగారు మాత్రము వీరి వాక్యములను మఱువక "సాళువగుండ నరసింహరాయలు ౧౪౫౦ వ సంవత్సరమునకు పైని ౧౪౮౦-౯౦ సంవత్సర ప్రాంతములయం దుండినవాఁ డగుటచేతను, శ్రీనాథకవి ౧౪౫౦ వ సంవత్సరమునకు ముందే మృతినొంది యుండుటచేతను ఈకవిసార్వభౌమసమూర్జనకథ ౧౪౩౫ దవ సంవత్సరప్రాంతమున రచింపఁబడిన కాశీఖండరచనకుఁ బూర్వమునందే నడచియుండుటచేతను శ్రీనాథుఁడు సాళువగుండ నరసింహరాయల యాస్థానములో నుండిన డిండిమభట్టుతో వాదముచేసి జయించుట సంభవింపనేరదు." అని ఖండించియున్నారు. రామకృష్ణకవిగారు క్రీడాభిరామపీఠిక వ్రాయునప్పటికి డిండిమభట్టారకుల చరిత్రము వెలువడి యుండలేదు. వారిచరిత్రమును దెలిపి యందలి చిక్కును దొలఁగించినది శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారి కనకాభిషేక మను గ్రంథము. ఆ గ్రంథసహాయమును గొని నేనాంధ్రులచరిత్రములో నీవిషయమును జర్చించినాఁడను. ఆకనకాభిషేకమును, ఈయాంధ్రుల చరిత్రమును బయలువెడలిన తరువాత నాంధ్రకవులచరిత్రములో రామకృష్ణకవిగారి యభిప్రాయములను ఖండన

చేయుట సుసాధ్యమె. ఆంధ్రకవిచరిత్రకారుఁడు తన కింతచరిత్రజ్ఞాన మును కలిగించినందులకు కనకాభిషేకగ్రంథమునకుఁ గృతజ్ఞఁతఁజూపి యుండవలయును. ఇప్పటిచరిత్రగ్రంథముల నన్నిటిని జదివియు శ్రీవీరే శలింగముగా రింకను సుప్రసిద్ధములైన చరిత్రాంశములను సయితముఁ దెలిసికొనఁ జాలక మనుమనిఁ గొడుకునుఁజేసి చదువరులకుఁ దమ యపూర్వచరిత్రజ్ఞానమును బోధించుచునే యున్నారని తెలుపుటకు విచార మగుచున్నది. ప్రౌఢదేవరాయఁడు విజయబుక్కరాయల కొడు కై యుండఁగా విజయబుక్కరాయని తండ్రియైన దేవరాయని కొడు కై నట్లుగా వ్రాయుచున్నారు. రామకృష్ణకవిగారు శ్రీనాథకవితో వాదము జరిపిన డిండిమభట్టును గుర్తింపలేకుండుట వింతకాదుగాని సుప్రసిద్ధమైన చరిత్రాంశమై కన్నులకువిస్పష్టముగా గోచరమగుచున్న దేవరాయని కిని ప్రౌఢదేవరాయనికిని గలసంబంధము నాంధ్రకవిచరిత్రకారుఁడు గుర్తింపలేకుండుట వింతగానే గన్పట్టకమానదు.

డిండిమవంశ్యుల పూర్వచరిత్ర

ఒకప్పుడు కాంచీపురమునేలు చోళరాజు కాశీయాత్ర బయలు దేఱి గంగావిశ్వేశ్వరుల సందర్శించి కాంచీపురమున నొక శివాలయ మును బ్రతిష్ఠింపనిశ్చయించి, ప్రాసాదవల్లభయజ్వ, భాస్కరకవి, రాజ నాథకవి, సుబ్రహ్మణ్యకవి, జటాధరేశయజ్వ, నీలకంఠకవి, సోమనాథ దీక్షితుఁడు, మల్లికార్జునభట్టు నను నెనమండ్రు గంగాతీరస్థు లయిన బ్రాహ్మణులను వారికుటుంబములతోడ వెంటఁగొని కాంచీపురమునకు మరలివచ్చెను. తరువాత నారాజు తుండీరమండలమునఁ దల్పగిరికిఁ బశ్చిమభాగమున నొక యగ్రహారము నొసంగి వారల నందుఁ బ్రవేశ పెట్టెను. వార లాయగ్రహారమున శివునిఁ బ్రతిష్ఠించి రాజనాథుఁ డని పేరుపెట్టి యాదేవుని నింటివేల్పుగాఁ జేసికొని యారాధించుచు నందు నివసించియుండిరి. అటుపిమ్మట ప్రాసాదవల్లభయజ్వకు సభాపతియను

పుత్త్రుఁడు పుట్టెను. అతనికిఁ జోళచేరపాండ్యరాజులు శిష్యులై ఛత్త్రచామరాద్యాదిసమ్మానముల బహూకరించిరి. ఆతనిముదిమనుమఁడే భాస్కరాచార్యుఁడు. ఈతఁడు ప్రసన్నకావ్యకర్త. ఇతని వంశమున త్యాగరాజునుతఁడు పుట్టి కామకోటిపీఠమున విద్యాజయస్తంభమును స్థాపించినాఁడు. ఇతనికి స్వయంభూయజ్వ, గురుస్వామిబుధుఁడు నుదయించిరి. ఇతరవంశములందు నిట్లే పల్వురు ప్రఖ్యాతవిద్వాంసు లుదయించిరి. ఇట్లు క్రమముగా వీర లేక వింశతివంశములవా రయిరి. స్వయంభూయజ్వకు సభాపతి యను కుమారుఁడును, గురుస్వామిబుధునకు సోమనాథుఁ డను కుమారుఁడును, అభిరామాంబిక యను కూఁతురును జనియించిరి. అభిరామాంబికను గౌతముఁ డగు రాజనాథుఁడు పెండ్లిచేసికొనియెను. ఆయభిరామాంబిక పుష్పవతి కాకపూర్వము పదుమూఁడవ సంవత్సరప్రాయమున 'అరుణగిరినాథు' డను కుమారుని గనియెను. కుమారున కుపనయనము కాకపూర్వమే తండ్రి రాజనాథుఁడు శివసాయుజ్యమును బొందెను.

అభిరామాంబిక తనకుమారుని సోమనాథమఖియను తనసోదరున కప్పగించి సహగమనము గావించెను. సోమనాథమఖి మేనల్లునిఁదనకొడుకుల కంటె నెక్కువ ప్రేమతోఁ బోషింపుచుండెను. అరుణగిరినాథుఁడు వేదాధ్యయనము సేయుచునుండ నేమికారణముచేతనో మేనమామ భార్య కీతనియెడ ననూయపుట్టి క్రోధముతో మెలఁగుచుండెను. ఈవిషయమును మేనమామకుఁ దెలియకుండెను. అరుణగిరినాథుఁడీబాధపడలేక యొకనాఁ డిల్లువిడిచి నవగ్రామముచేరి యక్కడనొకశివాలయమున శివసాన్నిధ్యమున శివునారాధించుచుండెను. అంతట సోమనాథమఖి మేనల్లునిఁ గానక యూళ్లునాళ్లు వెదుక మనుష్యులను బంపించెను. కానిమూఁడవనాటియుదయమున నదీతీరమున నాబాలునిఁ దమ్మనియుమ్మిచే నెత్తి వ్రాసిన పెదవితోఁ గానంబడఁగాఁజూచి సోమనాథమఖి మేనల్లునిఁ గాగ

లించుకొని ,నాయనా! ఇదియేమిరా యిట్లుంటి'వనిప్రశ్నించెను. అంత నతఁడు ,మామా! ఊరకవచ్చితిని, బడలికచే నీశ్వరాలయమున నిద్రించితిని అర్ధేందుశేఖరుఁడు నాకుఁబ్రత్యక్షమై నన్నునిద్రనుండి మేల్కొల్పి నిద్రాస్వభావమునఁ దెలిపిగానున్న నానోరఁ దమ్మ్రుమియెను; అందుచేనానోరెల్ల వారియున్నది. పరిశుభ్రముచేసికొనుటకై నేనిచ్చటికి వచ్చితి" ననిపలికెనట. అప్పుడాతఁడు శివుని ననేకస్తోత్రములను రచియించెను. ఇతఁడే క్రొత్తగాఁ బట్టాభిషిక్తుఁడయిన ప్రౌఢదేవరాయల వారినిఁ దన కవిత్వశక్తి చేతను, వివాదచాతుర్యముచేతను మెప్పించి యాతని మన్ననకుఁ బాత్రుఁడయ్యెను. ఈతఁడును ప్రౌఢదేవరాయఁడును తుల్యాంబరాభరణధారులై యేకమనస్కులయి వర్తిల్లుచుండెడివారట. ఇతఁడుయజ్ఞాంబికయను కన్యను వివాహమై యనేక యజ్ఞములనుగావించెను. ఔదుంబరపురమునకుఁ దూర్పుగానున్న,తల్ప్రగ్రామమునకు దక్షిణముగాను, నవగ్రామమునకు వాయవ్యముగాను ప్రౌఢదేవరాయలవారొక యారామమును నిర్మింప నయ్యది తూర్పుపడమరల నొకక్రోసును, ఉత్తరదక్షిణములనొక యరక్రోసును వ్యాపించి యనేకఫలపుష్పాదులతోను, నాగవల్లీక్షుఖండాదులతోను బెంపొందుచుండెను. రాయలా యారామమునకు 'నీలగిరి' యనుపేరుగల యొకబేరినధికారిగానియోగించెనట. ఈయారామమునుజూచి వానిగారాము రాణియగు రుక్మిణీరామాలలామ దానిప్రమదోద్యానముగాఁ గైకొనియుండ నారామజీవియగు నీలగిరి ధనాధికుఁడై గర్వితుఁడై యుండెనఁట. అరుణగిరినాథునిపసులాయారామములోని కసవునకలవాటుపడియెనఁట. నీలగిరి వానిని నావలకుఁ దోలించుచుండెడివాఁడు. ఒకనాఁడు నీలగిరికోపముతోఁ,పసులు రేపటినుండి తోటకు మరల వచ్చెనేనిఁ గట్టిపెట్టించెద, వానివిడిపించుకోఁ, దలఁచితిరేని దక్షిణాధీశుఁడగు దేవరాయలయుత్తరువు నొందవలసినదేయనిగద్దించిపలికెనఁట. మఱునాఁడు పసులెప్పటియట్లే మరిగెను. నీలగిరి

తనమాటనిలిచి పసులఁగట్టివైచి పాలకు విడువఁ జమ్మేరు. అంతట నరుణగిరినాథుఁడాసంగతి రాయలకు విన్నవించి 'దేవరా! నీతోఁటపట్టునా కగ్రహారముగా దానముచేయుము-అట్లుచేయకుంటివేని నిప్పుడే నీరాజ్యముచు విడిచిపోయెద, నని పలికెనఁట. అందునకు రాయ లిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "అది ప్రమదావనంబగుటచే నీయంబడదు. ఇతరస్థలమున నొసంగెదనని పలికెయగాని యతఁడు కోపించి ఢిల్లీనగరమునకుఁబోయెనఁట. ఢిల్లీసురతాణుని దర్శనము సామాన్యముగా లభించునదికాదు గనుక దుర్గద్వారమున నొకశ్లోకమును వ్రాసెనఁట.

సురతాణా! నీరాణిచెంతనిద్రింపనరుదెంచితి.' అనునర్థముఁగల యాశ్లోకమును అసూయాళువు లగు పండితులాసంగతిని సురతాణుని కెఱింగించిరి. అతఁడాగ్రహచిత్తుఁడై వానికొమరితె లమ్మంగియనునది వానిని వారించి 'నాయనా! నీయాశ్రయముకోరివచ్చిన కవీశ్వరుఁడెన్నఁడు నట్లు వ్రాసియుండఁడు; దానికెద్దియో మఱియొక యర్థముండును; వానిరప్పించి విచారింపు' డని పలికెనఁట. అతఁడామెపలుకులనాదరించి రప్పించి విచారింపఁగా నరుణగిరినాథకవి యాలంకారికులపద్ధతి ననుసరించి యుత్తరార్థమునుబూరించి శ్లోకముఁజదివి 'నీధాటివలని భయముచేఁ బరదేశములందు నిద్రాభావముగలిగినందున నీ రాణిచెంత నిదురింప నరుదెంచితి; రాణిఅనఁగా నిచటపరిపాలితదేశ' మని యర్థము. అంతియగాని విపరీతార్థ మిందేమియు లేదనినుడివెనఁట. ఢిల్లీసురతాణుని యాస్థానమున 'అనపాయుఁ' డను కవిమల్లుఁడు గలఁడఁట. అతఁడు జయనూపురమును పాదమునధరించి డిండిమవాద్యముతోఁ బూజితుఁడై యుండెనఁట. అతఁడీయరుణగిరినాథునిఁ బ్రవేశమున కసమ్మతిని గనుపఱిచెను. అంతనిర్వురకు వివాదమేర్పడియెను. సర్వశాస్త్రములయందు విచారముజరిగెను. ఇరువదిమూఁడుదినములు చర్చసాగెను. కడపటఁ గవిమల్లుఁడు నిగ్రహింపబడియెను. ఢిల్లీసురతాణుఁడు సంతోషించి

వానిబిరుదములనన్నిటిని నరుణగిరినాథుని కిప్పించి మణిరంజితమగు న సువర్ణాసనమున నభిషిక్తునిగావించి "విద్యాడిండిమశోణశైలకవి' యని యతని నగ్గించెనఁట. తరువాతమఱికొన్ని విద్వత్త్వకవిత్వపరీక్షలు పెక్కులుజరిగినవఁట. అప్పు డాయరుణగిరినాథుఁడు 'కవిసార్వభౌమ' బిరుదమునుగాంచి రామపదాంకిత మగుకావ్యమును, డిమ మను రూపక మును రచించి బహుప్రఖ్యాతిని గాంచిమించెనట. అతఁడు ఢిల్లీసురతాణుని వశ్యునిగాఁజేసికొని యతనిచే నాజ్ఞాపత్రమునుఁబొంది మరలవిద్యానగరమునకువచ్చి రాయలవారికిఁజూపించి తాన తొలుతకోరిన ప్రమదావనమునే యగ్రహారముగఁ దానముఁబడసెనఁట. ఇయ్యది వాని వంశ్యులచే వ్రాయఁబడిన విభాగరత్నమాలనుండి వ్రాయఁబడిన కథాసారము. కాని యీకథనంతయు మనము విశ్వసింపరాదు. అరుణగిరి నాథుఁడుద్దండపండితుఁడై డిండిమభట్టారకుఁ డను నామముతోఁ గవిసార్వభౌముఁడై ప్రౌఢదేవరాయని యాస్థానమున నున్నమాట వాస్తవము.

## శ్రీనాథుని విద్యానగర ప్రయాణము.

శ్రీనాథుఁడు భీమఖండరచనము తరువాత రాజమహేంద్ర పురమునందుండ నిష్టములేకవిద్యానగరమునకుఁ బోవఁగారణమేమని చదువరులకు సంశయము జనింపక మానదు. అందునకుఁ గారణము రాజమహేంద్రపుర పండితులతోడి వివాదము లనియె మఱియొకమాఱు చెప్పవలసి వచ్చుచున్నది. శ్రీనాథుఁడు సకలవిద్యాసనాథుఁడయ్యునెంతయైదుష్యదర్పము గలవాఁడయ్యు, ప్రశాంతమనస్కుఁడై వినయ సంపత్తి నధికముగాఁ జూపుచు 'సుకవిజనవిధేయుఁడ' నని తాను తెలుపుకొనుచున్నను పండితకవులు మత్సరగ్రస్థు లగుచుఁ వివాదములు గల్పించి వేధింపసాగిరి. తనభీమఖండమున వేము వీరభద్రారెడ్ల నాకర్షించుటకై కృతిపతివంశవర్ణనా సందర్భమునఁ గృతిపతికిఁ బ్రభువు లగువారి వంశమును గూడఁజేసినను వారలచిత్తముల నాకర్షింపఁ జాలకపోయెను. వార

లేతనిఁడమ శత్రుపక్షమువాఁడని యనుమానముతో మొదట నలక్ష్య భావముతో నంకితని తలంపవలసి వచ్చుచున్నది. శ్రీనాథుఁడు తనకుఁ గల లోకజ్ఞతను, నిర్మత్సరతను, ప్రశాంతతను, పాండితీదర్పమును చాటించి భీమేశ్వరపురాణమునఁ గుకవినిరసనమున నెంతమృదువుగా మందలించినను, కార్పణ్యము వహించిన పండిత ప్రకాండులతో శ్రీనాథునకుఁ బ్రచండవాదముల నల్పుటమాత్రము తప్పలేదని రాజమహేంద్రపుర పండితుల నీతఁడు తిరస్కరించుచు నుల్లసమాడిన విధమునుదెలిపెడు శ్రీనాథుని చాటువులె వేనోళ్ల ఘోషించుచున్నవి. నాటి ప్రధ్వంసాభావ ప్రాగభావములపైఁ గల్పించిన కల్పనకుఁ దార్కికులు తలలు వంపవలసియుండును. ఆచాటువుల నాథోరణులిచట నుదాహరింపఁ దగినవికావు అన్నామాత్యుఁడు సాహసించి యాతనిఁ జేరఁదీసి భీమేశ్వరపురాణమును రచియింపఁజేసి తానంకితము పొందినను బండితుల చాడీకోరుతనమునకు వెఱచి యేమియుఁజేయక సమయమునకై నిరీక్షింపుచు మిన్నకుండెఁ గావలయును. ఎట్టిదైనను ప్రథమసమావేశకాల మీతని కనుకూలముగా లేదని తోచుచున్నది.

గీ. నికటమునసుండి శ్రుతిపుటనిష్ఠురముగ
నదరి కాకులు బిట్టు పెద్దఱచినప్పు
డుడిగి రాయంచ యూరక యుంటలెస్స
సైఁపరాకున్న నెందేనిఁ జనుటయొప్పు.

అనిభీమేశ్వరపురాణమునఁ దానుజెప్పినన్యాయమును నీతిని పాటించి కొంతకాలమాపురమునువిడిచి యుండుటకునిశ్చయించిమహోన్నతదశయందుండిన కర్ణాటరాజ్యమునకుఁబోయి యాసామ్రాజ్య సార్వభౌముఁడగు ప్రౌఢదేవరాయల సందర్శించి సత్కారములఁబొంద సంకల్పించుకొని విద్యానగరమునకు బయలు వెడలిపోయెను. శ్రీనాథుఁడు వైదుష్యదర్పములుగల యుద్దండపండితుఁడని యాంధ్రదేశమున నెఱుఁగఁదురుకాని కర్ణాటను లోనిపండితులెఱుంగరు. అచటిపండితుల దుర్నఁ

త్రిమువలన నతనికొక పట్టునరాయలసందర్శన భాగ్యములభింపలేదు. శ్రీనాథుఁడు విద్యానగరమునకుఁబోయిరప్రౌఢదేవరాయని యునికిప ట్టైయ్యదియని యడిగినప్పుడు చెప్పినకొండవీటి వర్ణనసీసపద్యము శ్రీనాథుఁడీసమయము ననేచెప్పినదిగాయుండుఁ దగునని ప్రభాకరశాస్త్రిగారుచెప్పినది వాస్తవముగాదు కనకాభిషేకము కథనడచినది. క్రీ. శ. ౧౪౩౦ వెనుక ౧౪౩౫ ప్రాంతముననిరొయెకమూల వ్రాయుచునీపద్యముకాలమునఁ జెప్పినదని వ్రాయుటసందర్భశుద్ధిగానరాదు అప్పటికిఁగొండవీటిరాజ్యము గర్ణాటసామ్రాజ్యమునఁ గలుపుకొనఁ బడినది. అప్పుడు గొండవీటికిఁ బ్రభువుకర్ణాట సార్వభౌముఁడగు ప్రౌఢదేవరాయలే గావునఁ గొండవీటి వైభవము పోయిన పిమ్మటనే యీపద్యము చదువఁ బడినదనుట హాస్యాస్పద మగును. ఈ విషయమును ప్రథమముద్రణ గ్రంథమునందు నేను స్పష్టముగా వక్కాణించియుండినను దానిం జూచియు ప్రభాకరశాస్త్రిగారీయభిప్రాయమును విడిచిపెట్టక వ్రాయుట యాశ్చర్యజనకముగా నున్నది. విద్యానగరయాస్థానపండితులలో ముమ్మకవియు, డిండిమకవియు నను నిద్దరు కవులు గలరు. అందును డిండిమభట్టారకుఁడు గవిసార్వభౌముఁడుగదా. శ్రీనాథుఁడు తొలుదొల్త ముమ్మకవిని సందర్శించి యీక్రిందిపద్యమును జెప్పెనఁట.

"సీ. పంపావిరూపాక్ష బహుజటాజూటికా
రగ్వధప్రసవ సౌరభ్యములకు
తుంగభద్రాసముత్తుంగ వీచీఘటా
గంభీరఘుమఘుమారంభములకు
కళసాపురప్రాంత కదళీవనాంతర
ద్రాక్షాలతాఫల స్తబకములకు
కర్ణాటకామినీ కర్ణహాటకరత్న
తాటంకయుగ ళీ ధళధళ్యములకు
గీ. నిర్నిబంధనిబంధమై నెనయుకవిత
తెలుఁగు నను సంస్కృతంబునఁ బలుకనేర్తు

పార్శ్వదేవేంద్రరాయ శ్రీపాలకుండు
సమ్ముఖంబునఁ జేయుచున్నాఁడు ముమ్మడికవి.

అప్పుడు ముమ్మడికవి "శ్రీనాథునిఁజూచి మీరు కర్ణాటరాజుల యాస్థానమున విద్యాధికారిగా నుంటిరి కదా! మీబిరుదము లెట్టివో తెలుపఁగలరే" అని ప్రశ్నించెనట; అంత శ్రీనాథుఁడాతనితో నిట్లు ప్రత్యుత్తరమిచ్చెను.

"చ. వచియుల గాఁడినఁ బిసికెద ధర్మజు నానఁ గఁటి చేసెదా
క్సనిజసేత్రి యూఁతి విచారము గొప్పన గర్వహీనతన్
మరలి తెలుంగు భూమి కసమానగతిన్ గొనిపోవు వాఁడనై
బిరుదులు నానాటకమఁ బెట్టితి సత్కవి సార్వభౌముఁడన్.

ఈపద్యమునందు సత్కవిసార్వభౌముఁడ నని శ్రీనాథుఁడు చెప్పుకొనుట యష్టదిగ్విజయ పటకాకృతబిరుద డిండిమాడంబరుఁ డనుగవిసార్వభౌముండునగు డిండిమభట్టారకునకు భరింపరానిదిగనుండి సంతప్తకుపితుని గావించి స్పర్థకలిగించునదయ్యెను. ఎన్నాళ్లున్నను రాయల దర్శనము లభించినదికాదు. అతఁడు కన్నడరాజ్యలక్ష్మిని దలపోసికొని యిట్లు వేడెనని యీక్రింది చాటుపద్యమును జూపుచున్నారు.

శా. పల్లామ్ముంచితిఁ గోఁకసుట్టితి మహాకూర్పాసముల్ దొడ్గితిన్
వెల్లుల్లిన్ దిలపిష్టముల్ మెసవితిన్ విశ్వస్తవడ్డింపఁగాఁ
జల్లాయంబలి ద్రావితిన్ రుచులు దోషంబంచుఁ బోనాడితిన్
దల్లీ! కన్నడరాజ్యలక్ష్మి! దయలేదా? నేను శ్రీనాథుఁడన్.

దేశమర్యాదనుబట్టి తలకుఁ గుళ్ళాయును, మేనికంగరకాయును దొల్చుట మొదలగు ననభ్యస్తవిషయము లక్కడ శ్రీనాథునకుఁ దటస్థించెననియు, ఆదేశము విధము తనకు సరిపడకుండెననియు, అందువలన నాతఁడు అమ్మా! నాకుఁ బెందలకడ రాజదర్శనాదికము సమకూర్చి స్వదేశమున కరుగ సెలవిమ్మా!' యని కర్ణాటరాజ్యలక్ష్మిని వేడుకొనుచుఁ బైపద్యమును జెప్పియుండు నని ప్రభాకరశాస్త్రిగారి యభిప్రాయము. పయిపద్యములోని కడపటిపాదము కేవలము దైన్యభావమును సూచిం

చుచున్నది. ఈకాలమున శ్రీనాథుఁడు గంభీరహృదయమును జాటుచు దర్పమును బ్రకటించుచున్నవాఁడు గాని దైన్యభావమును సూచింపు చుండలేదు అదియుగుంగాక కన్నడరాజ్యలక్ష్మికి నొక మహోత్కృష్ట విషయమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నట్టు 'దయలేదా నేను శ్రీనాథుఁడన్' అనువాసివలన సువ్యక్తము నగుచున్నది. అదెటులనఁ గన్నడరాజ్యలక్ష్మి కెఱుకపడక క్రొత్తగఁ బోయినవాఁడు 'దయలేదా? నేను శ్రీనాథుఁడన్' అని జ్ఞప్తికిఁదెచ్చునట్లు సంభవింపదు. కనుక నీపద్యము వార్ధక్యమున రెండవతూరి శ్రీనాథుఁడు కర్ణాటదేశమునకు, బోయినకాలమునఁ జెప్పి నదై యుండవలయునని ప్రథమాధ్యాయమునఁనే జెప్పినట్టు 'ఓతల్లీ! కన్నడ రాజ్యలక్ష్మీ! అప్పుడే నన్ను మఱచిపోతివా ? నామీద దయ లేదా? ఇచ్చట ముత్యాలశాలలో స్వర్ణాభిషేకము నుభవించిన శ్రీనాథుఁ డనుజుమీ' యని జ్ఞప్తికిఁదెచ్చిన విషయముగా భావింపవలయునే గాని మఱియొక సందర్భమునఁ జెప్పినదిగా భావింపరాదు. డిండిమభట్టారకుఁడు మొదలగువారు తనకు రాయదర్శనము లభింపకుండ నడ్డుపడుచున్నా రను విషయముఁ దెలియవచ్చినప్పుడు శ్రీనాథుఁడు మిక్కిలి దర్పమును జూపుచు నీక్రిందిపద్యమును వ్రాసి ప్రౌఢదేవరాయనికి, బంపెనను విష యముగూడ నాయభిప్రాయమును బలపఱచునదిగా యున్నదిగాని ప్రభాకరశాస్త్రిగారి యభిప్రాయమును బలపఱచుచుండలేదు.

"సీ. డంబుచూపినరా తలంబుపైఁదిరుగాడు
కవిమీఁదఁగానిరా కవచమేయ
దుష్ప్రయోగంబుల దొరకొని చెప్పెడు
కవిశిరస్సునఁగాని కాలుచాఁప
సంగీతసాహిత్య సద్విద్యలొల్లని
కవులఱొమ్ములగాని కొల్చివిడువ
చదివిచెప్పఁగలేక సభయందువిలసిల్లు
కవివీఁపుగాని వ్రక్కలుపఁదన్న

దంటకవ్రులఁ బిలునైన యింటిమగఁడఁ
గవులవాదంబు విన వేడ్కఁ గల్గి జేరి
నన్నుఁ బిలుపింపు మాస్థానసన్నిధికిని
అక్షుణ్ణసేంద్ర! ప్రౌఢరాయక్షితీంద్ర!

ప్రౌఢదేవరాయలు వీకీతని దర్పమును జూచి యాశ్చర్యపడుచుఁ దానుపేక్షించుటఁ దన యాస్థానవిద్వద్బృందమునకు నగుబాటగునని యెవ్వరిమాటలను సరకుఁగొనక యాతనిఁ దన యాస్థానమున కాహ్వానించెను. తరువాత నాతని కోరికను దెలిసికొని యొకవిద్వత్సభను గూర్పించెను. కర్ణాటసామ్రాజ్యసార్వభౌముఁ డగు ప్రౌఢదేవరాయల సన్నిధానమునఁ గవితావిషయమున శ్రీనాథకవిభట్టారకునకును, డిండిమకవిభట్టారకునకును వైరము వర్ధిల్లి విజిగీషువులై వారిరువురును చర్చకు దొరకొనిరి. వారెందునుగూర్చి యట్టి యుత్కటవివాదమును బెట్టుకొనిరో తెలియదు గాని డిండిమభట్టారకునకున్న కవిసార్వభౌమ బిరుదమును శ్రీనాథుఁడుగూడ వహించుటచేత గలిగినదని యూహింపవచ్చును. "బిరుదులు నారివాగుకడఁ బెట్టితి సత్కవిసార్వభౌముఁడన్" అనునదియే మూలకారణము. అరుణగిరినాధ డిండిమభట్టారకుని మనుమఁడగు రాజనాథభట్టారకునితోఁబాటుగా నచ్యుతదేవరాయలవారి యాస్థానకవులలో నొక్కఁడగు రాధామాధవకవి.

శా. సూనాస్త్ర ప్రమదామదస్ఫురిత వక్షోజాత కాఠిన్యమున్
బూనంజాలు వచోవిలాసమున నింపుల్ మీఱఁ గర్ణాటక
క్ష్మానాథేంద్రు సభన్ గవిత్వ విజయోత్సాహంబు కైకొన్నమా
శ్రీనాథుం గవిసార్వభౌముఁ గొలుతున్ సేవాంజలుల్ గీల్కొనన్."

కవిత్వవిజయముకొఱకే యీపోరాటమని సూచించియున్నాఁడు.

ఈవివాదమునందుఁ గర్ణాటరాజ్యసార్వభౌములకుఁ గులగురువయిన 'చంద్రభూషక్రియాశక్తి' యొడయఁడు మధ్యవర్తిగ నుండెను. ఈవివాదములో మాధ్యస్థ్యము నెఱపిన చంద్రభూషక్రియాశక్తి పండి

తోఁడు డిండిమభట్టారకుఁడే యోడిపోయె నని నిర్ణయించి విద్వత్పరిషదంబునకు నివేదించెను. కవిసార్వభౌమబిరుదము నాతనికిఁ దొలగించి శ్రీనాథునకు శాదుకొల్పిరి. అంతటితో డిండిమభట్టారకుని డిండిమాడంబరము గూడ నడఁగారినది. కర్ణాటసామ్రాజ్యసార్వభౌముఁడు శ్రీనాథకవిసార్వభౌముని పాండిత్యశౌండీర్యమునకు నద్భుతాశ్చర్యములు మానసమును బురికొల్పి నపరిమితానందముఁ జెందినవాఁడై యాతఁడత్యంత గౌరవాస్పద మగు తన ముత్యాలశాలలో బహు విద్వజ్జన పండితపరివారబహుమానపూర్వకముగా నాకాలమునాటి బంగరునాణెములగు దీనారములతోను టంకములతోను స్వర్ణస్నానోత్సవము సలుప నిశ్చయించుటను దెలిసికొని శ్రీనాథకవిసార్వభౌముఁ డీపద్యమును జెప్పెనఁట.

చ. జననాథోత్తమ! దేవరాయనృపతీ! చక్రేశ! శ్రీవత్సలాం
ఛనసంకాశ మహాప్రభావ! హారిగ్రత్నాదత్త! నాఁబోటికిన్
గున్నృపస్తోత్ర సముద్భవంబయిన వాగ్దోషంబు శాంతంబుగాఁ
గనక స్నానము చేసి కాక పొగడంగాశక్యమే దేవరన్.

కనకాభిషేకసత్కారక్రమము రాజ్యలక్ష్మీపీఠికాతంత్రమున వివరింపఁబడినది. మహారాజు విద్వద్గోష్ఠిలో నసామాన్య పాండితీ మహిమంబుఁ జూపఁగల్గిన విద్వాంసునకుఁగాని కవిశ్రేష్ఠునకుఁగాని కనకాభిషేకసత్కారముఁ గావింపవలయు ననియుఁ గనకాభిషేక మనఁగా నాకాలమునాటి బంగారునాణెములను సభామధ్యమున నున్నతాసనము నామహనీయునిఁ గూర్చుండఁ బెట్టి వాని శిరస్సున జలముఁ గ్రుమ్మరించునట్లుగాఁ గ్రుమ్మరించి యానాణెములను నాసమ్మానోత్సవమున కరుగుదెంచిన విద్వాంసులు మొదలగువారికిఁ బంచిపెట్టవలయు ననియు నందుఁ జెప్పఁబడినది. ప్రాచీనకాలమున నిట్టి సత్కారమును ప్రభుపుంగవులచేఁ బెక్కండ్రు విద్వాంసులు పొందియుండిరి. అట్టి ప్రాచీనాచారమును శిరసావహించి కర్ణాటసామ్రాజ్యసార్వభౌముఁడు ప్రౌఢ

దేవరాయలవారు శ్రీనాథకవిసార్వభౌముని నట్టి కనకాభిషేక సత్కారముచే గౌరవించిరి. మన కవిసార్వభౌముఁడు ప్రౌఢదేవరాయని ముత్యాలశాలలోఁ గనకాభిషేకసత్కారమును బొందినపిదపఁ బ్రౌఢ దేవరాయలవారి నిట్లభినందించినాఁడు.

శా. జోటీ! భారతి! యొప్పెటీవు మొఱయుఁ బీ చోద్యంబు గానేమ క
ర్ణాటాధీశ్వరు దేవరాయనృపతిన్ నాసీరధాటీసమా
కోటీ ఘోటకధట్టికా ఖురపుటీ కుట్టాకసంఘట్టన
స్ఫోటీ ఘూర్ణఘనా ఘనస్ఫుటీకి తాఁ బోటీవు ప్రశంసించెదవే.

ఇట్లఖండపండితుం డగు డిండిమభట్టారకునిఁ బ్రౌఢదేవరాయల యాస్థానంబున విద్వద్బృందము నడుమ డీకొని వాదించి యోడించి యామహానీయుని లోహడిండిమమును (కంచుఢక్కను) బగులఁ గొట్టించి శ్రీనాథ కవిసార్వభౌముఁడు తా నార్జించిన యశోడిండిమముతో బయలువెడలి యాంధ్రదేశమునం దంతట మ్రోగింపఁజేయుచు నాంధ్రదేశమున జనించిన యే యాంధ్రమహాకవియుఁ బొందని మహాభాగ్యము ననుభవించెను.

## వల్లభాభ్యుదయము.

శ్రీనాథుఁడు కర్ణాటరాజధానికిఁ బోయినపుడే రాయలరత్నభాండారాధ్యక్షుఁడైన వినుకొండవల్లభామాత్యునితో మైత్రి నెఱపి వల్లభాభ్యుదయ మను గ్రంథమునురచించి యాతని కంకితముచేసెనని శ్రీవీరేశలింగముగారు వ్రాయుచున్నారు. అయ్యవి స్వవచన వ్యాఘాతములతోఁ గూడుకొన్నవి. వల్లభరాయని చరిత్రమున "ఈక్రీడాభిరామము ౧౪౨౦ వ సంవత్సర ప్రాంతమునందు రచియింపఁబడియెను. ఈకాలమునందు శ్రీనాథుఁడు కర్ణాటదేశమునకుఁబోయి వల్లభామాత్యుని దర్శించి వల్లభాభ్యుదయమును రచించియుండుటచేతను" అనియు;—శ్రీనాథ కవిచరిత్రమున 'రాజదర్శనము క్రీడాభిరామకర్తయైన వినుకొండవల్లభ

రాయని నాశ్రయించి యాతని కంకితముగా వల్లభాభ్యుదయమును జేయుటవలన నాతనిమూలమున లభించిన దని చెప్పుదురు." అనియు, శ్రీవీరేశలింగముగారు వ్రాయుచున్నారు. దీనింబట్టి శ్రీనాథుఁడు కర్ణాట రాజధానికిఁ బోయినది దేవరాయని కాలముననా? ప్రౌఢదేవరాయని కాలముననా? దేవరాయలు ౧౪౦౬ మొదలుకొని ౧౪౨౨ వఱకును, ౧౪౨౨ మొదలు ౧౪౨౪ వఱకును వానికొడుకు విజయబుక్కరాయలును, ౧౪౨౪ మొదలుకొని ౧౪౪౭ వఱకును వానికొడుకు ప్రౌఢదేవరాయలును కర్ణాటకసామ్రాజ్యమును బరిపాలించి యుండుటచేత ౧౪౨౦ లో దేవరాయలే పరిపాలనము చేయుచుండుట స్పష్టము. శ్రీవీరేశలింగముగారి వాక్యములనే విశ్వసించినయెడల నిదివఱకు వారు వ్రాసినదంతయు వ్యర్థమగుచున్నది. అదియేమి కర్మమోగాని యొక విషయమునుగూర్చియే రెండేసియభిప్రాయము లిచ్చుచుండుటచేత, విమర్శకుల కనావశ్యకమయిన శ్రమము కలుగుచుండును. ౧౪౨౪ వ సంవత్సరము తరువాతనే శ్రీనాథుఁడు కర్ణాటకరాజధానికిఁ బోయి డిండిమభట్టారకుని జయించెనని పుటలకుఁ బుటలనింపియు నొక్కమారుగా నాకాశమునుండి క్రిందికి జాఱినట్లుగా ౧౪౨౦ వ సంవత్సరములో దేవరాయనికాలముననే శ్రీనాథుఁడు కర్ణాటరాజధానికిఁ బోయి వల్లభాభ్యుదయమును రచించెనని చెప్పుటహాస్యాస్పదముగ లేదా? పోనిండు; ఇఁకొకచిత్రమును జూడుఁడు. ఇంతకును, శ్రీవీరేశలింగముగారు వల్లభాభ్యుదయమును తాము చూడలేదని వ్రాయుచున్నారు. "శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు క్రీడాభిరామపీఠికలో శ్రీనాథుని వల్లభాభ్యుదయములోఁ గృష్ణాతీరమునందు శ్రీకాకుళస్వామి తిరునాళ్లలో జరుగు నసభ్యములు దీనికంటెఁ బచ్చిగా నున్నవి.........మఱియు వల్లభాభ్యుదయమున నాంధ్రవల్లభుని తిరునాళ్ళలోని విధవాదుర్వర్తనములు శ్రీనాథుఁడు విశదముగా వర్ణించియున్నాఁడు......శ్రీనాథుఁడు శ్రీకా

కళాధీశ్వరుండగు తెలుంగురాయని సంహరించి యతని కంకితముగా వల్లభాభ్యుదయమును జెప్పెనుగదా!" అని వ్రాసియున్నారు. ఈవాక్యములనుబట్టిచూడఁగా వల్లభాభ్యుదయము శ్రీకాకుళాంధ్రదేవుని యుత్సవములలో నడచుచుండెడు విశ్వస్తాదుల దుర్వర్తనములుగలది యనియు, అది యాంధ్రవిష్ణుదేవునకే యంకితమొనర్ప బడినదనియు, దెలియవచ్చుచున్నది" అని వ్రాసియున్నారు. దీనింబట్టి వల్లభాభ్యుదయము వల్లభామాత్యుని కంకితముచేయబడినమాట వ్యర్థమగుచున్నది. ఇంకను వీరికి రామకృష్ణకవిగారి వాక్యములే యాధారములై యున్నవి. ఆగ్రంథమును జూడనిదే వారివాక్యముల నాధారముచేసికొని సిద్ధాంతముచేయబూనినబరిహాసాస్పదులమగుటనిక్కము. రామకృష్ణకవిగారు తొమ్మిదిసంవత్సరముల క్రిందట నాపీఠికను వ్రాసినారు. తరువాత వారొకప్పుడు నాతో వల్లభాభ్యుదయమును శ్రీనాథుఁడు రచించినాఁడని తాము వ్రాసినది పొరబాటని చెప్పినట్లు నాకు జ్ఞప్తియందున్నది. వల్లభాభ్యుదయము మనకు లభించినప్పుడుగాని యాగ్రంథముశ్రీనాథుడు రచించినదియు, లేనిదియు నిర్ధారణము కాజాలదు. శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు ప్రప్రథమమునఁ దమ పీఠికలలోఁగొన్ని పొరబాటభిప్రాయములను దెలిపినమాట వాస్తవము. భ్రమప్రమాదములచే నొకప్పుడు తప్పుటూహలు కలుగవచ్చును. విమర్శకులు వానిని నంధప్రాయముగా విశ్వసింపక పరిశీలించి యథార్థవిషయమును గ్రహించి తక్కినదిత్రోసి పుచ్చుచుండవలయును. నల్లేరుపై బండి పఱువిడునట్లుగా రామకృష్ణకవిగారి యభిప్రాయములను ఖండించుటకై పఱువిడుచుండెడి యాంధ్రకవిచరిత్రకారుఁ డీయభిప్రాయమును తాము గ్రంథమును జూడక పోయినను ప్రేమపూర్వకముగా స్వీకరించుటకుఁగారణ మందు విశ్వస్తాదుల దుర్వర్తనము లభివర్ణింపఁబడి యున్నవని వారు నుడివిన వాక్యములేమై యుండును.

## క్రీడాభిరామము.

ఇది వీథి యను పేరం బరఁగిన యొక దృశ్యకావ్యము. ఇది దశరూపక నాటకభేదములలో నొకటి. ఇది వినుకొండ వల్లభామాత్యుని పేర శ్రీనాథునిచే రచింపఁబడినదిగాఁ దోఁచుచున్నది. వినుకొండ వల్లభరాయఁడు నియోగిబ్రాహ్మణుఁడు. విశ్వామిత్ర గోత్రుఁడు; ఆశ్వలాయనసూత్రుఁడు; తిప్పనార్యుని పుత్త్రుఁడు. తిప్పనార్యుని ముత్తాతయైన చంద్రామాత్యుఁడు బుక్కరాజునకు మంత్రియై నట్లుగా నీక్రిందిపద్యమునఁ జెప్పఁబడియుండెను,

శా. కర్ణాటక్షితినాథుఁడైన పెదబుక్కక్ష్మాపదేవేంద్రున
ఘ్యర్ణామాత్యుని దానఖేచరుని చంద్రాధీశు బంధుప్రియుం
వర్ణించుంగవికోటి శంకరజటావాటీతటాంతర్నదీ
స్వర్ణద్యంబుతరంగరింఖణలసత్సాహిత్యసౌహిత్యయై

వల్లభరాయని పినతాతయైన లింగమంత్రి హరిహరరాయల కొలువులోనుండి న ట్లీపద్యమునఁ దెలుపఁబడెను.

మ. కనకాద్రిప్రతిమానధైర్యనిధి లింగక్ష్మాపమంత్రీంద్రుతో
ననతారాతినృపాలమంత్రిజనతాహంకారతారాహిమా
ర్కునితో రూపరతీంద్రుతో హరిహరక్షోణీంద్రసామ్రాజ్యవ
ర్ధనుతో సాటి సమానమీడుఁగలరా రాజన్యసైన్యాధిపుల్.

వల్లభరాయని తండ్రియగు తిప్పన్న యను త్రిపురాంతక మంత్రి కూడ హరిహరరాయల కొలువులోనుండి యాతని రత్నభాండారమున కధికారిగానుండెనని యాక్రిందిపద్యమున దెలుపబడియె.

సీ. సత్యవ్రతాచార సత్కీర్తిగరిమలఁ
జంద్రుతోడను హరిశ్చంద్రుతోడ
నభిమానస్ఫూర్తి నైశ్వర్యమహిమను
గారాజుతోడ రేరాజుతోడ
సౌభాగ్యవైభవ జ్ఞానసంపదలను
మారుతోడ సనత్కుమారుతోడ

లాలిత్యనిపుణ ప్రాజ్ఞావిశేషావలి
ఘనప్రశోభను రామభనప్రశోభ
సాహిత్యనందన భారతీపాలసభల
శ్రీహంపరాయ పృథ్వీశతత్ర
రత్నభాండార సాక్షికాంతప్రియుఁడు
మల్లికార్జున త్రిపురాంత మంత్రివరుఁడు.

రాయని రత్నభాండారాధ్యక్షుండును వినుకొండ దుర్గపాలకుండునైన గ్రంధకర్త వల్లభరాయఁడు ములికినాట మూఁడుగ్రామగ్రామములతో మోపూరు పాలించుట యావిగాఁగల విషయము లీక్రింది పద్యమునఁ దెలుపఁబడియెను.

సీ. మూఁడు గ్రామగ్రామములతోఁ గూడిన
మోపూరుపాలించె ముల్కినాట
నాశ్వలాయనశాఖయందు ఋగ్వేదంబు
కొత్తలామువకంబుగాఁ బఠించె
బ్రీత్యక్ష మొసఁగిన భైరవస్వామిచేఁ
సిద్ధసారస్వత శ్రీవరించెఁ
గాధికాయనస విశ్వామిత్రగోత్రంబు
వంశగోత్రంబుగా వార్తకెక్కె
నెవ్వఁడా త్రిపురాంతకాధీశ్వరునకు
రాయనవరత్న భండారరక్షకునకుఁ
బ్రియతనూజుండు చంద్రమాంబికకు సుతుఁడు
మనుజమాత్రుండె వల్లభామాత్యవరుఁడు

తిప్పనవినుకొండ దుర్గాధ్యక్షుఁడైనట్లును వానికి బైచన వల్లభ మల్లనయను మూవురు పుత్రులు గలరని యీక్రింది పద్యమువలన దేటపడుచున్నది.

ఉ. గంధవతీ పవిత్రిత పురఘస్మర పాదబిసప్రహోనపు
ష్పంధయ చక్రవర్తి ఘుత్రిపర్వత దుర్గమహాప్రధానరా

ప్రాంశుగ జంబు తిప్పన యఖండ సుధీనిధి గాంచెఁ బుత్రులన్
బాంధవకల్పవృక్షముల పైచనవల్లభమంత్రులన్.

ఇట్టివంటి వంశచరిత్రముగలిగిన వల్లభామాత్యునకును శ్రీనాథునకును మైత్రి సంభవించుట వినుకొండపట్టణముననే కాని విద్యానగరమున గాదని తోఁచుచున్నది? వల్లభరాయఁడు ౧౪౦౪ వ సంవత్సరమువఱకును కర్ణాటకరాజ్యపరిపాలనముచేసిన హరిహరరాయల రత్నభాండారాధ్యక్షుఁడైన తిప్పన పుత్రుఁడగుటచేత నాసంవత్సరమున కనంతరముననుండెననుటకు సందేహములేదు. అందుచేత నీక్రీడాభిరామము ౧౪౨౦ వ సంవత్సరప్రాంతమునందు రచింపఁబడెనని నిరాక్షేపముగాఁ జెప్పవచ్చునని శ్రీవీరేశలింగముగారు వ్రాయుట నేల విడిచి సాముచేయుటవంటిదిగా నుండును. ఎందుకన వల్లభరాయఁడు క్రీడాభిరామమును రచించుచుండఁగా శ్రీనాథుఁడు కర్ణాటరాజధానికిఁ జూడఁబోయినపు డాతనికి నొక గీతపద్యరచనమునందు దోడ్పడెనని వక్కాణించుచున్నారు. ఇదియొక పెద్దవిపరీతసిద్ధాంతము. క్రీడాభిరామము వల్లభామాత్యవిరచితము కాదనియు శ్రీనాథకవి విరచితమై యుండుననియు నొక పూర్వపక్షవాదము గలదు. ఈవాదమును నెలకొల్పినవారు శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు అట్లనుట అతిసాహసమని శ్రీవీరేశలింగముగారనుచున్నారు గాని రామకృష్ణకవిగారట్లు సందేహించుటకు హేతువులు లేకపోలేదు. క్రీడాభిరామము శ్రీనాథకవి విరచితమని సందేహించుటకు హేతువు లీక్రింద నుదాహరించుచున్నాఁడను.

౧ శ్రీనాథుఁడు వీథినాటకమును రచించెనని యొక ప్రతీతి వ్యాపించియుండుటయు వీథినాటకలక్షణములేని యొక గ్రంథము కొన్ని చాటూక్తులతోఁ గూడుకొని వీథినాటకమను పేర వ్యవహారమునం దుండుటయు,

౨ క్రీడాభిరామములో 'కంఠమున కేళి సల్పెడు ప్రాకారమునన్' అను పద్యమును, 'కుసుమం బద్దిన చీరకొంగు వాలయక్' అను పద్యమును శ్రీనాథుని వీథినాటకములోనివని యప్పకవి యుదాహరించి యుండుట.

౩ క్రీడాభిరామములోని

గీ. గార్గ్యసిద్ధాంతమతము షట్కాల కలన
శకునమానుట యది బృహస్పతిమతంబు
వ్యాసమతము మనఃప్రసాదాతిశయము
విప్రజనవాక్యమరయంగ విష్ణుమతము.

అను ౨౬ వ పద్యమునందలి ప్రథమ ద్వితీయ చతుర్థ పాదములు శ్రీనాథుఁ డిటీవల రచించిన భీమేశ్వరపురాణ తృతీయాశ్వాసములో

గీ. గార్గ్యసిద్ధాంతమతము షట్కాల కలన
శకునమానుట యది బృహస్పతిమతంబు
విప్రజనవాక్యమరయంగ విష్ణుమతము
సర్వసిద్ధాంత మభిజిత్తు సమ్మతమగు.

అను ౪౧ వ పద్యమునఁ బ్రథమ, ద్వితీయ, తృతీయ పాదములుగా నుండుటయు,

౪ వల్లభామాత్యుని నతిశయోక్తులతో స్తుతించు పెక్కుపద్యములు క్రీడాభిరామమున నుండుటయు.

దీనికిఁ బ్రతిపక్షులుగ నుండువారిలో ముఖ్యులు శ్రీవీరేశలింగముగారు. వీరు చెప్పుసమాధానముల నొకింత పరిశోధించిన దీనిచందము తేటపడఁగలదు. శ్రీవీరేశలింగముగారు "కొందఱు శ్రీనాథుఁడే క్రీడాభిరామమును రచించి దాని కర్తృత్వమును వల్లభరాయని కారోపించెనని చెప్పుదురుగాని యిది సిద్ధాంతము చేయుటకుఁ దగిన సదాధారము లేవియుఁ గానరావు. అప్పకవికిఁ బూర్వమునందున్న వారును

వల్లభరాయనికిఁ జేరువకాలమునందున్న వారగుటచేత నాతనిగూర్చి యెక్కువఁగా దెలియఁదగినవారును నైన చిత్రకవి పెద్దన్న, ముద్దరాజు రామన్న, శ్రీధరుఁడు మొదలైన లక్షణగ్రంథకర్త లందఱును బూర్వోక్తపద్యద్వయమును వల్లభరాయనివనియే తమతమ లక్షణ గ్రంథములయం దుదాహరించి యుండఁగా వల్లభరాయని కిన్నూఱు సంవత్సరములకు వెనుకనుండిన యప్పకవి యవి శ్రీనాథుని వనుట యజ్ఞానమూలమునఁ గాని తెలిసి చెప్పుటచేతఁగాదు. వల్లభరాయని సందర్శింపఁబోయి నప్పు డాతఁడు క్రీడాభిరామమును రచించుచుండఁ గాఁ జూచియుండుటచేతనో తత్పద్యరచనమునం దాతనికిఁ దోడుపడి యుండుటచేతనో శ్రీనాథుఁడు తాను తరువాత రచించిన భీమఖండము నందు సంస్కృతశ్లోకమును దెనిగించుచు 'గార్గ్యసిద్ధాంతమతి' యన్న పద్యములోఁ గొంతభాగ మట్లే వేసియుండవచ్చును. అంతమాత్రము చేతఁ బుస్తక మంతయు శ్రీనాథవిరచిత మనుట యతిసాహసము" అని సమాధానము వ్రాసియున్నారుగదా! శృంగారదీపిక శ్రీనాథకృత మను టకు శ్రీనాథుని శాసనములలోఁ గన్పట్టెడి శృంగారదీపికలోని ౪, ౫ శ్లోకములు రెండుమాత్రమే యాధారములుగా నున్నవని దెలిపెడి శ్రీవీరేశలింగముగారు 'శ్రీనాథుని శాసనములలోని శ్లోకములకే భేద మించుకయులేక సరిగా నిందుఁ గనఁబడుచున్నందున వీరనాథుఁడే శృంగారదీపికను రచించియుండు' నని సాహసించి చెప్పఁగలిగినను, అట్టి సాహసము క్రీడాభిరామముపట్ల కలుగకున్నది. అప్పకవి యీరెండు పద్యములను శ్రీనాథుని వీథినాటకములోని వనుటకు నజ్ఞానమే కారణ మైనయెడల నెవరో పుల్లయ్య వీథినాటక మనక శ్రీనాథుని వీథినాటక ములోని వని యెందుకనవలయును? ఈరెండుపద్యములు శ్రీనాథునివీథి నాటకమని వ్యవహరింపబడెడి బజారు గ్రంథములోఁగూడ నున్నవి గదా. అప్పకవినాటికే శ్రీనాథుఁడు వీథినాటకము రచించెనను సంగతి

వ్యాప్తములో నున్నదనుమాట యైనను అప్పకవి గ్రంథమువలన స్థాపింపఁబడుచున్న దనుట స్పష్టముగదా. వల్లభామాత్యుఁడు ౧౪౨౦ లో క్రీడాభిరామము రచించుచుండఁగా జూచినవాఁ డగుటచేతనో తత్పద్యరచనమునం దాతనికిఁ దోడుపడియుండుటచేతనో శ్రీనాథుఁడు ౧౪౩౦వ సంవత్సరప్రాంతమున అనఁగా ౧౨ఏండ్లకుఁబిదపఁ దానురచించిన భీమేశ్వరపురాణములో సంస్కృతశ్లోకమును వెలిగింపుచు క్రీడాభిరామములోని "గార్గ్యసిద్ధాంత" మన్న పద్యములోని మూఁడుచరణముల నట్లే వేసియున్నాఁడఁట! అహాహా! ఎంత చక్కఁగానున్నది. భట్టుమూర్త్యాదులను గూర్చి వ్రాయు సందర్భమున నీసిద్ధాంత మేల పనికిరాదయ్యెనో? క్రీడాభిరామపీఠికలో నత్యతిశయోక్తులతోఁ దన్ను దాను పొగడుకొనియుండునా? వానినీక్రింద నుదహరించుచున్నాను. చూడుఁడు. "మనుజమాత్రుండె వల్లభామాత్యవరుఁడు" అను తుదిపాదముగల సీసపద్యము నిదివఱకె యుదహరించి యున్నాఁడను.

కం, అహరహపథి సమయన్నృత్య
త్తుహినాంశుధరప్రిచార దూతాభ్రిధునీ
లహరీభ్రిమ ఘుమఘుమములు
వహిఁజెప్పును వల్లభన్న వాగ్వైభవముల్.

కం. హాటకగర్భవధూటి
వీటీకర్పూరశకల విస్ఫురదసౌర
భ్యాటోప చాటుకవితా
పాటవమను ధవణి వల్లభన్నకు నమరెన్.

తే. హాల్లీసక నటనోద్భవ
వల్లభహరికృష్ణకంఠ వనమాల్యమిళ
ద్వల్లత్ సురభులు తిప్పయ
వల్లభరాయప్రధాన వాగ్వైభవముల్.

కం. అమృతరసనమథన సంభవ
ఘుమఘుమమిత పయఃపయోధి కోలాహలముఁ

ధరియించు దిప్పనచివా
స్త్రమువల్లభ విటునిచాటు ధారాఘణితుల్

కం. ఖిల్లావతాం మధుభి
త్పల్లభుజాస్ఫాల్యమాన పటుచాపజ్యా
వల్లీమతల్లి చెల్లెలు
వల్లభరాయప్రధాన వాగ్వైభవముల్.

కం. నెల్లూరి తూముకాలువ
పల్లకముల కమ్మదావి నపలాపించుఁ
సల్లలిత లీలఁ దిప్పయ
వల్లభరాయప్రధాన వాగ్డంబరముల్.

కం. ఉపమించెద ధారాధర
తపజన్మై రాజరాజ ధారానగరా
ధిపధారాధర వాహుల
దిత్రిపురాంతకవల్లభుని వితీర్ణప్రౌఢిన్.

కం. సరివత్తువీవినిర్జర
పరివృషమణి ధనదజలదవలిఖచరనిశా
కరసురతరు సురధేనువు
లరుదే త్రిపురారి వల్లభామాత్యునకున్

శా. సారాచారమునన్ వివేకసరణిన్ సౌభాగ్యభాగ్యంబులన్
ధౌరంధర్యమునన్ బ్రతాపగరిమన్ దానంబునన్ సజ్జనా
ధారున్ దిప్పనమంత్రివల్లభు నమాత్యగ్రామణిం బోల్పఁగా
వేరీ ముత్రిలు సింధువేష్టితమహోర్వీచక్రవాళంబునన్.

సీ. మందారవారుణీ మదఘూర్ణితాత్ముచే
వెడదకన్నుల చిన్నివడుగుచేత
ఢమరు ఖట్వాంగదండకపాలపాణిచే
ధూర్తబాలక చక్రవర్తిచేతఁ
గుహ్యకపరివార కోటిసేవితునిచే
వెలఁది కోఁతిమోము వేల్పుచేత

* * * * * * * *

విశ్వవిశ్వంబు పాలించు విభునిచేత
భాగ్యతీదేవి గారాపుబట్టిచేత

నీప్సితముగాఁ జెప్పుమంత్రిప్రవరుఁడయిన
ధర్మమణివల్లభామాత్యుఁ డహోహంబు.

ఆమంత్రిశేఖరుండు రావిపాటి త్రిపురాంతకదేవుం డను కవీశ్వ రుం డొనరించిన ప్రేమాభిరామనాటకంబు ననుసరించి క్రీడాభిరామం బను రూపకంబు తెనుంగుబాస రచియించినవాఁడు.

గీ, అతఁ డెంతటివాఁడు ప్రేమాభిరామ
మనఁగ నెంతటి యది దానిననుసరించి
వీధియనురూపకము మది వెలఁపులేక
తిప్పవిభువల్లభుఁ డెట్లు తెనుఁగుజేసె.

ఈవిధముగా వల్లభామాత్యుఁడు తనకుఁదానే పొగడుకొను చుండుట శ్రీవీరేశలింగముగారికి వింతగాను, వెగటుగాను గనుబట్టలేదు. ఆత్మగౌరవముగలకవి యెవ్వఁడు నీరీతిగాఁ దన్ను బొగడుకొనియుండడు. ఎంతటిస్తోత్రప్రియుఁడైనను నీరీతిగాఁ బొగడుకొన్న లోకము నవ్వునని సిగ్గుపడకమానఁడు. కావున నీపొగడ్తలన్నియు నమితమైయొక కవియై యుండ వలయును. అట్టికవి శ్రీనాథుడే గాని మఱియన్యుఁడుగాడు. తమ కవిత్వ మును గొంచె మతిశయోక్తులతోఁ బొగడుకొన్న మడికిసింగన, సంకు సాల నృసింహకవి మొదలగువారిని స్వాతిశయముకలవారని నిందించిన వీరేశలింగముగారు వల్లభామాత్యునిపట్ల మౌనధారణము వహించి యున్నకుండుట నత్యాశ్చర్యకరముగా నున్నది. "ఈవల్లభరాయని కవి త్వము మృదుమధురపదగుంభనము గలదయి ప్రౌఢముగా నున్నది కాని కొన్నిచోట్లఁ గ్రీడాభిరామములోని వర్ణనము లసభ్యములయి యశ్లీలములయి నీతిబాహ్యములయి యుండుటచేత స్త్రీలును సామా న్యజనులును జదువఁదగినదికాదు." అనిమాత్రము వ్రాసినారు. మఱి యును "జారత్వము దూష్యముగాఁ బరిగణింపఁబడక శ్లాఘ్యముగా నెంచఁబడెడు కాలమునందుఁ జేయఁబడిన గ్రంథవిషయమునను మనము కాలమును నిందింపవలసినదే కాని కవిని గర్హింపవలసినపనిలేదు." అని

కాలమును నిందించినారు. ఈకడపటియభిప్రాయమునే శ్రీవీరేశలింగము గారు పలుతడవులు వక్కాణించి యున్నారు గావున నందునగూర్చి ప్రత్యేకముగా మఱియొక స్థానమునఁ జర్చింపబూని యిచ్చట విరమించుచున్నాను. కాలమును మాత్రము నిందించెనే కాని కవిని మాత్రము శ్రీనాథుఁడు కాఁడనుకొనుటచేత జారుఁడనికాని పాపుఁడనికాని నిందింపక విడిచిపెట్టినారు. ఒకవేళ అభాగ్యోపాఖ్యానము, పరిహాసనములు మొదలగునవి వ్రాసిన తా మాకవిని నిందించినపక్షమున నయ్యవి తమకుఁగూడ నన్వయించునేమోయన్న భయముచేత విడిచిపెట్టినను విడిచిపెట్టియుందురు. ఆవిషయ మటుండనిండు. ఈ వీథినాటకము పై హేతువులచేత వల్లభామాత్య విరచితము కాదేమోయని యెట్టివానికిని సందియము గలుగకమానదు. ఎట్లైనను అంతయుం గాకపోయినను గొంతవఱకైనను శ్రీనాథునిచేయి యీ రచనమునఁ బొలుగొని యుండకపోదన్ని విశ్వసింపవలసి వచ్చుచున్నది.

సీ. అలకాపురంబున నంగారవర్ముఁడౌ
గంధర్వపతికన్య కమలపాణి
యాదివ్యగంధర్వి కపరావతారంబు
మధుమావతోర్గంటి మండలమున
నాసుందరాంగి దాక్షారామమునఁబుట్టు
భువనమోహిని చిన్నిపోతియనఁగ
నట్టిసత్ స్త్రీజాతి యాసానికూతురు
చిరకాలమున సదాశివునికూడి
పావనంబైన తమిలేటిపరిసరమున
వేఁగి కురువాటి కాదేశ విపినభూమి
గోవులను పేరి చెంచులకులమునందుఁ
గలిమిగత్తెల యమ్మినాఁ గలుగఁగలదు.

అనుపద్యములో నుదాహరింపఁబడిన స్థలముల నన్నిటిని జూఁచినవాఁడేగాని మఱియొకఁడిట్టిపద్యమునువ్రాసి మధుమావతీదేవి

పూర్వజన్మమున నిట్టి దని భావిజన్మమున నిట్లుపుట్టు నని భూతభవిష్య త్కాలముల జన్మములును జాతులును జెప్పుట సంభవముకాదు. ఈ దేశము లనన్నిటిని దిమ్మతిరిగి దేశములయొక్కయుఁ బ్రజలయొక్కయు రీతుల నెఱిఁగినవాఁడు శ్రీనాథకవివర్యుఁడు గాని వల్లభామాత్యుఁడు గాడని మనమెఱుంగుదుము. కనుక శ్రీనాథుఁడే క్రీడాభిరామమును రచించియుండవచ్చును.

## క్రీడాభిరామకర్తృత్వ విమర్శనము.

ఈ పైరీతిని క్రీడాభిరామమును గూర్చి 1918 సంవత్సరమున నేను బ్రకటించిన శ్రీనాథకవి జీవితము యొక్క ప్రథమముద్రణగ్రంథ మున వ్రాసి ప్రకటించిన తరువాత ప్రభాకరశాస్త్రిగారు నా యభి ప్రాయమును బలపఱచుచు మఱికొన్ని దృష్టాంతములను జూపుచు 1923 సంవత్సరమునఁ దాము ప్రకటించిన 'శృంగారశ్రీనాథ' మను గ్రంథమున నీ వాదమును గొంత విపులము గావించిరి. అందుపైని నా మిత్రులగు వేమూరి విశ్వనాథశర్మగారు 'క్రీడాభిరామ గ్రంథకర్త శ్రీనాథుఁడా' యను శీర్షికతో ప్రభాకరశాస్త్రిగారు చూపిన హేతువు లను ఖండించుచు దమ యుక్తులచే క్రీడాభిరామ గ్రంథకర్త వల్లభరా యుఁడే గాని శ్రీనాథుఁడు కాఁడను వీరేశలింగముగారి వాదమును నిలువఁబెట్టవలయు నని చేతనైనంతవఱకుఁ బ్రయత్నించి సమర్థింపఁ బూనిన నొక వ్యాసమును భారతీపత్రికయందుఁ బ్రకటించిరి. అటు పిమ్మట శర్మగారి వాదమును సంపూర్ణముగా ఖండించుచు 'క్రీడాభి రామ కర్తృత్వవిమర్శన' మను శీర్షిక పేరుతో దీర్ఘ పరిశోధనముతోఁ గూడిన యొక పెద్దవ్యాసమును కిలాంబి రాఘవాచార్యులుగా రా భారతీపత్రిక యందే క్రీడాభిరామ గ్రంథకర్త వల్లభరాయుఁడు గాక శ్రీనాథుఁడే యైయుండవలయు నని శర్మగారికిఁ బ్రత్యుత్తరము వ్రాసి

యున్నారు.* విమర్శకులకుఁ బ్రత్యేకము శ్రమ తొలగించుటకై విశేషముగాఁ బరిశోధనము చేసి పదపద్యభావసామ్యములు గల పద్యములను శ్రీనాథకవి రచితములైన యితరగ్రంథములలోని పద్యములతోఁ బోల్చి చూచుకొనుటకై క్రీడాభిరామమునుండి పెక్కు పద్యముల నెత్తి చూపి యున్నారు. కాని వ్యాసపీఠికలోని బుక్కరాయాదుల కాల-నిర్ణయమును గూర్చి చేసిన ప్రశంసలో నుదాహరించిన సంవత్సరములన్నియు నిజమైన చరిత్రకాలమునకు భిన్నములుగా నుండుటయె గాక రాజుల నామములు గూడ తప్పులుగా వ్రాయఁబడినవి. రాఘవాచార్యులుగారు విద్యాధికులయి యుండి చరిత్రము బాగుగాఁ దెలిసిన యీకాలమునఁ గూడ నిట్టి యాభాసచరిత్రమును వెల్లడించుట చరిత్రజ్ఞులలో హాస్యాస్పదులగుటయే గాక చరిత్రమును దెలియనివారిని మాఱుత్రోవలం బెట్టిన వారగుచున్నారు. తమకు చరిత్రము తెలియనప్పు డావిషయమున మౌనము వహించుట గౌరవాస్పదమైన విషయము.

"ప్రథమ దేవరాయ లనఁబడు హరిహరిరాయలు క్రీ. శ. ౧౩౭౫ నకుఁ బూర్వమునను, ద్వితీయ హరిహరరాయలు క్రీ. శ. ౧౩౭౫-౧౩౩౯ సంవత్సరములలోను రాజ్య మొనర్చినట్లు గర్ణాట రాజ్య చారిత్రపరిశోధకులు వ్రాసియున్నారు. ఇందు వల్లభరాయల తండ్రి, ప్రథమ హరిహరరాయల యాస్థానమున రత్నభాండాగారాధ్యక్షుఁడైనచో కవియు క్రీ. శ. ౧౩౫౦ ప్రాంతము వాఁడగును. ద్వితీయ హరిహరరాయ లయినచో కవి క్రీ. శ. ౧౩౨౫ సంవత్సరప్రాంతము వాఁడగును. అళియరామరాజు ముత్తాతయగు సోమభూపాలుని కంకిత మీయఁబడిన శ్రీధరచ్ఛందమున 'మంచనవింటివో' యను క్రీడాభి

*(1) 1927 సంవత్సరము, భారతీసంపుటము ౪. సంచిక ౪ చూడుఁడు.

(2) ఆ దేసంవత్సరము ,, ౪, సంచిక ౬. చూడుఁడు.

రామములోని పద్య ముదాహరింపఁబడినది. అళియ రామరాజు సదాశివరాయని కాలములో కర్ణాటరాజ్యమును బాలించుచుండెను. సదాశివరాయలు క్రీ శ. ౧౫౪౦ ప్రాంతమువాఁడు సోమభూపాలునకు సోమరామరాజునకు మూఁడు తరము లంతర ముండుటచే శ్రీధరుఁడను భూపాలుఁడును క్రీ. శ. ౧౪౬౫ ప్రాంతము వారగుదురు. శ్రీధరునకుఁ బూర్వపువాఁడగుటచే కవి క్రీ. శ. ౧౪౫౦ సంవత్సరప్రాంతముననుండి యుండును. కవి తండ్రియగు తిప్పనయుఁ బ్రథమ హరిహరరాయల యాస్థానమునం దుండనొప్పు.”

ఈపై వాక్యములు తమ వ్యాసములోఁ బీఠికభాగమున రాఘవాచార్యులుగారు పొందుపఱిచి యున్నారు. ఇయ్యవి వీరు నిజముగా చరిత్ర మెఱిఁగి వ్రాసిన వాక్యములు గావు. మీదుమిక్కిలి కర్ణాటరాజ్యచారిత్ర పరిశోధకు లిట్లు వ్రాసినారని వ్రాయుచున్నారు. నే నెఱిఁగినంతవఱ కిట్లెవ్వరును వ్రాసి యుండలేదు.

విజయనగరరాజుల సరియైన ప్రభుత్వకాలము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| మొదటి హరిహరరాయలు | క్రీ.శ. | ౧౩౩౬ | మొదలుకొని | ౧౩౫౫ | వఱకు |
| వీరబుక్కరాయలు | ,, | ౧౩౫౫ | ,, | ౧౩౭౭ | వఱకు |
| రెండవహరిహర రాయలు | ,, | ౧౩౭౭ | ,, | ౧౪౦౬ | వఱకు |
| మొదటి దేవరాయలు | ,, | ౧౪౦౬ | ,, | ౧౪౨౨ | వఱకు |
| విజయబుక్కరాయలు | ,, | ౧౪౨౨ | ,, | ౧౪౨౩ | వఱకు |
| రెండవ దేవరాయలు లేక ప్రౌఢ దేవరాయలు | ,, | ౧౪౨౩ | ,, | ౧౪౪౭ | వఱకు |

మనకవి వల్లభరాయఁడు ప్రౌఢదేవరాయల కాలములోనున్న వాఁడు. వీనితండ్రి మొదటిదేవరాయల కాలములో నున్నవాఁడు. ఈ పై విజయనగరరాజుల నామములు సరియైనవనియు, వీరి పరిపాలనాకాల

మెవ్వ రేవిధముగాఁ జెప్పినను ఒకటి రెండు సంవత్సరముల భేదముతో సరిపోకమానవనియు, శ్రీమాన్ కిలాంబి రాఘవాచార్యులు ఎమ్. ఏ. బి. ఎల్. గారు మఱొకమాఱు శ్రద్ధతోఁ బరిశోధించిన యెడ వారు తెలిసికొనఁగలరని నాదృఢమైన విశ్వాసము. అట్లుచేయఁ బ్రార్థింతును. వారు చేసిన గొప్పతప్పేమన మొదటిదేవరాయలు, రెండవ దేవరాయలు లేక ప్రౌఢదేవరాయ లనుటకు మాఱుగా ప్రథమ హరిహరరాయలు, ద్వితీయహరిహరరాయలని వ్రాయుటయే. ద్వితీయహరిహరరాయలు క్రీ. శ. ౧౪౨౫-౧౪౪౯ సంవత్సరములలో రాజ్యమొనర్చినట్లు మొదటవ్రాసి తరువాత క్రిందను 'ద్వితీయ హరిహరరాయ లయినచో కవి క్రీ. శ. ౧౪౭౫ ప్రాంతము వాఁడగునని వ్రాయుట మఱియొక తప్పు. అళియరామరాజు ముత్తాతయగు సోమభూపాలునకు శ్రీధరఛందస్సు అంకితము చేయఁబడినదనుట మఱియొక తప్పు. అళియరామరాజు ముత్తాత యార్వీటిబుక్కరాజు గాని సోమభూపాలుఁడు గాఁడు.

అళియరామరాజు వంశము బాలభాగవతము నందును, నరపతి విజయము నందును దెలుపఁబడినది.

తాత పిన్నమరాజు కొడుకు సోమదేవరాజు; వానికొడుకు రాఘవరాజు; వానికొడుకు పిన్నమరాజు; వానికొడుకు బుక్కరాజు; వానికొడుకు రామరాజు; వానికొడుకు తిమ్మరాజు; వానికొడుకు శ్రీరంగరాజు; వానికొడుకు అళియరామరాజు.

ఇట్లుండఁగా అళియరామరాజు ముత్తాత సోమభూపాలుఁడనుట తప్పు. అళియరామరాజున కేడు తరములకుఁ బూర్వమున్నవాఁడు సోమదేవరాజు. ఈ సోమదేవరాజే సోమభూపాలుఁ డనుకొందమన్న నతఁడు క్రీ. శ. ౧౩౭౦ సంవత్సరమునకుఁ బూర్వుఁడు కాని తరువాత వాఁడై యుండఁడు. అతని కంకితము చేయఁబడిన శ్రీధరఛందస్సులో ౧౪౫౦ప్రాంతమున వ్రాయఁబడిన క్రీడాభిరామములోని మంచనవింటివో

మెవ్వ రేవిధముగాఁ జెప్పినను ఒకటి రెండు సంవత్సరముల భేదముతో సరిపోకమానవనియు, శ్రీమాన్ కిలాంబి రాఘవాచార్యులు ఎమ్. ఏ. బి. ఎల్. గారు మఱొకమాఱు శ్రద్ధతోఁ బరిశోధించిన యెడ వారు తెలిసికొనఁగలరని నాదృఢమైన విశ్వాసము. అట్లుచేయఁ బ్రార్థింతును. వారు చేసిన గొప్పతప్పేమన మొదటిదేవరాయలు, రెండవ దేవరాయలు లేక ప్రౌఢదేవరాయ లనుటకు మాఱుగా ప్రథమ హరిహరరాయలు, ద్వితీయహరిహరరాయలని వ్రాయుటయే. ద్వితీయహరిహరరాయలు క్రీ. శ. ౧౪౨౫-౧౪౪౬ సంవత్సరములలో రాజ్యమొనర్చినట్లు మొదటవ్రాసి తరువాత క్రిందను 'ద్వితీయ హరిహరరాయ లయినచోఁ కవి క్రీ. శ. ౧౪౭౫ ప్రాంతము వాఁడగునని వ్రాయుట మఱియొక తప్పు. అళియరామరాజు ముత్తాతయగు సోమభూపాలునకు శ్రీధరఛందస్సు అంకితము చేయఁబడినదనుట మఱియొక తప్పు. అళియరామరాజు ముత్తాత యార్వీటిబుక్కరాజు గాని సోమభూపాలుఁడు గాఁడు.

అళియరామరాజు వంశము బాలభాగవతము నందును, నరపతి విజయము నందును దెలుపఁబడినది.

తాత పిన్నమరాజు కొడుకు సోమదేవరాజు; వానికొడుకు రాఘవరాజు; వానికొడుకు పిన్నమరాజు; వానికొడుకు బుక్కరాజు; వానికొడుకు రామరాజు; వానికొడుకు తిమ్మరాజు; వానికొడుకు శ్రీరంగరాజు; వానికొడుకు అళియరామరాజు.

ఇట్లుండఁగా అళియరామరాజు ముత్తాత సోమభూపాలుఁడనుట తప్పు. అళియరామరాజున కేడు తరములకుఁ బూర్వమున్న వాఁడు సోమదేవరాజు. ఈ సోమదేవరాజే సోమభూపాలుఁ డనుకొంద మన్న నతఁడు క్రీ. శ. ౧౩౨౦ సంవత్సరమునకుఁ బూర్వుఁడు కాని తరువాత వాఁడై యుండఁడు. అతని కంకితము చేయఁబడిన శ్రీధరఛందస్సులో ౧౪౫౦ ప్రాంతమున వ్రాయఁబడిన క్రీడాభిరామములోని 'మంచనవింటివో'

అనుపద్య ముదాహరింపఁ బనుట యెట్లు? ఆ ట్లాకవేళ యుండిన తరువాత నెవ్వరివలననో యందు చేర్పఁబడి యుండునుగాని గ్రంథకర్త చేర్చినవాఁడని చెప్పవలను లేదు. ఇంతకును శ్రీధరఛందస్సు నంకితము పొందిన సోమభూపాలుఁ డేసోమభూపాలుఁడో రాఘవాచార్యులు గారు సరిగాఁ బరిశోధింప లేదనుకొనియెదను. ఇట్లు వ్రాసినందుకు రాఘవాచార్యులుగారు నన్ను క్షమింతురుగాక!

ఈపీఠికభాగమును విడిచిపెట్టిన యెడల శ్రీయాచార్యులవారి వ్యాసము సర్వవిధముల యోగ్య మయినదిగా నున్నదనుటకు సందియము లేదు. ప్రతిపక్షులవాదము మరల తలయెత్తకుండ జేయఁగలిగిరి. నావంటి విమర్శకునకును గ్రంథపరిశోధన పరిశ్రమబాధలు లేకుండఁజేసి నందులకు వారి కనేక కృతజ్ఞతాభివందనములను మనఃపూర్వకముగా సమర్పించుచున్నాను. వినుకొండ వల్లభరాయఁడు:—

అశ్వలాయన శాఖయందు ఋగ్వేదంబు
కరతలామలకంబుగాఁ బఠించె
బ్రత్యక్షమొనరించి భైరవస్వామిచే
సిద్ధసారస్వత శ్రీవహించె.

అని వర్ణింపఁబడియుండియు, గవిసార్వభౌముని చేతిలో వెట్టివెంగలయ్య యయిపోయినాఁడు. తా నీగ్రంథకర్తృత్వమును గోరక గ్రంథము నంకితము బొందియుండినయెడల నాంధ్రప్రపంచమున నెంతో గౌరవము నొంది యుండును. "కవీంద్ర కాంక్షిత దళమహీరుహము" కావున వల్లభరాయఁడు యశమున కాసించి విశేషధనము నొసంగి గ్రంథకర్తృత్వము దనపైఁ బెట్టించికొన సాహసించి యుండ నోపు. వల్లభరాయఁడు యశోలోభమున లోకమున నవ్వులపాలగు చున్నాఁడు. ఎంతవిద్యాధికుఁ డయినను నెట్టి ప్రతిభాశాలి యైనను క్రీడాభి

రామగ్రంథకర్తృత్వమును వల్లభరాయునికి నిలుప సమర్థింపఁబూను వాఁడుగూడ లోకమునఁ బరిహాసాస్పదుఁడు గాకమానఁడు. అట్లగుట నెఱింగియు విశ్వనాథశర్మగారు తగుదు నని ముందుకువచ్చుట వింతగా నున్నది. ఒకటిగాదు; రెండుకాదు; వందలకొలఁది నున్న వానిని సమర్థించుటెట్లు? ఇట్టి సందర్భమున యుక్తిప్రయుక్తుల వలనఁ బ్రయోజనమేందునా? పదసంవిధానమునందును, కారకప్రయోగవైచిత్రిపద్యోపక్రమ నిర్వాహములందును, అన్వయక్రమమునందును, ప్రతిపదమును శ్రీనాథుని జ్ఞప్తికిఁ దెచ్చుచుండఁ గాదనుటయెట్లు? సంస్కృత వాఙ్మయమందును పూర్వకవుల పద్యములలోని భావములను, పదముల కూర్పును నర్వాచీనకవు లనుకరించుట సనాతన సంప్రదాయ మన వచ్చును. అది గ్రంథచౌర్యములోనికిఁ జేరదు. సందర్భము ననుసరించి పదములకూర్పును మార్చుచు, పూర్వకవి ప్రయోగములకు మెఱుఁగులు వెట్టుచు తరువాతికవులు తమ తమ కవితల వెలయింపఁ జేసియున్నారుగాని పద్యములకుఁ బద్యములే, పద్యములోని రెండేసి, మూఁడేసి పాదములను బదముల కూర్పునం దొకింతయు మార్పులేకుండ, నే ప్రసిద్ధాంధ్రకవియు దొంగిలించి యుండలేదు. ఇది కేవలము దొంగతనము అనిచెప్పరాదు. ఈగ్రంథ మామూలాగ్రము శ్రీనాథ రచనమనియె గన్పట్టుచున్నది

## పదపద్యభావసామ్యములు

గీ. గార్గ్యసిద్ధాంతమత ముషఃకాలకలన
శకునమూనుట యది బృహస్పతిమతంబు
వ్యాసమతము మనఃప్రసాదాతిశయము
విప్రజనవాక్య మగయంగ విష్ణుమతము. వీథి.

గీ. గార్గ్యసిద్ధాంతమత ముషఃకాలకలన
శకునమూనుట యది బృహస్పతిమతంబు

విప్రజన వాక్య మాయంగ విష్ణుమలేము

సర్వసిద్ధాంత మహేజిత్తు సమ్మతము గు. భీమఖండము.

శా. ప్రాలేయాహిత సంప్రసక్తి ప్రకటీజ ప్రక్రీడదగ్నోపల

జ్వాలాజాలజటాలజాంగలతటీ వాచాలతో యష్టియై. హర. (ఆ.౭.ప.౧౦౯)

శా. ప్రాలేయా దిక్కుల భాను భాస్వతి కర ప్రక్రీడదగ్నోపల.

జ్వాలాజాలజటాలజాంగలతటీ వాచాలతో యష్టులై, (వీథి. ప. ౧౫౬)

వీణాక్వాణ పాణింధమంబైన వీథి. ప. ౧౦౦

కలమధురవీణాక్వాణపాణింధమంబై, భీ. ఖం. ౨. ౧౧౦

పాణింధమం బను పదము శ్రీనాథుని కవనంబునఁ బెక్కుమారులు ప్రయోగింపఁబడియుండుట గానఁగును.

గంధసార తుషార పాణింధమంబు* భీ. ఖం. ౧. ౫౩

ప్రవాహధారాగంధ పాణింధమం బైన కా. ఖం. ౨-౪౪

నీహార క్షీరధారాశ్రేణి పాణింధమం బైన కా. ఖం. ౩.౧౧౩

మాణిబంధాశ్వ లవణ పాణింధమములు కా. ఖం. ౪-౧౧౯

కాలహాటచ్ఛాయా పాణింధమంబై ,, ౪-౧౧౮

కేసర పరాగ గంధ పాణింధమంబై ,, ౪-౨౭౨

నిశ్శ్వాసాగ్ని పాణింధమంబేలా శృం. నై. ౨-౩౨

కోదండనారాచ ధారాపాణింధమంబు ,, ౮-౫౭

శృంగారనైషధమున 'నిశ్శ్వాసాగ్ని పాణింధమంబేలా?' అను పద్యమునకు మూలమునందు 'పాణింధమం' బను పదము గానరాదు.

వ్యామగ్రాహ్య నితంబబింబ— వీథి

వ్యామగ్రాహ్య స్తనులగు భామినులు— శృం. నై.

వ. టిట్టిభ! యదె చూడు వరుణరాజవారాంగనావిలాస దర్పణానుకారి యై యహర్పతి క్రుంకఁబోయె.— వీథి.

క. ఈ మాటల పెఖోంబునఁ
దిశమై యొక్కింతతమువు దినకరుఁడొప్పెన్
వరుణుని శుద్ధాంతంబున
నరవిందాక్షులకు మించు టద్దంబగుచున్,        భీమఖండము.

వ. నెఱసంజయు మసమసకని చీఁకటియుఁ గలసి దిక్సౌధకూటవాటీ నికరంబుల వ్రేలవిడిచిన గురివిందపూసల పేరునుం బోలెఁ బొలుపు మిగిలె... వీధి.

క. పసుఁబాప యెండకొసలును
మసమసకని యరలుఁగలసి మనమలరించెన్
దెసల నలుగడల గుంజా
విసరంబుల సరుల వ్రేలవిడిచినభంగిన్.        శృం. నై.

గన్నేరుపూఁ జాయకరమొప్పు నీర్కావి
మడుఁగు దోవతి పింజెవిడిచికట్టి -        వీధి. ౮౩

గన్నేరుపూచాయ గనుపట్టు జిలుగైన
సలిలకాషాయవస్త్రంబుగట్టి        శృం. నై. ౮-౧౦౩

గోజ్జంగిపూనీరు కులికి మేదించిన        వీధి

గోజ్జంగి పూదేనె కులికి మేదించిన        కా. ఖం. ౩-౧౧౮

గంగమట్టి లలాటకమునదీర్చి...        వీధి

గంగమట్టియమీఁదఁ గస్తూరిరసమున
బుంద్రకంబు లలాటకమునదీర్చి శి. మా.

వ్రీడాశూన్య కటీరమండలము దేవీ శంభళీవ్రాతమున్.        వీధి

కట్టిడివ్రీడాశూన్య కటిగోపురద్వార పరిరక్షకుఁడు-        కా. ఖం. ౧-౨

లజ్జయెఱుంగని కటిమండలంబుమీఁద.        కా. ఖం. ౩-౨౮౦

మధుకైటభారాతి మడుఁగుఁబొన్న-        వీధి ౨-౨౧

మధుకైటభారాతి మడుఁగుఁ బొన్న -        కా. ఖం. ౩-౧౮౯

తోఁకచుక్కలఁ బోలు తోరంపు దెలికన్ను
లా వైళమున సిగ్గునతకరింప వీధి. ౧౩౭

తోఁకజుక్కలఁబోలుఁ దృక్తోయజముల శృం. నై ౮-౬౦

హర్షనైషధమున గానవచ్చు శ్లోకమున ‘తోఁకచుక్కల బోలు’ అను దానికి మూలము గనంబడదు.

నిద్దంపు వెలిపట్టు నెఱికదూరిన యప్డు
తొడలమించులు వెలిదొంగలింప క్రీ. రా. ౧౩౭

అచ్చవెన్నెల చాయ నవఘళింపఁగఁ జాలు
నిద్దంపు వెలిపట్టు నెఱికగట్టి శృం. నై. ౯-౨౨

ఈ సీసపద్య పాదమునకు సరియైన మూలము హర్షనైషధమున గానరాదు.

ఆ లీఢపాద విన్యాస మొప్పఁగ వ్రాలి క్రీ. రా. ౧౧౭

ఆలీఢ పాద విన్యాసంబు శృంగార
వీరాద్భుతంబులకు విందు సేయ శృం. నై. ౬-౨౨

వ్యామగ్రాహ్యనితంబ బింబకుచహా
రాభీల భద్రాకృతుల్ క్రీ. రా. ౨౦౯

వ్యామగ్రాహ్యకుచంబు లంటి యిదెనా
ప్రాణంబు రక్షించెదన్ శి. మా. ౩-౮౭

వ్యామగ్రాహ్యపయోధరల్ కా. ఖం. ౩-౫౩

వ్యామగ్రాహ్యపయోధరల్ హ. వి. ౫-౨౩

వ్యామగ్రాహ్యస్తనులగు భామలు శృం. నై ౮-౯౮

మూలగ్రంథమగు హర్షనైషధమున నిది గానంబడదు.

నింగియుంగిలికంబునం బెట్టి క్రీ. రా. ౨౭౩

నింగియుంగిలికాన నభ్యంగమార్చె కా. ఖం ౧-౧౨౮

రోలంబంబులు మూతిముట్ట వెఱచెన్

క్రొవ్వేడి చీరెండలన్ క్రీ. రా. ౧౫౩

మొకరి తుమ్మెద మూతిముట్టనోడెడి శి. మా. ౨-౧౦౭

కోమలి నిట్టూర్పు క్రొవ్వేడి నెత్తావి

మొకరితేంట్లును మూతిముట్ట వెఱచె శృం. నై.

౨-౧౧౩

శృంగారనైషధము నందలి పై పద్యభాగము మూలనైషధము నుండి యాంధ్రీకరింపఁబడి యుండలేదు. శ్రీనాథుని స్వకపోలకల్పితమే. కోయిలలు కొసరుట శ్రీనాథునకుఁ గడునింపు గూర్చు వర్ణనమని.

కోకిలము పంచమశ్రుతి గొసరినట్లు క్రీ. రా. ౧౦౧

కొసరి వసంతకాలమున కోయిల క్రోల్చినభంగి కా. ఖం. ౫-౧౭౭

కొసరె నుద్యానవుం బ్కోకిలములు. హ. వి. ౭ ౧౩౫

కోయిల పంచమస్వరము క్రోల్చినభంగి క్రీ. రా. ౧౭౭

కోకిలం బెవ్వనికాయునో కొసరి యనుచు శృం. నై. ౮-౨౦

హర్షనైషధమున నిదియుఁ గానరాదు.

కంఠగ్రైవేయ ఘంటికాటంకారంబులును క్రీ. రా. ౨౨౭

కరిఘటాకంఠ గ్రైవేయ ఘంటికాటంకారంబు బ్రోదిసేయుచు

హర్షనైషధమున నిదియుఁ గానరాదు. శృం. నై. ౯-౬౦

గంధదంతావళగ్రైవేయ ఘంటికా

టంకారముఖర ఘంటాపథంబు భీ. ఖం. ౧-౪౨

మహిషగ్రైవేయ ఘంటాధ్వనుల్ — కా. ఖం. ౫-౨౭

కలకంఠ కామినీ కోమలకు హూంకారంబు-శ్రీనాథుని స్వతంత్రరచన

కలకంఠీ కలకంఠ కోమలకు హూంకారంబు తోరంబుగా

క్రీ. రా. ౧౩౧

వరుణరాజ శుద్ధాంతకాంతానివాస
మాణిక్యదర్పణంబై — క్రీ. రా. ౨౭౩

వరుణుని శుద్ధాంతంబున
సరవిందాక్షులకు మించుటద్దంబగుచున్ — భీ. ఖం. ౨-౨౭

కెంజిగురాకు మోవినిశిధాత్వర్థంబనుష్ఠింతునో — క్రీ. రా. ౯౦

ణిసిధాత్వర్థ మనుగ్రహింపఁదగవే నీరేజపత్రేక్షణా శృం. నై. ౮. ౫౨

హర్షనైషధకావ్యమున నిది గానరాదు. ణిసిచుంబనే, యను ధాత్వర్థము ననుసరించి రచించిన యపూర్వప్రయోగమై యున్నది.

చరణాంగుళీకుటిల నఖశిఖాకోటికుట్టనంబున — క్రీ. రా. ౨౩౫

కుటిలపాటల జటాంకురకుట్టనంబున — కా. ఖం.

కుటిలచంద్రాపుట కోటికుట్టనమున — శృం. నై. ౨-౫

హర్షనైషధమున నీశ్లోకము గానంబడుచున్నది.

చాంపేయ కుసుమచ్ఛదచ్ఛాయా దాయాదంబులైన — క్రీ. రా. ౮౧

కఠోరపాఠీనచ్ఛాయా దాయాదంబులైన — భీ. ఖం

సుకుమార సుఖచ్ఛదచ్ఛటా దాయాదంబులైన — కా. ఖం

ద్యావాపృథ్వ్యంతరాళముల — క్రీ. రా. ౫

ద్యావాపృథ్వ్యవకాశ పేశలయశో
ధారానభస్సింధువై — కా. ఖం. ౧-౨౩

ద్యావాపృథ్వ్యవకాశముల్ — కా. ఖం. ౬-౨౪౦

ద్యావాభూమ్యంతర మట్టహాసడమరు
ధ్వానంబులన్ — కా. ఖం ౭-౩౨

దాహకుండెక్కి విడిచిన వారువంపుఁ
గోదమయును బోలి క్రీ. రా. ౮౭

చండాలకుల వరారోహవాహకుండెక్కి
విడిచినవారు వంపుగోదమయుంబోలె శి. మా. ౩-౯౬

ఉ. తియ్యనివింటిజోదు రతిదేవి చనుంగవ నొత్తగిల్లి యె
య్యెయ్యనవంక చక్కఁబడనొత్తెడుఁ జూచితే పుష్పబాణముల్
మయ్యెగ్రాసెఁ జిత్తగవుమాఁగిలి మాఁగిలి చిత్రకారుఁడా
దయ్యము గాక వీని పసదావము టెట్టిథ వీనికిందగుఁగా. క్రీ. రా. ౧౯౨

తే. గీ. కోఁగించిన కడకంటి కొలికిఁ జూచి
వాడివాలిక పూఁదూపువంకఁ దీర్చు
చొరగి రతిదేవిపాలిండ్ల నొత్తగిలిన
యంచు విలుకాని వ్రాసినా రిడుపునందు. శృం. నై. ౭-౧౫౦

ఈపద్యమునకు మూలము నైషధమున గానరాదు. ఇట్టి యపూర్వ కల్పనలే శ్రీనాథుని ప్రతిభావిశేషమును వేనోళ్ళఁ జాటుచు నామహా నీయుని యాంధ్రీకరణపద్ధతిని వివరించుచున్నవి. మూలమునగానరాని యీభావసామ్యము నేమని చెప్పవలయు?

మఱియు'

శా. పంచారించిన నీపయోధరములా స్ఫాలింతునో లేఁత బొ
మ్మంచుం గెంజిగురాకుమోవిణి సిధాత్వర్థం బనుష్ఠింతునో
పంచాస్త్రోపనిషద్రహస్య పరమబ్రహ్మస్వరూపంబు నీ
కాంచీదామపదంబు ముట్టుదునో యోకర్ణాటతాటంకినీ!

శ్రీనాథుని కవితారచనల మాధుర్యము నించుకయైనఁ జవిగొన్న రసజ్ఞు లగువా రీపద్యము శ్రీనాథవిరచితమని గుర్తింపకుందురా?

పద్యసామ్యముగాని భావైక్యముగాని లేక సమానమగు పోకడలుగల పద్యములు పెక్కులుగన్పట్టుచున్నను గ్రంథవిస్తరభీతిచే విడిచిపెట్టవలసి యున్నది. మఱియు శ్రీనాథుని రచనముందెలుపుఁబట్టి పీఁటవిటంకము కుసుమంబెట్టిన, నిద్దంపుఁజెక్కులనీడ, బీరెండవేఁడి, కప్పురబోగివంటకము చెక్కుటద్దములు, దాసనపుఁబువ్వచాయ, పదియార్వన్నెపసిండి, ఆకొన్నాఁడవు, విజ్జోడు, పంచారించు, ఓలగందము, మిసిమింతుఁడు, కుక్షింకులు, కట్టెఱ్ఱ, ఉజ్జ్రూతలు, ఇత్యాదిపదములెన్నియేనిఁ బ్రయోగముల గన్పఱుపవచ్చును.

క్రీడాభిరామము త్రిపురాంతకుని ప్రేమాభిరామమున కాంధ్రీకరణముగావున, పైనచూపిన భావవిశేషములు గొన్ని త్రిపురాంతకునివి కాఁగూడదా యనియు, నట్లుగానిచో నసలుకవియగు త్రిపురాంతకునికే మోసముగల్గుననియు, శ్రీ విశ్వనాథశర్మగారు వ్రాయుచున్నారు. త్రిపురాంతకుని ప్రేమాభిరామము నేఁడు మనలకు లభింపకున్నది క్రీడాభిరామము ప్రేమాభిరామమునకు సరియైన యాంధ్రీకరణము గాదనియు, మూలములోని వర్ణనములఁ బెక్కింటిని బెంచి విస్తరింపఁజేసినాఁడని విశ్వనాథశర్మగారొప్పుకొనుచుండియు, నీగ్రంథకర్తచేసిన ప్రయోగములన్నియుఁ ద్రిపురాంతకునివేయని సాహసించిచెప్పుట సమంజసముగాఁ గన్పట్టదు. శ్రీనాథుని యాంధ్రీకరణములెప్పుడును మక్కికిమక్కిగా రచింపఁబడి యుండలేదు. శ్రీనాథుఁడు భావములను విస్తరింపఁజేసియు, స్వకపోలకల్పనలతోఁ బద్యములనల్లి కొన్నితావుల మూలములకంటెను శోభనుదెచ్చియున్నాఁడు. మనమిందలి సత్యములను దెలిసికొనవలసి యుండునేని శృంగారనైషధమును మూలముతోఁబోల్చి చూచుకొన్న విస్పష్టముగాఁ దెలియఁగలదు. హర్షనైషధమునఁ గానరాని యనేకాపూర్వకల్పనలను దెలియఁగోరువారుకీర్తిశేషులయిన వేదము వేంకటరాయశాస్త్రులవారిశృంగారనైషధవ్యాఖ్యానపీఠికనుజూచినయెడల నిందుఁ

జూపినవిగాక పెక్కు లందుఁ గన్పట్టఁగలవు. పైనిచూపఁబడిన పదపద్య భావసామ్యమునుఁబట్టి క్రీడాభిరామము వల్లభరాయ విరచితముగాక శ్రీనాథ విరచితమేయని యెట్టివానికైనను దోఁచకపోదు.

---

## అధ్యాయము ౬

### సర్వజ్ఞసింగమనాయని సందర్శించుట.

అట్లుప్రౌఢదేవరాయమహారాయలవారి యాస్థానమున నరుణగిరినాథకవిసార్వభౌముని నుద్భటవివాదమున నోడించి వాని విజయడిండిమమును బగులఁ గొట్టించి వానికవిసార్వభౌమ బిరుదమునుఁజూఱఁ గొని యామహారాయని మౌక్తికాగారములో స్వర్ణాభిషేకమహోత్సవమును బొంది కర్ణాటకపద్మవనహేళియై సకలవిద్యాసనాథుఁడైన శ్రీనాథకవి సార్వభౌముఁడు తరువాత కొంతకాలమునకు విద్వాంసుఁడై సర్వజ్ఞబిరుదాంచితుఁడై ప్రఖ్యాతిగనుచున్న రేచర్ల సింహభూపతిని సందర్శింపఁబోయె నట! అట్లు పోవుచు నాతని యాస్థానమున దనకువిజయము కలుగుటకై శ్రీనాథుఁడు శారదాదేవి నుద్దేశించి యిట్లు స్తుతించెనట.

సీ. జీనాగటంకాలఁ జీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల
పంక్తితోఁడై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథ సందర్భమునకు
బగులఁగొట్టించి తుద్భట వివాదప్రౌఢి
గౌడ డిండిమభట్టు కంచుఢక్క
చంద్రభూషణక్రియాశక్తి రాయలయొద్ద
బాదుకొల్పితి సార్వభౌమ బిరుద
మెటుల మెప్పించెదో నన్ను నింకమీఁద
రావుసింగమహీపాలు ధీవిశాల్బు

నిండుకొలువున నెలకొనియుండి నీవు
సరస సద్గుణ నికురుంబ శౌరి రాజ.

శ్రీనాథుఁ డీరావుసర్వజ్ఞ సింగభూపాలుని యాస్థానమునకుఁ బోయియుండిన కాలములో

“క. సర్వజ్ఞనామధేయము
శర్వునకే రావుసింగ జనపాలునకే
యుర్విం జెల్లును నితరుని
సర్వజ్ఞుండనుట కుక్క సామజ మనుటే.”

అని రాజునుగూర్చి పలికెనఁట! సర్వజ్ఞబిరుదాంకితుఁడైన సింగ యనాయఁడెతఁడో, అతఁడెక్కడ పరిపాలనము చేసెనో తెలిసికొన వలయు నని సత్యాన్వేషణ తత్పరుఁడైన నాయాంధ్రుల చరిత్రములో విశేషముగాఁ జర్చించియున్నాఁడను. ఈతనింగూర్చి వేంకటగిరివారి వంశావళిలో—

“సీ. క్షితిలోన సర్వజ్ఞసింగభూపాలుండు
బలవైరిసన్నుత పౌరుషుఁడు
లలిత కావ్య నాటకాలంకార చతురుండు
సకలశాస్త్రార్థ విశారదుండు
వలనొప్ప సింగభూపాలీయనామక
గ్రంథంబు రచియించెఁ గౌతుకమున
మును భాగవతమును దెనుఁగు చేసినయట్టి
బమ్మెర పోతన బాగుమీఱ
గీ. తనకుఁ జెప్పిన భోగినీదండకమును
వెలయ శ్రీనాథ నామక విప్రవరుఁడు
కోరిచెప్పిన పద్యముల్ గొని ముదాప్తిఁ
బెంపుతో వారి మన్నించి పేరువడసె.”

అనునొక పద్యము గన్పట్టుచుండెను.

“వీ రనేకవిద్యల నభ్యసించి యెల్లప్పుడు పండితులచేతం గవుఁ జేతం బరివేష్టింపఁబడి యుండువారు. ‘సింగభూపాలీయ’ మను గ్రం

ము ను రచించినారు. వీరికి సర్వజ్ఞనామము పౌరుష నామధేయమై యున్న' దని శ్రీబొబ్బిలి సంస్థానాధిపతుల చరిత్రమునందు లిఖింపఁ బడియున్నది.

"ఈప్రభుఁడు విద్యావినోదములఁ గాలము గడపుచుండువాఁడు. సంస్కృతమునఁ బండితుఁడును గవియునై యుండి స్వయముగ ననేక గ్రంథముల రచియించి పండితకవుల విశేషముగ నాదరించి బహు ప్రఖ్యాతిఁ గాంచె" నని రావు వంశీయుల చరిత్రమున వక్కాణింప బడి యున్నది.

"సింగభూపాలుఁడు మహావిద్వాంసుఁడు; అందుచేత నతండు సర్వజ్ఞసింగనృపుఁడు (నాయఁడు) అని వ్యవహరింపఁ బడుచు వచ్చెను. ఇతఁడు వేంకటగిరి సంస్థానమునకు మూలపురుషుఁ డయిన బేతాళ నాయఁ డను నామాంతరముగల చేవిరెడ్డికిఁ బదవతరమువాఁడు. ఈప్రభువు సంస్కృతమున చమత్కారచంద్రిక యను నలంకారశాస్త్రమును జేసెను. దీనికి సింగభూపాలీయ మని నామాంతరము గలదు" అని యాంధ్రకవుల చరిత్రమున నుద్ఘోషింపఁబడినది. (పూర్వగ్రంథము)

రసార్ణవసుధాకరగ్రంథము బయల్పడు నంతవఱకు సర్వజ్ఞబిరుదాంచితుఁడైన సింగమనాయఁ డొక్కఁడేయనియు అతఁడు రేచెర్ల బేతినాయనికిఁ బదవ తరము వాఁడని వ్యవహరింపఁ బడెడి సింగమనాయఁ డనియు నభిప్రాయపడి యున్నారు.

ఇప్పుడు వెల్గోటివారి వంశచరిత్రమునందు రసార్ణవసుధాకర గ్రంథకర్తయని వ్యవహరింపఁబడెడి యేఁడవతరము సింగమనాయఁడు కూడ సర్వజ్ఞబిరుదముగలవాఁడే యని వక్కాణింపఁబడియెను. సర్వజ్ఞ బిరుదము గలవా రిరువు రున్నారని ప్రతిపక్షులు చెప్పుచున్నారు. వారెల్లరును శ్రీనాథుఁడు సంకీర్తించినది పదవతరము వానినని యే

గ్రీవముగాఁ బలుకుచున్నారు గనుకనే నేఁడవతరము సింగమనాయని గూర్చి యిచ్చట చర్చించుట యవసరము.

"వీరిలో జ్యేష్ఠుఁడగు సర్వజ్ఞసింగభూపతి కావ్యనాటకాలంకార శాస్త్రాదులయందు మిక్కిలిఁ బాండిత్యముగలిగి యాంధ్రసంస్కృతములందలిక బట్టుకొమ్మయై యుండెను" అని వెలుగోటివారి వంశచరిత్రమునందు వ్రాయఁబడియెను. ఈసింగమనాయని పండితుఁడనుటకును సర్వజ్ఞబిరు దాంకితుఁడనుటకును నాకేవిధమైన యాక్షేపమునులేదు. కాని యితఁడు రచించిన గ్రంథము లేవియు గానరావు. చమత్కారచంద్రికను రచించెనని శ్రీవీరేశలింగముగారు వ్రాసిరి గాని యది సత్యముకాదని తేలినది. చమత్కారచంద్రిక యీసింగభూపాలునకు నంకితమీయఁబడినది. చమత్కారచంద్రికను రచించినవాఁడు విశ్వేశ్వరపండితుఁడు. "చమత్కారచంద్రిక యనంబడెడు రేచెర్లసింగభూపాలీయము విశ్వేశ్వర కవిచంద్రునిచే రచియింపఁబడినది" అని వీరేశలింగముగారు తమనూతన గ్రంథమునఁ జెప్పియున్నారు. ఈచమత్కారచంద్రికయొక్క ప్రతి యొక్కటియైన చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకభాండారమునఁగాని మఱియెచ్చటను గాని గానరాదు. దీనిప్రతి లండనుమ్యూజియములో మాత్రముగలదని తెలియుచున్నది. దీనిని తాము పఠించినట్లుగా వీరేశలింగముగారు తమనూతన గ్రంథములో నిట్లు వ్రాసియున్నారు:-

కవి యీగ్రంథమునకు సింగభూపాలకీర్తి సుధాసారశీతల నామమునుంచెను. అందలి విలాసాంతగద్యమును జూడుఁడు——

"ఇతిసరససాహిత్యచాతురీధురీణ విశ్వేశ్వరకవిచంద్రప్రణీతాయాం శ్రీసింగభూపాలకీర్తి సుధాసారశీతలాయాం చమత్కారచంద్రికాయాం అష్టమోవిలాసః"

సర్వజ్ఞవసుధాకరము మూఁడుల్లాసములుగలది; చమత్కార

చంద్రిక యెనిమిది విలాసములు గలది. చమత్కారచంద్రికలోని రెండుశ్లోకములనిం దుదాహరించుచున్నాను.

శ్లో. క్ష్మతిరభిమతకృతి చతురాయది చతుర్దాంతనయోగుణోదారా
 ఇతిలక్షణకృతిరత్నం రచయే సింగనృపగుణోదాహరణం

శ్లో. లోకేరాఘవపాండవాద్భుత కథాగ్రంథానుసంధాయినా
 తేగ్రంథావివతన్మని ప్రణిహితా శ్రీసింగభూపాశ్రయః
 సూయాదాదరణీయతం కృతధియాగ్రంథోయనుస్మత్కృతీ
 నాహం యద్యపితాదృశోన్మ్యయమసౌరాజాహితాదృగ్గుణః

చమత్కారచంద్రికను గూర్చిన యీవివరము నెవరో యొక మిత్రుఁడు వ్రాసి పంపఁగా వారిపేరెత్తక మెల్లగా వీరు తమ గ్రంథమునం దెక్కించుకొనిరి. ఇది యెక్కడనుండి సంపాదించినారో, ఈ విషయమై తమకుఁ దోడ్పడిన వా రెవ్వరో తమ గ్రంథమునఁ బేర్కొ-నుట వీరిధర్మము కాదు కాఁబోలు ఈప్రశంసను విడిచిపెట్టి శ్రీనాథుని కాలమున నీతఁ (పదవతరము సింగమనాయఁడు) డున్నాఁడా, ఇతఁ డెక్కడ పరిపాలనము చేసెననునది విచారింపవలసియున్నది.

ఇతని కంకితము చేయబడిన భోగినీదండకములో నితఁడు రావు సింగనృపాలుని మనుమఁ డనియు, కుమారాన్నపోతానాయనికిఁ బో చాంబయందు జనించిన పుత్త్రుఁ డనియు వ్రాయబడియున్నది. ఇతఁడు రాజమహేంద్రపురమునందుండి రాజమహేంద్రిపుర రాజ్యమేలినట్లుగా వెలుగోటివారివంశ చరిత్రగ్రంథకర్తలు మొదలగువారు కొందఱు వ్రాసియున్నారు. గాని యదిసత్యముగాదు. శ్రీనాథునికాలమున రాజమహేంద్రిపురరాజ్యము నేలినవారు అల్లాడరెడ్డిపుత్త్రులగు వేమారెడ్డి యు, వీరభద్రారెడ్డియు నని శాసనములవలనను శ్రీనాథుని గ్రంథముల వలనను దేటపడుచున్నది. ఇతఁడు మేతుకుదుర్గమునుండి యాదేశ మును బరిపాలించినట్టు గన్పట్టుచున్నది.

ఈ రేచర్ల వంశమునకు మూలపురుషుఁడు బేతాళనాయఁడని యేతద్వంశీయుల గాథలలోఁ గన్పట్టుచున్నను పూర్వులశాసనములయందు వెన్నమనాయనినుండియే వంశము ప్రారంభము చేయబడుచువచ్చెను. రసార్ణవసుధాకరగ్రంథమున ఎఱ్ఱదాచానాయనినుండి వంశమెత్తికొనబడినది. ఈసర్వజ్ఞసింగమనాయఁడు బేతాళనాయనినుండి పదవతరమువాఁడట! పదవతరము సింగమనాయఁడు భోగినీదండకమునుబట్టి రావుసింగభూపాలుని మనుమఁడని స్పష్టపడుచున్నదిగదా. ఆఱవతరమువారమున అనపోతనాయఁడును, మాధవనాయఁడును క్రీ. శ. ౧౩౨౦ వఱకుఁ బరిపాలనముచేసియుండిరి. అనపోతభూపతికి సింగభూపతి, శివభూపతి యను నిరువురుకుమారులు, మాధవభూపాలునకు దేవగిరీంద్రుఁడు మొదలగువారును జనించిరని రసార్ణవ సుధాకరమును బట్టిదెలియుచున్నది: వీరిలో జ్యేష్ఠుఁడగు సింగభూపతి (ఏఁడవతరమువాఁడు) రాజ్యభారమును వహించెను. ఇతఁడు ౨౦ సంవత్సరములు అనఁగా క్రీ. శ. ౧౪౦౦ వఱకుఁ బరిపాలన చేసియుండవచ్చును. ఇతఁడేరసార్ణవసుధాకరగ్రంథకర్త ఇతనికిఁ గూడ సర్వజ్ఞబిరుదము గలదందురు. అదియటుండనిండు. ఇతనితమ్ముఁడు శివభూపతియని రసార్ణవసుధాకర గ్రంథమున బేర్కొనఁబడియుండెను. ఇతనికేధర్మానాయఁడని నామాంతరము గలదనియు, ఇతఁడే వెలుగోటివారివంశమునకు మూలపురుషుఁడనియు నేతద్వంశ చరిత్ర గ్రంథకర్తలు నుడువుచున్నారు. ఈయేడవతరము సింగమనాయనికి అనపోతనాయఁడు, దాచానాయఁడు వల్లభనాయఁడు, వేదగిరినాయఁడు, దామానాయఁడు, మాదానాయఁడు నను నార్వురుపుత్రులున్నట్లుగా రసార్ణవసుధాకర గ్రంథమున—

"శ్లో. అనపోతదాచవల్లభ వేదగిరిస్వామి దామమాదాభిఖ్యైః"

అని వక్కాణింపఁ బడియెను. వీరిలోఁ గడపటి వాఁడైన మాదానాయఁడు అనగా రామమాధవరావు భార్య నాగా

బిక యొక్క శాసనము వ్రాయించెను. ఈ రావు మాధవ నృపాలుఁడు క్రీ. శ. ౧౫౨౩ వ సంవత్సరమున నయితము రాచకొండ లో నివసించుచు రాజ్యపరిపాలనము చేయుచున్నట్లా మెశాసనము దెలుపుచున్నది. ఆశాసనమునం దితని వంశావలి వర్ణింపఁబడినది. విష్ణుపాదమున జనించిన వర్ణమునందు రేచర్ల వంశాంబుధి పూర్ణచంద్రుఁడైన యెఱదాచభూపాలుఁడు జనించె ననియు, అతనికి యాచకకామధేనువగు నతనికి నవపోతభూపతియు, అతనికి వంశదీపకుఁడగు సింగమభూపతియు అతనికి రామమాధవభూపతియు జనించెనని యాశాసనమునం జెప్పఁబడి యుండెను. రసార్ణవసుధాకరమునఁ దనభర్తకు నైదుగురన్నలున్నట్లుగా నైనఁజెప్పక తనభర్తయైన మాధవరావునుమాత్రమె పేర్కొనియెను. తన మామకు సర్వజ్ఞబిరుదమున్నట్లుగాని రసార్ణవసుధాకర గ్రంథము రచించినట్లుగాని చెప్పియుండలేదు. అయినను దనశాసనమునఁ దనభర్తయగు రావుమాధవరావు శా. శ. ౧౩౮౯ ప్లవంగ సంవత్సరాశ్వయుజమాసమున శ్రీమద్రామాయణమునకు సమీచీనముగ నర్థబోధకమును రాఘవీయమను వ్యాఖ్యానొనరించి శ్రీరాముల పాదాంబుజముల యందు సమర్పించినాఁడని వ్రాయించెను. ఆశ్లోక మిట్లున్నది.

శ్లో. గా కార్త్స్యనిధివార్ధి గామశశిగేప్యబ్దె ప్లవంగే శుభే
మాసే హ్యాశ్వయుజే రఘూన్వహపదేయో రాఘవీయాహ్వయామ్
టీకామర్థపటుప్రబోధఘటనా మాణిక్యపుష్పాంజలిం
కృత్వాగాత్ రావుమాధవనృపో రామాయణస్య శ్రియే

మఱియు నీశాసనములో రావుమాధవరావు రాయరావు బిరుదమును స్థిరీకరించినాఁడని యీక్రింది శ్లోకములో వ్రాయబడియున్నది.

[illegible]
[illegible]

మఱియును శాలివాహనశకము [illegible] సంవత్సర చైత్రమాస మున రావుమాధవరావు భార్య నాగాంబిక నాగసముద్రమను తటాక మును శాశ్వతధర్మాభివృద్ధికై ప్రతిష్ఠించెనని యీశాసన ముగ్గో షించుచున్నది.

ఈశాసనమునుబట్టి యెనిమిదవతరమువాఁడైన రావుమాధవ రావు క్రీ. శ. [illegible] వఱకుఁ బరిపాలనము చేయుచున్నట్లు గానంబడు చున్నది. పదవతరమువాఁడైన సర్వజ్ఞసింగమభూపాలుని పితామహు డైన రావుసింగమభూపాలుఁడు గూడ నెనిమిదవతరమువాఁడు గదా! అతఁడేవంశములోవాఁడు. ఎక్కడఁ బరిపాలనము చేయుచుండెను? ఇది నుదురక కాఁబోలు వెలుగోటివారి వంశచరిత్ర గ్రంథకర్త యనపోతసిం గమనాయని యాఱ్వురుపుత్రులలోను వేదగిరిస్వామి యను వానిని రావుసింగక్ష్మాపాలుని గావించిరి. వేదగిరి వేంచేసియున్న స్వామి నరసింహుఁడని యర్థము గ్రహింపవలసి యుండునని కారణము నొకదానిగూడ వ్యక్తపరచి యున్నారు. ఇట్లర్థము వ్యక్తీకరింప కున్న యెడల పదవతరము సింగమనాయని సర్వజ్ఞ భూపుని చేయుటకు ప్రతిబంధకముగా నుండును. ఏమన సర్వజ్ఞభూపుని పితా మహుఁడు రావుసింగక్ష్మానాథుఁడని భోగినీదండకమున వక్కా ణింపఁబడి యుండుటచేతను, రసార్ణవసుధాకరగ్రంథమున సింగమనాయని పుత్త్రులలోఁ బెద్దవాఁడగు ననపోతనాయనికి సింగమనాయఁ డను పేరు గల తమ్ముఁడు లేకుండుటచేతను, వీరు సర్వజ్ఞసింగమనాయని పితా మహుఁడగు రావుసింగక్ష్మాపాలుఁ డెవ్వఁడో నిరూపింపవలసి యున్నది, గావున వేదగిరిస్వామి యనఁగా నరసింహుఁడని యర్థము చెప్పి యతఁడే సర్వజ్ఞసింగభూపతి తాతయగు రావుసింగక్ష్మానాథుఁడని పేర్కొని నారు. అట్లూహించుట సమంజసముగా లేకున్నను వాదసౌకర్యార్థ మట్లే యొప్పుకొందము. ౧౪౩౦ వ సంవత్సరమునాటికి రావుసింగక్ష్మా పాలునకు నలువది సంవత్సరములు వయస్సు గలదనుకొన్నను, అప్పటికే వాని కిరువది సంవత్సరముల కుమారుఁ డనపోతనాయఁ డనుకొన్నను,

అప్పటికి వానికిఁ గుమారుఁడు పుట్టినాడనుకొన్నను వాఁడు విద్యాబుద్ధులు నేర్చి సర్వజ్ఞుఁడని ప్రఖ్యాతికెక్కి పరిపాలనము చేయుటకు నిరువదిసంవత్సరములవాఁడైన నైయుండవలయును గదా. ఇన్ని యసంభవములగువిషయముల నంగీకరించినను సర్వజ్ఞసింగమభూపతికి నిరువదేండ్లు ప్రాయము వచ్చునప్పటికి శ్రీనాథుఁడు బ్రదికియుండెనా? యోచింపవలదా? అనగా లక్ష్మణరావుగారి సిద్ధాంతము ప్రకారము ౧౪౪౦ సంవత్సరమున శ్రీనాథుఁడు మరణముఁ జెందియుండెను. శ్రీవీరేశలింగముగారి యభిప్రాయము ప్రకారము ౧౪౪౫ లేక ౧౪౫౦ లోపుగా శ్రీనాథుఁడు మరణముఁ జెందియుండెను. కాఁబట్టి సర్వజ్ఞసింగభూపతికి ౨౦ సంవత్సరముల వయస్సు వచ్చుచున్నప్పటికే శ్రీనాథుఁడు స్వర్గస్థుఁ డయ్యెనని తేలుచున్నది. ఇదెంత హాస్యాస్పదమైన సిద్ధాంతము. ఇంతియగాక శ్రీవీరేశలింగముగారు శ్రీనాథుఁ డీపండిత ప్రభువునొద్దకుఁ బోయి సమ్మానముఁ బొందినది ౧౪౨౫ వ సంవత్సర ప్రాంతమని వ్రాయుట పిచ్చ కుదిరినది రోకలి తలకుఁ జుట్టు, మన్నట్లున్నది. అనపోతసింగమనాయని కొడుకగు వేదగిరిస్వామిని రావుసింగభూపాలునిగ జేసినను మనసమస్య పరిష్కారము గాలేదు. శ్రీనాథుఁడు పదవతరము వాఁడైన సర్వజ్ఞసింగమనాయని సందర్శించుటయే హుళక్కి యని తేలుచుండఁగా,

క. సర్వజ్ఞనామధేయము
శర్వునకే రావుసింగ జనపాలునకే
యుర్విం జెల్లును నితరుని
సర్వజ్ఞం డనుట కుక్క సామజ మనుటే.

అనుపద్యమును శ్రీనాథుఁడు చదివెననుట మొదలుగాఁ గథలన్నియును దుడిచిపెట్టుకొని పోవుచున్నవి. పునాదిలేని భవన మెంతకాలము నిలుచును? శ్రీనాథకవిసార్వభౌముని యొక్క కీర్తిని నలుపు గావించుటకై యీకథలు గల్పింపబడినవికాని మఱియొండుగాదు. ఈ రేచర్ల కుటుంబమువారి వంశవృక్షమునందు వెలుగోటివారి వంశచరిత్రము సరిగాఁ గానంబడదు.

# వెలుగోటివారి వంశవృక్షము.

- (1) చెవ్విరెడ్డి / బేతాళనాయఁడు
  - (2) దాచా
    - (3) వెన్నమ
      - (4) ఎఱదాచ
        - (5) సింగమ (రెండవ ప్రతాపరుద్రుని సమకాలికుఁడు ౧౩౪౪ వఱకు నున్నవాఁడు.)
          - (6) అనపోత (౧౩౪౪-౧౩౭౧)
            - క్రీ.శ. ౧౩౭౧-౧౪౦౦ (7) సింగమ
              - (8) అనపోత
                - సింగమ (ప్రభాకర శాస్త్రిగారి సర్వజ్ఞుఁడు)
              - దాచ
              - వల్లభ
              - వేదగిరిస్వామి (8)
                - కుమారాన్నపోత (9)
                  - సింగమ (పదవ తరము సర్వజ్ఞ సింగభూపతి. వె. వం. చా. కర్త)
              - దామ
              - మాద
            - శివభూపతి
          - మాధవ (6) (౧౩౪౪-౧౩౭౫)
            - దేవగిరీంద్ర (7) [క్రీ. శ. ౧౩౭౫-౧౪౦౫]
              - రామచంద్ర (8)
              - కుమార మాద (8)
                - లింగమనాయఁడు.
  - పెద్దాదిత్య
  - రుద్ర

## ప్రభాకరశాస్త్రిగారి సర్వజ్ఞుఁడు.

ఈపయి వంశవృక్షములో ౭ వ తరమువాఁడైన సింగమనాయఁడే రసార్ణవసుధాకర గ్రంథకర్తయనియు, ఇతఁడే మొదటి సర్వజ్ఞసింగభూపతి యనియు, ఈసింగమనాయని నాలుగవ కుమారుఁ డగు వేదగిరిస్వామికి కుమారుఁ డగు సింగభూపతికిఁ గూడ సర్వజ్ఞబిరుదము గల దనియు ఇతఁడుంచుకొన్న వేశ్యమీఁదనే బమ్మెరపోతన భోగినీదండకము రచించిన వాఁడనియు, ఈసర్వజ్ఞసింగభూపునే శ్రీనాథకవిసార్వభౌముఁడు సందర్శించెననియు వెలుగోటివారి వంశచరిత్రగ్రంథకర్తలు వ్రాసి యున్నారు. ఇంతకుపూర్వము వారివాదనను ఖండించి యున్నాను. శ్రీప్రభాకరశాస్త్రిగారీవిషయమునే తమ గ్రంథమునఁ జర్చించుచు వీరి వాదమును ఖండించుచు మఱియొక మార్గమును ద్రొక్కి యేడవ తరమువాఁడును, రసార్ణవసుధాకర గ్రంథకర్తయునగు సింగభూపాలుని పెద్దకొడుకగు అనపోతనాయఁడే భోగినీదండకమున వర్ణింపఁ బడిన కుమారాన్నపోతానాయఁడనియు, అతనికుమారుఁడే సర్వజ్ఞసింగభూపతి యనియు వర్ణించి లోకప్రతీతిగన్న యాభాసకథను నెట్లయిన నిలువఁబెట్టఁ బ్రయత్నించుచున్నారు. ప్రభాకరశాస్త్రిగారు తమగ్రంథములోఁ బ్రథమప్రకరణమున ౧౪ వ పేజీలో రేచర్లవారి వంశచరిత్రలందీ సర్వజ్ఞసింగభూపాలుఁడు సరిగా గుర్తింప నగుచున్నాఁడని వ్రాసి యుండి షష్ఠప్రకరణములో "ఈసింగభూపతికి సర్వజ్ఞబిరుదము గాన రాదు; రసార్ణవసుధాకరమున లేదు; చమత్కారచంద్రికలో లేదు; అమరవ్యాఖ్యలో లేదు; ప్రాఁతవ్రాఁతలలో నెక్కడను లేదు; కాని వెలుగోటివారి వంశచరిత్రమున నితఁడు మొదటి సర్వజ్ఞభూపతిగాను, శ్రీనాథునిచే దర్శింపఁబడినవాఁడు రెండవ సర్వజ్ఞసింగభూపతిగాను వ్రాయఁ బడినది; ఆవ్రాఁత యసంగతము." అని వ్రాయుట విపరీత విషయము.

ప్రభాకర శాస్త్రిగారు సర్వజ్ఞసింగభూపుని నెట్లుగుర్తించిరో యావిధ మీక్రిందవివరింతును. ఏడవ తరమువాఁడైన సింగమనాయని

యాహ్వపు పుత్రులలోనే జ్యేష్ఠుఁడగు అనపోతనాయనిఁ బ్రశంసింపుచు నొకపద్యము వెలుగోటివారి వంశావళియందు వ్రాయఁబడినది. అది యిట్లున్నది.

సీ. వీరాగ్రగణ్యుండు వెన్నభూపాలుండు
ఖ్యాతి నేరాజు ముత్తాత తాత
నెఱిపొడ్డ గెలిచినాఁడెఱదాచభూపతి
దాతృనేరాజు ముత్తాత తండ్రి
సంగరాభంగుండు సింగభూనాథుండు
తనకు నేరాజు తాత తాత
అనిగిక్ష్మాపుఁడౌ ఘన పోతభూపతి
తప్పుఁడనేరాజు తండ్రి తండ్రి
చిరకీర్తియగు రావు సింగమనీశుండు
ఘట్టిపనేరాజు తండ్రి తండ్రి
బిరుద శేఖరుఁడైన పినసింగ నరపతి
చెన్నొందనేరాజు కన్నతండ్రి
గీ. సోమకుఁడౌ రాచ ... ... ... ...
సాసనస్వామి సేవావిశాలుఁడైన
యన్న మాంబా తనూజాతుఁ డనఘమూర్తి
రాయ గా వన్నపోతధరావిభుండు.

"ముత్తాత తాత, ముత్తాత తండ్రి, ముత్తాత (తాత తండ్రి), తండ్రితండ్రి, తండ్రియను విధమునఁ బితృపరంపరఁ జెప్పఁదగియుండును. ఇందట్లులేదు. పద్యము తప్పుగానున్నది. ఇట్లుండవలెను. వెన్న భూపాలుఁడు ముత్తాత తాత; ఎఱదాచభూపతి ముత్తాత తండ్రి; సింగ భూపాలుఁడు ముత్తాత; అనపోతభూపతి తండ్రితండ్రి, పినసింగనరపతి కన్నతండ్రి. "చిరకీర్తియగు" నిత్యాది చరణ మసంగతము మఱియు 'సింగభూనాథుండు తనకు నేరాజు తాతతండ్రి' యని యుండును.

పయి చరణమందు ముత్తాత తండ్రియుండఁగా మరల నిక్కడఁ దాత తాతయని యుండఁగూడదు. ఈదిద్దుబాటు సరియగుటకు రసా

ర్ణవసుధాకరాది ప్రాచీనగ్రంథములు సాధకము లగుచున్నవి." అని ప్రభాకరశాస్త్రిగారు పద్యము దిద్దుబాటు నొందవలసినదిగా నిరూపించిరి. అట్లు చేసినయెడల 'పయిపద్యమున 'బిరుదభీకరుఁడైన పినసింగనరపతి' యనపోతభూపతికొడుకగు రసార్ణవసుధాకరకర్త యగునని శాస్త్రిగారి యభిప్రాయము. వీరి మార్పులలోఁ గడపటిదాని నేనొప్పు కొనఁజాలకున్నాను. రసార్ణవసుధాకరకర్త సింగభూపతికాని పినసింగభూపతియని రసార్ణవసుధాకరమున నున్నట్లు శాస్త్రిగారు చూపింపలేదు. అందుచే సీసములోని నైదవచరణమును పూర్తిగాఁ దొలగించుటకు మాఱుగా నందలి ప్రథమభాగమగు 'చిరకీర్తియగు రావుసింగావనీశుండు' అనుదానికి నాఱవ చరణములోని రెండవభాగమగు 'చెన్నొందునే రాజు కన్నతండ్రి' యనుదానిని గలిపి,

> చిరకీర్తియగు రావు సింగావనీశుండు
> చెన్నొందునే రాజు కన్నతండ్రి.

అని యేకచరణము గావించి నిలిపినయెడ రసార్ణవసుధాకరములోని వంశమునకు సరిపుచ్చనగును. శాస్త్రిగారికిఁ గావలసిన దవియొక్కటి యెగాదు. సర్వజ్ఞుని గుర్తించుటకు భోగినీదండకముకంటె మించిన ప్రమాణము మఱియొకటి గానరాదు. అయ్యది బమ్మెర పోతన రచించినదైనను గాకపోయినను భోగినీదండకము సర్వజ్ఞసింగభూపతి కంకితము గావింపబడియున్నదిగావున దానిని ప్రమాణముగాఁ గైకొనఁదలంచిరి. అందు సర్వజ్ఞసింగభూపతి తండ్రి కుమారాన్నపోతనాథుఁడనియు, తాత రావుసింగక్ష్మానాథుఁడనియుఁ, జెప్పఁబడియుండుట చేత శాస్త్రిగారు రసార్ణవసుధాకర గ్రంథకర్తయె రావుసింగక్ష్మానాథుఁ డని గుర్తింపఁదలఁచినారు. అందుకు శాస్త్రిగారి కొక చిక్కు గానుపించినది. రసార్ణవసుధాకర గ్రంథకర్తయగు సింగభూపాలుఁడు విశ్వేశ్వరకవిపండిత కృతమగు చమత్కారచంద్రికకును, బొమ్మకంటి యప్పయాచార్య కృతమగు "అమరవ్యాఖ్య"కును భర్తయై యున్నవాఁ

డని వారివిశ్వాసము. ఆకృతులందు భర్త పేరు కుమారసింగభూపుఁడని యుండెను. కుమారసింగభూపుఁడని రసార్ణవసుధాకరమున గానరాదు. కావున, "అనపోతనాయని" గూర్చి పైఁజెప్పఁబడిన పద్యములో "విరుదభీకరుఁడైన పినసింగనరపతి చెన్నొందు నేరాజు కన్నతండ్రి" అని యున్నయెడల చమత్కారచంద్రిక, అమరవ్యాఖ్యలలోఁ బేర్కొనఁబడిన కుమారసింగభూపాలుఁడే రసార్ణవసుధాకర గ్రంథకర్తయగుననన్న తమయూహకు బలము నొసంగునను తలంపుతో నట్టిమార్పును గోరెను. పూర్వులు వ్రాసిన రేచర్లవారి వంశచరిత్రములలోఁ బేర్కొనఁబడిన యేసింగభూపాలునకు సర్వజ్ఞబిరుదము గలదో వానినిగుర్తించుట విమర్శకునిప్రయత్నముగా నుండవలసినదిగాని సర్వజ్ఞునిగావించుటకై యొక సింగమనాయని సృజించి వంశకర్తృత్వమును గూడఁ దలపై నిడికొనుట విమర్శకుని ప్రయత్నముగా నుండరాదు. భోగినీదండకములో నుదాహరింపఁబడిన సర్వజ్ఞసింగభూపతియు, వానితండ్రి కుమారాన్నపోతనాయఁడును, తాత, రావుసింగక్ష్మానాథుఁడును మెతుకుసీమను బరిపాలించువారని పూర్వగ్రంథములును, వెలుగోటివారి వంశచరిత్రయు నొకవంక ఘోషించుచుండఁగా నామిత్రు లావిషయమును విస్మరించి రాచకొండ రాజ్యమును బాలించినవారుగా నూహించుట యథార్థమునకు విరుద్ధముగాఁ గన్పట్టుచున్నది. రసార్ణవసుధాకర కర్తయగు సింగమనాయని జ్యేష్ఠకుమారుఁడైన అనపోతభూపాలుఁడు రాచకొండరాజ్యమును బరిపాలించినమాట వాస్తవము. ఇతఁడు బహమనీసుల్తానగు ఫెరోజిషాహా లక్షసైన్యముతో దండెత్తివచ్చి పానుగల్లు దుర్గమును రెండుసంవత్సరములు ముట్టడించియు వశ్యముఁ జేసికొనలేక కలరామున్నగు వ్యాధులు పీడింపఁగా విశేషసైన్యము హతమైపోవుటచే దలపోసి తురకసర్దారులెల్లరును పలాయనులై తమతమ జాగీరులకుంబోవ ఫెరోజిషాహాముట్టడి వదలిపోవలసిన వాఁడయ్యెనని ఫెరిష్టావ్రాసిన చరిత్రమును బట్టి

దెలియుచున్నది. ఈకాలమున రాచకొండరాజ్యమును అనపోతనాయఁడును, దేవరకొండ రాజ్యమును అనపోతనాయని పినతాత మనుమఁడు రామచంద్రనాయఁడును బరిపాలించుచుండిరి బహమనీసుల్తా నగు ఫిరోజిషాహాతో యుద్ధముఁ జేసియోడించిన వారు. తెలుఁగు సర్దారులలోముఖ్యుఁడును మొదటిమాధవ భూపాలుని మనుమఁడును, పెదవేదగిరినాయని కుమారుఁడునగు రామచంద్రనాయఁడు ఫిరోజిషాహాను వాని సైన్యములను వెంటాడించి వానివజిరుఁడగు* మీర్-ఫైజ్-ఉల్లా,అను వానినిసంహరించి బండికనుమ సమీపమున వానికనేక విధములైనబాధలను గల్పించి పరిభవింపగానతఁడు భగ్నమనోరథుఁడై సిగ్గును బోనాడి పాఱిపోవలసివచ్చెను. అనపోతని గూర్చి రావువంశీయుల చరిత్రము నందు,

సీ. పౌరుషంబున నీవు పానుగల్లాదిగాఁ
గోటరాజ్యంబెల్ల గొల్లలాడి
యేపుమై రాజమహేంద్రిఁబు మేఁగా
రెడ్డిరాజ్యంబెల్ల రేఁగఁగొట్టి
ఉపఁబస్త్రని చెన్నపట్నంబు మేరగా
తిగుటరాజ్యంబెల్ల దెబ్బదీసి
మొక్కబోళంబునఁ జొచ్చి ముద్గోజిగేటుక
బోయరాజ్యంబెల్లఁ బొడిచిపైచి
గీ. నేర్పునెలపించి రాయల నిర్వహించి
తల్లు పంజెటగెలిచితి వాపహమున
విమల చారిత్ర సింగభూవిభునుపుత్త్ర
వర్ణితాటోప రాయ రావన్నపోత.

అని యొకపద్యమును, వెలుగోటివారి వంశచరిత్రమునందు,

సీ॥ పటుసోమకులరాజ పరశురామాంకుఁడై
సమ్మెటసోముని జక్కఁ జేసె
ఖడ్గనారాయణ గాయగోవాలుఁడై
సకపల్లెరాజుల సంహరించె

పట్టుతలాటాంక బల్లరగండఁడై
యనవేమారెడ్డి నాజిఁదునిమె
జగమందు రాయవేశ్యాభుజంగాంకుఁడై
మఱి ధాణిబలముల సోఁకి గెల్చె
గీ॥ ధరణి నాతఁడు భీమప్రతాపవిజయ
బాహుబలశాలి నిత్యసౌభాగ్యశీలి
లలితసుగుణుండు రేచెర్లకులపవిత్రు
డనఁగ వెలసెను సింగయ యన్నవిభుఁడు.

అని యొకపద్యమున, రామచంద్రనాయునిగూర్చి వెలుగోటివారి వంశ చరిత్రమునందు,

సీ॥ కొండపల్లియుమ్మనిఁగూల్చిన యొజడాన
భూతలాధిపుఁడు మీతాతతాత
అనిలోన మచ్చగన్నయను ద్రుంచిన సింగ
ధారుణీశ్వరుఁడు మీతాతతండ్రి
తోడరిభాండాగముమ్మడిని నాజినడంచి
తనరు మాధవుఁడు నీతండ్రితండ్రి
గుంద్రవదంద్రాయని ఖండించి సన్నుతి
గాంచుటఁ బరఁగె నిన్నన్నతండ్రి
గీ॥ కడిమి మైనీవు తగబండి కనమయొద్దఁ
బరగఫేరోజి సురథాణుఁ బరిభవించి
కదనమున నేరగెలిచితి కన్నశీల
రమ్యదేవేంద్ర వేదయరామచంద్ర.

అనుపద్యమును పై ఫెరిష్టా ఫెరోజిషాహా దండయాత్రను దెలిపిన విధమును సమర్థించుచున్నది. మొదటిపద్యములో 'పట్టుతలాటాంక బల్లరగండఁడై యనవేమారెడ్డి నాజిఁదునిమె' ననుదానివలన నితనికిని సమకాలికుఁడైన పెదకోమటి వేమారెడ్డికిని జరిగిన యుద్ధములో పెదకోమటనవేమారెడ్డి మరణముఁ జెందియుండు నని నిశ్చయింపవచ్చును. అనవేమరెడ్డియనఁగాఁ బ్రోలయవేమారెడ్డి పుత్రుఁడైన అనవేమరెడ్డి

గాక, పెదకోమటిరెడ్డి పుత్త్రుడైన అనవేమరెడ్డియని భావింపవలయును. దీనింబట్టి అనపోతనాయఁడు క్రీ. శ. ౧౪౨౦ వఱకు రాచకొండరాజ్యమును బరిపాలించుచున్నవాఁ డనుట స్పష్టము. ఇతఁ డేకారణముననో కర్ణాటసామ్రాజ్యమునకుఁ జేరిన గండికోట దుర్గమును ముట్టడింపఁగా మొదటి దేవరాయ మహారాయనికి సామంతుఁడుగ నున్న పోలేపల్లి బుక్కరాజను మహావీరుఁ డొక్క రాత్రివేళ మోసముచేసి వచ్చి పైఁబడి యనపోతనాయని సంహరించెననియు, అనపోతనాయని తమ్ముఁ డగు పినసింగభూపతి (వేదగిరిస్వామి లేక మెతుకు సీమనేలు రావు సింగక్ష్మాపాలుఁడు) తన బావమఱఁది యగు జూపల్లి కొండమనాయని వానిఁబట్టి తీసికొనిరావలసినదని యాజ్ఞాపింపఁగా నాతఁడు బుక్కరాజుపై దండెత్తిపోవ నావార్తవిని యాతఁడు పొడిచేటికోటలో దాగు కొనియె ననియు, కొండమనాయఁడు వాని నోడించి బంధించి తీసికొని రాగా నాతఁడు శరణు వేడినందునఁ జంపక విడిచి పుచ్చెననియు వెలుగోటివారివంశచరిత్రమునందు వక్కాణింపబడినది. కనుక అనపోతనాయఁడు క్రీ. శ. ౧౪౨౨, ౧౪౨౩ ప్రాంతము వఱకు రాచకొండ రాజ్యమును బాలించినవాఁ డనుట సత్యమని తేలుచున్నది. తరువాత నితని పైనెవ తమ్ముఁడగు (కడపటివాఁడు) రావు మాధవభూపాలుఁడు రాచకొండరాజ్యమును బరిపాలించినట్లు వానియొక్కయు, వాని భార్యయొక్కయు శాసనములు ఘోషించుచున్నవి. ఈసంగతి మొదటనే తెల్పి యున్నాను. ఇతఁడు 'రాయరావు' బిరుదమును లోకమునందు రూఢపఱచినవాఁడని వానిభార్య నాగాంబికశాసనములోని యీక్రింది శ్లోకమువలనఁ దెలియుచున్నది.

శ్లో. సూను స్సింగనృపస్య తస్య శుభధీ స్సార్వోపమస్సై జసా
కాన్త్యా చంద్రసమః కలాభిరనిశం సన్మార్గసంపత్తిభిః
రమ్యో రాజతి రావుమాధవనృపో రాజన్యచూడామణి
ర్యేనశ్రీవిధిరాయరావు బిరుదం లోకేనిరూఢీ కృతమ్.

ఇతని కాలమునుండి 'రాయరావు' బిరుదము రేచర్లవంశీయులకుఁ గల దనియు నంతకుఁబూర్వ మీబిరుదము వారిపూర్వుల కెవ్వరికిని లేద నియు, పై శాసనములోని శ్లోకము ధృవపఱచుచున్నది.

ఈయనపోతనాయనికే సర్వజ్ఞసింగభూపతి కుమారుఁడై యున్న యెడల తండ్రియనంతరము కుమారుఁడు రాజ్యమును బొందవలసి యుండఁగా నైదవతమ్ముఁడు రావుమాధవరావు పరిపాలనము చేయుట యెట్లు సంభవించును? దీనికి ప్రభాకరశాస్త్రిగారు ప్రత్యుత్తరము చెప్పలేదు. ఇంతియగాదు. రావుసింగక్ష్మాపాలుని పుత్త్రుఁడై మెతుకుసీమను పరి పాలించిన యనపోతనాయనికి సింగమనీఁడు, అన్నమనాయఁడు, వసంత నాయఁడు నని మువ్వురు పుత్త్రులు గలరనియు, వీరిలో జ్యేష్ఠుడే సర్వజ్ఞ సింగభూపతి యనియు వెలుగోటివారి వంశచరిత్రము నందు వ్రాసిన వెల్లాల సదాసివశాస్త్రిగారికి నైన ప్రత్యుత్తరము చెప్పి యుండలేదు. రావుమాధవరావు ౧౪౩౦ సంవత్సర ప్రాంతమున రాచకొండరాజ్య మును బరిపాలించుచున్నట్లు శాసనము లుద్ఘోషించుచున్నవి. అదియు నుంగాక భోగినీదండకమున సర్వజ్ఞసింగమనాయని తాతయగు సింగమ నాయనికి "రావు" బిరుదమున్నట్లు గన్పట్టుచుండఁగా రసార్ణవసుధాకర కర్త సింగమనాయఁడే యాసింగమనాయఁడనుటకునతనికిఁగూడ "రావు" బిరుద మున్నట్టు రసార్ణవసుధాకరమునుండిగాని యాతఁడంకితముఁ బొం దినదని చెప్పఁబడిన చమత్కారచంద్రికనుండి గాని యమరవ్యాఖ్యము నుండిగాని ప్రమాణముల నెత్తి ప్రభాకరశాస్త్రిగారు చూపింపవలదా? రాయరావు బిరుదమును సంపాదించిన వాఁడు, అతని కుమారుఁ డగు మాధవరావని యాతనిభార్య నాగాంబిక వ్రాయించిన శాసనమునఁ గన్పట్టుచుండుట ప్రభాకరశాస్త్రిగారెఱుంగరా? ఆశాసన సమాచార ము నుగ్గడించినవారేకదా! దానినేలవిస్మరించవలెను! ఇయ్యవి బుద్ధిమద గ్రగణ్యులగు ప్రభాకరశాస్త్రిగారెఱుంగనవికావు. ఇందుకు ప్రతిబంధ కముగ నొక గొప్పసంగతి వారిమనంబునకు దట్టినది.

మెతుకుసీమను బరిపాలించుదొరలు రేచర్ల వంశీయులుకారను తలంపుతో ప్రభాకరశాస్త్రిగారు సర్వజ్ఞసింగమనాయనిసందర్శించుటకై యాదేశమునకుఁ బోయినసమయమునందే బమ్మెరపోతనవంటివానినాదరింపనికారణమును బురస్కరించుకొని మెతుకుదొరలను శ్రీనాథకవిసార్వభౌముఁడు తిట్టినట్టి చాటుపద్యమని యీక్రిందిపద్యమును తమగ్రంథమునం దుదాహరించియున్నారు.

చ. కుతుకలు కోయవొంగలకు, ఘోరపికాక తుపుక్క జాతికిన్,
మతకపు లంజెకోత్తులకు, మాదిగవాండ్రకు, మల్లదాల్లకున్
కొతకకయిత్తు; గంటె; కదికోటులకిత్తురని చిత్తు; రంతెపో
మెతుకుదొరల్ ... ... ... ... ... భయవోగ్బలుల్.

మఱియు భాగవతమునందు బమ్మెరపోతన,

ఉ. ఇమ్మను జేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట వ్రేటులంబడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పెనీ
బమ్మెర పోతరాజొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.

అని రావువంశీయులరాజ్యములోనిదగు నేకశిలానగరమున నుండియు నిట్టిపద్యమును వ్రాసి ప్రకటించినదానిఁగూడ ప్రభాకరశాస్త్రిగారెఱుంగుదురు.

ఇందుకు భిన్నముగా రేచర్లవంశీయుల ప్రాఁత వ్రాఁతపత్త్రములలో సర్వజ్ఞసింగభూపాలుఁడిట్లభివర్ణింపబడియున్నాఁడు.

సీ. సకల విద్యాభ్యాస సాహస గరిమంబు
నూటిమీఱఁగఁ దోడుసూపినాఁడు
కఠినశాత్రవ యూధఘన కంఠరక్తంబు
వేడ్కఁ గాళికి భుక్తిపెట్టినాఁడు
సాధుమార్గక్రియా సౌజన్యముననీతి
చెలఁగ సద్వర్తనల్ చేసినాఁడు
సంతతార్థాశ్రిత సముదయంబులతోడ
వెలయ బాంధవము గావించినాఁడు

గీ. అతఁడు భూపాలమాత్రుఁడే యతులకీర్తి
వితత జంభారి సర్వజ్ఞ విగ్రహుండు
వాసికెక్కిన రేచర్ల వంశవార్ధి
శీతకరుఁడగు సర్వజ్ఞ సింగవిభుఁడు.

ఇట్లు సర్వజ్ఞసింగభూపాలుని శీలము తద్వంశీయుల గ్రంథములం దెంతగా నభివర్ణింపఁబడియున్నను, పదునెనిమిదవ శతాబ్దిమధ్యమం దున్న కూచిమంచి తిమ్మకవి తనలక్షణ సారసంగ్రహమునందు,

సీ. ఘనుఁడు పోతనమంత్రి మును భాగవతము తె
నుఁగించి చక్రికి సమర్పించు నెడల
సర్వజ్ఞ సింగయధాత్రవరుఁ డది తన
కిమ్మని వేఁడఁగా నీయకున్న
నలిగి యా పుస్తకంబును బాతిపెట్టఁ
జివికి యం దొక కొంత శిథిలమయ్యెఁ
గ్రమ్మఱ నది వెలిగందల నారప
రాజును మఱి గొప్పరాజు గంగ
గీ. రాజు మొదలగు కవివరుల్ తీరమొనఁగ
జెప్పి రాగ్రంథమునందె తప్పు లొదవెఁ
గాని పోతనకవీంద్రుని కవితయందు
లక్షణం బెందుఁ దప్పునా దక్షహరణ.

మరియొక సందర్భమునఁ దిమ్మకవి పోతన నభివర్ణించుచు నతఁడు 'మత్తక్షితీశాధమస్తోత్రవిముఖుఁ డని తనలక్షణ సారసంగ్రహమునందే మఱియొక తావున,

సీ. అఖిలవేదాంతవిద్యా రహస్యవిదుండు
సహజపాండిత్య విశారదుండు
మత్తక్షితీశాధమస్తోత్రవిముఖుండు
శంభుపదాబ్జ పూజారతుండు
పటుతర కవితావిభాసిత ప్రముఖుండు
సకలాంధ్ర లక్షణచక్రవర్తి
రఘుపతి లేఖ నిదేశ రచిత మహాభాగ
వత పురాణుఁడు పుణ్యవర్ధనుండు

గీ. బుధజనహితుండు బమ్మెరపోత సుకవి
యెన్న శేషాంకకాలంబు లెఱుఁగఁడనుచు
నజ్ఞులౌక కొందరాడుదు రామహాత్ము
కవిత కెందును లోపంబు కలుగ దభవ.

అనుపద్యముల నుగాహరింపుము సర్వజ్ఞసింగభూపాలుని దుర్నయమును వెల్లడించియున్నాఁడు. సర్వజ్ఞసింగభూపునకును పోతన శ్రీనాథులకుఁ గలసంబంధ మీవిధమునఁ బయిపద్యములు దెలుపుచుండ వేంకటగిరివారి వంశావళిలో

సీ. క్షితిలోన సర్వజ్ఞ సింగభూపాలుఁడు
బలవైరిసన్నుత పౌరుషుండు
లలితకావ్య నాటకాలంకార చతురుఁడు
సకల శాస్త్రార్థ విశారదుఁడు
వలనొప్ప సింగభూపాలీయ నామక
గ్రంథంబు రచియించెఁ గౌతుకమున
మును భాగవతమును దెనుఁగు చేసినయట్టి
బమ్మెరపోతన బాగుమీఱ
గీ. తనకుఁ జెప్పిన భోగినీదండకమును
వెలయ శ్రీనాధనామక విప్రవరుఁడు
కోరిచెప్పిన పద్యముల్ గొనిముదాప్తిఁ
బెంపుతో వారిమన్నించి పేరువడసె.

అనుపద్యమునఁ జెప్పినవిషయములన్నియు సత్యములుగావని తలంపు జనింపకమానునా? సర్వజ్ఞసింగభూపాలుని దుర్నయకార్యమును గప్పి, పెట్టుటకును, పోతన శ్రీనాథుల కపయశంబును కలిగించుటకును సంకల్పించి చెప్పినపద్యమని దీనిఁ జదివినంతటనే తేటపడగలదు. ఎట్లన; భాగవతము రచించిన పిమ్మటనే భోగినీదండకమును పోతన రచించినాఁడని చెప్పుట యొకటి 'మును-తనకు' అను శబ్దప్రయోగముల స్వారస్యమును గ్రహింపుడు. "ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి" అను పద్యమును రచించి భాగవతములోఁ జొప్పించిన బమ్మెరపోతన భోగినీ

దండకమును సింగభూపాలునకుఁ జెప్పినాఁడన్న లోకమున బమ్మెర పోతన గౌరవమంతయు బూడిదపాలగుటకుఁ సంశయము గలదా? బమ్మెర పోతన గౌరవ మెట్లు మంటఁగలసిననేమి? భాగవతము పాతిపెట్టించి నాఁడను లోకనిందనుండి సర్వజ్ఞసింగభూపునిఁ దప్పించినఁ జాలును గదా! "శ్రీనాథనామకకవిప్రవరుఁడు" అను సమాసపదమును రెండు విధము లర్థమగునట్లు విడఁదీయవచ్చును. ఎట్లన; శ్రీనాథనామక-విప్ర వరుఁడు; అని, శ్రీనాథనామ-కవిప్రవరుఁడు; అని: మొదటిది సంభావన కొఱకు వచ్చిన బ్రాహ్మణుఁడని స్ఫురింపఁ జేయఁగలదు. ఆంధ్రప్రపంచమున విద్వజ్జనలోకమునఁ బేరుమోసిన శ్రీనాథకవి సార్వభౌముని నానాఁడు నీనాఁడు నెఱుంగనివారు గలరా? శ్రీనాథనామకవి ప్రవరుఁ డని చెప్పనేల? ఇందలినామకశబ్దప్రయోగము యొక్క స్వారస్యమును గ్రహింపుఁడు. మఱియు నాకాలమున సర్వజ్ఞభూపుండు గానిండు, మఱి యేభూపుండు గానిండు శ్రీమదాంధ్రభాగవతగ్రంథాంకితమును బొందుటకై యమ్మహాత్ముని బమ్మెర పోతన్నను మనఃసంక్షోభము పాల్పఱచి కష్టములఁ బెట్టియుందు రని విశ్వసింపవలసివచ్చుచున్నది. ఇట్టి మనఃసంక్షోభమునఁ గ్రుంగిపోయి యమ్మహాత్ముఁడు తన్నెక్కడ విక్రయించునో యన్న భీతిచేత నేడ్చుచు శారదప్రత్యక్షమైనట్లు తలపోసికొని పోతరాజు దృఢచిత్తుఁడై చేతులు మోడ్చుకొని,

ఉ. కాటుక కంటినీరు చనుకట్టుపయిం బడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల యోమదంబ యో
హాటకగర్భురాణి నిను నాఁకటికిం గొనిపోయి యల్లక
ర్ణాట కిరాట కీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ నమ్ము భారతీ.

అను పద్యమును జెప్పి యామె నోదార్చుచుఁ దన గ్రంథముల నరాంకితము చేయనని ప్రతిజ్ఞఁబూనుట సత్యమని చెప్పవచ్చును.

ఇట్టి శీలముచే మహాప్రఖ్యాతిగాంచిన-బమ్మెర పోతన సర్వజ్ఞ సింగమనాయని యాస్థానకవి యని చెప్పుటకంటె సాహసకృత్యము

మఱియొకటి యుండబోదు. ఇంతటి యాత్మగౌరవసంపత్తిగల యీకవి చంద్రుఁడు సింగమనాయఁడుంచుకొన్న వేశ్యనుగూర్చి దండకము చెప్పెననికాని, చెప్పుననికాని, యూహించుటకే సాధ్యపడదు. ఇతనికిని సింగమనాయనికిని సరిపడదని యంకితమును గూర్చిన కథయే వేనోళ్ళఁజాటుచున్నది. ఒకవేళ భాగవతము రచించుటకు ముందే భోగినీదండకమును రచించి యుండుననని యూహింతమన్నను భాగవతములోని రాజదూషణ మీయూహనుగూడ బాధింపకమానదు. అదివఱకు సింగమనాయని యాస్థానకవిగనుండి భోగినీదండకమును జెప్పిన కవి యొక్కసారిగా రాజదూషణమునకుఁ గడంగుట తటస్థింపదు. ఇష్టములేనియెడల నరాంకితము చేయకుండునే గాని యాతని రాజ్యమునందుండి యారీతిగా రాజదూషణము గావించి బ్రతుకఁజాలునా? ఈ భోగినీదండకము చివరను,—

ఉ. పండితకీర్తనీయుఁడగు బమ్మెర పోతన యాసుధాంశు మా
ర్తాండ శిలాచలాంబునిధి తారకమై విలసిల్ల భోగినీ
దండకముఁ రచించె బహుదానవిహర్తకు రావుసింగ భూ
మండల భర్తకున్ వినుతమానవనాథ మనోపహర్తకున్.

అనుపద్యము గన్పట్టుచున్నది. ఇది బమ్మెరపోతన చెప్పిన పద్యముగాఁ గన్పడదు. "పండిత కీర్తనీయుఁడనని బమ్మెరపోతన పైదండకమువంటి చిన్నవ్రాతకుఁగా నింత బిరుదాంకితము వేసికొని యింతగా నాత్మస్తుతి చేసికొనునా?" అని కవిజీవిత గ్రంథకారులగు గురజాడ శ్రీరామమూర్తిగారిదివఱకే ప్రశ్నించి యున్నారు. "పండిత కీర్తనీయుఁడగు బమ్మెర పోతన" అని యుండుటచేతనే యీపద్యము మఱియొకరు వ్రాసినట్లు స్పష్టమగుచున్నది. ఈ భోగినీదండకముగూడ బమ్మెరపోతనకృతము గాదనినాదృఢమైనయభిప్రాయము. భాగవతము రచింపఁబడిన బహుకాలమునకుఁ బిమ్మట సింగభూపాలుఁడు గాని బమ్మెర పోతనఁగాని యెఱుఁగనే యెఱుఁగరు. కీర్తికాముఁడగుటచేత

॥ రాజవేశ్యా భుజంగస్య కుమారగిరి భూపతేః శ్రీకాటయ వేమ శ్రీ వ్రగల్భాతత్రదూతికా" ఇత్యాదులీ యర్థమును స్పష్టపఱచు చున్నవి. దేవవేశ్యాభుజంగ పదముకూడ దేవతాధిపుఁడను నర్థము లదే! "దేవరాట్" అను పదమునకు నుచితమైన పరివర్తనమే గారను కొనునట్లు కుకి ళోగపుటా డ్రని యర్థముగాదు" అని వ్రాసి శ్రీనాథుని నపవాదమునుండి తొలగించుచున్నారు. ఇంతటనైన ప్రభాకరశాస్త్రిగా రపభ్రమల పాలుగాక యథార్థమూరసి శ్రీనాథకవిసార్వభౌముని నేరీతిగ విమర్శించి గౌరవింపవలయునో యారీతిగ విమర్శించి గౌరవింప వలయునని ప్రార్థించుచున్నాఁడను.

కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు తాము వ్రాసిన 'శ్రీనాథకవిరాజీయ' మను నాటకము యొక్క పీఠికలో శ్రీనాథుఁడు శృంగారాగ్రేసరుఁడు విటుఁడు నని వ్రాసినవారి వ్రాత నాకిష్టము గాదు అతఁడు పరమపవిత్రుఁడని నా యభిప్రాయము' అని వ్రాసిరి. శ్రీనాథుఁడు పరమపవిత్రుఁడో కాఁడో నిర్ణయించి నొక్కి వక్కాణించుట కాతనికి నూఱేండ్ల తరువాత నున్న మన కధికారము లేదు. వారివారి కావ్యములలో నా యా కవులు చేసిన వర్ణనలను బట్టి వారి శీలమును గూర్చి నింద్యముగా వ్రాయరాదని నామతము. ఇది నేను లోకమునకుఁ జాటి చెప్పఁ బూనుకొన్నది.

శ్రీనాథకవి సార్వభౌముఁడు డెబ్బది లేక యెనుబది సంవత్సరములు జీవించినాఁడు. అందులో నలుబది సంవత్సరము లఖండ వైభవము ననుభవించినవాఁడు పెక్కు కృతులొనరించినవాఁడు, ఆతని జీవితచరిత్రము వ్రాయుట యన నాంధ్రదేశము యొక్క యొకశతాబ్ది చరిత్రము వ్రాయుటయే. ఆతని పేరిట పెక్కు చాటుపద్యములు ప్రచారమున వ్యాప్తములయి, యున్నవి అయిన కథలు, కాని కథలు తెనాలిలింగమునకు ముడివెట్టినట్లు ప్రతి చాటువును, ప్రతిశృం

గారవపద్యమును శ్రీనాథునకు ముడిపెట్టుచున్నారు. సత్యసం
రించి పలికిన పిమ్మటనే గ్రహింపఁ దగినవి. గాన
గైకొనరాదు.

“ఈ కవిసార్వభౌముని శృంగార ప్రవర్తన విషయమై
కరశాస్త్రి గారెట్టి యభిప్రాయము వెల్వరించియున్నను, “
కవీశ్వరుఁడు తన పలుకుఁ దేనియల నందఱ దఱకో రాజులకు,
మంత్రులకు నామెతలు పెట్టి బహుధన మార్జించెను. ఎంత యా
చిన నేమి! తుదకా మహనీయుని మనువు కడతేఱుదనుక నైన సి
కడ చెందదయ్యెను. ఆ నాఁటి కానాఁడేదో కృత్రిమపు ఘనత కూర్చు
ధనమేమి ధనము! దంధనము! కీర్తి ధనమే ధనము. శ్రీనాథ కవీశ్వ
రునిఁ గన్నులఁజూచి యెఱుఁగము మన కాతఁ డెట్టిమూర్తియును గా
డు. కాని యాంధ్రలోకమున కా మహాశయుని మూర్తి కన్నులకుఁ గట్టి
నట్టు నాఁటికి నేఁటికిఁ బొడగట్టుచునే యుండును. ఆతని యెడల స్నేహ
మో! బాంధవమో! గౌరవమో, యాంధ్రలోకమున కెడతెగనిదే.
ఇంతకుం గారణమాతఁ డార్జించు కొన్న కీర్తిధనమే గదా!’’ అని
వ్రాసిన రసపూరితవాక్యము లెంత యాదరణపాత్రములుగా నున్న
వో చదువరులే గ్రహింతురు గాక!

సమాప్తము.

సింగభూపాలుఁడు భాగవత మంకితమిమ్మని తన రాజ్యములోని వాఁ
డగుటచేత పోతన్నను వేధించి యుండును అతఁడు నిరాకరించి యుం
డును. అందుపై కోపించి యతఁడు బలాత్కారముగాఁ గాని మాయో
పాయముచేతఁగాని యాగ్రంథమును దెప్పించుకొని కొంతకాలము
భద్రముగా దాచి యుంచవలెనను తలంపుతోనే మంచిరక్షణముగా
వించి భూమిలోఁ బాతిపెట్టి యుంచియుండవలయును. అట్లుగాని పక్ష
మున బమ్మెర పోతనయే వాని దౌష్ట్యమునకు వెఱచి వానిచేతఁబడ
కుండ నుండుటకై మంచిరక్షణముతో దానిఁ దనయింట నొకమూలఁ
బాతిపెట్టి యుండవలయును? సింగమ నాయఁడే యీదుష్కార్యము
జరిగించి యున్నయెడల నతఁడు లోకనిందకు భయపడి తనకుఁగల్గిన
యపయశస్సును భరింపఁజాలక గ్రంథమును బైటికి తీయుటయో
లేక బమ్మెర పోతనయె సింగభూపాలుని మరణానంతరము బైటికిఁ
దీయుటయో తటస్థించినప్పుడు తాళపత్రము లనేకములు చెదలపాలై
నశించిపోయి యుండును శిథిలములైన భాగములను మరల రచింప
కొనక పూర్వమే బమ్మెర పోతన యావిచారముతోనే మరణించి
యుండును. అందుచేతనే శిథిలములయిన భాగముల నితర కవులు
పూరించుట సంభవించినది. సింగభూపాలుఁడీ గ్రంథమును బాతిపెట్టించ
లేదని తలంచినను వానికిని పోతన్నకును నడుమ కొంత గ్రంథము
నడిచి యుండును. సింగభూపాలుఁడు పోతన్నను కొంతవఱకు బాధించి
యుండునని యొప్పుకొనక తప్పదు. కాకయున్న నిర్నిమిత్తముగా నిట్టి
నింద లోకములో వ్యాపించి యుండదు. బమ్మెర పోతనవంటి భక్తా
గ్రేసరుఁడు, శాంతిగుణ సంపన్నుఁడు, తన భాగవతములో నావిధ
ముగా రాజదూషణము చేసియుండఁడు. భావికాలమున నిట్టి నింద
నుండి తప్పించుటకై సింగమనాయని వంశీయులెవ్వరో తరువాత భాగ
వతరచన ననుకరించి భోగినీదండకమును రచియింపఁజేసి యుందురు.

భాగవతరచన ననుకరించి యొక చిన్నదండకము చెప్పుట పండితకవులకు నసాధ్యమగునది కాదు. ధనలోభముచే నిట్టి రచనగావించు కవులు పెక్కండ్రు కలరు. భాగవతములోని దూషణకు సింగభూపాలుఁడు కారకుఁడు కాఁడని భావికాలము వారనుకొనుటకై యాతనికి సర్వజ్ఞబిరుదము గల్పించి యాతఁడుంచుకొన్న లంజతోత్తుపై పోతన చెప్పినట్లుగా భాగవతరచన ననుకరించి యాదండకమును వ్రాయించి చివర పండితకీర్తనీయుఁడగు బమ్మెర పోతన రచించినాఁడను పద్యమును జేర్చినారు. ఈ సింగభూపాలుఁడు సర్వజ్ఞుఁడనుట కాధారము వేఱుగానరాదు.

ఈ సింగభూపాలుఁడు రచించిన గ్రంథములుగాని, అంకితముఁ బొందిన కృతులుగాని, గానరావు. ఇతని యాస్థానకవులు గాని పండితులుగాని గానరారు. 'సింగభూపాలీయ' మను గ్రంథము చమత్కారచంద్రికకు నామాంతరముగాఁ గన్పట్టుచున్నది. అయ్యది విశ్వేశ్వర పండితకృతము. ఇతఁడు పెదకోమటి వేమారెడ్డికి సమకాలికుఁడు గాఁడు, విశ్వేశ్వరపండితుఁ డీతనికి సమకాలికుఁడు గాఁడు రేచర్లవంశమువారిలో నొక సింగమనాయఁడు 'సర్వజ్ఞ' బిరుదముతో నొప్పినవాడు గలఁడని లోకప్రతీతి మాత్రము గలదు కాని గ్రంథస్థమగు ప్రమాణము గానరాదు. భోగినీదండక మాకాలమునఁ బుట్టినది కాదని యిదివఱకె తెలిపియున్నాను. పెదకోమటి వేమారెడ్డి 'సర్వజ్ఞ చక్రవర్తి' బిరుదము వహించుటకుఁ గారణము రేచర్లవంశము వారిలో నాకాలమునఁ గాని యంతకుఁ బూర్వమునఁ గాని సర్వజ్ఞ బిరుదము గలవారుండుటయె. అదియొక న్యూనతగా నుండునేమో యని యా బిరుదముతో వ్యవహరింపఁ బడినవారు గాని తదాస్థాన పండితులు గాని కవులు గాని యా బిరుదమును గ్రంథస్థము చేసి యుండలేదని నా యూహ. ఈ రహస్యమును దెలు

నుకొన లేక యిటీవల వారు పండితులు, కవులు మొదలగు వారెవ రికిఁ దోఁచిన విధముగా వారు తమ తమ సింగన్నలకు సర్వజ్ఞ బిరుదము నంటఁగట్టుచు వచ్చిరి. అందువలన సత్యము మఱుగునఁ బడిపోయినది. కూచిమంచి తిమ్మకవి గూడ సింగభూపాలునికి సర్వజ్ఞ బిరుదముఁ జేర్చుట వాడుకను బట్టియె గాని తెలిసి చేర్చినది కాదు. పూర్వము రేచర్ల వంశీయులు రాజ్యము చేసిన దేశమంతయును నేఁడు నైజాము ప్రభుత్వముక్రింద నుండుటచేత వీరికాలము నాటి శాసనములు గాని గ్రంథములు గాని మనకు లభించి యుండలేదు. లభించినవి బహు స్వల్పసంఖ్య కలవిగా నున్నవి. వీరల చరిత్రము సంపూర్ణముగాఁ దెలియరాకున్నది' అందువలన నిపుడున్న సాధనముల తోనే మన యభిప్రాయములను దెల్పుకొన వలసివచ్చుచున్నది. ఇప్పటి సాధనములను బట్టి సర్వజ్ఞసింగమనాయని గుర్తింపఁ జాలము. భోగినీ దండకమును నమ్ముకొని చరిత్రముఁ గల్పించుకొనుట కుక్క తోఁకను బట్టుకొని గోదావరి యీద బ్రయత్నించిన ట్లగును.

ప్రభాకరశాస్త్రిగారు "పోతనామాత్యుని కృతులు భాగవతము వీరభద్రవిజయము భోగినీదండకము నని మూఁడు కలవు." అనియు, భోగినీదండక కర్త యీతఁడు కాఁడను వాదమెంతయు నసంగతమే;' అనియు, "భోగినీదండకము కుమారాన్న పోతానేని కుమారుఁడగు రావుసింగభూపాలుని పేర రచింపఁబడినదని;' అనియు, "పోతానామాత్యుఁ డోరుగల్లు నివాసి గావునను రావుసింగభూపాలునికా యల్పకృతి యొసఁగుట యుపపన్న మయ్యెను;' అనియు, వ్రాసిన చేతులతోనే "పోతనయైహికేచ్ఛావిముఖుఁడగుట నిక్కువము. నరకృతి యాతనికి సమ్మతము;" అనియు, "పోతనామాత్యుఁడు సాత్త్వికప్రకృతిగల యుత్తమపురుషుఁడు. రాజాశ్రయాద్యపేక్షలు లేనివాఁడు;" అని వ్రాసిన వాక్యము లర్థములేని వ్యర్థవాక్యపుంజములని యనిపించుకొనవా? "శ్రీనాథాదులకుఁ జెఱుకుమని తగులు

నట్లు "ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి" అను పద్యమును భాగవతమునఁ జెప్పినాఁడఁట ఇదియే నిజమైన యెడల వెంటనే చెంపపెట్టు పెట్టినట్లు ఓయీ తెలివితక్కువ పెద్దమ్మా! రావు సర్వజ్ఞసింగమ్మ సాలుఁ దుంచుకొన్న లంజతొత్తుపై దండకము చెప్పి యాతని కంకితము చేసిన నీవా యిట్టి గర్వోక్తులు వచించుట? చాలుఁ జాలు; నోరుమూయు"మని ప్రత్యుత్తర మిచ్చియుండఁడా? భాగవతమునకుఁ బిమ్మటనే భోగినీదండకమును రచించె నందురా కావ్యముల రచించి నరాంకితముఁ జేసిన నన్నయ, తిక్కన, యెఱ్ఱన, శ్రీనాథాదుల వంటి మహాకవులను, తత్కృతిపతులను వ్యర్థ వాగాడంబరముతో దూషించినవాఁడు సాత్త్వికప్రకృతి గల యుత్తమ పురుషుఁ డెట్లగును? భోగినీదండకరచన భాగవతమునకుఁ బూర్వము నం దయినను బరము నం దయినను భాగవతములోని పయి పద్యమును సమన్వయించుటకు సాధ్యము కాదే. ఇప్పుడైనను భోగినీదండకము కృత్రిమరచన మని నా మిత్రులగు శాస్త్రిగారు గ్రహింపఁ గలిగిన యెడల నా పడినప్రయాసము వ్యర్థము కాలేదని తలంతును. భాగవతము రచించిన పోతనామాత్యుఁడు శ్రీనాథుని బావ యని కల్పించిన కథలన్నియుఁ దాఁడును బొంగరము లేని యమ్మన్మకథలని గ్రహింతురు గాక. బమ్మెర పోతన శ్రీనాథుని తరువాతివాడు గాని శ్రీనాథునికి సమకాలికుఁడు గాఁడు

శ్రీనాథుని భార్యతోఁబుట్టిన వారిలో నొక పోతనామాత్యుఁడు గలఁడు. అతఁడు నాచికేతూపాఖ్యానము రచించిన దుగ్గనామాత్యుని యన్న యని నాచికేతూపాఖ్యానమున వక్కాణింపఁ బడి యున్నది. ఆ పోతనామాత్యుఁ డే యీ బమ్మెర పోతనామాత్యు డని భ్రమించి పోతన శ్రీనాథులు బావ మఱదు లని యూహించి చమత్కారముగాఁ గథలు గల్పింపఁ బడినవి గాని యవి సత్యములు గావు.

# అధ్యాయము ౭



ఇట్లుఖండ కీర్తి వైభవములతో నొప్పారుచు శ్రీనాథకవి సార్వభౌముఁడు క్రీ. శ ౧౪౩౮ సంవత్సర ప్రాంతముల మరల రాజమహేంద్రపురమునకు విచ్చేసెను. ఇతఁడు కర్ణాటాధీశ్వరుఁడగు ప్రౌఢదేవరాయల యాస్థానమునందు డిండిమభట్టారక కవిసార్వభౌముని నోడించి యాతని కంచుఢక్కఁ బగులఁ గొట్టించి యాతని కవిసార్వభౌమ బిరుదము నొడిచికొని కర్ణాట సార్వభౌమునిచేఁ గనకాభిషేక సత్కారమును బొందిన విధమునంతయు నాంధ్ర దేశమున బహువిధములఁ గవిపండితకోటిచేఁ బ్రశంసింపఁ బడుటఁ దెలిసికొని రాజమహేంద్రపుర పండితులు తమ తొంటి వైషమ్య భావములను విడిచిపెట్టి మధికగౌరవమును జూప మొదలిడిరి. ఇంతకుముందే అన్నామాత్యుఁడు మొదలగువారు వేమ వీర భద్రారెడ్లను శ్రీ నాథకవి సార్వభౌముని ప్రజ్ఞా ప్రభావములను, ప్రతిభా విశేషములను, ప్రౌఢసాహిత్య సౌష్టవములను నగ్గడింపుచు నాతనియెడ వారికి విశేషగౌరవముదయించునట్లు చేయుచు వచ్చిరి ఇంతకుఁ బూర్వము వేమ వీర భద్రారెడ్లకును శ్రీనథునకు విశేష పరిచయ మున్నట్లు గానరాదు. శ్రీనాథుఁడు రాజమహేంద్ర పురమునకు వచ్చిన వెనుకనో యంతకుఁ బూర్వముననో కాశీఖండమును రచించుటకుఁ బూనుకొనెను. ఈ విషయమును అన్నామాత్యుఁడు వీరభద్రారెడ్డికిఁ జెప్పి యంకితముఁ బొందవలసినదిగా నాతనిఁ బ్రోత్సహించెను. అందులకాతఁ డియ్యకొనెను. ఈ సంగతి నే శ్రీ నాథకవి సార్వభౌముఁడు తాను రచించిన కాశీఖండమునందిట్లు చెప్పుకొని యున్నాఁడు.

శ్రీ నాథుఁడు మరలివచ్చిన తరువాత నొకనాఁడు తనలోఁ దానిట్లు తలపోసి కొనియెనఁట.

" చిన్నారి పొన్నారి చిఱుతకూఁకటి నాఁడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూఁగు మీసాల నూత్నయౌవనమున
శాలివాహనసప్తశతి నొడివితి
సంతరించితి నిండు జవ్వనంబున యందు
హర్షనైషధకావ్య మాంధ్రభాష
ప్రౌఢ నిర్భరవయః పరిపాకమునఁగొని
యాడితి భీమనాయకుని మహిమ
బ్రాయమింతకు మీఁద గైవ్రాలకుండఁ
గాశికాఖండమను మహాగ్రంథమేను
దెనుఁగుఁజేసెదఁ గర్ణాటదేశకటక
పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి.

ఇట్టి సంకల్పముతోఁ గాశీఖండరచనమునకు దొరకొనుటను గర్ణాకర్ణి కావశంబున విని వీరభద్ర నృపాలుం డొక్కనాఁడు——

"సీ. త్రైలోక్యవిజయాభిధంబైన సౌధంబు
చంద్రశాలాప్రదేశంబునందు
సచివ సైన్యాధీశ సామంత నృపవార
సీమంతినీజనశ్రేణి గొలువ
శాస్త్రమీమాంసయు సాహిత్యగోష్ఠియు
విద్వత్కవీంద్రులు విస్తరింపఁ
గర్పూర కస్తూరికా సంకుమదగంధ
సారసౌరభము దిక్పూరితముగ
నిజభుజావిక్రమంబున నిఖిలదిశలు
గెలిచి తను రాజ్యపీఠమెక్కించినట్టి
యన్నవేమేశ్వరుని యంకమాశ్రయించి
నిండు కొలువుండెఁ గన్నుల పండువగుచు".

అట్టిసమయమునఁ దమ్ముని యభిమత మెఱిఁగి యల్లాడవేమ భూపతి శ్రీనాథకవి సార్వభౌముని రప్పించి సముచితాసనమునఁ గూర్చుండ నియమించి యీ క్రింది విధమునఁ బలికెను.

"సీ. వచియింతు వేములవాడ భీమనభంగి
నుద్దండలీల నొక్కొక్కమాటు
భాషింతు నన్నయభట్టు మార్గంబున
నుభయవాక్ప్రౌఢి నొక్కొక్కమాటు
వాక్రుత్తు దిక్కయజ్వ ప్రకారము రసా
భ్యుచితబంధముగ నొక్కొక్కమాటు
పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని త్రోవ
సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు
నైషధాదిమహాప్రబంధములు పెక్కు
చెప్పినాఁడవు మాకు నాశ్రితుఁడవనఘ
యిపుడు చెప్పఁదొడంగిన యీప్రబంధ
మంకితము సేయు వీరభద్రయ్య పేర."

"శా. ఈక్షోణి న్నినుఁబోలు సత్కవులు లేరీ నేటికాలంబునన్,
దాక్షారామ చాళుక్యభీమవర గంధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయ గంధసారఘుసృణ ద్వైరాజ్యభారంబున
ధ్యక్షించుం గవిసార్వభౌమ భవదీయప్రౌఢసాహిత్యముల్."

అనినపలికి కర్పూరదాంబూల సహితంబుగా జాంబూనదాంబరా భరణాబు లిచ్చినం బరిగ్రహించెనఁట. అల్లాడ వీరభద్రనృపాలుని మూర్తి కొలువున్నసమయమున నెట్లుండునో యాశృంగారాకృతి నీ రీతి నీక్రిందిపద్యమున నభివర్ణించెను.

"సీ. మకరకుండలవజ్రమాణిక్యదీప్తులు
చెక్కుటద్దములపైఁ జిలువాఱ
డాకాలిగండపెండారంబు దాపున
బొమ్మలై వైరిభూభుజులు వ్రేలఁ
గలయంగ నలదిన కస్తూరినెత్తావి
యష్టదిక్కులయందు నవఘళింప
మొగముచూచినమాత్ర మూర్ధాభిషిక్తులు
మోడ్పుచేతులు మస్తములఘటింప
గీ. బాఱుఁగు దీగెలఁబోలు భామినులు గొలువ
నిండుకొలువుండెఁ గన్నులపండువగుచు

రాయవేశ్యాభుజంగ వీరప్రతాప
విభవుఁడల్లాడభూపతి వీరవిభుఁడు.,,

ఇట్టి ప్రభువర్యునివలనఁ గర్పూరతాంబూలసహితంబుగా జాంబూనదాంబరాభరణంబులు పరిగ్రహించి తాను గావ్య రచనకుఁ గడంగిన విధము నీక్రింది పద్యములోఁ దెలిపియున్నాఁడు.

సీ. ఆంధ్రక్షమామండలాఖండభుజుండైన
వేమ భూపతి కృపా వీక్షణంబు
భూదేవరాయాంక సద్గుణ రాజభీమేశ్వ
ర స్వామి పద సమారాధనంబు
కమలాద్రి నిలయ మార్కండేయ శివమౌళి
చంద్రాంశు నవసుధా సారధార
వేదాద్రినరసింహ విపుల వక్షస్థలీ
కల్హారమాలికా గంధలహరి
గీ. కారణంబులు నుద్బోధకములు గాఁగ
సంభవించిన సాహిత్యసౌష్టవమున
వీరభద్రేశ్వరుఁ బ్రబంధవిభునిఁ జేసి
కాశికాఖండముఁ దెనుఁగుగా నొనర్తు.,,

ఇతఁడం దందు నిజ ప్రభావంబుఁ గొంత దెలుపు కొన్నను తిక్కనాదులకంటె నెక్కువ ప్రౌఢముగను రసోదంచితముగఁ గవనము చెప్పను నని కాని డిండిమకవి సార్వభౌముని నుద్భటవివాదమున గెలిచిన వాఁడయ్యును నాడంబరముగా నట్టి ప్రబంధమునను జెప్పకొనక పైనఁ జెప్పిన విధముగా సాహిత్యసౌష్టవమును బడసి కాశికాఖండముఁ జెప్పఁ బూనుకొంటిననిచెప్పుటెంతయు నౌచితిని దెలుపుచున్నయది.

ఇతఁడు వేము వీరభద్ర నృపతులు చేయు శివార్చనా విధానము నిట్లభివర్ణించియున్నాఁడు.

సీ. త్ర్యంబకాచల కన్యకాంబు పూరంబున
నఘమర్షణ స్నానమాచరించు
నిద్ధమైన మడుఁగు నీర్కావి దోవతి
కనకమేఖలతోడి గడి ఘటించి
మూలమంత్రాక్షరంబుల బూతి మంత్రించి
పుండ్రకంబుగ ఫాలమున ధరించి
క్రొత్త ముత్యములతో రుద్రాక్షమాలిక
లష్టోత్తర శతంబు లఱుతఁ దాల్చి

గీ. పుండరీకాననమునఁ గూర్చుండి శంభు
నర్చనము సేయునపుడు మహాప్రమథుఁడు
చాలనొప్పారు రెండవ శంభునట్లు
వీరనారాయణుఁడు రెడ్డి వేమవిభుఁడు.,,

సీ. గోదావరీ పావనోదకంబుల హేమ
కలశశతంబుల జలకమార్చఁ
గర్పూరకస్తూరికా కుంకుమంబులఁ
గలపంబుఁ గూర్చి శ్రీగంధమలదు
సప్తగోదావరీ స్వర్ణపుష్కర హేమ
సౌగంధికముల నర్చనమొనర్చఁ
గలధౌత పాత్రల గాలాగరు చ్ఛేద
బహుళధూపంబులు పరిఢవించు

గీ. వేనవేలునివాళుల విస్తరించు
నమృత దివ్యాన్నముల నుపహారమిచ్చు
సంఘటించు నశేషోపచారములను
బ్రమథనాయకునకు వీరభద్రనృపతి.

వీరలు శైవమతావలంబకులయినను పరమతములను నయితము సహన భావముతోఁ జూచుచుండిరి కాని యెన్నఁడును ద్వేషబుద్ధితో జూచినట్లు గన్పట్టదు.

## అల్లాడ దొడ్డ భూపతి విజయధాటి.

వేమవీరనృపతులకు సోదరులైన దొడ్డనృపతియు, అన్న నృపతియు సేనాపతులుగ నుండి రాజ్యము విస్తరింపఁ జేయుట యందన్నలకుఁ దోడ్పడుచుండిరి. వీరిలో దొడ్డ భూపతి స్వారి చేయుట యందు దాఁటి తేరిన రౌతుగ నుండెను. అనేక జయములచేతఁ బ్రఖ్యాతిఁ గాంచెను. ఇతఁడు గుఱ్ఱము నెక్కి స్వారిచేయుచు నిరువది నాలుగు మూళ్ళ మేర భూమిని దాటించి యశమును గాంచిన వాఁడని కాశీ ఖండములోని యీక్రింది పద్యము చాటి చెప్పుచున్నది.

“ మ. హరిదాటించెఁ బురోపకంఠమున వాహ్యాళి ప్రదేశంబునం
దరుదేయళ్ళయ రెడ్డి నందనుఁడు దొడ్డయ్య క్షమాధీశ్వరుం
డిరువై నాలుగు మూళ్ళ మేర యది పోలెక్కింపఁగా నేల య
ద్ధరణీనాథుని కీర్తి దాఁటెఁ గకుబుద్దండించి బ్రహ్మాండమున్.

ఈ గుఱ్ఱము పేరు రాజకుంజరసింహం బని నిశ్శంక కొమ్మన కవి తన శివలీలావిలాసమను గ్రంథమున

“ మ. అరుదై యళ్ళయ దొడ్డ భూవిభుఁడు వాహారోహరేవంతుఁడిం
పరుదారన్వడి మూలగూరి కడ వాహ్యాళిస్థలిన్ రాజకుం
జరసింహంబను వారువంబును యదృచ్ఛాలీలదాటింపఁడే
తిరమై యిర్వదినాల్గుమూళ్ళ నిడుపు ప్రత్యేకంబుచే యెత్తుగాన్.

ఈ దొడ్డారెడ్డి చిల్కసముద్రము వఱకుఁ గల దేశమును జయించి జయస్తంభములు నాటించినట్లుగా నీ క్రింది పద్యమునఁ జెప్పి యున్నాఁడు.

“ శా. ఔరా యళ్లయ రెడ్డి దొడ్డ వసుధాధ్యక్షుండు ధాటీ చమూ
భేరీ భాంకృతిఘోరఘోషమున నిర్భేదించె నొడ్డాది శృం
గారం కోటయు లోతుగడ్డయును నుద్ఘాటించె నత్యుద్ధతిన్
క్షీరాంభోధితటంబునన్నిలిపె దిక్సీమాజయస్తంభముల్”.

కనుకనే శ్రీనాథకవి సార్వభౌముఁడు, వీరభద్రనృపాలుడు, చిల్కాస ముద్రము వఱకు రాజ్యము విస్తరింపఁ జేసి పరిపాలించు చున్నట్లీ క్రింది పద్యమునఁ జెప్పియున్నాఁడు.

"ఉ. ప్రాకట విక్రమ స్ఫురణ రాజమహేంద్రము రాజధానిగా
నేకసితాతపత్త్రమున నేలును వీరనృపాలుఁ డుత్తమ
శ్లోకుఁడు వేమగౌరియనుజుండు సమున్నతి వైభవాఢ్యుఁడై
చీకటియుం గళింగయును జిల్కసముద్రము సింహశైలమున్.

అగ్రహార బ్రాహ్మణ వర్ణనము.

గౌతమీ తటమునందు వేమభూపాలుఁ డనుజన్ముఁడైన వీరభద్రనృపాలుని చేత ధాత్రి సేవించు కాలమున నగ్రహారములోని బ్రాహ్మణు లెట్టి యైశ్వర్యములతో నొప్పుచుండిరో యా వివరమును గూడ శ్రీనాథకవి సార్వభౌముఁడీ క్రింది రీతి నభివర్ణించియున్నాఁడు,

" సీ. ధరియింప నేర్చిరి దర్భవెట్టెడు వ్రేళ్ళ
లీల మాణిక్యాంగుళీయకముల
గల్పింప నేర్చిరి గంగమట్టియ మీఁదఁ
గస్తూరికా పుండ్రకముల నొసల
సవరింప నేర్చిరి జన్నిదంబుల ప్రోల
హారవారములు ముత్యాలసరులు
చేర్పంగ నేర్చిరి శిఖల నెన్నడుముల
గమ్మని క్రొత్త చెంగల్వ విరులు
తే. ధామముల వెండియును బైఁడి దడబడంగ
బ్రాహ్మణోత్తము లగ్రహారములలోన
వేమభూపాలుఁ డనుజన్ము వీరభద్రు
ధాత్రియేలింప గౌతమీ తటమునందు.

అనఁగా నంతకుఁ బూర్వము బ్రాహ్మణులంత యైశ్వర్యవంతులుగా లేరని భావము తేటతెల్లమగుచున్నది.

## రాజ్య విస్తీర్ణము

వీరభద్రారెడ్డి కటకాధిపతియు, కళింగ గాంగవంశజుఁడును, గజపతియు నగు భానుదేవునినోడించి తన రాజ్యమును మహానది వఱకు విస్తరింపఁజేసెను. ఈ ప్రదేశమంతయుఁ గళింగదేశమని పూర్వము వ్యవహరింపఁబడినను శ్రీనాథకవిసార్వభౌముఁడు వీరభద్ర నృపాలుని మధ్యాంధ్రకుమారమండలేశ్వరుండని వ్యవహరించి యున్నాఁడు ఆనాటికే కళింగదేశము సంపూర్ణముగా నాంధ్రదేశములోని భాగముగా నేర్పడినది. ఈ రెడ్డిరాజులు పరిపాలించిన భూభాగమంతయును ముప్పదివేల మైళ్ల వైశాల్యము గలది యై యుండెననుటకు సందియము లేదు. అల్లాడ రెడ్డి పుత్త్రులు నిరంతరశుభ్రయవక్రపరాక్రమంబున నిరువదేండ్లకాలము మధ్యాంధ్రదేశమును బరిపాలించిన వెనుక దేశము ఘోరయుద్ధములకు రంగస్థలమై పోయినది.

## రెడ్ల ధర్మకార్యములు

అల్లాడ వేమభూపాలుని శ్రీనాథకవి సార్వభౌముఁడు దేవబ్రాహ్మణభక్తినర్థితధరిత్రీచక్రసామ్రాజ్యలక్ష్మీనివాసోన్నతి" యని వర్ణించి యుండఁగా నాతని ధర్మకార్యము లెట్టివై యుండునో వేఱుగఁ జెప్పనక్కఱలేదు. ఇతఁ డనేక భూదానములను గావించి కాంచీ శ్రీగిరి కాశీ పంచారామాది దేవభవనంబులలో శాసనములు వ్రాయించెనని యీ క్రింది పద్యమువలన వేద్యము కాఁగలదు.

" కం కాంచీ శ్రీగిరి కాశీ
పంచారామాది దేవభవనంబుల వ్రా
యించెను వేమక్ష్మాపతి
యంచిత భూదానశాసనాక్షరపఙ్క్తుల్. "

గీ. ధర్మశాసన ఘనశిలాస్తంభ మెత్తె
శ్రీముకుందోద్భవ స్వామి శివుని మ్రోల
వీరభద్రేశుఁ డా చంద్రతారకముగ
నగ్రహారాళి నఖిలమాన్యంబు లొసఁగి. "

అను పద్యము గన్పట్టుచున్నందున వీరనృపాలుఁడు సైతము మత సంరక్షకులగు బ్రాహ్మణులకు నగ్రహారముల నొసంగుచుండెనని విదితము కాఁగలదు ఇట్లు కొండవీటిరెడ్లు, రాజమహేంద్రపురరెడ్లు బ్రాహ్మణులకు భూదానములు చేసినారన్న కుక్షింభరమాత్రులయిన బ్రాహ్మణులకు వ్యర్థముగా భూదానములు చేయుచుండిరని నవనాగరికులు కొందఱు తలంచి పరిహసింపవచ్చునుగాని యట్లు తలంచుట న్యాయముగాదు విద్యలన్నియు బ్రాహ్మణుల యాధీనమై యుండుటచేత వేదశాస్త్రాది విద్యల పోషణార్థము పర్వకాలములందు పుణ్యము పేరు చెప్పుకొని వేదవేదాంగ వేత్తలయిన బ్రాహ్మణులకు మాత్రమే భూదానములు మొదలగు చేయుచుండిరని భావింపవలయును. వారియుద్దేశముగూడ నట్టిదై యుండెను. వీరభద్రభూపాలుని పట్టమహిషియగు అనితల్లీ దేవి ఆయుర్వేద పారంగతుఁడైన వరహితాచార్యుఁడను బ్రాహ్మణునకు కలువచేరను గ్రామమునకు అన్నవరమని పేరిడి దానముచేసి యుండెను వరహితుని పూర్వులెల్లరు నాయుర్వేదపారంగతులయిన భిషఙ్మణులని శాసనమునం దభివర్ణింపఁబడిరి. అట్టి యుత్తమ విద్యను నేర్చి బహుజనోపకారకులై ప్రసిద్ధి నొందిన బ్రాహ్మణోత్తముల బోషించుట యాయుర్వేదవిద్యను బోషించుట కాదా! ఇట్టి యుత్తమ శాస్త్రములు నశింపకుండఁ జేయుటకే వారాకాలమునందు గ్రామములు భూములు మొదలగు వానిని బ్రాహ్మణోత్తముల బోషించుట యాయుర్వేదవిద్యను బోషించుట కాదా! ఇట్టి యుత్తమ శాస్త్రములు నశింపకుండఁ జేయుటకే వారాకాలమునందు గ్రామములు భూములు మొదలగు వానిని బ్రాహ్మణోత్తములకు దానము చేయుచుండిరి. పై దానము శా. శ. ౧౪౨౮ [1428] క్షోభకృద్వర్ష శ్రావణ కృష్ణైకాదశీ దినంబున శ్రీమార్కండేయేశ్వరుని సన్నిధానమునఁ జేయఁబడినది.

## మధ్యాంధ్ర దేశవిప్లవము

౧. అల్లాడ భూపతి పుత్త్రులు క్రీ. శ. ౧౪౪౪ వఱకు నవక్రపరామంబున శత్రురాజుల నదిమిపట్టి యవనకర్ణాట కటకభూధవులతోఁడఁ జెలిమిపాటించి రాజమహేంద్రపుర రాజ్యమును బరిపాలించిరని తెలిపి యున్నాఁడను. వీరి రాజ్యము గజపతిరాష్ట్రమునకుఁ బక్కలో బల్లెమై యుండెను. ఈ రెడ్డిరాజ్యము ప్రవర్ధమానమై యున్నంతవఱకు గజపతు లభివృద్ధి గానరాక యుండిరి. వీరికిఁ గర్ణాటకులు శత్రువులుగ నుండిరి. కర్ణాటకులును రెడ్లు నప్పటప్పట మైత్రిగలిగి యుండుచు వచ్చిరి అదియుఁగూడ నొక విరోధకారణమై యుండెను పశ్చిమమున బహామనీ రాజ్యము వర్ధిల్లుచుండెను. అహమ్మదుషాహ మరణముఁ జెందఁగా అల్లాఉద్దీన్‌షాహ ౧౪౩౫ సంవత్సరమున రాజ్యారూఢుఁడై కర్ణాటక సామ్రాజ్య చక్రవర్తి యగు ప్రౌఢదేవరాయనితో యుద్ధములు ప్రారంభించెను. ప్రౌఢదేవరాయలు తురకప్రభువైన బహమనీసుల్తాను మాత్రమెగాక హిందువైన గజపతిగూడ శత్రువుగ నుండుటచేత నొకప్రక్క గజపతుల తోడను, మఱియొకప్రక్క తురకలతోడను యుద్ధములు చేయవలసి వచ్చెను యవన కర్ణాటక భూధవులు సమానబలులు సమర్థులుగావున దక్షిణహిందూదేశమున దమతమ సామ్రాజ్యములను సుస్థిరముగా నిలుపుటకై. ఘోరముగాఁ బోరాడుచు వచ్చిరి ఇట్టి యుద్ధతుల నడుమ రెడ్డిరాజ్య మెంతో కాలము నిలువఁజాలక పోయినది. గజపతులు రెడ్డిరాజ్యమును మ్రింగివేయవలయునని చలముపట్టి యుండిరి. అందులకుఁ గాలము కర్మము సమకూడినది. ఇట్లుండఁగా ౧౪౩౫ వ సంవత్సరమున గజపతుల రాజధానియైన కటకపురమున విప్లవము తటస్థించి రాజైన భానుదేవుఁడు సంహరింపఁ బడియెను ఈతనితోఁ గళింగ గాంగవంశ మంతరించినది. మంత్రియగు కపిలేంద్ర గజపతి రాజ్యారూఢుండయ్యెను. ఇతఁడు

మిక్కిలి సమర్థుఁడు, విక్రమాఢ్యుఁడు నగుటచేతఁ దనరాజ్యమును విస్తరింపఁజేయ సంకల్పించెను. రెడ్డిరాజ్యము నాపోసనముఁబట్టినఁ గాని తన సంకల్పము నెఱవేఱఁజాలదని తలంచెను. అందులకై పది సంవత్సరములు కృషిచేసెను ౧౪౪౪ వ సంవత్సరములోఁ గపిలేంద్ర గజపతి రాజమహేంద్రపురముపై దండయాత్ర వెడలివచ్చెను. ప్రౌఢదేవరాయలు రెడ్లకు సాహాయ్యముఁ జేయవచ్చెను. ఉభయపక్షముల వారికి యుద్ధములు జరిగినవి. కపిలేంద్ర గజపతి యుద్ధమున గెలువఁజాలక యాతడవకు మరలి పోయెను గాని తన పట్టువిడిచిన వాఁడు గాఁడు. ప్రౌఢదేవరాయ లాసంవత్సరమున దక్షారామ భీమేశ్వరుని సందర్శించి యొకదానశాసనమును వ్రాయించి వెడలిపోయెను తరువాత రెండుసంవత్సరములకు విద్యానగరమునఁ బ్రౌఢదేవరాయలు మరణముఁ బొందినందున గజపతికి బలమెక్కువ యయ్యెను మహాసమర్థుఁడైన తనశత్రుప్రభుఁడు మరణము నొందినందున గజపతి కర్ణాట సామ్రాజ్యమును స్వాధీనపఱచుకొని పిమ్మట తురుష్కులను జయించి దక్షిణహిందూదేశమున నేకసామ్రాజ్యమును స్థాపింపవలయునని సంకల్పించి క్రీ శ ౧౪౪౭ వ సంవత్సరమున విజృంభించి యసంఖ్యాకములగు సైన్యములతో దండయాత్ర బయలుదేఱి రెడ్డిరాజులను జయించి రాజమహేంద్రపుర రాజ్యమును మాత్రమెగాక దక్షిణమున నుదయగిరివఱకుఁగల కర్ణాట రాజ్యమును, ఏకశిలానగరమువఱకుఁగల పద్మ వెలమ నాయకుల రాజ్యమును నాక్రమించుకొని యారాజ్యములఁ బరిపాలించుటకై ప్రతినిధి పాలకుల నియమించెను. పరశురామ రఘునాధ రాజు, వీరభద్రరాజు, కంబముమెట్టు, ఓరుగల్లుసీమలఁ బాలించుటకు నియమింపఁబడిరి. గజపతిపాత్ర సామంతులలో నొకఁడు రాజమహేంద్రపుర రాజ్యమును బరిపాలింపుచుండెను. కొండవీటిరాజ్యమును

పాలించుటకు గణదేవుఁడు నియమింపఁబడెను. వినుకొండరాజ్యమును కమ్మ సేనానిసాగిగన్నమనాయఁడను గన్నక్షితిపాలుఁడు పరిపాలనము సేయుచుండెను. ఉదయగిరిరాజ్యమును మాధవవర్మకులోద్భవుండయిన తమ్మిరాజపుత్త్రుఁడు బసవరాజు పరిపాలనము సేయుచుండెను. వీరెల్లరును ౧౪౫౦ దవ సంవత్సరమునకుఁ బూర్వముననే యీదేశములను జయించి పరిపాలించుచున్నట్లు శాసనములవలనఁ దెలియవచ్చుచున్నందున నప్పటికే యాంధ్రదేశములో మూఁడువంతులు గజపతుల స్వాధీనమయ్యెనని చెప్పవచ్చును.

## శివరాత్రి మాహాత్మ్యము *

ఇంతవఱకుపలబ్ధములయిన శ్రీనాథుని గ్రంథములలో శివరాత్రి మాహాత్మ్యము కడపటిదిగాఁ గన్పట్టుచున్నది. రాజమహేంద్రపుర రెడ్డిరాజ్యము నశించిన వెనుక వచ్చిన యొడ్డెరాజుల దొరతనమున శ్రీనాథకవిసార్వభౌముని నాదరించు ప్రభుపుంగవులు లేకపోయిరి. ౧౪౫౦ సంవత్సరమునకుఁ బిమ్మట శ్రీనాథకవిసార్వభౌముఁడు మరల దేశాటనము ప్రారంభించి కొండవీటిసీమలో సంచారము సేయుచు శివరాత్రి పర్వకాలమున శ్రీగిరి మల్లికార్జున భ్రమరాంబికల సందర్శించుటకై శ్రీశైలయాత్రకు బయలు వెడలెను శ్రీశైలమున భిక్షావృత్తి మఠమను జంగమ మఠ మొకటి గలదు. అక్కడ నా మఠాధీశ్వరులు ధర్మకర్తలుగా నుండిరి. వారు శ్రీనాథకవిసార్వభౌముని సత్కరించి శివరాత్రి మాహాత్మ్యమును జెప్పఁగోరినందున నతఁడీ గ్రంథమును రచియించెను.

---

* ఈ గ్రంథ మాంధ్రసాహిత్య పరిషత్తువారిచే సంపాదితమై వారి యాంధ్రసాహిత్య పరిషత్పత్రిక యందే ప్రకటింపఁ బడియున్నది. అత్యంతము శిథిలమైన ప్రతియొక్కటియే దొరకినది. గ్రంథపాతములు గలవు.

అక్కడి మఠాధీశ్వరులకు భిక్షావృత్తులని పేరు. వారిలో శాంతభిక్షావృత్తి ప్రఖ్యాతుఁడైన మహాత్ముఁడుగా నుండెను. శివరాత్రి మహోత్సవ సమయమున శాంతభిక్షావృత్తి యతీశ్వరుఁడు శివకథావినోదంబులఁ బ్రొద్దుపుచ్చుచుఁ దన ప్రియభృత్యుఁ డగు శాంతయ్యను శ్రీనాథునిచేఁ గృతిఁగొమ్మని ప్రబోధించినట్లు శివరాత్రి మహాత్మ్యమునఁ జెప్పబడినది. అట్లు శ్రీనాథుఁడు లక్షాధికారులయి యుండిన జంగమగురు పీఠము వారి యనుగ్రహమునకుఁ బాత్రుఁడై వారి ప్రార్థనము మీఁద శివరాత్రి మహాత్మ్యమును రచించి పువ్వుల ముమ్మడి దేవయ్య పుత్రుఁడయిన శాంతయ్యకు నంకితము గావించెను. ఈ కావ్యమునందు కృతిపతి యిట్లభివర్ణింపఁబడి యున్నాఁడు.

సీ॥ "పరవాది మత్తేభ పంచాననాఖ్యుండు<br>
పరహిత మండూక పన్నగుండు<br>
పరవాది నవమేఘ ప్రమానధీరుండు<br>
పరవాది సాగర బాడబుండు<br>
పరవాది కుత్కీల భాసుర దంభోళి<br>
పరవాది గోధన పావకుండు<br>
పరవాది చయతమః పటలోగ్రభానుండు<br>
పరవాది భోగి సుపర్ణుఁ డనఁగ

గీ. జటుల శైవ కోలాహల సమర బిరుద<br>
ఘనుఁడు సంగ్రామ పార్థుండు వినుత యశుఁడు<br>
శుభుఁడు ముమ్మడి దేవయ్య సుతుఁడనఁగ<br>
వెలసె శాంతయ్య విక్రమహీరవరుండు.

ఈ గ్రంథమును గూర్చి యీనడుమ నొక విచిత్ర వివాదము బయలు వెడలినది. ఈ గ్రంథమును శ్రీనాథుఁ డెవరికి నంకితమొనర్పక ముందే స్వర్గస్థుఁడై యుండుననియు, ఈ గ్రంథమునకు భర్తగాఁ గన్పడు నట్టి ముమ్మిడి శాంతయ్య యెట్లో యీకృతిని సంగ్రహించి తన కతికించుకొని యవతారికాదులను స్వహస్తముననో, పరహస్తముననో

యవతరింపఁజేసెననియుఁ బ్రవాదము పుట్టించుచున్నారు. అవతారికా భాగము దోషభూయిష్ఠమై, అప్రౌఢకల్పనాజల్పాకమై యుండుట కారణముఁట. ఇంతమాత్రమునఁ బ్రబల ప్రమాణముఁజూపించు నంత వఱకిట్టి వాదము నంగీకరింపరాదు. శ్రీనాథకవిసార్వభౌముఁడు తన వార్ధక్యదశ యందు శివరాత్రి పర్వకాలమున కృతిభర్తయగు శాంతయ ప్రోత్సహించి నందువలనఁ ద్వరితగతిని గ్రంథమును రచించి నట్లు మనమూహింపవచ్చును గాని తదితరములయిన యూహల కవకాశము గనుపట్టదు. అవతారికాభాగము దోషభూయిష్ఠమై యుండుటకుఁ గారణము పరిషత్తునకు లభించిన ప్రతి శిథిలాతి శిథిలమై యుండుటయె కారణము. శాంత బిక్షావృత్తి యతీశ్వరుఁడు శ్రీనాథునకు సమకాలికుఁడని నిస్సంశయముగాఁ జెప్పదగును కృతిపతి యగు శాంతయ జంగమదేవర శాంత బిక్షావృత్తి యతీశ్వరునకు మూల భృత్యుఁడని శివరాత్రి మహాత్మ్యమునఁ జెప్పఁబడియున్నది గనుక మమ్మయ శాంతయ్య శ్రీశైలమందలి బిక్షావృత్తి మఠస్థ జంగముఁడని తేటపడఁగలదు. హరిశ్చంద్ర చరిత్రను ద్విపదకావ్యముగా రచించిన గౌరనమహాకవి తన పెదతండ్రి పోతరాజు దేవరకొండ రాజ్యాధిపతి యగు సింగన మాధవక్షితిపాలమణికి మంత్రిగా నుండెనని చెప్పియుండుట చేతను, సింగన మాధవభూపాలుఁడు క్రీ.శ. ౧౪౨౩ లో రామాయణమునకు వ్యాఖ్య రచించినాఁడని వీని భార్యయగు నాగాంబిక రాచకొండ కుత్తరమున నాగసముద్ర మను తటాకమును ద్రవ్వించి వ్రాయించిన శిలాశాసనములో నుండుటచేతను, గౌరన తన నవనాథచరిత్ర పీఠికలో శాంతబిక్షావృత్తి యతీశ్వరుని విశేషముగా నభివర్ణించి యుండుట చేతను ౧౪౩౦ ప్రాంతములనున్న పోతన మంత్రి తమ్ముని కుమారుఁడైన గౌరనకవి ౧౪౫౦ ప్రాంతములనుండుట సత్యమునకు విరుద్ధముకాకుండ చేతను గౌరన నవనాథచరిత్ర పీఠికలో

శాంత బిక్షావృత్తి యతీశ్వరుని ప్రాభవమును విశేషముగా నభివర్ణించి యుండుటచేతను శాంతభిక్షావృత్తి యతీశ్వరుఁడు గూడ నాకాలమున నుండెననుట సత్యమునకు విరుద్ధము గాదు. ఈకాలమున నీదేశ మంతయు నోఢ్రరాజులకు గజపతుల కధీనమయ్యెను. తన్నాదరించు నాశ్రయప్రభువు లెవ్వరు లేకుండుటచే వార్ధక్యము ముంచుకొని వచ్చుచున్నను సంసారభారమును భరించుటకై గజపతికి సామంతుఁడగు నేగణదేవునో యాశ్రయించి కృష్ణాతీరమునందలి బొడ్డుపల్లెను గుత్తకుఁ దీసికొని గుత్తసైకమును చెల్లింపలేక వారివలన నానావిధకష్టములను బొందిన ట్లాతనిచే రచింపఁ బడినదను నీక్రింది చాటుపద్యమువలన దెలియఁగలదు.

సీ. కవిరాజు కంఠంబుఁ గౌగిలించెనుగదా,
  పురవీథి నెదురెండ పొగడదండ,
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబున
  దగిలియుండెను గదా నిగళ యుగము,
వీరభద్రారెడ్డి విద్వాంసు ముంజేత
  వియ్యమందెనుగదా వెదురు గొడియ,
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుగదా
  నగరివాకిట నుండునల్లగుండు,
గీ. కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు దినిపోయెఁ దిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేలి మోసపోతి
నెట్లు చెల్లింతు టంకంబు లేడునూర్లు.

వార్ధక్యము పైఁబడిన తరువాత, తన్నాదరించిన మహారాజు లొకరి వెనుక నొకరు నాశనముఁ జెందుటయు, పరరాజుల నాశ్రయించి యొకగ్రామమును గుత్తకుఁదీసికొనుటయు, చిరకాలము గంటముఁబట్టిన హస్తముతో నాగలిబట్టుటయు, దురదృష్టవశమునఁ బండించినపంట నంతను కృష్ణవేణమ్మ వరదలతో ముంచెత్తికొని పోవుటయు, పోగా

మిగిలిన పంటలను బిలబిలాక్షులు దినిపోవుటయు, గుత్తధనము చెల్లింప లేకపోవుటయు, పరప్రభువులు దయాదాక్షిణ్యాదులను విడిచి గౌర వమునైన పాటింపక పురవీధిలో నెనురెండలో నిలువబెట్టి కాళ్ళకు గదలకుండ సంకెళ్ళు దగిలించి నగరివాకిటనుండు నల్లగుండును నొక దాని బుజముపైఁ బెట్టించి బాధించినవిధమునంతను వర్ణించి చెప్పిన పద్యము శ్రీనాథునిది కాదని చెప్పుటకు నోరు రాఁగలదా ? ఇట్టి కష్ట ముల పాల్పడిన వెనుక నే శ్రీనాథ కవిసార్వభౌముఁడు శ్రీశైలయాత్రకుఁ బోయి యచటి మఠాధిపతులతో మైత్రిగావించుకొని ధనసంపాదనకై వారల ప్రోత్సాహమున శివరాత్రిమాహాత్మ్య మను నీ గ్రంథము నత్యల్పకాలములో త్వరితగతిని రచించి యుండుననుట వాస్తవముని విశ్వసింపవచ్చును. ఇట్టి పరిభవమును బొందినవాడగుట చేతను, వార్ధక్యము పెరుగుచున్నవాఁడగుట చేతను, అవతారికాదులు కొంత వఱకుఁ బేలవముగా నుండవచ్చును. కాని గ్రంథమును ముమ్మాయ శాంతయ కంకితము చేయలేదనుటకు సప్రమాణములగు నాధార ముల నెవ్వరును జూపింపలేదు. శిథిలాతిశిథిలమగు ప్రతియొక్కటియే పరిషత్తువారికి లభించుటచేతను గ్రంథపాతములు పెక్కులు గాన వచ్చుచుండుటచేతను, ఇట్టి యపోహల కవకాశమిచ్చుచున్నదిగాని గ్రంథమును బాడితవర్యులు నిష్పక్షపాతబుద్ధితోడను, సహృదయదృష్టి తోడను జక్కఁగా విమర్శించి కవిహృదయానుసారముగ నౌచిత్యభంగ ములేకుండ సుచితసంస్కరణములను గావించి ప్రచురింపవలసిన గ్రం థమై యున్నది. ఇట్టిపని యాంధ్రపరిషత్తువారిచేతను నెఱవేర్పఁబడ వలసి యున్నది.

శివరాత్రి మాహాత్మ్యమున కృతిభర్తల్లియైన యొమ్మమాంబను వర్ణించిన యాకింది—

" పరమపాతివ్రత్య భావంబు తలపంగ
గౌరిగాఁబోలు నీకాంతితలఁప
సకలసంపత్స్ఫూర్తి చాతుర్యమహిమల
నిందిర గాఁబోలు నిందువదన
సకల విద్యాప్రౌఢి నడిసన్న గరిమల
భారతి గాఁ బోలు భామ యెప్పుడు
సర్వలక్షణ గుణసంపన్నతోన్నతి
నింద్రాణిగాఁబోలు నిగురుబోఁడి
యనగనిద్ధాత్రియేప్రొద్దు నతిశయిల్లె
బరఁగ ముమ్మడి దేవయ్య భామ జగతి
గామితార్థక సంతానకల్పవల్లి
యుజ్జ్వలద్గుణనికురంబ యొమ్మమాంబ.

అను సీసపద్యము శ్రీనాథవిరచిత భీమఖండావతారికయందలి యీక్రింది

సీ. జగదేకసంస్తుత్యసౌభాగ్యసంపద
రతిదేవిబోలు నీరాజవదన
పరమపాతివ్రత్య భాగ్యగౌరవమున
భూపుత్రిఁబోలు నీపువ్వుబోఁడి
యక్షీణమహిమఁ గళ్యాణ వైభవమునఁ
బార్వతిఁబోలు నీ పద్మగంధి
మృదుగభీరప్రౌఢమిత భాషణంబుల
భారతిబోలు నీపరమసాధ్వి.
యనుచు బంధులు వినుతింప నవనిమించె
నధికశుభగాత్రి విశ్వనాయకుని పుత్రి
యన్నవిభు దేవమంత్రి యర్ధాంగలక్ష్మి
రమ్యసద్గుణ నికురంబ రామమాంబ.

అను సీసపద్యమును బోలియున్నది. ఈ గ్రంథమునందలి మాలకథ

స్కాందపురాణమందలి శంకరసంహితలోని దని శివరాత్రి మహాత్మ్యములోని

"ఉ. తాపససార్వభౌములు సదా శివరాత్రి మహావ్రతంబు దో
షాపహృతిక్రమంబు వినుఁడాదరణంబున నేను సద్గురు
శ్రీపదపద్మముల్ దలఁచి చెప్పెద శంకరసంహితాకథా
దీపిత భవ్యమార్గమునఁ దేటపడన్ మొదలింటి నుండియున్.",

కవి యీ గ్రంథమును త్వరితముగా ముగింపవలసిన వాఁడగుట చేతనో, లేక మహాకవి యగు బాణుని యందు గల యత్యంతాభిమానము చేతనో కాదంబర్యనుసరణము నెక్కువగాఁ జూపియున్నాఁడు.

మఱియు మన కుపలబ్ధమయిన ప్రతిగూడ నాలుగా శ్వాసముల గ్రంథమై చతుర్థాశ్వాసాంతమున నున్న

" గీ. పరమ మునులు నూత్యాహసంభవుని సూతు
భక్తిఁ బూజించి యధిక తాత్పర్య గరిమ
భటులు ప్రమథులచే భంగపడుట చూచి
చిన్నబోయి యముండేమి చేసెఁ బిదప.,.

అను గీతపద్యమువలన సమగ్రమయిన దట్లుగా స్పష్టమగుచున్నది. ఇట్లసమగ్రమై గ్రంథపాతములతోఁ గూడి శిథిలాతిశిథిలమై యున్న ప్రతిలోని పదజాలమును బురస్కరించుకొని నిరాధారము లయిన యపోహలతోఁ జేయు నాక్షేపణములకు బ్రత్యుత్తరమును జెప్పుట గ్రంథము విస్తరింపఁజేయుటకు మాత్రమె తోడ్పడును సంశయగ్రస్త మానసముల సంతృప్తపఱుపఁ జాలదని యీ విషయ మింతటితో విరమించుచున్నాను.

———

# అష్టమాధ్యాయము

## అవసానకాలము

శ్రీనాథకవి సార్వభౌముఁడు తనవార్ధక్యమునఁ బయి నుడివిన కష్టము లనుభవించి ప్రాణావసానసమయమున

"సీ. కాశికావిశ్వేశుఁ గలిసె వీరారెడ్డి
రత్నాంబరంబు లేరాయఁ డిచ్చు?
రంభఁగూడెఁ దెనుఁగురాయరాహుత్తుండు
కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు
స్వర్గస్థుఁ డయ్యె విస్సనమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తిఁ గలదు
కైలాసగిరిఁ బండె మైలారు విభుఁ డేగి
దినవెచ్చ మేరాజు దీర్పఁగలఁడు

గీ. భాస్కరుఁడు మున్నె దేవుని పాలికరిగెఁ
గలియుగంబున నిఁకనుండఁ గష్టమనుచు
దివిజకవివరు గుండియల్ దిగ్గురనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి."

అని యెల్లవారికి జాలిపుట్టునట్లుగాఁ బయిసీసపద్యమును జెప్పి విచారముతోఁ బ్రాణములను విడిచెనఁట. దీనిని సందుచేసికొని విషయవిమర్శను జక్కఁగాఁ జేయుక పయి యధ్యాయమున నుదహరించిన "కవిరాజు కంఠంబుఁ గౌగలించెనుగదా పురవీధి నెదురెండ పొగడదండ," అను పద్యమును నిందలి పై సీసపద్యము నుదాహరింపుచు శ్రీవీరేశలింగము పంతులుగారు తమ "ఆంధ్రకవుల చరిత్రము" నందు

"అవసానదశయం దిట్టికష్టముల కెల్లను గారణము యౌవనదశయందుఁ గామవశముచేత స్వేచ్ఛముగా విహరించి దేహమును ధన

మును బోఁగొట్టుకొన్న పాపఫలముతక్క వేఱొక్కటి గానరాదు,,

అని యొక యపూర్వ వ్యాఖ్యానము చేసి ధర్మోపదేశమును గావించి యున్నారు.

ఈ చాటుపద్యములు రెండును శ్రీనాథకవియే మనము విశ్వసించిన యెడల మొదటి పద్యము చెప్పిన కాలమునకును రెండవపద్యము చెప్పిన కాలమునకును నడుమ గొంతకాలము గడచి యుండవలయును. ఏకకాలమునఁ జెప్పినవి కావనుట సత్యము.

శ్రీనాథుఁడు క్రీ శ. ౧౩౬౦ లోఁ బుట్టి క్రీ శ. ౧౪౪౦ లో మృతినొందెననియు నప్పటికి ౮౦ సంవత్సరముల వయస్సుగలవాఁడై యుండుననని లక్ష్మణరావు గారును, ౧౩౬౫-లోఁ బుట్టి ౧౪౪౦-౪౫ సంవత్సరప్రాంతముల మరణముఁ జెందెనని వీరేశలింగము పంతులుగారును సిద్ధాంతములు చేసి యున్నారుగదా! అనఁగా శ్రీనాథునకు ౮౦ సంవత్సరములు వచ్చువఱకును వీరభద్రారెడ్డి బ్రదికి యున్నవాఁడు గావున నంతవఱకెట్టి కష్టము శ్రీనాథునకు సంభవింపలేదనియు నటు పిమ్మట నే యూతఁడిట్టి కష్టములను బొందెననియు, దేటపడుచున్నది. పంతులవారి యభిప్రాయము ననుసరించి యెనుబదియేండ్లు దాటిన ముసలితొక్క ఒకగ్రామమును గుత్తకుఁగొనుటయుఁ వ్యవసాయము చేయుటయు వఱదలు వచ్చి పంటలగొనిపోవుటయు ఏఁడునూర్లటంకంబులు పన్ను చెల్లింప లేకపోవుటయు, ఎండలో నిలువఁబెట్టబడుటయు బొండవేయుటయు, నగరివాకిట నుంచు నల్లగుండు భుజముపైఁ బెట్టుటయు సంభవించెనన్న విశ్వసింపఁ దగునా? కాటికిఁ గాళ్ళుచాచుకొని యొకమూల ప్రాణములను విడుచుచు నాకు రత్నాంబరములు కావలెననియు, కస్తూరి కావలెననియు, హేమపాత్రాన్నము కావలెననియు, దినవెచ్చము కావలెననియు, శ్రీనాథునివంటి వేదాంతియు భక్తాగ్రేసరుఁడును నేడ్చెనన్న విశ్వసింపవచ్చునా? స్త్రీలోలుఁడై వయః

కాలమున విచ్చలవిడిగాఁ దిరిగి కాయమును ధననికాయమును జెడగొట్టుకొని కష్టపడవలసిన వృద్ధదశను దెచ్చుకొన్నాఁడఁట! ఎంతటి సాహసపుం బలుకు? ఇట్టి ఘోరపుం బలుకు పలుకుటకుఁ గారణంబేమి? "వీథినాటకములోనిదానివలె దుర్నయపోషణమునకు గాక దుర్నయశోషణమునకును, నీతిభంజనమునకు గాక దుర్నీతి భంజనమునకును, ఉద్దేశింపఁ బడెనని మా మిత్రులెఱుంగుదురు గాక!" అని వ్రాయుట చేత వీథినాటక మొక కారణముగాఁ దెలుపఁబడుచున్నది. వీరి యభిప్రాయము వీథినాటకమునఁ గ్రీడాభిరామమునిగాదు శ్రీనాథుఁడు వేశ్యాప్రియుఁడని యాతనిని గూర్చి వ్రాసిన వారందఱును నైకకంఠ్యముతోఁ జెప్పుట రెండవకారణమఁట! వీథినాటకమను పేరితో బజారులో నమ్మఁబడు గ్రంథము శ్రీనాథ విరచితము గాదని యాంధ్రకవుల చరిత్రములోని దివఱకే వ్రాసియున్నాను వీరేశలింగముగారే "శ్రీనాథుఁడు వీథినాటకమనఁబడెడి యొక యపాత్రపు గ్రంథమును గూడఁ జేసెనని చెప్పుదురు గాని యిప్పుడు ప్రకటింపఁ బడియున్న యా పేరిటి చిన్న పుస్తక మాతనిచే పుస్తకరూపమున రచియింపఁ బడినదికాదు ... ... దుర్నీతి పోషకమైన యీ యనుచిత పద్యరచనమును శ్రీనాథుని కారోపించుట యాతని కపకీర్తి కలిగించుట .. శ్రీనాథుని వీథినాటకమని ప్రకటింపఁబడిన దానికి వీథిరూపక లక్షణమే పట్టదు ... ... దీనివలన వీథికైశికీ వృత్తియందు రచియింపఁబడి భాణమునందువలె సంధ్యాంగాంకములను గలదయి అధికముగా శృంగార రసమును కొంచెముగా నితరరసములను గలిగి ఉద్ఘాత్యకాద్యంగములతో ప్రస్తావనను గలిగి పాత్రముల నొకటి రెంటిని గలదయి యుండవలెనని యేర్పడుచున్నది ... ... ... ఈ యేర్పడిన లక్షణములేవియు లేవు. ఇందు నాయకుఁడు లేఁడు; ప్రస్తావన లేదు; పాత్రములు లేవు; సంధులు లేవు ఇతివృత్తము లేవు వీథికుండవలసిన యంగములే

వియు లేవు ... ... ఈ యసభ్యత గ్రంథము యొక్క కర్తృత్వము నూరక యారోపించి మఱవాఱు కొందఱు శ్రీనాథుని ముంపఁదలచు కొన్న దుర్యశఃపంకము నుండి యతఁడిని శ్రీనాథకవి కృతము గాదని సిద్ధాంతమై నప్పుడే లేచి బైలఁబడి గట్టెక్కి కృతార్థుఁడు కాఁగలుగును; అని కంఠోక్తిగా వీథినాటకము శ్రీనాథ విరచితము కాదని సిద్ధాంతీకరించియు "తమగ్రంథములలోని శృంగారమును, దుర్వర్తనప్రకటనమునకును, "వీథినాటకములోని (శ్రీనాథుని) దానివలె దుర్నయపోషణమునకును నీతిభంజనమునకును గాక దుర్నయశోషణమునకును దుర్నీతి భంజనమునకును ఉద్దేశింపఁబడె' నని వ్రాసి వీథినాటకము కారణముగాఁ జెప్పుట స్వవచన వ్యాఘాతము కాదా? శ్రీనాథుని జారుఁడనుటకు సాక్ష్యము గలదా? వారు వీడు వ్రాసినారని యదియొక ప్రమాణముగాఁ గైకొనుట శాస్త్రీయధర్మమగునా? "ఇతడు శివభక్తుఁడు యౌవనదశయందు శృంగారనాయకుఁడై స్త్రీలోలుఁడై తిరిగెనని చెప్పుదురు. అదియంత నిజమోకాని వయసు మఱిగిన తరువాత శివభక్తుఁడై యుండెనని యాతడురచించిన గ్రంథములే సహస్రముఖముల ఘోషించుచున్నవి,, అనిపంతులవారు తాము వ్రాసిన వాక్యములలో శ్రీనాథుని యౌవనదశను గూర్చి తమకేమియుఁ దెలియదని యొకమూల ఘోషింపుచు" స్త్రీలోలుఁడై వయఃకాలమున విచ్చలవిడిగా దిరిగి కాయమును ధననికాయమును జెడగొట్టుకొని కష్టపడవలసిన వృద్ధదశను దెచ్చికొన్నపాపి యని సిద్ధాంతీకరించుట శ్రీనాథకవి సార్వభౌముని పట్లఁ జూపుదౌర్జన్యమని వేనోళ్లఁ జాటకుందునా? వీరు క్రీడాభిరామము నయితము శ్రీనాథకవి విరచితము కాదని చెప్పుచున్నారు. శ్రీనాథుని పై మోపఁబడిన దోషము స్త్రీవర్ణనముల చేసినందులకును, విటపురుషుల దుర్వర్తనముల వెల్లడించినందులకును గాఁదట! ఇందెందులకందురా? శ్రీనాథుఁడు వేశ్యాజనవర్ణనము విశేషముగాఁ జేసినం

దునకుఁ, క్రీడాభిరామమును శ్రీనాథ విరచితము కాదని తాము స్థిరీకరించియుండియు, మానవల్లి రామకృష్ణకవిగారు "క్రీడాభిరామపీఠికలో నక్షయ్యాంబుగ' అను పద్యము నుదాహరించి యాసందర్భమున, దీనిచే శ్రీనాథునకు దాక్షారామ వేశ్యలతో సంబంధము గలదని వేఱుగఁ జెప్పనక్కరలేదు. వీథినాటకములోని చిన్నపోతియే శ్రీనాథునకుఁ గూర్పుమగువయో యని సందియము గలుగుచున్నది.' అని వ్రాసినారనిరి. మొదటిది చాటువు వారి యభిప్రాయము ప్రకారము రెండవది శ్రీనాథ విరచితము కాదు. రామకృష్ణకవిగారియూహ వీరికెట్లు పరమప్రమాణమయ్యెనో యూహింప నలవిగాదు; నమ్మిన యెడల నిట్టి పిచ్చికథలు పెక్కులుగలవు; నీసికిఁ దలయూఁ దోకయు నుండవు. శ్రీనాథకవి చేసిన వేశ్యావర్ణనాదులనుబట్టి దురూహాలు చేసి యిదంతయుఁ గల్పనచేసినారు గాని వేఱొండు గాదు. పూర్వకవులు చేసిన వర్ణనలను బట్టి వారియొక్క వర్తనములను నిర్ణయింపరాదు. అందుచేతనే నేనాంధ్రుల చరిత్రములో "ఇట్టి సిద్ధాంతమునే మనము సాహసించి చేయవలసిన పక్షమున లోకములో సిగ్గును విడనాడి ప్రబంధములలోఁ గామోద్రేకముగలిగించు విధమున మిక్కిలి పచ్చిగా స్త్రీవర్ణనములఁ గావించి రసికజన మనోరంజనము గావించెడు కవులను, లోకములోని విటపురుషుల దుర్వర్తనముల హాస్యపరిబంధరూపముగను ప్రహసన రూపమునను వెల్లడించెడు కవులను, కామపరవశులనియు, వారలు శ్రీనాథునికంటె ఘనులు కాఁజాలరనియు మనము సిద్ధాంతము చేసి చెప్పవలసి వచ్చును గదా!" అని నేను వ్రాసి యున్నాను. "గుమ్మడికాయలదొంగయన్న బుజముతడివిచూచుకొన్న వానిపగిది తమ్మును తమ గ్రంథములను బేర్కొన్నవాఁడనని యహంకారమునుబూని నావాక్యములో మొదటనున్న "ఇట్టి సిద్ధాంతమునే మనము సాహసించి చేయవలసిన పక్షమున లోకములో సిగ్గును

విడనాడి ప్రబంధములలో" అన్నంతవరకును, వాక్యములోఁ గడపటనున్న "వారలు శ్రీనాథునికంటె ఘనులు కాఁజాలరనియు మనము సిద్ధాంతము చేసి, అన్నంతవరకును దీసివేసి తక్కినదాని నుదహరించి "ద్వేషబుద్ధితో దురభిమాన పూరితములైన యుక్తిరహితదూషణ భాషణములను వ్రాసి యున్నా"నని నాకు ద్వేషబుద్ధి నారోపించి నన్ను నిందించి తమ గ్రంథములను శ్లాఘించుకొనుచు శ్రీనాథుని నోరికివచ్చినట్లు బడబడఁదిట్టివేసినారు మనము సాహసించి వీరేశలింగముగారు చేసిన సిద్ధాంతమునే చేసినపక్షమున ప్రబంధకవులను, ప్రహసనకవులను సక్లే భావింపవలసి వచ్చుననియు, వారలు శ్రీనాథునికంటె ఘనులు కాఁజాలరని చెప్పవలసివచ్చుననియు, గావున నట్టి సిద్ధాంతము చేయరాదనియు నాయభిప్రాయమును దెలుపుటకట్లు వ్రాసియున్నాను "ప్రబంధములు కవులు" అని బహువచన ప్రయోగము చేసి వ్రాసియున్నను విస్మరించి రసికజన మనోరంజనము గావించెడు కవి తామొక్కరే యనుకొని తమగ్రంథము సర్వకళాశాలవారిచే ప్రథమశాస్త్రపరీక్షకును శాస్త్రోపాధ్యాయ పరీక్షకును పఠనీయగ్రంథముగా నిర్ణయింపఁబడెనని యొకగొప్పగా నెంచుకొనుచున్నారు ఇది వీరికిగొప్పయైనయెడల శ్రీనాథుని కాలములోని మహారాజులు, చక్రవర్తులు, వాని గ్రంథములను బూజించి వానికి గానకాభిషేకము చేసియుండలేదా? వీరి శృంగారము వేఱట! వేశ్యాంగనా వర్ణనమైన నేమి? పతివ్రతాంగనావర్ణనమైన నేమి? హద్దుమీఱి వర్ణింపఁబడిన శృంగారవర్ణనములు కామోద్రేకమును బుట్టించుటకు రెండును సమానములై యున్నవి ఏ కాలమునందును హిందూసంఘమున జారత్వము ప్రతిష్ఠావహమైనదిగను, శ్లాఘ్యమైనదిగను బరిగణింపఁబడి యుండలేదనియు అనర్హములగు స్త్రీ వర్ణనములు శ్రీనాథుని గ్రంథములందున్నవని భావించినయెడల నట్టివర్ణనము లుత్తములని భావింపఁబడు వారి కావ్య

ములలోఁ గూడఁ గలవనియు, ఇంతగా నిక్షేపించెదు వీరేశలింగము గారి గ్రంథములనుండియు నెత్తి నూపించవచ్చుననియు విశదపఱచుకొను చున్నాను.

ఎట్లయినను అవసానకాల మాసన్నమగునప్పటికి మనకవిసార్వభౌముఁ డెనుబది సంవత్సరములు వయస్సుగలవాఁడై యున్నట్టు చెప్పకొనక తప్పదు ౧౪౪౭ వ సంవత్సరమునాటికి రాజమహేంద్రపుర రాజ్యము గజపతుల యధీనమై పోయినది. శ్రీనాథునకాంధ్రప్రభువుల ప్రాపుతొలఁగిపోయినది. తరువాత నొకటిరెండు సంవత్సరములు దాటిన వెనుకనే ౧౪౫౧ సంవత్సరముల ప్రాంతమున డెబ్బదేండ్ల ప్రాయమునాఁడు గత్యంతరములేక బొడ్డుపల్లెను గుత్తకుఁ దీసికొని వఱదలు మొదలగు వానివలన పంటలు నాశనము కాఁగా గుత్తపై కమును గూడ చెల్లింపలేక పరప్రభువులవలన మొదటిపద్యములోఁ జెప్పఁబడినట్టు నానావిధకష్టములు పొందియుండి యీపద్యమును జెప్పి యుండును. దీని దైవికముగా భావింపవలయునే కాని స్త్రీలోలుఁడై వయఃకాలమున విచ్చలవిడిగాఁ దిరిగి కాయమును ధననికాయమును జెడఁగొట్టుకొని వృద్ధదశను దెచ్చుకొన్న పాపఫలమని నిందించి వ్రాయుట యెట్టివానికిని ధర్మమును గాదు; న్యాయమును, నీతియును గాదు.

ఈ పద్యము చెప్పిన వెనుక మఱికొన్ని సంవత్సరము లయినను బ్రదికి యుండవలయును. ఇతఁడు ౧౪౬౦ వఱకు బ్రతికి యుండవలయునని నే నభిప్రాయపడుచున్నాను.

ఇట్లు నలుబది సంవత్సరముల కాల మఖండ వైభవ మనుభవించి కాలకర్మకోపమువలన దారిద్ర్యము పాలయి యెనుబదేండ్ల ప్రాయమునఁ బ్రాణములు విడుచుచు శ్రీనాథుఁడు కవిసార్వభౌముఁడు గావునఁ దన తొల్లింటి వైభవమును నప్పటి కష్టస్థితిని జూచి

పుమ నాత్మగౌరవముతోఁ గూడుకొన్న గాంభీర్య భావమును వెల్లడించుచుఁ గవితాచాతుర్యము గలిమిచూపుచు 'దివిజ కవివరు గుండియల్ దిగ్గురనఁగ' నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి" అని చెప్పిన పద్యమై యుండవలయునే గాని యెనుబదేండ్లు నిండియు నైషయిక వాంఛలు విడువఁజాలక వానికై యంగలార్చుచుఁ జచ్చుచున్నవాఁడు భావిప్రపంచమున మహావిమర్శకులు దమ్ము నోటికి వచ్చినట్లుగాఁ దిట్టుటకై చెప్పిన పద్యము గాదని కవితావాసన యించుక యేని గలవారికి బోడగట్టక మానదు

---

## నవమాధ్యాయము.

### శ్రీనాథుని పరివర్తనము

మా మిత్రులగు శ్రీయుత వేటూరి ప్రభాకరశాస్త్రి గారు తమ శృంగార శ్రీనాథమను గ్రంథమున శ్రీవీరేశలింగము పంతులు గారి సందర్భమున శ్రీనాథుని గొంతె యవగణించిరి. అతఁడు వార్ధకమున దారిద్ర మనుభవించుట పాపఫలమని కర్మవిపాకము చెప్పిరి. అట్లు చెప్పుట వారికే చెల్లినది." అని వ్రాసి వారి యభిప్రాయము వాము గర్హించినట్లు తోఁపఁ జేసిరి. ఎద్దానిఁబురస్కరించుకొని వీరేశలింగము పంతులవారట్లు వ్రాయసాహసించిరో యద్దానినే మా శాస్త్రులవారును బలపఱచుచున్నారు. వీరి ప్రాంతవైఖరిని చూడుఁడు

„శ్రీనాథునికి వైవయిక వాంఛలత్యున్నతములు, భోగపరాయ ణత మెండు. ప్రౌఢనిర్భర వయఃపరిపాక కాల మగుటచే నాతఁడ ప్పుడు శృంగారసముద్రమునఁ దెప్పఁదేలుచున్నాఁడు దానికారా వ్యసోరామల యొడళ్ళపయి బుగబుగ లొల్పుటకని తెలుఁగు రాయని గస్తూరి కోరినాడు. శృ. శ్రీ. పు ౧౫౫

„శ్రీనాథుఁడు సాంసారిక సాభాగ్యము నంతగా ననుభవించిన వాఁడు గాఁడఁట. కాని సంసారము మెండుగాఁ గలవాఁడట.

(శృం శ్రీ. పు. ౨౯౩)

„శ్రీనాథుఁడు మహాభోగపరాయణుఁడఁట! స్వర్ణపాత్ర భోజ నములు. దీనారటంకాల తీర్థయాత్రలు, జాంబూనదాభరణధార ణములు, కస్తూరికా గంధాంగరాగానులేపములు, ఉద్యానవిహా రములు, శ్రీనాథు డపేక్షించెనఁట! (శృం శ్రీ. పు. ౨౯౯.)

„తదుపలబ్ధికై గ్రంథముల రచించెనఁట! అనుదినము మాంచి సుందరిని గూర్చియో అనుభవించిన యానందమును గూర్చియో కవనము కట్టుచుండెడివాఁడఁట! (శృం. శ్రీ పు. ౨౯౯)

„అతఁడు సౌందర్యాభిమాని యఁట! చిన్నారి పొన్నారి చిఱు తకూకటినాడు, నూనూగుమీసాలనూత్న యౌవనము ప్రౌఢనిర్భర వయఃపరిపాకము నను పదము లీ విషయమును దెలుపుచున్నవఁట!

(శృం. శ్రీ. పు. ౩౦౦)

„మఱియు నాతఁడు శృంగారశేఖరుఁడఁట! భీమఖండ కాశీఖండ గ్రంథభాగములు, వీథినాటకము, శివరాత్రిమాహాత్మ్యము చాటు ధారలు, ఐతిహ్యములు, ఇతరకవిస్తుతులు, నీవిషయమును రాద్ధాంత పఱచుచున్నవఁట! ఈ విషయము నిరూపించుటకై కొంత గ్రంథము వ్రాయ మనసొల్లకున్నదఁట! కొందఱు శ్రీనాథుని శృంగారియని యను ట కొప్పుకొనకున్నారట! అట్టివారు శ్రీనాథుని గ్రంథములు జదువని

వారో, చదివినను కవితాతత్వము నెఱుంగనివారో, యెఱిగినను గప్పి పెట్టఁదలఁచువారో, కావలెనఁట! తామిక్కడ శ్రీనాథుని దిట్టుట లేదఁట! కవితావర్ణనమునఁ గన్పట్టుచున్న యీ విషయములు గప్పి పెట్టిన మాసిపోవఁట, శ్రీనాథుని చాటుధార లనేకము లుదాహరింపఁ జాలకున్నారఁట! వానిలోఁ గొన్నింటిని బ్రాచీనులు లక్షణగ్రంథములలో నుదాహరించినారఁట! అట్టివాని నెల్ల తా ముదహరింపకున్నను జూచినట్లు సూచించి స్థైర్య విడువవలె నఁట.

(శృం శ్రీ పు ౩౦౦)

“శ్రీనాథుని శృంగారప్రవర్తన మతఁడు పేరిట నొక పెద్దప్రకారణము రచించియు నది పదుగురును జదువఁదగినది కాదను కారణమున దూరీకరించిరఁట! ఇంతఁదాఁక లోకమున జీవించియున్న శ్రీనాథుని చాటుధారలిప్పుడు మనమచ్చున దీర్పకున్నంత మాత్రానఁ జచ్చిపోవునవి కావఁట; *వైషయికవర్తనమున సగ్రకోటి నధిష్ఠించియు గ్రుంగ్గ తిలఁబడక చిరజీవితము సాగించుకొన్నవాఁడఁట! మేలయిన యాహార విహారములు గలవాఁడఁట! మఱియు విశాలోన్నతకాయుఁడఁట!

[శృం. శ్రీ. పు. ౩౦౧]

ఆహా! శృంగారాభిమానులగు. ప్రభాకరశాస్త్రిగారి పోకడ లెట్లున్నవో పరిశీలించితిరి గదా!

“శ్రీనాథుఁడు శృంగారప్రియుఁడై తన కావ్యమునకు శృంగార నైషధ’మని పేరిడినందున నాతని యభిరుచిత మనకుట్టచే తమ గ్రంథమునకు తామును ‘శృంగార శ్రీనాథ’ మని పేరిడినారఁట గాని “శృంగారము గ్రంథము పేరనే గాని గ్రంథములో నెక్కడను గానరాదఁట! ఈ పేరు నేతిబీరవంటిదే’ యని తమకు దామే తను ‘శృంగార శ్రీనాథము’ నందలి తొలిపలుకు నందే తొలకరింపఁ జేసినందుల కెంతయు సంతోషింప వలసినదే.

పలువురు చదువరానివియు, వినరానివియునై చితికిపోయిన ప్రాచీనతాటాకులలోన బూజుపట్టి మాలిన్యగ్రస్తములై దిక్కుమక్కు లేక యణఁగిమణఁగి పడియున్న శృంగారధారలనెల్ల బహుప్రయాసముతో సేకరించి పరిశోధించి శ్రీనాథుని తలకుఁ బారిమి 'శృంగార ప్రవర్తనము' గూర్చి వ్రాసిన ప్రకరణమును గూడ మూలనుంచక యందుఁ జేర్చి ముద్రించుటకు సాహసించి యున్నయెడ వీరి 'శృంగార శ్రీనాథము' నేతిబీర వంటిది గాక సార్థకనామము వహించిన దగును గదా! ఎంత వెఱ్ఱిపని చేసిరి! శ్రీనాథుని శృంగార ప్రవర్తనము నిరూపించుటకయి కొంత గ్రంథము వివరించి వ్రాయ మనసొల్లకున్న దని వ్రాయుచు నా దిగువనే యందుకొఱకు నొకపెద్ద ప్రకరణమును రచించియు నది పదుగురును జదువఁదగినది కాదను కారణమున దూరీకరించితి మనిరి. వ్రాయ మనసొల్లని దానిని తిరిగి వ్రాయుటకు మనసెట్లొల్ల గలిగిందో మనసొల్లఁ గలిగి వ్రాసిన దానిని ముద్రించుటకు మరల మనసెట్లొల్ల నీయక దూరీకరింపజేసినదో శృంగారరసానందమున నోలలాడునట్టి ప్రవృత్తచిత్తము గల 'శృంగార శ్రీనాథ" కర్తలకే తెలియవలయుఁ గాని నావంటి యరసికున కెంత మాత్రము బోధపడఁజాలకున్నది

శ్రీనాథుని శృంగారి యన్నను, శృంగారప్రియుఁడన్నను, శృంగార శేఖరుఁడన్నను, నాకు చింతలేదు వానితో వివాదమును లేదు. శ్రీనాథుని భోగపరాయణుఁడన్నను మహాభోగపరాయణుఁడన్నను నేనంతగా విచారపడువాఁడను గాను.

శ్రీనాథుఁడు దాక్షారామాప్సరోరామల యొడల్లవయి కస్తూరితో బుగబుగ లొల్చువాఁడని యొకవంకను వైషయిక వర్తనమున నగ్రకోటి నధిష్ఠించియు మ్రొగ్గఁతిలఁబడక చిరజీవితము సాగించుకొన్నవాఁడని వేఱొకవంకను జాటుచుఁ బయ్యి విశేషణములఁ

చోడిగి తా నత్యంతాభిమానముతోఁ బ్రేమించెడి కవిసార్వభౌముని గేలిసేయుట యెంతయు సంతాపకరమగు సంగతిగదా?

ఈ భావమును పోషించుటకొఱకే శాస్త్రిగారు శ్రీనాథుఁడు సంసారభారము మెండుగా నున్నను సాంసారిక సౌభాగ్యము నంతగా ననుభవించిన వాఁడు కాఁ డట్టూహించి చెప్పసాహసించిరి. ఈ భావమును పోషించుటకొఱకే యాతని మేలైన యాహారవిహారములను, ఉద్యానవిహారములను, కస్తూరికా సుగంధాంగరాగానులేపనములను, స్వర్ణపాత్రభోజనములను, విశాలాలోన్నత కాయమును, భోజనప్రియత్వమును బ్రశంసింపవలసిన వారయిరి.

ఇట్టి దుర్భావకల్పనము చేయుటకు దృఢతరమైన ఋజుభారమును వహింపవలసి యుండును. చాటువుఁ జీకటింగో నేమో యున్నవాని పట్టి ప్రగల్భవాక్యములఁ బచరించుటయే గాని వీరి శృంగార శ్రీనాథమునఁ జూపఁగలిగిన దొక్క చాటుపద్యముదక్క మఱియొండు గానరాదు. అయ్యది శ్రీనాథునిదని చెప్పుటకు సాధ్యము కాదని సరిగా విమర్శించిచూచిన పక్షమున నాయంశము తేటపడఁగలదు. పంచమాధ్యాయమున నాపద్యము నుదాహరించి కొంత చర్చ సలిపి యున్నాను గాని యా పద్యము శ్రీనాథుని దగునో కాదో యంతగాఁ జర్చింపలేదు. దానిని సవిస్తరముగా నిచట చర్చింతును.

శాస్త్రిగారి ప్రమాణచాటువు.

వీరి శృంగార శ్రీనాథమునందా చాటు విట్లున్నది.

శా. అక్షయ్యంబగు సాంప (సంబు) రాయని తెలుంగాధీశ! కస్తూరికా
భిక్షాదానము సేయరా! సుకవిరాడ్బృందారక శ్రేణికిన్ (స్వామికిన్)
దాక్షారామ చళుక్య భీమవర గంధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయ కుంభికుంభములపై వాసించుఁ దద్వాసనల్.

కాని యాంధ్రలోకమున విశేషవ్యాప్తినిగాంచిన పాఠమిట్లున్నది.

"అక్షయ్యంబగు సాంపరాయని తెలుంగాధీశ! కస్తూరికా
భిక్షాదానము చేయురా సుకవిరాడ్బృందారక శ్రేణికిన్
దాక్షారామ పురీవిహార వరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయ కుంభికుంభములపై వాసించుఁదద్వాసల్"

ఈ పాఠమునకు భిన్నముగా శాస్త్రిగా రుదాహరించిన పాఠములో 'శ్రేణికిన్' అను పద్యమునకుఁ బ్రక్కను [స్వామికిన్] అను పదము కుండలీకరణమున నుంచఁబడినది. 'పురీవిహారవర' యనుదానికి బదులుగా 'చళుక్యభీమవర' యని చేర్పఁబడి యున్నది.

ఇత్యాది శ్రీనాథుని దనుటకేమి నిదర్శనమని యడుగుదుమేని ప్రభాకరశాస్త్రిగారిట్టి పద్యమొకటి 'క్ష' ప్రాసముతో కాశీఖండమున నున్నదని మాత్రము చెప్పవత్తురు. ఆపద్యమునుగూడ నేనిదివఱకే పంచమాధ్యాయమున నుదహరించి యున్నాను. ఆపద్యము కాశీఖండములో నిట్లున్నది.

శా. ఈక్షోణిన్ నినుఁబోలు సత్కవులు లేరీ నేఁటి కాలంబునన్
దాక్షారామ చళుక్యభీమవరగంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయ గంధసారఘుసృణద్వైరాజ్యభారంబున
ధ్యక్షించున్ గవిసార్వభౌమ భవదీయప్రౌఢసాహిత్యముల్

రెండును శార్దూలవృత్తములు; రెంటియందును 'క్ష' ప్రాసముండుట, మఱియును విశేషించి 'దాక్షారామ చళుక్యభీమవర గంధర్వాప్సరోభామినీ వక్షోజద్వయ" అను నంతవఱకు రెంటియందు నుండుట. ఈ కారణములచేత చాటుపద్యముగూడ శ్రీనాథునిదని శాస్త్రిగారి విశ్వాసము.

స్థూలవిమర్శదృష్టితోఁ జూచినప్పు డీరెండుపద్యములను రచించినవాఁడు శ్రీనాథుఁడే యని యనుమానించుట కవకాశము గలదుగాని సూక్ష్మవిమర్శదృష్టితోఁ జూచినప్పుడుమాత్రము పై చాటు

పద్యము శ్రీనాథకవి సార్వభౌమ విరచితమని తోపఁజేయదు. ఎందుకన ఈపద్యము వీరభద్రారెడ్డి త్రైలోక్యవిజయాభిధానంబైన సౌధములోఁ జంద్రశాలాప్రదేశమునందుఁ సచివసైన్యాధీశసామంతనృపవారసీమంతినీజన శ్రేణిగొలువ, శాస్త్రమీమాంసయు, సాహిత్యగోష్ఠియు విద్వాంసులు విస్తరింపుచుండఁ కర్పూరకస్తూరికా సంకుమదగంధ సారసౌరభము ఉద్భూరితమగుచు నుండ, నిజభుజావిక్రమంబున నఖిలదిశలు గెలిచి తన్ను రాజ్యపీఠమెక్కించినట్టి యన్నవేమేశ్వరుని యంకమాశ్రయించి, విమల ధర్మశీలుండగు వీరభద్రనృపాలుండు గన్నులపండువగానిండు గొలువుండువేళ నల్లాడ వేమవిభుఁడు తన్నురప్పించి పలికినట్లుగాఁ గాశీఖండమున శ్రీనాథకవి విరచితమై గ్రంథస్థమైయున్న యీపద్యమును తమ శృంగార శ్రీనాథమను గ్రంథమున నుదాహరించి దీనిభావమును వెల్లడింపకయె 'తు' ప్రాసముతోఁ గాశీఖండమున నిట్టిపద్యమొకటియున్నదని మాత్రము చెప్పి వివరించి వ్యాఖ్యానము సలుపక చల్లగ జారవిడిచి శ్రీనాథుని దగునో కాదో సంశయాస్పదమై యనర్థదాయకమైన యా చాటుపద్యమును మాత్ర ముదహరించి యేమేమో పలికి కవిసార్వభౌముని నపహసించిరి. ఈ కాశీఖండములోని పద్యముయొక్క భావమేమని యెందఱెందఱ పండితులనో సాహితీగోష్ఠి గలవారి నడిగితిఁగాని యెవ్వరును దృష్టికరముగాఁ జెప్పఁజాలక పోయిరి. కొందఱు ద్వైరాజ్యభారంబనుటకు బదులుగా ద్వైరాజ్యభావంబనవలయుననియు, ద్వైరాజ్యభావంబనఁగా వైరభావంబనియు 'అధ్యక్షించున్' అనుగావహించుననియు నర్థము చెప్పిరి. ద్వైరాజ్యమనఁగా వైరమనునర్థమే నిఘంటువునఁగలదో చెప్పఁజాలరైరి. మఱికొందఱు రెండురాజ్యముల యొక్క బరువును బరిపాలించునని యర్థము చెప్పుచున్నారు.

ఓ విచక్రవర్తీ! ఈ నేటికాలమునందీ భూమిలో నీవంటిసత్కవులు లేరు. నీ సంబంధమయిన ప్రౌఢసాహిత్యములు (గడితేటినట్టియు,

అనేకవిషయవిజ్ఞానములుగలట్టియు, (పాండిత్యములు) దాక్షారామ చళుక్యభీమవరములలో నివసింపుచు పాటలయందును, ఆటలయందును నేర్పుగలిగి యున్న వేశ్యాస్త్రీలయొక్క చనుఁగవలయందలి మంచి గంధము, కుంకుమపువ్వు రెండురాజ్యములయొక్క బరువును బరిపాలించు,, ననిశబ్దార్థము స్ఫురించుచున్నది గాని భావము విస్పష్టముగ స్ఫురింపనందున నీకాలమునందలి సాహితీపండితులయిన పండితుల కపభ్రమలు కలుగుటకుఁ గారణమగుచున్నది. ఈపద్యముయొక్క భావమును దెలిసికొనవలెనన్న నాకాలమునాటి దర్బారుల తీరులెట్టివో ఆచారములలోను, నడవళ్లలోను నేవిధమాన్యములో, ఏవిధమాన్యములు గావో, కవిసాంప్రదాయములెట్టివో, కవుల పోకడలెట్టివో, దేవదాసీ ప్రతిష్ఠాపన మెట్టిదో వీనినెల్లనవగాహనముఁ జేసికొన్నమీఁదట సాధ్యపడునుగాని స్థూలదృష్టితోఁజూచు నీకాలపువారికంతగా బోధపడదు. కవి హృదయమును గ్రహింపకఁగాని వ్యాఖ్య లపహాస్య భాజనము లగును.

ఎట్లు రాజసభలయందు వేశ్యాస్త్రీలయొక్క వక్షోజద్వయములందలి గంధ సారఘు స్రాణముల యొక్క సౌరభములు సభాంతరాళమున నల్లకలఁబర్వి సభ్యుల నానందపరవశుల గావించునో యట్లే వాని నతిశయించి కవిసార్వభౌముని ప్రౌఢసాహిత్యములు గూడ సభ్యుల నానందపరవశులఁ జేయునని భావమెగాని యంతకన్న విపరీతభావమేమియు లేదు. ఇట్లు ప్రౌఢముగా ప్రభువులసభలలో వక్కాణించుట యాకాలమున గౌరవలోపముగా భావింపఁబడకుండుట చేతనే శ్రీనాథ కవిసార్వభౌముఁడు తన్నుఁగూర్చి పలికినట్లు ప్రభువు నోటఁ బలికించినాఁడు.

కాశీఖండములోని పద్యమును గాంచి యసభ్యముల పాలయి యౌచిత్యమెఱుంగని కవియెవ్వడో యొక యనామకుండు శ్రీనాథకవి

సార్వభౌముని గేలిచేయుట కొఱకో లేక యపయశస్సు గల్పించుట కొఱకో పై చాటుపద్యమును గల్పించి యుందురు. శ్రీనాథ విరచితము కాదనియే నా నిశ్చితాభిప్రాయము. అడిగిన సమయము, అడిగిన రీతి అడిగిన యెత్తుగడ తృణీకారముఁ జూపుట, పోకిరితనము వెల్వరించుట ఔచిత్య మెఱింగి మాట్లాడక పోవుట, వీని నన్నిటిని బర్యాలోచించి చూడ నాపద్యము శ్రీనాథ విరచితము గాదని స్పష్టపడ గలదు. పాఠ భేదముఁగూడఁ గలదు ప్రాచీనపాఠమై యాంధ్రదేశములో వ్యాప్తమై యున్న 'సుకవిరాడ్బృందారక శ్రేణికిన్' అనునదియే నిజమైన పాఠమైన యెడల సుకవిశ్రేష్ఠులను దేవతాసమూహమునకు దానము చేయుమని యడిగి నట్లున్నదే గాని శ్రీనాథుని నామము స్ఫురింపఁ జేసెడి పదజాల మేమియును గానరాదు కనుకనే శృంగార శ్రీనాథమున 'శ్రేణికిన్' అని యున్న నర్థము సరిపడదని 'కాఁబోలు స్వామికిన్' అని చేర్పబడినది. అప్పుడు 'సుకవిరాజులను బృందారకులకు, బలిభువని యర్థమగును గావున నయ్యది శ్రీనాథకవి సార్వభౌముని స్ఫురింపఁ జేయునని తలఁచి యట్లు చేసియుండ బోలు అప్పుడు సుకవి రాడ్బృందారస్వామి శ్రీనాథభట్టనియె యేల తలఁపవలయును? వామన భట్టు కాఁగూడదా? డిండిమభట్టు కాఁగూడదా! విశ్వేశ్వర భట్టు కాఁగూడదా? వీరెల్లరుఁ గవిసార్వభౌములే గదా! అని యాదుమేని కాశీఖండములోని పద్యములో "దాక్షారామ చళుక్య భీమవర గంధర్వాప్సరో భామినీ వక్షోజద్వయ" అన్నంతవఱకుఁ బాదమంతయు నిందున్నది కావున నియ్యది శ్రీనాథునిదే యని చెప్పవత్తును. అట్లయిన సుకవిరాడ్బృందారకస్వామి నని తన్నుత్కర్షించుకొనుచు దానకర్తయైన యొకమహాప్రభువును 'భిక్షాదానముఁ జేయుమా' యని యేకవచన ప్రయోగముతో నీచముగా సంబోధించునా? అదియును దానమడుగుచున్నప్పుడా! అడిగెనుబో యౌచిత్యమెఱుఁగకుండఁ

గోకిరితన మస్పృహ వక్షోజసంభిసుంభములపైఁ బ్రాముటకని చెప్పెరా! పోకిరితనమున గడితేఱిన దుండగీడు సమితమున నట్లను కుటను వెఱ్ఱిమనే ఇంతకును శ్రీనాథునకు తెలుఁగురాయని యాశ్రియమెప్పు డేర్పడినది యనునది సిద్ధాంతమైనదా, ప్రభాకరశాస్త్రి గారు భీమఖండరచనము తరువాత దాక్షారామ రామానసమా యోగము కల్గిన యూనవయి క్రీ.శ. ౧౪౩౫-౧౪౪౦ ప్రాంతమున తెలుంగురాయని యాశ్రయమేర్పడినదని వ్రాయుచున్నారు. ఆ కాలమున రాజమహేంద్రిపురాధీశ్వరులగు నల్లాడ వేమారెడ్డి వీరభద్రారెడ్ల యాశ్రయమున నున్నవాఁడు కాని తెలుంగురాయని యాశ్రయమున లేడని స్పష్టముగాఁ జెప్పవచ్చును. భీమఖండ రచనము తరువాతనే దాక్షారామరామానసమా యోగము శ్రీనాథునకు లభించినట్లుగా వ్రాయుచున్నారు. కనుక రాజమహేంద్రపురమున రెడ్లరాజ్యము నశించిన వెనుకనే తెలుంగురాయని యాశ్రయమేర్పడి యుండవలయును. ప్రభాకరశాస్త్రిగారి సిద్ధాంతము ప్రకారము ౧౪౪౦ సంవత్సరము నాటికి శ్రీనాథునకు నేబదియైదు సంవత్సరముల వయస్సుండును నా యభిప్రాయము ప్రకార మఱువది సంవత్సరముల వయస్సుండును. అఱువది యేండ్ల వయస్సు వార్ధకము గాని ప్రౌఢనిర్భర వయఃపరిపాక కాలము గాదని శాస్త్రిగారు స్పష్టముగా వక్కాణించినారు. చిన్నారి పొన్నారి చిఱుతకూటివాఁడు కాదే నూనూఁగు మీసాల నూత్నయౌవనము గాదే. ప్రాయమింతకుఁ గై వ్రాలకుండునని చెప్పుకొన్న కాలముగాదే! వార్ధకము పైఁబడి గడచుచున్న కాలమే! అష్టకష్టములఁ బడుచున్న కాలమే! ఇట్టి కాలమున నా దాక్షారామా చళుక్య భీమవరగంధ రాప్సరో భామినీవక్షోజద్వయకుంభిసంభములపై శ్రీనాథకవి సార్వభౌముఁడు తద్వాసనల వాసింపఁజేయుటకై తెలుంగురాయని యాశ్రయించి కస్తూరికా భిక్షాదానము చేయుఁడా

యని యడుగుట? ఇంకొకచిత్రము చూడుడు. ఈ తెలుంగురాయని చాటుపద్యమును నిలువఁబెట్టుటకై యెన్నో తికమకలు పడినట్టు గన్పట్టుచున్నది తెలుంగురాయనికొడుకు తిరుమలరాయలు క్రీ.శ ౧౪౪౪ సంవత్సరములలో నూతులపాడున నెలకొల్పిన శాసనమును జతుర్థప్రకరణమునఁ బేర్కొనుచు నాతఁడు క్రీ.శ. ౧౪౭౦ లో జన్మించెననియు, అతఁడు పుట్టిన వెనుకనే తెలుంగురాయఁడు మరణించెననియు, అతని మరణకాలమునకును శ్రీనాథుని మరణకాలమునకు నడుమ నాలుగైదేండ్లకంటె నెక్కువ వ్యత్యాసముండఁ గాలదనియు మొదటిప్రకరణములో వక్కాణించుచున్నారు ఎంత యాభాససిద్ధాంతము? తెలుంగురాయని యాశ్రయమంతకాలము శ్రీనాథునకున్న యెడల బొడ్డుపల్లెను గొడ్డేటి మోపపోయి యొడ్డెప్రభువులచే నేల డగంట్లు పొందవలసి వచ్చెనా? ఇది యంతయు నేలవిడిచి చేయుసాముగనె నున్నది.

శ్రీనాథునకు తెలుఁగురాయని యాశ్రయమే కాలమున లభించి యుండవలయునో తముకు దామైనను స్థిరపఱచుకొని యుండలేదు. భీమఖండకృతిభర్తయగు నన్నమంత్రి దక్షవాటికయందుఁ దరుణేందుమౌళికి మొగలివాకిట ధామమును రచించి క్రీ.శ ౧౪౩౦ లో శాసనము వ్రాయించినధర్మకార్యము భీమఖండమునఁ బ్రశంసింపఁబడియుండుటచేత భీమఖండరచనము క్రీ.శ. ౧౪౩౦ కిఁ దరువాతనే జరిగెనను విషయము నిశ్చలమైన సిద్ధాంతమనియు, భీమఖండరచనమునకు దరువాతనే శ్రీనాథునకు దాక్షారామ రామానమాయోగము కల్గినదని చెప్పెడు శాస్త్రిగారంతకుఁ బూర్వమే తెలుఁగురాయని యాశ్రయము మనకవివరేణ్యునకు లభించినదనియు నప్పుడే పై కస్తూరికాబిళ్ళ దానము చేయుమురా, యను చాటుపద్యము చెప్పియుండునని తలంచుటకున్నైనను సాధ్యపడదుగదా! సింహాచల శాసనములో కన్న

డదేశమండలి సంబురాయనికొడుకు తెలుంగురాయడు' అని చెప్పకొని యుండుటచేత నప్పటికిఁ ఖ్యాతుఁడుగాక తండ్రిచాటువాఁడని యు నిరువదేండ్లకు లోపడిన వయస్సు వాఁడయినట్లు తలంపవలయునని దృఢముగా విశ్వసించెదు ప్రభాకరశాస్త్రిగారు—

"శా. ధాటీ ఘోట ఘురట్ట ఘట్టన మిళ ద్ధాత్రీక్షిప్త కళ్యాణ ఘం
టాటంకార విలుంఠలుంఠిత మహోన్మత్తాహితక్షోణీ భృ
త్కోటీరాంకిత కుంభినీ ధరసమూత్కూటాటవీ ఝాట! క
ర్ణాటాంధ్రాధిప! సాంప [సంబు] రాయని తెలుంగా! నీకు బ్రహ్మ
[దీర్ఘా] యువౌ.

అను పద్యమును జెప్పి శ్రీనాథుఁడు తెలుంగురాయని దీవించిన వాఁడని యెట్లు చెప్ప సాహసింతురు? అదియును గాక అశ్వారూఢుఁడయి యుద్ధోన్ముఖుడై యున్నవాని నట్లు దీవించిన తరువాత 'కస్తూరికా భిక్షాదానంబు సేయుమా; 'దాక్షారామ చళుక్య భీమవర గంధర్వాప్సరో భామినీ వక్షోజద్వయ కుంభి కుంభములపై వాసించు తద్వాసనల్'' అని ప్రశంసించు గాని? అహాహా! ఎటువంటి సమయము దొరకినది. ఇట్టి శాస్త్రిగారి విశ్వాసమును వివేకులెట్లు విశ్వసింపగలరు? రాచవేముని యనంతరము ప్రౌఢదేవరాయని పక్షమున నుండి కొండవీటి సామ్రాజ్యమును జయించి పాలించిన వారిలో నీ తెలుంగురాయని మొదట పేర్కొన వలసి యుండును. అందుచేతనే యీతని 'కర్ణాటాంధ్రాధిప' యని కవి సంబోధించుచున్నాఁడని తలంపవలయును. కనుక తెలుంగురాయని యాశ్రయము లభించినమాట వాస్తవమే యగునేని నయ్యది క్రీ. శ. ౧౪౨౨-౧౪౨౬ సంవత్సరముల నడిమికాల మయి యుండును. అప్పటికి శ్రీనాథుఁడు రాజమహేంద్రపురమునకు వచ్చియుండలేదు ప్రభాకరశాస్త్రిగారు తలంచినట్లు శ్రీనాథునకు దాక్షారామ రామానమాయోగము కల్గినదని తలంచుటకును సాధ్యముగాదు. కావున నీ రెండవ చాటుపద్యము శ్రీనాథుడు

చెప్పినదేయని విశ్వసించుట సాధ్యముగాదు. పయినుడివిన హేతువులచేత ' (అక్షయ్యంబుగ) అను చాటు పద్యము శ్రీనాథ విరచితము గాదని నేను దృఢముగా నమ్ముచున్నాను.

వీథినాటకము

ఇదియు సూర్పి ప్రభాకర శాస్త్రిగారిట్లు వ్రాయుచున్నారు:

"శ్రీనాథకృతములును దదితరకృతములును నగు చాటుపద్యములను గొన్నిఁటిని జేర్చి యచ్చు వచ్చిన తరువాతఁ గొందఱు శ్రీనాథుని 'వీధినాటక' మను పేర నొక గ్రంథమును ముద్రించుచున్నారు. ఆ పేరుతో నా పద్యసముదాయము ప్రాఁత వ్రాఁత ప్రతులలో గానరాదు. అట్టి పద్యములఁ గొన్నింటిని జాటుపద్య మణిమంజరిలో నేను సంధానించినాఁడను శ్రీనాథుని వీథినాటక మందలి పద్యములు కొన్ని పయి పద్యసముదాయమునఁ జేరిన వనవచ్చును. కాని యీ పద్యసముదాయమే శ్రీనాథుని వీథినాటకమనుట సరిగాదని నేను దలంచుచున్నాఁడను."

ఇట్టి ప్రభాకరశాస్త్రిగారి యభిప్రాయముతో నేనుగూడ నేకీభవించుచున్నాను గాని యిందేవి శ్రీనాథునివో యేవి కావో నిర్ధారణ సేయకుండ శ్రీనాథుని శృంగార ప్రవర్తన మిట్టిదని ప్రభాకరశాస్త్రి గారి వలె నా కవిసార్వభౌముని దూషించుట తగదని మాత్రము నేను చెప్పవత్తును.

క్రీడాభిరామమే నిజమైన వీథినాటకమనియు, అది శ్రీనాథ విరచితమే గాని వల్లభామాత్య విరచితము గాదని శాస్త్రిగారి దృఢతరమైన యభిప్రాయము. ఇందున సూర్పియు మూఁడు వంతులు శాస్త్రి గారితో నేనకీభవింతును గాని యిది యాధారముగాఁ దీసికొని శ్రీనాథునికి దుష్ప్రవర్తన మారోపించుటకు మాత్రము నామనసొల్లకున్నది.

ఈ గ్రంథమునకుఁ బ్రతాపరుద్రుని కాలమున నున్న రావిపాటి త్రిపురాంతకుఁడను తిప్పరాజుచే సంస్కృతమున రచియింపఁబడిన 'ప్రేమాభిరామ' మను గ్రంథము మూలమై యున్నది దాని భాషాంతరీకరణ మిది యని యింతకుఁ జెప్పఁబడినది. ఆమూల గ్రంథము నేఁడు గానరాదు, ఇయ్యది ప్రదర్శనాను కూలమగు నాటకముగా భాషాంతరీకరింపఁ బడక యేకాశ్వాసప్రబంధముగాఁ దెలిగింపఁబడినది కావుననే యే వర్ణనము లధికముగ నున్నవో, ఏయే వర్ణనములు భిన్నములుగ నున్నవో దెలిసికొనుట కవకాశము లేదు. వీథి యనునది దశరూపములలో నొకటియైన చిన్న నాటకము. ఒకరు గాని యిద్దరు గాని విలాసపురుషులగు నాయకులు శృంగార విహారాసక్తులై యేదేని నొక నగరమునందును దత్పరిసర ప్రాంతప్రదేశము లందును సంచరింపుచు నందందుఁ గన్పట్టు మండెడి యాటపాటలను, ఉత్సవాది వినోదములను, కేళీవిశేషములను వీక్షించి సంతోషసాగరమునఁ దేలుచు శృంగారభోగపరాయణులై వేశ్యవాటికాపరిభ్రమణమున కామాసక్తచిత్తులై యారాత్రిఁ గడపి మరునాడు తమదారిని పోవుచుందురు, ఇట్టి నాటికలను 'వీథి' యని మన పండితులు పేర్వెట్టిరి. ఇట్టివి సంస్కృతమునఁ జెప్కలు రచింపఁబడినవి. వానివలెనె రావిపాటి తిప్పరాజు 'ప్రేమాభిరామము'ను రచియించెను అయ్యది క్రీడాభిరామమను పేరితో దెలిగింపఁబడి వల్లభామాత్య విరచితమైనట్టుగ వెలసియున్నది. ఎంతకొట్టు మిట్టాడినను దీనికిని శ్రీనాథునకును గల సంబంధమును దొలగించుటకు సాధ్యము కాదు. తమ కాలమునందు వీరేశలింగము పంతులు గారు వేశ్యాభుజంగులగు విద్యార్థులను గూర్చి తమ ప్రహసనములలో తీవ్రముగఁ బరిహసించిన రీతినే యేనూఱు సంవత్సరముల క్రిందట వల్లభామాత్యుఁడు గానిండు శ్రీనాథుఁడు గానిండు, ఎవరైన నేమి శిష్టాచారసంపత్తిలో నగ్రస్థాన

మలంకరించిన విద్యార్థియగు గోవింద మంచన శర్మను వాని సఖుడగు టిట్టిభ సెట్టిని నెత్తికొని భావగర్భితము నభివర్ణించి యెక్కువగా నపహసించి యుండుట నిజము. ఇందలి శృంగారరసము నీచమైనది. అశ్లీలమైనది. నీతిబాహ్యమైనది స్త్రీలును, బాలురును జదువఁ దగిన గ్రంథము గాదు. కాని యీ గ్రంథ మాకాలము నాఁటి సాంఘిక చరిత్రమునకుఁ గొంతవఱకు విలువయైన వస్తువును దానము నొసంగుచున్నది. ఈ గ్రంథమును జదువు నప్పుడప్పటి సంఘస్థితి యెట్లుండెనో దాని స్వరూపము మన కన్నులకు గోచరించు నట్లు కావ్యరూపమున నందభివర్ణింపఁబడినది.

అందలి కథాసారము.

ఒకనాఁడు కాసల్నాటి గోవిందమంచనశర్మ యను శ్రోత్రియ బ్రాహ్మణుఁడును, వానిచెలికాఁడగు టిట్టిభ సెట్టి యను కోమటియు, 'ఆంధ్రనగర' మను నామాంతరముగల యోరుగల్లు నగరవీథులలో విలాసార్థము విహరించి యచట గోచరమగు వినోదములను, క్రీడలను, ఆటపాటలను శ్రవణానంద రమ్యముగఁ జూచి యానందించుటకై ప్రభాతవేళ నొక శుభముహూర్తమున బయలు దేరెను. తొలుత నేకశిలానగర పరిసరమున నున్న వెలిపాళెమునం బ్రవేశించి యచటనున్న మేదరసానినిఁ దర్వాత నొక చండాల యువతిని నాపిమ్మట నొక కర్ణాటాంగనను వాని వీక్షించి శృంగార పరవశులై మోహవిభ్రాంతిఁ జెంది యటుపిమ్మట నొక కొంతదవ్వుమేర నొక కాపువనితను, కర్ణాటవేశ్యను జూచుట తటస్థించెను. ఇట్లు వీరిని వీక్షించి పరమోల్లాసముననుండ సంపెఁగనూనె నమ్ముచున్న యొక పడతి వారికంట బడుటయు నామె మేని యందముఁ గాంచి యామెనట్టి దానిగా సృజించిన విధాతను దూఱుచు మోహారివాడలోఁ బ్రవేశించుటకై యగడ్తనుగడచి పైఁడితల్పులు బిగించిన వంకదారిగుండ రాజ

మార్గముఁ బ్రవేశించిరి. "వారణఘటాఘోటకశకటికాభటకోటిసంకులంబుగా నుండెడి యారాజమార్గమునఁ బోవుట ప్రియముగానందున నటుపోవుటవలనఁ బ్రయోజనము లేదని క్రొంత్రోవల కలకలంబులు లేక సుఖవినోదములు గలుగునుగాన సందుదారులఁ బోవుట సుఖతరముగా నుండునని యామార్గమును బట్టి చనిరి అట్లు కొంతదూరమగునప్పటికి వారికన్నులముందు పల్నాటివీరుల కథవమును పాడుచున్న యాటకాండ్రపాటలఁ గొంతసేపాలకించి మెచ్చుకొని ముందుకుసాగి పోవ వేక వీరాదేవిగుడియును మాసారమ్మగుడియును, గన్నుల తనివితీఱ నా దేవతల యుత్సవాదులను దిలకించి జక్కులవాండ్రు, మైలారభటులు మొదలగువారు చేయు జాతరలను వీక్షించి, చాముండేశ్వరీయాలయమును బౌద్ధవిహారమును, ముద్దరాలుముసానమ్మ నివాసమును, కుమారస్వామివసతిని, పాండవులగుడిని, కర్తారునిమఠమును, మున్నగు దేవాయతనములను పలక్షించి, తరువాత నెదుటఁ గన్పట్టిన స్వయంభూకేశవస్వాములకుఁ జేతులుజోడించి దండములుపెట్టి మహాభైరవేశ్వరస్వామికి నమస్కరించి నల్గడలఁ దేటిపాటఁ జూచుచుండ నాంధ్రచక్రవర్తి మొగసాలపైనున్న గడియారము పదునాలుఘడియలుగొ చక్రవర్తి మొగసాలపైనున్న గడియారము పదునాలుఘడియలు గొట్టుట వినిపించెను. ఆఘంటధ్వనులు చెవినిబడినతోడనే మధ్యాహ్నమైనదని యాకలిగొన్నవారగుటచేఁ బూటకూటింటికిఁ బోవఁ ద్వరపడుచు బ్రాహ్మణవాడకుఁ బోయి లక్ష్మణయొజ్జలయింట నొక్కొక్కరూక నొసఁగి మృష్టాన్నమును భుజించిరి. ఆయింటనున్న వితంతువుయొక్క పరిచయమును సంపాదించుకొని మరల పురమార్గములఁ బట్టిరి. తరువాత వారిరువురును పుష్పలమ్ము నంగడికిఁ బోయి యచటి పుష్పలావికల ప్రౌఢవచోవిలాసముల నాకర్ణింపుచు వేశ్యావాటికం బ్రవేశించి యచట నొకయుత్సవంపు కలకలము వీక్షించి యయ్యాది పరితాపరు

దేవమహారాజుగారి యీప్రియుక త్తెయగు మాచల్దేవియును వేశ్యాంగన చిత్రశాలావ్రివేశముం గావించుచుం జేయునట్టి పుణ్యాహవచనసమయ ముంగా నెఱింగి యచటికిరిగి కొంత కాలమచటనిలిచి యామహారాజు లాలించు నాకళావతిని సందర్శించి కొంతతడవు సుచితసంభాషణాబులు సలిపి మంచన శర్మదగు పూర్వపువారాంగనయగు గాంధారిగన్నట్టు గా నామోడ కొంతతడవు విశ్రమించి మరల బయలుదేఱి నాగసర్వ మునఁ బాడుచున్న నాగులవానిని మెచ్చికొనుచు నటుపిన్నట పొట్టే ళ్ళపందెములను కోడిపందెములనుగాంచి సంతోషమును జెందుచు నావెనుక నావిటశేఖరునకుఁ బ్రియురాలగు కామమంజరి గృహముఁ బ్రవేశించి యాఱేయి యచట యథేచ్ఛముగా గడపి గడపి తరువాత తమ మార్గమునఁ బోయిరి.

ఈగ్రంథమంతయుఁ గ్రీడావిషయములతో నిండియున్నది జన సామాన్యముయొక్క సంఘజీవితమంతయును మహానగరములలోను, మహాపట్టణములలోను ప్రాయికముగా విశాలమై కన్పట్టుచుండును. ఇట్లు నానావిధజాతులయొక్కయు, మతములయొక్కయు, వర్ణముల యొక్కయు, నిమ్నోన్నతావస్థలును, సుగుణదుర్గుణరూపభేదములు, శీలభేదములును అవస్థాభేదములును మహానగరములలో నొకేస్థానమున నొకేకాలమునఁ జూచుటకెక్కువ యవకాశముండును. ఈవివిధ రూపమానవప్రకృతిఁజూచిన ప్రతిమానవునకుఁ గొంత సంతోషము గలుగక మానదు.

సమర్థుఁడైనకవి యిట్టి వివిధమానవ ప్రవృత్తములను యథా రీతిని కవనరూపమున వర్ణించి తానానందము ననుభవించుటయేగాక లోకమునకొటకుఁ తన కాలసాంఘికస్థితిని దర్పణమునఁజూపినట్లు చూపి యానందింపఁజేయును. ఇట్టికవులు సకలదేశములయందును గలరు. ఎలకాలములయందును గలరు. ఇట్టిగ్రంథము లఖలభాషలలోను